జానపదవాఙ్మయము : ౧

సంపాదకులు : పురిపండా అప్పలస్వామి

# మిన్నేరు

(జానపదగేయరత్నావళి)

సంకలన :

**నేదునూరి గంగాధరం**



ప్రాచీన గ్రంథావళి

రాజమహేంద్రవరము

# MINNERU
(Folklore in Telugu)

Compiled by
NEDUNURI GANGADHARAM

First Edition – January 1968
Price Rs. 12-00

Printed at Saraswathi Power Press, Rajahmundry





PRACHEENA GRANDHAVALI
RAJAHMUNDRY

Editor: PURIPANDA APPALASWAMY

## ప్రకాశకుల విజ్ఞప్తి

జానపద వాఙ్మయ క్షేత్రమున పరిశీలనాపూర్వక మగు నిరాఘాట సంచారము గావించి, అందలి యింపుసొంపులను ప్రజల కందించినవారిలో శ్రీ నేదునూరు గంగాధరంగారు ఎన్నికగన్నవారనుట గత మూడు శతాబ్దముల నుండియు ఆంధ్రసోదరు లెల్ల రెఱింగిన విషయమే.

బహుదేశాటనముచేసి, బహుశ్రుతులను గలిసికొని, బహుసందర్భసంగతములైన బహువిషయములను శ్రీ గంగాధరంగారు సేకరించి యున్నారు. వీరు చేర్చియుంచిన అపార జానపద వాఙ్మయ విషయిక సంచికలను పరికించిన వారికి, ఈయన తనజీవితసర్వమును ఆంధ్రసారస్వతోపకారకమైన ఈ మహత్కార్యమునకే ధారపోయుచున్నారని పొడకట్టకమానదు.

వీరి జానపదవాఙ్మయమును ఆధారముగా గొని పరిశోధనలు జరిపి పెక్కండ్రు భాషాపట్టభద్రులును, పాశ్చాత్యవిద్వాంసులును డాక్టరేటు డిగ్రీని పొందగలిగి రన్నచో వీరి వాఙ్మయ సేకరణ ప్రయోజన మెట్టిదో తెలిసికొనవచ్చును.

జానపదగేయ సంపుటమైన యీ 'మిన్నేఱు' నవరసవ్యంజకములైన బహువిధగేయములతో గూడిన నవశీర్షికలుగా విభజించి శ్రీ గంగాధరంగారి కూర్పును చాల విన్నాణముగా వింగడించినారని చెప్పవలసి యున్నది. ఎల యనగా – అక్కడ నొక్కటియు, ఇక్కడ నొక్కటియు, అప్పు డొక్కటియు, ఇప్పు డొక్కటియుగా సేకరించిన వివిధవిషయిక ప్రస్తవము లైన గేయములను వాటి భావమును బట్టియు ధ్వనినిబట్టియు ఫలాని శీర్షికలో జేర్చి పలపరచుట మిక్కిలి విచక్షణతో గూడిన పనియని వేరుగా చెప్పనక్కరలేదు.

వీ రింతకుమున్ను 'సెలయేఱు' అనెడి చిన్ని సంకలనగ్రంథమును సప్త శీర్షికలతో ప్రకటించి యుండుట పాఠకులెఱిఁగియున్న విషయమే. ఇప్పుడు

ప్రకటితమైన యీ 'మిన్నేఱు' గ్రంథమునకు తరువాత 'మున్నీరు' అనెడి పంద్రెండు శీర్షికల విపులగ్రంథము ప్రకటితము కానై యున్నది.

మన పూర్వ జానపద జనతాభావములు, భాషారీతులు, సంస్కృతీ సరణులు – వీని స్వరూపమును కనులకుఁ గట్టినట్లు ప్రదర్శించు నిట్టి అమూల్య గ్రంథమును ప్రకటించు సదవకాశమును, సర్వ స్వత్వాత్వాలతో మా కొసంగిన శ్రీ గంగాధరంగారికి మేమెంతయు కృతజ్ఞులము.

ఆంధ్రసోదరు లాదరముతో దీనిని బరికించి మాకు సముచిత ప్రోత్సాహము కల్గింతు రని విశ్వసించుచున్నాము.

ఇట్లు
ప్రకాశకులు

## ఉపోద్ఘాతం

భారతీయ సంస్కృతీ నిక్షిప్తమైన వేదాలను మహర్షులు అనుశ్రుతంగా వాగ్రూపంగా వేలాది వత్సరాలుగా పరిపోషించారు.

ఆంధ్ర జాతీయ సంస్కృతీ నిబిడీకృత మయిన జానపద వాఙ్మయాన్ని జానపదులు నోటి పాటలుగా వందలాది సంవత్సరాలు పరిరక్షించారు.

ఆవిర్భవించిన నది పరీవాహవేగంలో, ఉపనదుల్ని తనలో కలుపుకొని, కొన్నిచోట్ల శాఖోపశాఖలై వాటిలో కొన్నిటిని క్రొత్తరూపాన కూర్చుకొని, కొన్నింటిని అంతరింపజేసుకొని సజీవమై జనాధార మవుతుంది.

చరిత్ర కందిన తెలుగు జీవికలో అంకురించిన జానపద వాగ్రూప సారస్వతం మధురిమతో పరిఢవిల్లి, కాలగమనంలో ప్రాంతీయ వైవిధ్యంతో పెరిగి, విరిగి, తరిగి, మురిగి, నేటికీ సజీవమై, తామరతంపరయై, సాహిత్య సమీకృతమై వున్నది.

మా గురువర్యులు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు అముద్రిత వాఙ్మయ సంపాదనకు నన్ను నియోగించగా, ఆ కృషిలో అంశగా జానపద వాఙ్మయసేకరణకు ప్రోత్సహించినవారు పూజ్యులు శ్రీ టేకుమళ్ల కామేశ్వరావుగారు, శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, శ్రీ మారేమండ రామారావుగారు, కీర్తిశేషులు చింతా దీక్షితులుగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, టేకుమళ్ళ రాజగోపాలరావుగారు, గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు.

నాల్గు దశాబ్దాలుగా తెలుగు నేల నాలుగు చెరగుల నిత్య సంచారిగా తిరిగి ; మారుమూల నున్న జీవంగలిగిన జానపద పాటలు, మాటలు, ఆటలు, సామెతలు, జాతీయాలు, నుడికారాలు, నానుడులు, కథలు, గాథలు, యుక్తి శెక్కలు, పొడుపుడు కథలు, స్త్రీల వేడుకపాటలు, కథాపదాలు, రంగవల్లులు,

సంప్రదాయక విజ్ఞానం వంటి జానపద సాహిత్య, సారస్వత వాఙ్మయములను అశేషంగా సేకరించాను.

కొన్నిటిని, విభాగాలుగా వింగడించి, కొన్నిటిని పుస్తకరూపంలో వెలువరించాను.

ఆంధ్ర జానపద వాఙ్మయం అనాదృత వాఙ్మయంగా పరిగణింపబడుతూ వున్నది. దీనిని సేకరించి పరిరక్షించవలసిన గురుతరబాధ్యత ఈ వాఙ్మయాభిలాషులమీద నున్నది.

నా శక్తిసామర్థ్యములను ప్రోదిపరచి సంపాదించిన యీ సాహిత్యాన్ని వాఙ్మయాభిలాషుల నెదుట నుంచుటకు ఎన్నియేళ్ళనుండియో ఊపిరి ఘూరుతూవున్నాను. దీనిని గ్రంథరూపమున వెలువరించుటకు ఆంధ్ర ప్రదేశ సాహిత్య ఎకాడమీవారు ఆర్థిక సహాయం చేసివున్నారు. అద్దేపల్లి అండు కంపెనీ వ్యవస్థాపకులు, 'ప్రాచీన గ్రంథావళి' అను ప్రణాళిక ననుసరించి యీ పుస్తకరూపమున ప్రచురించినారు. వీరికి యీగ్రంథమును సర్వసామ్యములతోసు యిచ్చివేసినాను. వీరికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నేను కోరినంతనే జానపద వాఙ్మయ విశేషాలను పీఠిక రూపమున వ్రాసియిచ్చిన 'సాహిత్యరత్న', డాక్టరు, కర్ణ రాజశేషగిరిరావు, ఎం. ఏ., పిహెచ్. డి. గారికి నా హార్దికాంజలులు.

ఇంకను నావద్ద నేను సంపాదించి వుంచిన విశేష జానపద వాఙ్మయం, అంతా లిఖితరూపమున యింకను మూడురెట్లు అచ్చునకు సిద్ధపడి వున్నది. దీనిని అచ్చొత్తించుటకు ప్రయత్నము చేస్తున్నాను. అందుకు సహృదయులు, సాహిత్యవేత్తలు, సారస్వతాభిమానులు తోడ్పడుదురని ఆశించుచున్నాను.

వదాన్యుల ప్రోత్సాహమే అముద్రిత జానపద సాహిత్యం గ్రంథరూపమున తెలుగువెలుగు చూడగలదు.

రాజమండ్రి-1
1 జనవరి 1968

సుజన విధేయుడు
నేదునూరి గంగాధరం

# పీ ఠి క

హితమునుగూర్చునది సాహిత్యము. సాహిత్యము శబ్దార్థసమన్వితము. జీవిత ద్వంద్వసమన్వితమే సాహిత్యము. అందువలన సాహిత్యమునందు సంఘము ప్రతిబింబితము. జానపదుల సాహిత్యమునందు జానపదహృదయము ప్రతిబింబితము. శిష్టసాహిత్యమునందు నాగరక జీవితము విలసిల్లుచుండును. సూర్యు డందఱికి – ఆరాధ్యుడే. అట్లే జానపదసాహిత్య, శిష్టసాహిత్య ప్రయోజనమొక్కటియే. జానపదసాహిత్యము సెలయేఱువంటిది. సతతప్రవాహ శీలనమే దీని లక్షణము. ఇయ్యది భౌగోళికపరిస్థితులనుబట్టి మానసిక వికాస మును బట్టి దేశీవస్తువుగా పరిగణింపబడును. దేశీవస్తువు శిష్టుల చేతులలో బడి కృత్రిమరూపమునొంది 'శిష్ట' సాహిత్య మనుపేర బరగును. ఇట్లు జానపద సాహిత్యము సెలయేఱు; దేశి సాహిత్యము నదీప్రవాహము; శిష్టసాహిత్యము కృత్రిమ జలధార యనవచ్చును.

జానపదసాహిత్యము చతుర్విధములు: (1) జానపద నృత్యములు (2) జానపద గీతములు (3) జానపద కథలు – జానపద గాథలు (4) ప్రకీర్ణ సాహిత్యము.

ఇట్లు జానపదసాహిత్య మపారజలరాశివంటిది. ఇయ్యది రత్నాకరము. భారతీయపండితులు దీని నాదరింపరయిరి. పాశ్చాత్యపండితులు దీనిని సేకరించి, సురక్షిత మొనరించి లోకోపకార మొనరించి రనుటలో సందియము లేదు. స్వాతంత్ర్యానంతరము మన పండితులు ఈ జానపదసాహిత్య విశిష్టతను, ఆవశ్యకతను గమనించి సంకలనకార్యమందు సంలగ్నమయినారు.

ఇట్టి గొప్ప సంకలనకర్తలలో అగ్రగణ్యులు శ్రీ నేదునూరి గంగాధరము గారు. వీరు నిజజీవితమును జానపద సాహిత్య సేకరణ కంకిత మొనర్చినారు; జానపదనృత్యరీతులను గమనించినారు; జానపద గీతములను సేకరించినారు; కథాత్మక గీతములను, బుఱ్ఱుకథలను గ్రంథస్థ మొనరించినారు; లోకోక్తులను,

పొడుపుకథలను, పలుకుబడులను గాలించి మూటకట్టినారు. ఎన్నియో వైద్య రహస్యములను, సంగీతరహస్యములను వెలికిదెచ్చినారు. వీరు సాహిత్య తపస్సంపన్నులు; నడుమువంగిపోయినను దృఢసంకల్పులు. వారి జీవితాశయములు మూడు : బడి, గుడి, మడి. వారు బడిపంతులు. ఊరూర తిరిగి గాలిపాటలను ప్రోగుచేయుచు వారు 'గుడి'లో విశ్రమింతురు. పొలములతో (మడులలో) కర్షకజనులతో గలసి తిరిగి అపారమైన వ్యవసాయ వాఙ్మయమును సేకరించిరి. ఏయమ్మయయినను 40, 50 పాటలు చెప్పినచో ఆమెకు చీరె, రవికె పెట్టి సత్కరించి పంపనిదే ఊరుకొనరు. ఏయయ్య యయినను పది పాటలను వినిపించినచో ఆయనకు ధోవతులచాపు పెట్టిగాని పంపరు. ఇట్టి ఉదారులు వీరు.

మొట్టమొదట వీరిగొప్పదనము గ్రహించిన పంజాబీ పండితులు దేవేంద్ర సత్యార్థిగారు. వీరి కింకను సహాయసంపత్తులు కావలెను. ప్రభుత్వమువారు వీరి సహాయముతో పల్లెపాటలను రికార్డు చేయించిన బాగుండును. ఇటీవల రాజస్థాను ప్రభుత్వమువారు రాజస్థానీ గీతముల నిత్యజీవిత కార్యక్రమానుసారము 'రికార్డు' చేయించి పదిలపఱచినారు. శ్రీ గంగాధరముగారు సేకరించిన గీతములను 'మిన్నేరు' పేర పుస్తకరూపమున అద్దేపల్లి అండు కంపెనీ వ్యవస్థాపకులు వెలువరించుచున్నారు. ఇది సంతసింపదగిన విషయము. మిగిలిన గీతములను, సాహిత్యమును పుస్తకరూపమున వెలువరింపబూనినారు. సహృదయులు వారికి చేయూత నిచ్చినగాని ఈ ప్రయత్నమునందు వారు సఫలులు కానేరరు. జానపద సాహిత్యారాధన పృథ్వీ సేవవంటిది కదా!

సాహిత్యరత్న, డాక్టరు కర్ణ రాజశేఖరరావు,

యమ్.ఎ., పిహెచ్.డి.

## అంకితము

దేశదాస్య శృంఖలావిచ్ఛేదనకై జాతీయోద్యమంలో పాల్గొని, మహాత్ముని యడుగుజాడల మసలి, కారాగారక్లేశాలను అనుభవించి, అకుంఠిత దేశభక్తిని ప్రకటించిన ధీరోధాత్తుడు ;

ప్రజాపాలనలో వివిధపదవులను జనరంజకముగా, పురోగామిగా, దీక్షతో, దక్షతతో నిర్వహించిన రాజనీతికోవిదుడు, "విశ్వకవి" రవీంద్రనాథ ఠాగూరునకు అంతేవాసిగా, సంగీత సాహిత్యాది లలితకళారాధకుడుగా, ఉజ్జ్వలయశస్సు నార్జించినవారు ;

తనతరంవారిలో మిన్నగా పరిగణన నంది, మన్ననలనుపొందిన

డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారికి

ఈ మిన్నేరు గ్రంథాన్ని

భక్తిపురస్సరముగా అంకితమిస్తున్నాను.

రాజమహేంద్రవరము
1 జనవరి 1968

సకలసుకవి జనానువర్తి
నేదునూరి గంగాధరం

# విషయ సూచిక

# ౧. బాలసాహిత్యం

నోరెరుగని, మానసవికాసం పొందని, పసివారలను ఆకర్షించి ఆనందింపజేసి వారిలో ఉత్తమ సాంస్కృతిక బీజాలు వేయునదే బాలసాహిత్యం. మానవుల విజ్ఞానం తల్లి జోలపాటలతో ప్రారంభ మవుతుంది. ఆ పాటలు పిల్లలకు అర్థం కావడంలేదని మన అభి ప్రాయం. కాని అర్థంకాకపోతే అవి వారినెలా ఆకర్షింపగలవు? ఆ ఆకర్షణఅర్థం పెద్దలకు తెలియదు. ఆ ఆకర్షణే సాహిత్య మృదు స్వరూపం. పిల్లల నాకర్షించే పాటలనే – ఆ ముద్దుమాటలనే - మనం బాలసాహిత్యం అని పిలుచుకుంటాం.

# 1. ప్రార్థన పద్యాలు

పసిపాపను తల్లి ఒడ్డాలలో పెట్టుకొని తాను ప్రార్థన చేస్తూ, తన బిడ్డ చేసినట్లుగానే భావిస్తుంది. ఉగ్గుపాలతో భక్తిని రంగరించి పోస్తుంది.

బాలగోపాలుడు అంటే అందరికీ పరమానందమే. చూడండి, గోపాలుని శృంగారాకారాన్ని తల్లి ఏలా వర్ణిస్తుందో!

## కృష్ణుని ప్రార్థన

చేత వెన్నముద్ద
చెంగల్వ పూదండ
బంగరు మొలత్రాడు
        పట్టు దట్టి
సందిట కడియాలు
సరిమువ్వ గజ్జెలు
చిన్ని కృష్ణమ్మ
నిన్ను నే చేరికొలుతు.

## తారంగం

తారంగం, తారంగం
తాండవకృష్ణా తారంగం
వేణునాదం తారంగం
వేంకటరమణ తారంగం
వెన్నదొంగా తారంగం
చిన్నకృష్ణా తారంగం.

## రాముని ప్రార్థన

లోకాభిరాముఁడు నల్లటి ఏనుఁగు, తెల్లటి కొమ్ములు దానిమీఁద కూర్చున్నాఁడు. ఆ దివ్యమూర్తిని తన బిడ్డకు బోధిస్తుంది.

ఏనుగు, ఏనుగు నల్లన
ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగు మీఁద రాముడు
ఎంతో చక్కని దేవుడు.

తెలుఁగుతల్లి తన ముద్దుబిడ్డకు ఈ గేయాలద్వారా అసాధారణమగు ప్రకృతివర్ణన కావించి, ప్రకృతి ప్రేమయొక్క బీజాలను నాటిస్తుంది. తన రెండు చేతులతోటీ తన బిడ్డ రెండు చేతులను జోడించి "నాలుగు చేతుల నమస్కారమయ్యా" అంటూ వినాయకుని ప్రార్థిస్తుంది. చూడండి యీ గేయంలో అసాధారణమైన ప్రకృతి వర్ణన వుంది.

## వినాయక ప్రార్థన

వెనకా, వెనకా, వేములతోట
క[illegible]కా పండ్లూ, కాముని పూవులు
[illegible]గూసిళ్ళూ, పనసముల పత్రి
మెత్తని కాళ్ళు, మేచక శంకులు
నూనీ ముడుగులు, దుప్పటి రేకులు
[illegible] [illegible], నల్లని వినాయకా
నాలుగు చేతులా, నమస్కారమయ్యా!

## గోపాల కృష్ణమ్మ

గోపాల కృష్ణమ్మ ఆరాధ్య దైవం. ఆయన గోవులకు వెలుగైతే, తన పాపాయి తన యింటికి వెలుగు. ఈ రెంటికి అతీతమైనది జ్యోతి. దీపం (జ్యోతి)ని ఆరాధన చేయిస్తుంది.

గోరంత దీపమ్మ
కొండలకు వెలుగు
గోపాల కృష్ణమ్మ
గోవులకు వెలుగు
మూడంత దీపమ్మ
మేడలకు వెలుగు
మారాజు అబ్బాయి
మాయిళ్ళ వెలుగు.

## నాన్న

పాపాయిని ఒడిలో కూర్చోబెట్టుకొని, యిట్లు ముద్దులాడుతూంటే బిడ్డ పకపక నవ్వును.

అమ్మలగన్న నాన్న
అంబలి గన్న నాన్న
వజ్రాల తల్లుల నాన్న
వరహాల పేరుల నాన్న
వలక బొజ్జల నాన్న
కాసుల పేరుల నాన్న
కన్నతల్లుల నాన్న.

## చక్కిలి గింతలు

పాపాయిని ఒడిలో కూర్చోబెట్టుకొని, చేతిని పట్టుకొని పాడుతూ, కితకితలు పెడుతుంది.

పప్పు పెట్టి, పాయసం పెట్టి
అన్నం పెట్టి, అప్పచ్చి పెట్టి
కూర పెట్టి, ఊరగాయ పెట్టి
నెయ్యి వేసి, ముద్దచేసి
తినిపించి, తినిపించి
చెయి కడిగి, మూతి కడిగి
తాత గారింటికి దారేదంటే
అత్తారింటికి దారేదంటే
ఇట్లా పోయి ఇట్లాపోయి
మోచేతిపాలెం ముందర్నుంచి
ఇట్లాపోయి ఇట్లాపోయి
ఇదిగో ఇదిగో వచ్చాం వచ్చాం
చక్కావచ్చాం, చక్కావచ్చాం
చక్కిలి గిలిగిలి, చక్కిలి గిలిగిలి.

### కిత కిత కిత

ఇల్లలికి – ముగ్గెట్టి
ఆకేసి – పీటేసి
పప్పెట్టి – బువ్వెట్టి
పాలోసి – పెరుగోసి
అత్తారింటికి త్రోవేదంటే
కితకిత కితకిత – కిలకిల కిలకిల.

## రామ భజన

భక్తికి ప్రధానమైనది భజన. పాపాయిచేత భజన చేయిస్తుంది తల్లి.

శ్రీరామ రాముడోయి - రామ భజన
రామన్న రాముడోయి - ,,
అయోధ్య రాముడోయి - ,,
కోదండ రాముడోయి - ,,
భద్రాద్రి రాముడోయి - ,,
పట్టాభి రాముడోయి - ,,
గోవింద రాముడోయి - ,,
గోపాల రాముడోయి - ,,
గోవింద రాముడోయ్ - ,,

# 2. మగపిల్లల ఆటపాటలు

తెలుగునాట పెక్కు ఆటలున్నాయి. వీటిని జాతీయ క్రీడలని, దేశవాళి ఆటలని అంటారు. చాలా ఆటలకు పాటలున్నాయి. ♦

ఆటలూ, పాటలూ ఆనందాన్నే కాక, బుద్ధికుశలతను, శరీర దార్ఢ్యాన్ని కలిగిస్తాయి. బాలుర ఆటలలో ఎక్కువగా వీరోచితములే కనబడుతూ వుంటాయి.

♦ చూడుడు: 'ఆటలు - పాటలు' అనే నా సంకలనం.

## ఎద్దు

మా యెద్దు మీ యెద్దు నీళ్ళ కెళ్ళాయి
తాతగారెద్దొచ్చి తన్ని పొడిచింది
అయ్యగా రెద్దొచ్చి ఆలకించింది
మామ గారెద్దొచ్చి మంతరించింది.

## వాన కోసం

మబ్బు వేసినప్పుడు, పిల్లలు ఆకాశంవంక చూస్తూ పాడేది.

"వానల్లు కురవాలి, వరిచేలు పండాలి; బుడుగో ॥ బు ॥
వడ్లన్ని రావాలి, మాకొట్లు నిండాలి; బు ॥ బు ॥
మానాన్న తియ్యాలి, మాయమ్మ కివ్వాలి బు॥ ॥ బు ॥
మాదాసి దంచాలి, మా యమ్మ వండాలి బు ॥ బు ॥
మా బొజ్జ నిండాలి, హాయిగా వుండాలి బు ॥ ॥ బు ॥

## ఉడుత

రెండు సంవత్సరముల బాలురు, బాలికలు ఉడుతనుచూచి సరదా పడుతూ గెంతుతూ యిట్లా పాడుతూంటారు.

ఉడతా ఉడతా హూత్
ఎక్కడకు వెడతావు ,,
సంతకు వెడతాను ,,
ఏమిటి తెస్తావు ,,
బెల్లం తెస్తాను ,,
నా కిస్తావా? ,,
నే నివ్వను పో, ఛూ.

## మావళి పాట

ఈ టెక్కు, యిటుపోమ్ము, చాదు, జవ్వాజి
జవ్వాజీ పట్టణము, జౌకు పట్టణము
కొమ్మ కొమ్మ నీమగడు - గోవిందరాజులు నీ మగడు
చింపిరిగుడ్డ నీది - చీర రవికె నాది.

## బుడుగు పాట

వాన జీవకోటికి ప్రాణాధారం, ఆకసాన కమ్మే మబ్బుతెరలు దీనితో పాటు వీచే పిల్లగాలులు, ఉరుము రవంతో పిల్లలు ఉల్లాసం పొంది, ఆనందంతో పరవసించి పాడేపాట

చల్లగాలి వచ్చింది బుడుగో, బుడుగో
పిల్ల మబ్బు వేసింది ,,
మెరపు కన్నె లొచ్చారు ,,
మద్దెళ్ళ చప్పుళ్ళు ,,
సన్న సన్న చినుకులు ,,
పెద్దపెద్ద చినుకులు ,,
వానలూ, వరదలూ ,,
వరిచేల పంటలూ ,,
వరహాల మూటలూ ,,

## చేతి వ్రేళ్ళు

చేతివ్రేళ్ళు చేతలకు ఆటపట్టు. ఆడుకొనే పాపలు చేతివ్రేళ్ళకు ముద్దు పేర్లతో గారవం పెంచి పాడేపాట.

చుట్టాల సురభి బొటనవ్రేలు
కొండీల కొరవి మూపుడువ్రేలు
పుట్టుసన్యాసి మధ్యవ్రేలు
ఉంగరాల భోగి ఉంగరపువ్రేలు
పెళ్ళికి పెద్ద చిటికెనవ్రేలు.

తిందాం తిందాం ఒకవేలు
ఎట్లా తిందాం ఒకవేలు
అప్పుచేసి తిందాం ఒకవేలు
అప్పెట్లా తీరుతుంది ఒకవేలు
ఉన్నాగదా నేను అన్నింటికీ
పొట్టివాణ్ణి, గట్టివాణ్ణి, బొటనవ్రేలు.

## చింతకాయ

చింతకాయ బొంతకాయ
చిగురు మామిడికాయ
కొల్లేటి వంకాయ
కొమ్మ నిమ్మపండు.
వాలుగల గుంటలో
జీలుగులు మేయగా
తాటాకు దప్పులము.
కోటవెలుగు
కోటలో నున్నది కొంకుడేనుగు పిల్ల
తరిమి తరిమి పొడిచింది తాబేలుపిల్ల.

## కోడి

కోడీ కోడీ
కొక్కొరోకో
కాకీ కాకీ
కావు కావు
తెల్ల వారింది
తెలివొచ్చింది
అమ్మ లెమ్మంది
ఆడు కొమ్మంది.

## గోళీకాయల ఆట

బాలబాలికలు ఆటల సందడిలోనే అంకెలయొక్క క్రమము నేర్చుకుంటారు. ఆడుతూ పాడుతూ నేర్చుకొను ఇట్టి విద్య వారి మనస్సులకు బాగుగా పట్టుతుంది. అట్టి పాటల్లో కొన్ని —

ఒక్కాయ ఒక్క
రెక్కాయ రెట్టి
మూక్కాయ మువ్వ
నక్కాయ నంది
ఐమూం బొడ్డు
ఆరింక తాళ
పడిశా బొద్దు
ఎనమాకన్ను
తొంబా పరక
తొట్టి కంగి.

## గోణీబిళ్ళ ఆట

ఈ గోణీబిళ్ళ ఆటకే కూటీబిళ్ళ అనికూడా పేరుగ. బిళ్ళను కర్రతో కొట్టి, కంచా దగ్గరనుండి దూరంగా వున్న బిళ్ళవరకూ ఆ కర్రతో కొలుస్తూ పాడేపాట. ఇది బోడికూటులో పాడేపాట.

బోడి కొడితే కండు

రుళ్ళ

ముళ్ళ

నాలగలి

ఐదిలి

ఆరెడి

ఉల్లి

ఈ పాటకు - ఎదుటి ఉజ్జీవారు హేళనచేస్తూ యిలా అంటారు:

"... కండు (అనగానే ఎదుట ఉజ్జీలోని ఒకడు),

కండు నీ మెళ్ళమీద నాచెండు

... రుళ్ళ ( ,, )

మీ యమ్మ కళ్ళ

... మూళ్ళ ( ,, )

మూళ్ళ నీమూతి

... ఐదిలి ( ,, )

ఐదిలి - సయిపాలి, కొండోడి కోతులు

మీబాబు మీనాలు - యింతా యింత ...".

## చెడుగుడి ఆట పాటలు

చెడుగుడి, బల్ చకుక్కా, అనే పేర్లతో ఆడే ఆటలోని పాటలు -

చెట్టు గొట్టగా - పాలుగారగా
చెన్నాపట్నం - దారిచ్చి దారిచ్చి దారిచ్చి
పిట్టా పిట్టా భాయ్ - పిగిలిపిట్ట భాయ్
నెత్తిమీది గుండుదీసి - నేలకొట్టి భాయ్
అల్ బల్ చెంగల్నాడ్ - కీత్ కీత్ కీత్
ఎల్లెద్దు పుల్లెద్దు - కర్రెద్దు ముగుదాడు

## ఆడపిల్లల ఆట పాటలు

మగపిల్లల ఆటలకన్న ఆడపిల్లల ఆటలు ఎక్కువగా వున్నాయి. సంగీతము, సారస్వతం, తాళం, నృత్యంతో కొన్ని; కుశాగ్రబుద్ధితో కొన్ని, చలాకీతో కొన్ని, భావనాబలముతో కొన్ని ఉన్నాయి. కొన్ని పాటలలో ముక్తపదగ్రస్తా లుంటాయి చూడండి, యీతొక్క పలుకులు అనే పాటను.

### ధిమిత ధిమిత

ఏమి ధిమిత - పసుపు ధిమిత
ఏమి పసుపు - తోట పసుపు
ఏమి తోట - ఆకు తోట
ఏమి ఆకు - తమలపాకు
ఏమి తమ్మ - పుట్ట తమ్మ
ఏమి పుట్ట - పాము పుట్ట
ఏమి పాము - త్రాచు పాము
ఏమి త్రాచు - నల్లత్రాచు.

## ఎద్దుల మోట

కొకుక్కా - కొకుక్క -

ఏమి గుడ్డ - తోలుగుడ్డ
ఏమి తోలు - జింక తోలు
ఏమి జింక - బుట్టి జింక
ఏమి బుట్టి - కంది బుట్టి
ఏమి కంది - కారు కంది
ఏమి కారు - చేపకారు
ఏమి చేప - నీళ్ల చేప
ఏమి నీళ్లు - పసుపు నీళ్లు
ఏమి పసుపు - ముండ పసుపు
ఏమి ముండ - చీలముండ
ఏమి చీల - బండి చీల
ఏమి బండి - ఉప్పు బండి
ఏమి ఉప్పు - కల్లు ఉప్పు
ఏమి కల్లు - తాటి కల్లు
ఏమి తాడు - మోట తాడు
ఏమి మోట - ఎద్దుల మోట.

## పెళ్లి అరుగు

పెండ్లి పందిట్లోని బాజాభజంత్రీల నాదము, పెద్దల పెళ్ళి వేడుక, చూచిన పాపలు ముచ్చటపడి, ఆడపాపల మనస్సులో బాలికలు బొమ్మలతో పెళ్ళి అనుకరణ చేస్తూ ఆనందంగా పాడుతూ పరమానంద భరితులవుతూ పాడే మనోజ్ఞ గేయం.

చిట్టి బొమ్మలపెళ్లి - చేయ వేడుకలు
శ్రీ రెండువాకిళ్లు - సిరితోరణాలు
రంగు గుమ్మము ముందు - రత్నకంబళ్ళు
పసిబాల తలమీద - పచ్చ అక్షతలు
అరటి స్తంభాలతో - అమరె పెళ్ళరుగు
చిన్నన్న పెట్టేదు - చింతాకు చీరె.

## బొమ్మల పెండ్లి

చిట్టి బొమ్మల పెండ్లి చేయవలె ననగా
శృంగార వాకిళ్ళు సిరితోరణాలు
గాజు పాలికలతో గాజు కుండలతో
అరటి స్తంభాలతో అమరె పెండ్లరుగు.

## బువ్వము పాట

చిట్టి చిట్టి మిరియాలు చెట్లకింద పోసి
పుట్టమన్ను దెచ్చి బొమ్మరిల్లు కట్టి
బొమ్మ రింట్లో పిల్ల తల్లికి నెయ్యి లేదు
నా తలకు నూనె లేదు
అల్లవారింటికి చల్లకుపోతే
అల్లవారి కుక్క భౌ మన్నాది
నా కాళ్ళగజ్జెలు ఘల్లు మన్నాయి.

## మనసే కారణం

బాలికలు బొమ్మలకు పెండ్లిండ్లు చేసేటప్పుడు, పెండ్లి కూతురు వైపు బాలిక; పెండ్లి కుమారుని వేషమునూ, వారి మర్యాదనూ, పరువునూ పరిహాసిస్తూ పాడే గేయం.

గచ్చకాయలే గంటీలు
కుక్కతోలే కుళ్లాయి
నక్కతోలే నడికట్లు
పులితోలే పూలహారం
అగిశాకే తోరణాలు
అలచందలే పూరణము
ఔరార పెండ్లికొడుక
నీ మనసే కారణము.

## బొమ్మకు నీతులు

బొమ్మల పెండ్లిలో బాలికలు - పెళ్లికూతురు బొమ్మకు నీతులు చెప్పేపాట.

వీధిలో తలవిప్పి ముడువకే బొమ్మ
పళ్లెత్తి గట్టిగా పలుకబోకమ్మ
పొరుగిళ్ళ కెప్పుడూ పోవకే బొమ్మ
నలుగురి నోళ్ళలో నానకే బొమ్మ.

## గొబ్బి యళ్లో

ఆడపిల్లల ఆటలలో గోపెమ్మనే గొబ్బి అంటారు. సంక్రాంతి పండుగకు గొబ్బిళ్ళు పెట్టి గొబ్బిపాటలు పాడుతూ బాలికలు నృత్యము చేస్తూంటారు.

గంగమ్మ గౌరమ్మ అప్పసెల్లెండ్రూ - గొబ్బియళ్లో
ఒక తల్లి బిడ్డలకు వైరమూలేదు ,,
మంచిమంచి పూలేరి ఒకరాసి పోసిరి ,,
కానరాని కలువలేరి ఒకరాసిపోసిరి ,,

ఏడుమూలలింటిలో ఏడొక్క తూము - గొబ్బియళ్ళో
ఏడొక్క తూమేసి ఎల్లా కొలిపించె ,,
పోడిగి ఒక తూమేసి పారా వొలిపించె ,,
గంపెడు తీసేసి గంగాకెత్తండీ ,,
మంచిమంచి పూలేరి మామయ్యకంపే ,,
కానరాని పూలేరి గౌరమ్మకంపే ,,
అక్కనూ చెల్లెనీ ఒక్కరీ కిచ్చె. ,,

## గొబ్బి పాట

బాలికలార బాగుగ కుమ్మి
బట్టుగ నిలచియు వేగమురారే
కోలాహలముగ కుమ్మినివేయుచు
కోరిన యారోగ్యము గైకొందము ॥ బాల ॥

1. పలువిధ రంగుల దుస్తులు తొడిగి
పలువిధ రంగుల పూలు గ్రుచ్చెదమ ॥ బాల ॥

2. కాళ్ళకు గజ్జెలు - నడుముకు పట్టెడ
కరముల దగు గాజుల తొడుగుదమ ॥ బాల ॥

3. గళ్ళున మ్రోగగ గంతులు వేయుచు
చక్కగ గానము చేయదలంతుము ॥ బాల ॥

4. వనరమణీయము గన వెళ్ళుదము
మనసారగ కానుక లర్పింతము. ॥ బాల ॥

## గొబ్బిళ్ల మంగళహారతి

జయ మంగళం - నిత్య శుభ మంగళం

1. ఓ సుబ్బి గొబ్బెమ్మ, ఓంకార రూపిణీ
నీకు వందనమంచు నే మ్రొక్కెదా
లోకపావని నీవు లోలాక్షి వినవమ్మ
ముందుగా నీకు వందన మంటిని ॥ జయ ॥

2. ఇంట యింటను నీవు యిలవేల్పు వైతివి
ఇహ పరంబులు మాకు చూపిస్తివే
గోమాతకున్ మ్రొక్కి గోమయం దెచ్చి నోం
గొబ్బెమ్మయని నిన్ను పూజింతుమూ ॥ జయ ॥

3. పసుపు కుంకుమతోడ పూజ లలరగ జేసి
పుష్పఫలముల దెచ్చి ప్రణతులన్ జేయుచును
చేడె లందరుగూడి చేమంతులన్ దెచ్చి
చేతులారా నిన్ను పూజింతుమా ॥ జయ ॥

4. పాడిపంటల నిచ్చి భాగ్యరాసుల నిచ్చి
బాలలతో వర్ధిల్ల జేయవమ్మా
ఆశ్రయించినట్టి అబలలన్ గాపాడు
ఆనంద మొందింప జేయుమమ్మా ॥ జయ ॥

5. మగువ లందరుగూడి, మంగళంబులు పాడ
ప్రార్థించి నిను వేడుచుంటి మమ్మా
కన్య లందరియెడ కడుప్రేమ జూపించి
కాపాడుమా గౌరి శార్వాణి. ॥ జయ ॥

## గచ్చనకాయల ఆట పాటలు

బాలికలు గచ్చనకాయ లాడుతూ పాడేపాటలు ఇవి. ఒక్కొక్క ప్రాంతంలో, ఒక్కొక్క విధంగా వాడుకలో వున్నాయి.

(సారంగధరుని కాళ్లూ చేతులూ ఖండిస్తే వాటిని అతికిన మందు దీనిలో యిమిడివుందని చెబుతారు)

కొండమీద వెండిగిన్నె
కొక్కిరాయి కాలు విరిగె
దాని కేమి మందు ?
వేపాకు చేదు
వెల్లుల్లి గడ్డ
నూనెలోని మడ్డి
నూటొక్క సారి
పూయవోయి నూరి
పూట కొక్క తూరి.

మరోవిధం :

కొండమీద వెండిగిన్నె
కొక్కిరాజు కాలు విరిగె
దాని కేమి మందు ?
వేపాకు చేదు
వెల్లుల్లి గడ్డ
నూనమ్మ బొడ్డు
నూటొక్క ధార.

ఇంకో రకం :

కొండమీద గుండు జారె
కొక్కి రాజు కాలు విరిగె
దాని కేం మందు
వేపాకు పసుపు
వెల్లుల్లి రేక
నూనెమ్మ బొట్టు
నూటొక్క ధార.

ఇదొక మాదిరి :

కొండమీద వెండిగిన్నె
కొక్కి రాజు కాలు విరిగె
విరిగి విరిగి రెండాయె
వీథుల్లో మూడాయె
పడమటి చుక్కలు పండేయి
భళ్ళున తెల్ల వారింది.

కాళ్ళమీద వేసే "కరపాణి" అనే చర్మవ్యాధికి మందు యీ దిగువ గేయంలో వుందని విజ్ఞు లంటున్నారు. బాలికలు కాళ్ళుచాచు కొని కూర్చుంటారు. తల్లి పాటపాడుతూ, ఒక్కొక్క కాలునీ పండిస్తుంది. ఈ పాట అనేకమార్పు కూర్పు చేర్పులతో వివిధ ప్రాంతాలలో వాడుకలో వుంది.)

1. కాళ్ళాగజ్జి - కంకోలమ్మా
వేగుల చుక్కా - వెలగా మొగ్గా
మొగ్గాగాదు - మోదుగనీరు
నీరుగాదు - నిమ్మలవారి

వారిగాదు - వావింటకూర
కూరగాదు గుమ్మడిపండు
పండుగాదు - పాపిడి మీసం
లింగూ లిటుకు - పందిమాల్ని పటుకు
రాజుగారితోట్లో - యే ముందంటే
పువ్వో మొగ్గో - పుచ్చుకుంటే దెబ్బ
కాల్దీసి - కడగా పెట్టు.

2. రింగురింగు బిళ్ళ - రూపాయిదండ
దండగాదు - తామర మొగ్గ
మొగ్గాగాదు - మోదుగనీరు
నీరుగాదు - నిమ్మలబావి
బావిగాదు - బచ్చలకూర
కూరగాదు - కుంకుమ మెట్టు
మెట్టుగాదు - మేదర యిల్లు
ఇల్లుగాదు - ఈగలతుట్టు
కాలుదీసి - కడకు పెట్టు.

3. కాళ్లా గజ్జీ - కంకాణమ్మా
వేగూచుక్కా - వెలగామొగ్గా
మొగ్గాగాదు - మోదుగ నీరు
నీరుగాదు - నిమ్మలవారీ
వారీగాదు - వావింటకూర
కూరాగాదు - కుమ్మర చట్టీ
చట్టీగాదు - చామలమట్టీ
మట్టీ తీసి నీ - మొగుడు కాలు మెత్త.

---

* ఇది కంకాణ శబ్దభవము.

4. కాళ్ళ గజ్జి - కంకోలమ్మా
వేగులచుక్కా - వెలగా మొగ్గా
లింగు లిటుకూ - పందెమూల పటుకూ
కాలు పండినట్టూ - కడకుతీసి పెట్టూ.

## గుడుగుడు కుంచం

ఈ పాట రెండు రకాలుగా వాడుకలో వుంది. దీనిలో పాము మంత్రం యిమిడి వుందని చెబుతున్నారు.

1. గుడుగుడు కుంచం - గుండా రాగం
పాముల పట్టం - పడగా రాగం
అప్పుల్రాజు గుఱ్ఱం - ఆడుకోబోతే
పే పే గుఱ్ఱం - పెళ్ళికి బోతే
నీ గుఱ్ఱం - నీళ్ళకు బోతే
నా గుఱ్ఱం - పాలకు బోతే
కత్తెయ్యనా? బద్దెయ్యనా?
వేణ్ణీళ్లా? చన్నీళ్ళా?

2. గుడుగుడు కుంచం - గుండేరాగం
పావడపట్టం - పడగేరాగం
అప్పడాల గుఱ్ఱం - ఆడుకోబోతే
పే పే గుఱ్ఱం - పెళ్లికిబోతే
అన్నా! అన్నా! నీ పెళ్లెపుడంటే.
రేపుగాక ఎల్లుండి
కత్తిగాదు బద్దాగాదు.
గప్! చిప్.

## చేయూచు బాల

రెండు చేతులూ పట్టుకొని వూపుతూ పాడేది.

చేయూచు బాలా! చేయూచూ
చిన్నారి బాలా! ,,
అద్దాల దిడ్డీ ,,
అరవ మాణిక్యాలు ,,
చేనికి పోదాము ,,
పండ్లూ తెత్తాము ,,
పాపకు యిత్తాము ,,

## చెమ్మ చెక్క

ఈ చెమ్మచెక్క ఆటలో పాడే గేయాలు అనేక రకాలుగా వున్నాయి. ఈ గేయంలో వాజీకరణ యోగం వుంది. రజస్వలకాని మాచకమ్మలకు, బహిష్టునొప్పిగల పడతులకూ, సంతానంలేని జవ్వనులకూ, పాలులేని బాలెంతరాలికీ చికిత్స లున్నాయి.

1. చెమ్మచెక్క - చేరడేసి బుక్క
అట్లు పొయ్యంగ - ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క - ముగ్గులేయంగ
రత్నాల చెమ్మచెక్క - రంగులేయంగ
పగడాల చెమ్మచెక్క - పందిరెయ్యంగ
పందిట్లో పాపరాజు - పరుగు లెత్తంగ
పాలీయ వచ్చెనా పడతి పద్మాక్షి.

2. చెమ్మచెక్క - చేరడేసి మొగ్గ
అట్లుపోయంగ - ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క - ముగ్గులేయంగ
రత్నాల చెమ్మచెక్క - రంగులేయంగ
పగడాల చెమ్మచెక్క - పందిరేయంగ
పందిట్లో మాయన్న - పెండ్లి చేయంగ
చాకలాడి వోణికింద - జాజిపూలదండ
మోరీల దండ - ముత్యాల దండ
దండో దండ - సండో దండ.
పై పై ముద్ద - ప్రధాన ముద్ద
లాల్ పీచు - లంకసాని
సొంటికొమ్ము - సోమాలింగం
గచ్చా పప్పా - గల కోడి.

## అప్పటి తిప్పటి తాండ్ర

అప్పటి తిప్పటి తాండ్ర
అయ్యవారి తాండ్ర
అల్లీ బిల్లీ తాండ్ర
అయ్యవారి వడిలో
తాచుబాము.

## ఒప్పుల కుప్ప

ఒక అమ్మాయిని ఒకచోట కూర్చోబెట్టి మిగిలిన అమ్మాయిలు ఆ అమ్మాయి చుట్టూ తిరుగుతూ పాడుతారు.

ఇద్దరు బాలికలు ఎదురెదురుగా నిల్చోని, చేతులు అటూ ఇటూ మార్చి పట్టుకుని, గిరగిరా తిరుగుతూ యీపాట పాడుతారు.

(తొలిపాటలో పురుషులకు వీర్యవృద్ధి, నడుంకు బలిమి కలిగించేది, మలిపాటలో స్త్రీలకు నడుం బలిమి కలిగించేది వాజీకరణయోగాలున్నాయని ప్రాజ్ఞులు చెప్పుతున్నారు.)

తొలి గేయం :— ఒప్పులకుప్పా ! ఒయ్యారిభామ
సన్నబియ్యం - చాయపప్పూ
పాలు నెయ్యీ - పాయసం పొయ్యీ
నీ మగడు తింటే - ఆనందమట్టే.

మలి గేయం :— ఒప్పుల కుప్పా ! ఒయ్యారిభామా
మినపాపప్పూ - మెంతీపిండీ
తాటిబెల్లం - తవ్వెడు నెయ్యీ
గుప్పెడు తింటే - కులుకులాడీ
నడుమూ గట్టీ - నా మాటబట్టీ.

## చిరుమల్లె పూదండ

సీతమ్మ వాకిటా
చిరుమల్లె చెట్టు
చిరుమల్లె చెట్టేమొ
చితుక బూసింది
(చిగురించి పూసె)
చెట్టు కదలకుండ
కొమ్మ వంచండి
పట్టి పూవులు కోసి

బుట్ట నింపండి
అందులో పెదపూలు
దండ గుచ్చండి
దండ తీసుకువెళ్ళి
సీత కివ్వండి
దాచుకో సీతమ్మ
దాచుకోవమ్మ
( రాము డంపాడు)
దాచుకోకుంటేను
దోచుకుంటాడు
దొడ్డిగుమ్మములోను
దొంగ లున్నారు.

## బండోయమ్మ బండి

బండోయమ్మ బండి
బండికి కుచ్చులు తెండి
సుబ్బారాయుడి పెండ్లి
చూచివత్తాం రండి

అమ్మ నాకు బువ్వ
అరచేతిలో గవ్వ
నీళ్ళమీద నిప్పు
అల్ల పిల్లల ఒప్పు
చేయబోకు తప్పు
చేస్తే కాలిచెప్పు.

## మా కోడొచ్చిందా

ఇంటివెనుక ఈరమ్మా!
మా కోడొచ్చిందా? వచ్చింది
ఎన్ని గ్రుడ్లు పెట్టింది? మూడు గ్రుడ్లు
గుడ్లేమి చేశావు? కుమ్మరోడి కిచ్చాను
కుమ్మరో డేమిచ్చినాడు? కుండిచ్చినాడు
కుండేమి చేశావు? బావిలో వేశాను
బావి యేమిచ్చింది? నీళ్ళు యిచ్చింది
నీళ్ళేమి చేశావు? తోటకు పోశాను
తోటేమి యిచ్చింది? పువ్వు లిచ్చింది
పువ్వు లేమి చేశావు? అప్ప కొప్పులో పెట్టాను
మీ అప్పే మిచ్చింది? పే నిచ్చింది
పేనేమి చేశావు? దూలముమీద వేసి కుక్కేను
దూల మే మిచ్చింది? పే డిచ్చింది
పేడేమి చేశావు? పొయ్యిలో పెట్టినాను
పొయ్యే మిచ్చింది? బూడి దిచ్చింది
బూడి దేమి చేశావు? చేనికి వేశాను
చేనే మిచ్చింది? గరి కిచ్చింది
గరి కేమి చేశావు? ఆవు కేశాను
ఆవేమిచ్చింది? పాలిచ్చింది
పాలేమి చేశావు? పాయస మొండించాను
పాయస మేమి చేశావు?
సగము తిని సగము ఉట్టిమీద పెడితే
కుమ్మరోడి కుక్క వచ్చి తినిపోయింది.

## కుమ్మి పదాలు

బాలికలు గుండ్రంగా తిరుగుతూ, చేతులు తట్టుతూ, గంతులు వేస్తూ అభినయంతో పాడేపదాలు.

ప॥ కుమ్మిని వేయుదమా! మనము కుమ్మిని వేయుదమా!
మనము కుమ్మిని వేయుదమా!

1. అటవిని ఆడుదమా! మనము పాటలు పాడుదమా!
మనము పాటలు పాడుదమా! ॥ కు ॥

2. పాటలను పాడుదమా! మనము హాయిగా తిరుగుదమా!
మనము హాయిగా తిరుగుదమా! ॥ కు ॥

3. గవ్వలు యేరుదమా! మనము గవ్వలు యేరుదమా!
మనము గవ్వలు యేరుదమా! ॥ కు ॥

4. చల్లని గాలిలో మనము - అల్లీ బిల్లీ లాడుదమా!
మనము అల్లీ బిల్లీ లాడుదమా! ॥ కు ॥

## కుమ్మిపాట - అభినయగీతము

జయ జయ పరమాత్మ, సకల భువనకారణా।
సకల భువనకారణా, జయ జయ పరమాత్మ।
సకల భువనకారణా, సకల భువనకారణా ॥ ॥ జయ ॥

నిలయమైన నిగమములను, నిలయమైన నిగమములను
నలువకిడిన మీనరూపా, మీనరూపా ॥ ॥ జయ ॥

అమరులకై మందరాద్రి, అమరులకై మందరాద్రి
నధివహించిన కూర్మరూపా, కూర్మరూపా ॥ ॥ జయ ॥

వసుధచుట్టే దనుజు జంపిన వరాహరూపా
వరప్రసాది హేమకశిపునడచిన నరసింహరూపా ॥ ॥ జయ ॥

బలి నడచిన శ్రీవామనరూపా,
పరశురామ క్షత్రియకులభీమ,
దశరథరామ దైవతరామా ॥ ॥ జయ ॥

నందయశోదల నంద ముకుందా,
బృందాలోలా కరుణాలోలా ॥ ॥ జయ ॥

జీవహింస మాన్ప భువిని, జీవహింస మాన్ప భువిని।
జన్మించిన బుద్ధరూప, జన్మించిన బుద్ధరూప ॥ ॥ జయ ॥

కలియుగమున కలుషమడప, కలియుగమున కలుషమడప।
కలికివైన పద్మనాభ, కలికివైన పద్మనాభ ॥ ॥ జయ ॥

## కోలాటము - పాటలు

బాలికలు రెండేసి కోలాటం చిడతలు పట్టుకొని లయయుక్తంగా వాయిస్తూ, గంతులు వేస్తూ గుండ్రంగా తిరుగుతూ పాడేవి.

ప॥ కోలాటంబుల వేయుదమా ! కోరిక తీరగ మనమందరమూ

1. చాలా సంతోషంబుగను । సభికులు మెచ్చెడి తీరుగను ॥ కో ॥
2. గుప్పు గుప్పున గంతులువేస్తూ । ఒప్పుగజడలు వేయుదమా ॥కో॥
3. ఒప్పుగ వేసిన జడలన్నీ । ఓపిక తోడుద విప్పుదమా ॥ కో ॥
4. సరిగరిసరిగరి యనుచు । సభ్యులు మెచ్చెడి రీతిగను ॥ కో ॥

ప॥ రత్నగిరి కోలాటము । రమ్యముగను వేయుదము
రత్నగిరి కోలాటము । రమ్యముగను వేయుదము ॥ ర ॥

1. కూడిపాడి వేడ్కతోడ । ఆడుదంపాడుదం
ఆడుదం పాడుదం ॥ ర ॥
2. రారే చెలియలార రంజిల । కోలాటంబులు వేయుదము
ఆడుదం పాడుదం । అందరము కూడి ॥ ర ॥

3\. మునగకాయ నువ్వుకాయ జడలల్లుదాము
మనము వలవేసి నిచ్చెన వేయుదము ॥ ర ॥

4\. సంతోషముతో గూడి యాడరే సఖియలార
వంతపాటతోడ యాడరే వరుస జడలు విప్పివేయరే ॥ ర ॥

## పూలుగోయు పాట

పూలు కోతము రారే - ఓ పూబోణులారా
ఈ పుష్పజాతులను ॥ పూ
మల్లెలు - మొల్లలు - మరి విరిజాజులు - కొల్లలుగ
మన వెన్నెలలన ద్రాక్షతోటలా ॥ పూ ॥
విరివిగా మరి విరిజాజులు - పొగడలు కూరిమితో
మన కోరిక దీరె సఖి ! ॥ పూ ॥
అందముగ నీ సుందరవనమున - డెందము
లానంద మందగ మనము ॥ పూ ॥
పొందుగ శ్రీభద్రపుర జగన్మోహన - సుందర
నాటక సూత్రధారుడే సఖి ! ॥ పూ ॥

## తోటలో బూచి చూపే ఆట

చింతాకు చిగురాకు ఏడ వున్నది ?
చిన్నయ్య తోటలో చానా వున్నది
అబ్బబ్బ అందులో బూచియున్నది
బూచికి నాచేత మందు ఉన్నది
కటారికోక మీద కన్ను ఉన్నది
అత్తకొడుకుమీద ఆశ వున్నది

మామ కొడుకుమీద మనసు ఉన్నది
మామకు నాకొక మాట ఉన్నది
మాటలు తేటలు మా యింట
మాపటి భోజనం మీ యింట.

కాయ పట్టురాయని కుచ్చు - బంగారు కుచ్చు
కాయ నాతో నాడినది - సరెగాత పడుచు
కాయ మూడవది యమ్మ - ముక్కాలిపీట
కాయ నాల్గవది యమ్మ - నల్ల నిప్పూస
కాయ అయిదవది యమ్మ - అచ్చన్న పట్టి
కాయ ఆరవదియమ్మ - అమ్మని కాయ
కాయ ఏడమ్మ నాకాయ - ఎత్తెత్తి పట్టు.

## నడుములో చేతులుంచుట

కోళ్ళు గోళ్ళు మోకాటి చిప్పలు మొల వడ్డాణము
సానరాయి గంధపు చెక్క పుక్కిటి విడియము
కన్నుల కాటుక పండ్ల కప్పు అడ్డబొట్టు
నిలువు బొట్టు చుక్క బొట్టు పాలకుండ
పెరుగు కుండ నేతి కుండ నూనె కుండ
మీ పిల్లి వచ్చి మా పొయ్యిలో నుండిన జగడానికి వస్తువా
తరిమివేయుదునా జాడించే జంపాలక్క.

## చెయి యూచు పాట

చెయి వూచమ్మా చెయి వూచు
సంతకుపోతా ,,
శనగలు తెస్తా ,,
చల్లగ తింటాం ,,

మిఠాయి తెస్తాం చెయివూచు
మెల్లగ తింటాం ,,
ఆపం తీస్తాం ,,
అంతా తింటాం ,,
చొక్కాయి తీస్తాం ,,
సొగసుగ వేస్తాం ,,
తిరిగీ వస్తాం ,,
వోడించి వస్తాం ,,
తేరుని చూస్తాం ,,
తిరిగీ వస్తాం ,,
కమ్మలు తీస్తాం ,,
చెవులో వేస్తాం ,,

## బిడ్డకు వెన్నెల చూపుట

చందమామ రావే - జాబిల్లి పోవే
కొండయెక్కిరావే - కురువేరు తేవే
నట్టింట పెట్టవే - నా మాట వినవే
వెండిగిన్నెలో వెన్న - పైడిగిన్నెలో పాలు
అన్నము తెచ్చి - అమ్మకు పెట్టవే.

## బొమ్మ తట్టి పరుగెత్తుట

ముందు బోయిన మీనాక్షి
చిన్న యింటికి దీపము వెలిగించితిమి
చేతిలో బిడ్డ ఉన్నాది
బిడ్డను క్రింద విడిచిపెట్టి

ఒక చెయ్యి అంబలి త్రాగేసి
నోటిలో తాటిబెల్లము వేసికొని
బొమ్మన తట్టుకొనిరా
ఏమి గుంటలో మునిగితివి
తామర గుంటలో మునిగితిని
మా యిల్లంత బంగారమాయెను, పో, పో.

## నాలుగుమూలల నిలుచుండి ఆడు ఆట

నడిమికి - తోడిమికి
తానక - తప్పక
తన పేరేమంటే
ఉస్తికాయలకుణ్ణ
ఊరగాయలకుణ్ణ
పాపటకాయలకుణ్ణ
పతీలు మనెగా చారచార
బరుకు బరుకు
అత్త చెవులలో
అటుకులు పోసి
కోడలు చెవులలో
కుంకుమ పోసి
ఆడుదువు రావే
చిన్న చిలుకా,

## చేతులు విసరు ఆట

ఉలవలు ఉలవలు వేయించి
ఉట్లు నిండుగ పోయించి
కందులు కందులు వేయించి
కలము నిండుగ పోయించి
సెనగలు సెనగలు వేయించి
చేటల నిండుగ పోయించి.

## ఆట విడిచినవారిని గేలిసేయుట

సగమాటలో పోయినది
చాకలివాని పెండ్లాము
మధ్య నడచి పోయినది
మంగలివాని పెండ్లాము
ఆటలో విడిచి పోయినది
హాస్యగాని పెండ్లాము.

## నలుగురి జత యాట

ఉడుము - తుడుము
తత్తళ - పిత్తళ
ముక్కా - చెక్కా
పాలు - పిరంగి
లాక్కొ లాక్కొ చెల్
ఊరిపిండి - ఊరగాయ
లకలక - చెంచుక
బరణిక - టాంటూం
టుపాకి - టుస్కు.

## గుజ్జన గూళ్ల పాట

ఆకో చాకో - తామరపాకో

తామరపాకుమీాద - పం డ్లెండ్లబోసి

కూడూ వండి - కూటాన బెట్టి

మాఊావండి - మాటున బెట్టి

గొల్ల వారింటికి - చల్లకుబోతే

గొల్ల వారి కుక్క - కూడు తినిపోయె

కూడు తిన్నా చోట - కుంకుమ రాలె

మారు తిన్నా చోట - మల్లెలు రాలె

మల్లెలు మారాజు - తోట బెట్టించె

తోటలోని ఆవు పేరేమి - గోవు పేరేమి ?

## ముక్కుడు గిల్లీలు

అమ్మలార అక్కలార

మీా మగల పేరేమి ?

నీళ్ళలో నిమ్మపండు

పాపలలో పనసపండు.

## పండ్లన్ని అమ్మాయి నోటిలో

పసిబిడ్డలను నిలువబెట్టి చక్కిలిగింతలు పెట్టుచుండ, వారి నవ్వుల మాధుర్యమును గ్రోలుచు, ఆ మందస్మిత వదనారవిందముల నుండి చిన్న చిన్నగ తొంగిచూచు పలువరుసను గాంచి, తల్లు లీవిధముగా సహజ కవిత్వము తేటపడ బల్కుదురు.

చింతాకు చిగురాకు ఏడవున్నాది
చింతమ్మ తోటలో శానవున్నాది
అబ్బబ్బ దానిలో బూచి వున్నాది
బూచికి నాచేత మందు వున్నాది
మందూకు నాచేత మంత్ర మున్నాది
మంత్రానికీ మావిపండు వున్నాది
పండ్లన్ని అమ్మాయి నోటిలో వున్నాయి.
సారి గిలగిల, చక్కిలి గిలగిల. (అని తిరిగి నవ్వింతురు)

## నాలుగు స్తంభాలాట

నాలుగు స్తంభాలాటా
వడిమికి తొడిమికి
తానక తప్పక
తన పేరేమంటే
ఉట్టిమీద బెల్లం
పొట్టి కాకరకాయ
బావా బావా
బరుకూ బరుకూ
తన్నులు తింటే
తల కొకటే.

## దినానికి టంకం

చందమామ యిల్లు కట్టి
జాజిపూల తోటలోను

అమ్మ నేను చిన్నదాన్ని
అల్లుడొస్తే అంపబోకు
ఢిల్లీకోట చల్లాగుంటే
దినానికి టంకం దేస్తా.

## నేనే తిందును బెల్లం

చిట్ల పొట్లకాయ
చీమ నెల్లికాయ
గోడ పుచ్చకాయ
గోరు చిక్కుడుకాయ
కొమ్మ నిమ్మపండు
అత్తకు పెట్టెద అల్లం
నేనే తిందును బెల్లం.

## చిటికెలు - మెటికలు

చిటికెలు మెటికెలు
బొటన వ్రేల్
అంబకు డిల్లకు
బెండకాయ బీన్.

## దొంగాలు

ఉత్తుత్తి పళ్ళు
ఉత్రాణీ పళ్ళు
నేరేడీ పళ్ళు
నిమ్మా పళ్ళు

తోడి పిల్లల్లారా - దొంగైన పిల్లా
తన మొగుడి పేరేమొ - తానే చెప్పాలి
ఉత్తుత్తి పళ్ళు - ఉత్రాణీ పళ్ళు
నేరేడీ పళ్ళు - నిమ్మా పళ్ళు - సూరమ్మ దొంగ.
ముద్దుల సూరమ్మా - నీ మొగుడి పేరేమొ!
నా చెల్లి పేరొచ్చి - నే చెప్పనమ్మ
నా మొగుడి పేరొచ్చి - నారింజపండు.
ఉత్తుత్తి పళ్ళు - ఉత్రాణీ పళ్ళు
నేరేడీ పళ్ళు - నిమ్మా పళ్ళు - వెంకమ్మ దొంగ.
చిట్టి వెంకమ్మా - నీ చెల్లి పేరేమొ!
చెప్పవా దొంగైతె - తప్పదోయమ్మ
నా చెల్లి పేరైతె - నా చిట్టి మొగుడు.
ఉత్తుత్తి పళ్ళు - ఉత్రాణీ పళ్ళు
నేరేడీ పళ్ళు - నిమ్మా పళ్ళు - అన్నపూర్ణ దొంగ.
అన్నపూర్ణా - నీ చిన్ని మొగు డెవడు!
నా చిన్ని మొగు డొచ్చె - ఆ చందమామ.
ఉత్తుత్తీ పళ్ళు - ఉత్రాణీ పళ్ళు
నేరేడీపళ్ళు - నిమ్మా పళ్ళు - సీతమ్మ దొంగ.
సొగసు సీతా - నీ మొగుడు పేరేమొ!
పాల సంద్రంమీాది - బాలకృష్ణుడు.

## నెత్తిమీద గోరింక

ఒకరి తలమీద ఆకుగాని, పుల్లగాని వేసి యీ క్రిందివిధంగా పాడుతూ ఉడికిస్తారు.

ఓ అబ్బాయి నెత్తిమీద గోరింక
చెప్పకు చెప్పకు చెడిపోతావు
చెప్పితే నీముక్కు తెగ్గోస్తా
దూలం మీంచి దూకిస్తా
పందిరి మీంచి పాకిస్తా
కంచం అన్నం తినిపిస్తా
కడివెడు నీళ్ళు తాగిస్తా.

## కూర్చో వదినా! ఆట

ఇద్దరు బాలికలు రెండు మూడు గజాల దూరంలో ఎదురెదురుగా కూర్చుంటారు. ఒక బాలిక ఆ కూర్చున్న బాలికలచుట్టూ తిరుగుతూ వుండగా యింకో అమ్మాయి యీ పాటలను పాడుతూ ఆ అమ్మాయిని తరుముతుంది. ఈ పాటలే త్రొక్కుడుబిళ్ళలో పాడతారు.

అగిచీ బుగిచీ జండాల
బుగిచీ బుగిచీ బుగిచీ దగ్గులూరు దవనం కట్టా
నీకో కట్టా నాకో కట్టా కట్టా కట్టా

విశాఖపట్నం వీశెడు బెల్లం
నీ కొక పదలం నా కొక పదలం
పదలం పదలం

బిందె నిండా కందులూ రంగసాని బొందులూ
బొందులూ బొందులూ

సూరీ గుమ్మడికాయ సూరప్ప తలకాయ
తలకాయ తలకాయ

ఆనపకాయ అచ్చమ్మ తలకాయ
తలకాయ తలకాయ

అక్కలకర్రా ముక్కాలపీట కూర్చో వదినా
వదినా వదినా

ఉసిరిచెట్టు క్రింద పసిరిపాము లేవే

మామిడాకు మంచినీళ్ళు
మామిడాకు మంచినీళ్ళు

ఆకు అల్ల - సూది సుద్ద - ఆకు అల్ల.

జుజ్జు

తోడు పాశం తోడు
అన్నల తమ్ముల తోడు
ఆట మాణిక్యమ్మ తోడు
తోడితే నా చెయ్యి వేడి
వేడివేడి పరమాన్నం జుర్రు.

ఇట్లు పిల్లని ఒడిలో కూర్చో బెట్టుకొని, పిల్ల చేయి ఒక చేతితో పట్టుకొని ఊపుతూ ఈ మాటలు చెప్పి జుజ్జు అని పిల్ల చేయి నోటి వద్ద పెట్టిన పిల్ల అల్లరిమాని నవ్వుతుంది.

## ఉయ్యాల కంబాల ఆట

ఉయ్యాల కంబాల వూరి పేరేమి?
రచ్చ బల్లలమీద రాజు పేరేమి?
చింత చెట్టుక్రింద చిఱుబొమ్మరిల్లు
వాటికి వాకిళ్ళు బోరు తలుపుల్లు
పలవకిం దున్నాది పొన్నాలు మేడ
మేడలో వున్నాయి జోడు హంసల్లు
హంస పేరేమి అడిగిరావయ్యా.

## సుబ్బారాయుడు పెండ్లి

బాలికలు గుంపులుకూడి, చప్పట్లుకొడుతూ, ఎగురుతూ పాడు కుంటారు.

సుబ్బారాయుడు పెండ్లి
చూచి వద్దాము రండీ
మా వాళ్ళింట్లో పెండ్లి
మళ్ళీ వద్దాము రండీ
దొంగా రింట్లో పెండ్లి
దోచుకు వద్దాము రండి.

## దొడ్డిలో భోజనాలు

మీ బుల్లి మా బుల్లి; చిట్టి బుల్లీలు
మీ యమ్మ మా యమ్మ; తోడికోడళ్ళు
మీ బాబు మా బాబు; అన్నదమ్ములు
కరణాల దొడ్డిలో; కంకణా లిప్పి
భోడోడి దొడ్డిలో; భోజనాలు పెట్టి.

## పెళ్ళి గొడవ

రాయాకు పాపమ్మ ఆడవే పాప
రాజు లందరుగూడి చూడ వచ్చేరు
చూడవచ్చిన వారు ఏమి తెచ్చారు
పట్టాభి వుంగ్రాలు పెళ్ళి బటువ్రాలు
సన్న కన్నా తల్లి చీరెట్ట వమ్మ
చీరెకు చిలకల అంచెట్టవమ్మ
పమిటికి రత్నాల పే రెట్టవమ్మ
పేరుకి పెట్టెలతో సొమ్మెట్టవమ్మ.

## దాగుడు మూతలు

ఒక అమ్మాయి కన్నులు మూసి, మిగిలిన పిల్లలను పారిపొండని చెప్పి, వారు దాక్కున్న తర్వాత కన్నులు మూసిన పిల్లను, దాక్కున్న వారిని పట్టుకొనుటకు తల్లి వదలివేస్తుంది. అప్పుడు ఈ గేయం పాడుతుంది.

దాగుడు ముచ్చి దండాకోర్ - పిల్లి వచ్చె ఎలుకదాట్ ।
ఎక్కడి దొంగ లక్కడ పారిపో పారిపో
తూరితే పిల్లి - పారితే పిల్లి
పడమ టక్కల్లారా ! పారిపొండోయి

## ఏనుగు పాట

ఒక బాలికను ఏనుగు ఆకారంగా నడిపిస్తూ పాడేది.

ఒక బాలిక క్రిందికి వంగి, తొండమువలె ముందున కొక చేయివేల వేసి, తోకవలె వెనుక కొక చేయి వేలవేసి, వంగియే నడచును. పిమ్మట మిగిలిన బాలికలు రెండు భాగములుగా ఒకరి ప్రశ్నలకు రెండవవారు జవాబులుగా పాడుదురు.

ఏను గొచ్చిం దేనుగు
ఎక్కడికొచ్చిం దేనుగు
మా వూరొచ్చిం దేనుగు
ఏమి చేసిం దేనుగు
మంచినీళ్ళు తాగిం దేనుగు
ఎక్కడికెళ్ళిం దేనుగు
కాకినాడెళ్ళిం దేనుగు
ఏమి చేసిందేనుగు
కొబ్బరికాయ తిందేనుగు.

## అప్పాల పండుగ

ఈ మాటలు చెప్పి ఆడించుచు పిల్లలను తల్లులు ముద్దులాడుదురు.

కాటుక పెట్టిన కన్ను అన్నారు
లేతమామిడి చిగురు అన్నారు
లేగంటావుల పెరుగన్నారు
కందిపప్పూ ముద్ద అన్నారు
అప్పుడు కాచిన నెయ్యి అన్నారు
అప్పాల పండుగ అన్నారు.

## దేవుడి గిన్నె

ఇద్దరు బాలికలు ఒకరిచేయి ఒకరు పట్టుకొని, గిరగిర తిరుగుతూ యీ మాటలు అంటూ ఆడుదురు.

విసిరీ విసిరీ వేలపిండి
విసరలేను జొన్నపిండి
మా అప్ప సవరం మాకు తే
దేవుడి గిన్నె మాకు తే.

## భోజనానికి

చంటితమ్ముణ్ణి బువ్వాలాటలోనికి తీసుకెళ్లి, పీటవేసి, కూర్చోబెట్టి బాలికలంతా ఈ లాగున పాడుతారు.

కోడి కొక్కురాట
కొబ్బరికాయ ముక్కలాట
పాలోసి బెల్లమాట
పంచదార చిలుకలాట
మారాజీ పట్టాల్ మీద మహారాజు
మీ అబ్బాయి, మా యింటికి భోజనానికి.

## అచ్చనగాయలు

ఈ ఆటలో క్రిందినుండి ఒకేసారి మూడు కాయలు తీస్తే "ముప్పీలు" అని కొందరు, "పుప్పీలు" అని కొందరు అందురు, సాధారణంగా 16 గుప్పీలు, 16 ముప్పీలు ఆడుదురు. కొందరు 10 గుప్పీలు, 16 పుప్పీలు మాత్రమే ఆడుదురు. కొందరు యిరువది కూడా ఆడుదురు. బాలికలు సంఖ్యాసీకము తెలియుటకై పుట్ట బడిన పాటలు. ఇందు 10, 20 ని లెక్కించుచున్నవి.

### పాట

ఒక్కో ఓ చెలియా
రెండూ రేవిళ్ళూ
మూడు ముచ్చిలక
నాలుగు నందన్నా
ఐదుం చిట్టిగొలుసు

ఆఱుందారాలు

(ఆఱుం జవ్వాజీ)

ఏడుం బేడీలూ

ఎనమా మనమందా

ఎనిమిది మనమందా

తొంబా తోకుచ్చూ

తొమ్మిది తోకుచ్చూ

పదికి పెట్టెళ్ళాం

పదకి పట్టెడా ॥

పది గుప్పీలు, పది పుప్పీలు ఆడేటప్పుడు ఈ పాటలు పాడుదురు.

ఇరువది గుప్పీలు, ఇరువది పుప్పీలు ఆడునప్పుడు పాడేపాటకు పదికి పట్టెళ్ళాం అయిన తరువాత సంఖ్యలను తెలుపుటకుగాను యీ క్రింది పాట పాడుదురు.

పడమటి గుడిచెలక

కన్నా రెండాయి

కాకిక్కి - కొరకంచు

పిచ్చికి - సీరంచు

అమ్మకు బొమ్మంచు

అయ్యకు జామారు

నాకు పట్టంచు

చెల్లెలు చేమంతి

తమ్ముడు తలపాగ
మరదలకు ఆభరణం.

అను నప్పుడు "నాకు పట్టంచు" తో పూర్తి అవుతుంది. ఒక్కొ ఓ చెలియ తో మొదలుపెట్టి, పదికి పట్టెళ్లాంతో ముగిసిపోయే పది గుప్పిలు, పది పుప్పీలు ఆడునపుడు పాడబడు పాటలకు బదులుగా యీ క్రిందిపాట అప్పుడప్పుడు పాడుచుందురు.

ఒక్కానంద
చిక్కిటీలు
ముక్కుమల్లె
నంగనాచి
ఆదుంరెళ్ళు
అత్తవారు
కొత్తపుస్తె
కొడుకు పేరు
మల్లి, మొగ్గ
మామిడిపండు.

## పాయసం ఆట

చిటికెలు మెటికలు పాటను బాలికలు ఒక్కొక్కరు వ్రేలిని తాకుచు పాడెదరు. తరువాత వ్రేళ్లన్నియు పండినవని, చేతులు వెనుకకు పెట్టుకొని, ఈ క్రింది విధముగా పండినవారి నడిగెదరు. అప్పటి సంభాషణ,

నీ చేతులేమయ్యేయోయ్
పిల్లెత్తుకు పోయింది
పిల్లి నెందాక తరిమావ్
గోలకొండ దాకా
గోలకొండే మిచ్చింది - గుడ్డిగవ్వ
గుడ్డి గవ్వేమి చేశావు - కుమ్మరాడి కిచ్చాను
కుమ్మరేమిచ్చాడు - కుండిచ్చేడు
కుండేమి చేశావు - మా తాత కిచ్చాను
మీ తాతేం చేశాడు - మూతి కడుక్కుని
గిరగిరా త్రిప్పి - నూతిలో వేశాడు
నుయ్యే మిచ్చింది - నీళ్ళిచ్చింది
నీళ్ళేంచేసావు - పూలచెట్లకు కాయలచెట్లకు పోశాను
పూలచెట్లు కాయలచెట్లు - ఏమిచ్చాయి
పువ్వులూ కాయలూ - యిచ్చాయి
పువ్వులూ కాయలూ - ఏం చేశావు
పువ్వులు మా అక్క తలలో పెట్టేను - కాయలు తిన్నా
మీ అక్క తల యేమిచ్చింది - పేనిచ్చింది
పేను నేం జేశావు - గడపమీద కుక్కాను
గడ పేమిచ్చింది - పేళ్ళిచ్చింది
పేళ్ళేంచేశావు - పొయ్యిలో పెట్టాను
పొయ్యే మిచ్చింది - బూడి దిచ్చింది
బూడిదేం జేశావు - పెంటమీద పోశాను
పెంటే మిచ్చింది - గడ్డిచ్చింది

గడ్డేం జేశావు - ఆవులికి గేదెలికి వేశా
ఆవులూ గేదెలూ ఏమిచ్చాయి - పాలిచ్చాయి
పాలేం జేశావూ - పరమాన్న మొండా
పరమాన్నమేం జేశావు - కొంత నేను తిన్నాను
మరి నాకో ?
పీటకింద పెడితే పిల్లెత్తుకు పోయింది
ఉట్టిమీద పెడితే ఉడతెత్తుకు పోయింది
మంచంమీద పెడితే మామ యెత్తుకు పోయాడు
అటకమీద పెడితే అల్లుడెత్తుకు పోయాడు
నీకు లేదు.

## అబ్బాయి - అమ్మాయి

చిక్కుడాకుమీద చిలుక వాలింది
చిలుకెక్కి ఓరాజు చిక్కివున్నాడు
అరిటాకుమీద హంస వాలింది
హంసెక్కి ఓరాజు అమిరివున్నాడు
కొబ్బరాకుమీద గోర వాలింది
గోరెక్కి ఓరాజు కోరివున్నాడు
మామిడాకుమీద మంచు వాలింది
మంచెక్కి ఓరాజు పొంచివున్నాడు
గుమ్మడాకుమీద గువ్వ వాలింది
గువ్వెక్కి ఓరాజు గూడొగ్గినాడు

చిక్కుడాకుమీద చిలుక అబ్బాయి
చిలుకెక్కి అబ్బాయి చిక్కివున్నాడు
అరటిఆకుమీద హంస అబ్బాయి
హంసెక్కి అమ్మాయి అమిరి వున్నాది
కొబ్బరాకుమీద గోర అబ్బాయి
గోరెక్కి అమ్మాయి కోరివున్నాది
మామిడాకుమీద మంచు అబ్బాయి
మంచెక్కి అమ్మాయి పొంచివున్నాది
గుమ్మిడాకుమీద గువ్వ అబ్బాయి
గువ్వెక్కి అమ్మాయి గూడొగ్గినాది.

---



౨. స్త్రీ

సారస్వతం

# ౨. స్త్రీ సారస్వతం

స్త్రీ సారస్వతం సంఘ జీవనమునకు జీవగఱ్ఱ. స్త్రీలోనున్న మాతృత్వమే సహజంగా వెల్లుబకగా స్త్రీ సాహిత్యం అవిర్భవించింది.

మన భారతీయ స్త్రీలు. ముఖ్యంగా మన తెలుగుతల్లులు, ఈ సాహిత్యాన్ని పూర్వకాలంనుంచీ వివిధములగు జానపద గేయాలద్వారా, మరియు దేశిపాటలద్వారా వెల్లడిస్తూ వున్నారు. ఏ గేయంలో, ఏ పాటలో మాతృత్వభావపోషణ మెంతెంత పరిపుష్టి పొందినదో, అది అంత ఉత్తమ స్త్రీ సారస్వతంగా మనం పరిగణించవచ్చును.

# 1. దంపుళ్ళ పాటలు

వీటిని రోకటి పాటలు, రోలు రోకలి పదాలు అనడం బాగుంటుంది. రోలు రోకలి పనులలో దంపు, కుమ్ము, కొట్టు, పోటు అంటూ వివిధ సందర్భాలలో పాడుతూ వుంటారు.

ఈ పాటలు పాడుతూవుంటే స్త్రీలకు ఆయాపనులు చేసేటప్పుడు ఆయాసం కనబడదు. ముందు ఒక ఆమె పాడుతూవుంటే, వెనుక నున్న వారందరూ ఆపాట అందుకొని పాడుతూవుంటారు. పాట చరణాన్ని అందుకొని పాడుటకు ఉత్సాహ పడుతేగాని, వారికి పని లోని శ్రమ కనపడదు. ధాన్యం దంపునపుడు, జొన్నలు కుమ్మునపుడు, పిండి కొట్టునపుడు, బియ్యం పోటేసేటప్పుడు వారి రోకలి ఏ లయతో పడుతుందో దాని ననుసరించే ఈ పదాలు ఆ గమనంతో పాడుతూవుంటారు.

### 1. దంపు

తమలపాకులమీాద – వడ్లెండబోసి
రాచిలుక పోచిలుక – వడ్లు దంపుదము.

### 2. కుమ్ము

అంతల్ల పుంతల్ల – మరదివచ్చేడు
జొన్నల్లు ఒక జాము – జారకుమ్మేను.

### 3. కొట్టు

పిండి కొడదామక్క – బండెక్కిదామా
చెన్నపట్నంబుకు – చేర బోదాము.

### 4. పోటు

రోకలి చిన్నాది – రోలు చిన్నాది
నాతోటి పోటేను – నాతి చిన్నాది.

## దంపుళ్ల పాటలు

కారాలలో కెల్ల రెండు కారాలు
ఉప్పుకార మొకటి ఉపకార మొకటి
వాసాలలో కెల్ల రెండువాసాలు
రాణివాస మొకటి విశ్వాస మొకటి
కుంటలలో కెల్ల రెండు కుంటల్లు
వడ్లకుంటా ఒకటి వైకుంఠ మొకటి.

ఆడదాన్ని నేను అయి పుడితిగాని
గండ్రగొడ్డలి క్రింద కొమ్మనైన జాలు
గొడ్రాలు బ్రతుకేల కోటి ధనమేల
స్వారాజ్య మిచ్చినా సవతిపోరేల.

చూడకా ఆడేరు చూచి ఆడేరు
కానకా ఆడేరు కల్ల లీ ప్రజలు.

పాటలు పాడితే పలువ దంటారు
పాడకుంటే జనులు మూగ దంటారు.

పాపమ్ము చేసుకొన బావిలో పడితే
పై మురికియేగాని పాపాలు పోవు.

చేటుకాల మట్ర శంకరుడ! నీకు
ఆలిమీది పెండ్లి యెట్లాడినావు.

ఊరి ముందర చేను వేయబోకన్న
ఊళ్ళోను వియ్యంబు లంద బోకన్న
ఊరిముందర చేను కాకుల్ల పాలు
ఊళ్ళోని వియ్యమ్ము కయ్యాలపాలు.

చేను మంచీదని చెప్పబోకన్న
చెరుకన్న రాజనం పండిన్నదాక
ఆలి మంచీదని అనబోకురన్న
అదివచ్చి మనలోన అణగిన్న దాక.

అత్తింటి కోడలవు కావుగా వటవే
ఆజ్ఞ సిగ్గులు నీకు లేవుగా వటవే
వీపు నిండా కొంగేదే ఇరువరుసలేవే
మడమ తిరగ బట్టేదే మాట వాసేదే?

కూతురూ పుట్టినది
కుందు పుట్టినది
దండాన కోకలకి
దాతా పుట్టినది
సువ్వి - హా - సువ్వి.

కూతురు పెళ్ళమ్మ
కొడుకు వడుగమ్మ
ఆడపడుచు సమర్త
అల్లుడి మనుగుడుపు
సువ్వి - హా - సువ్వి.

బావ లందరుగూడి
బండెక్కి వెడుతుంటె
అందులో పెద బావ
పడ వెక్కి వెళ్ళు.

తెడ్డిరిగి నడ్డిరిగి మూతీ పళ్ళిరిగి
మూతీ పళ్ళిరిగిన బావ
నా కేమి తెచ్చావూ?
మూటతో చక్కిలాలు
మువ్వంచు చీర
కావిడతో చక్కిలాలు
కరకంచు చీర.

ఎంత దొడ్డవాడు యమధర్మరాజు
యిన్ని పనులు విడిచి వెంట రమ్మనెను
పుట్టిన బిడ్డల విడిచి పుట్టిల్లు విడిచి
కలికి వైకుంఠము కలదు రమ్మనెను.

పల్లి దానింటి సరస కల్లు పాకుంది
పైమీద పంచిచ్చి కల్లు తాగుమరిది
నామీద చాల చాల దయవుంచు మరిది
దగదగ మెరసేటి దండమ్ము మరిది.

అరుగు అరుగుల్లోకి ఏ అరుగు తీరు
అల్లుళ్ళు కూర్చున్న ఆ అరుగుతీరు
కుదురు కుదురుల్లోకి ఏ కుదురుతీరు
కూతుళ్ళు కూర్చున్న ఆ కుదురు తీరు.

విశాఖపట్నాన వీధి గుమ్మాన
వింత రాచకొడుకు బంతులాడేడు
బంతివెళ్లి పాలకొండ సభలో పడితే
యిది యెవరి బంతని వివరించి రాజు.

గోలుకొండ వారి గొలుసులబంతి
పాలకొండవారి పచ్చల్ల బంతి
శ్రీకాకుళం వారి చిత్రాలబంతి
బొబ్బిల్లివారిదే బంగారు బంతి.

వానదేవుడ నీకు వరుస చెల్లెల్ని
వర్షాలు కురిపించి వరిమళ్ళలోను.
వరుసగా నీవార్ని వరసాడ బోతే
పురుషుడా నీ శిరసు ధరణి కొరిగేను
కానివార్ని నీవు కారాడబోతే
కాముడా నీశిరసు కాటి కొరిగేను.

కాకరకాయకు కాడ సన్నమ్మో
కాశీలో భద్రన్న కురులు సన్నమ్మో.

వంటింట సిరిచాప నామాలుపెట్టె
నరసింహా దాసుండు నా కన్నవాడు.

## 2. రాట్నము పాటలు

వీటిని నూలు వడికే పదాలు అనవచ్చును. ప్రత్తిచెట్టునుండి కాయలు కోయుట, కాయలలోని దూదినితీయుట, ఆ దూదిని ఏకించి ఏకులు చేయుట, ఏకులను రాట్నంమీద దారముగా వడుకుట ఇదంతా ప్రత్తి పరిశ్రమ. ఆ దారాన్ని ఆసులుపోసి రాట్నంమీద కండె బొట్లుగా చుట్టుట, ఆ కండెల సహాయంతో పడుగుగా పోసిన దారంతో నేస్తారు. దీనినే నేత పరిశ్రమ అంటారు.

ఈ మొత్తం పరిశ్రమలో :— 1. ప్రత్తి పట్టేదిప్రత్తి రాట్నం, 2. దారం తీసేది ఏకుల రాట్నం, 3. కండెలు చుట్టేది కండెల రాట్నం

అని మూడు రకాలుగా వున్నాయి. ఒక్కొక్కదాని పని ఒక్కొక్క లయతో జరుగుతుంది. ఆయా లయానుబద్ధంగా పని చేసేటప్పుడు ఈ పాటలు పాడుతారు. అందుచేత వీటిని రాట్నం పాట లంటారు.

"ఏకుల రాట్నము కాళ్ళ సంకెళ్ళు
ఏ పాపకర్మకు కావించినాడో" అంది ఒక బద్ధకస్తురాలు.

"కదురు కవ్వంబులు కలయాడు నింట
కరువు కాటకములు కలికాన లేవు"

అని యింకొకామె చెపుతూ దీని ప్రాధాన్యతను చెప్తుంది. ఒక చిన్నారి రాట్నాన్ని ఎంత చక్కగా పొగిడిందో చూడండి!

"మొగు డెందుకే? నారి మొగు డెందుకే?
అసలు మొగు డెందుకే?
రాట్నం చల్లగుంటె రప్పిస్తు గోల్కొండ
కదురు చల్లాగుంటె కదిలిస్తు ఢిల్లీని. ॥మొ॥

## రాట్నము పాటలు

వెండి పళ్లెములోన ఏలకులు బోసి
మెలమ దొరలంపారు నీకు చిన్నాన్న.

వేసంగి కాలాన పూసె బూరుగలు
ఆశపడి చిలకల్లు ఆరునెలలుండు
తినబోతె దూదాయె తీపిలేదాయె
మానవతి చిలకలార; మరలరే భూములకు.

సూర్యుడు యిచ్చినా చుక్కమట్టెల్లు
సుదతి! నా కాళ్లను చుక్కలై మెరసు

నారాయణిచ్చిన నల్లపూసల్లు
నాతిరో! నామెడ నానై మెరసు
పరమేశుడిచ్చిన పసుపు కుంకుమము
పడతిరో! నానొష్ట పద్మమై మెరసు.

రామన్న పట్నాన రాతిస్త్రంభాన
రామచిల్కకల్ల తూగుటుయ్యాల.

గుమ్మడి కాయంటి గురువొచ్చినాడు
సీకాయ పంచెలతో శిశువెళ్లినాడు
కాళ్లు కడుగనైతి కనిమ్రొక్కనైతి
వంగి దణ్ణంపెట్టి వరమడుగనైతి
నాతోడి వారెల్ల నానులడిగారు.

తమలపాకులమీద పళ్లెండబోసి
తలుపెక్కి నేజూతు తల్లి బలగంబు
అరటి ఆకులమీద వడ్లెండబోసి
అరుగెక్కి నేజూతు అయ్యబలగంబు.

నిమ్మల నీడను నే నిలిచినాను
అన్నల్లతోడు నిన్నే నమ్మినాను
నమ్మినవారికి నారాయుడు తోడు
నాకు మంగళగిరి నరసింహాుతోడు.

చింతకాయలన్ని కొమ్మమీదుండు
శ్రీరాము భ్రమలన్ని సీతమీదుండు
మామిడికాయలన్ని కొమ్మమీదుండు
మా అన్న భ్రమలన్ని వదినమీదుండు.

"వదినగారు మీరు వాసిగలవారు
వండ బోయినచోట కుండ నాకేరు
బావగారు మీరు భక్తిగలవారు
నిండున్న సభలోను పిండి బొక్కేరు
వెల్లచీరందమ్ము వేణి అందమ్ము
వెలది కేమునెలల గర్భిణందమ్ము
పట్టుచీరందమ్ము పట్టెడందమ్ము
పణతికి పదినెలల బాలు డందమ్ము
చూలింత బాలింత సుఖమును కోరి
లేతమామిడి వనము పూతకోరేను
రానివ్వో మామిడి రానివ్వో గదలె
నీకొమ్మ కోటిపల్లికోట గట్టింతు
నీఆకు అంతర్వేది చాపలల్లింతు
నీ పువ్వు పుట్టకొండ పూజకంపిస్తు
నీ పండు సింహాచలం శిఖరమెక్కింతు"

వడకు వడకూ కదుర వడకవే కదురా
ఏకుల్ల బుట్టంత ఎల్లుండి సంత
ఏకేకు ఒకబార యెల్లుండి సంత
నాయేకు లైపోయె నాకేమి చింత
యేకుల్ల యెల్లక్క పత్తిపుల్లక్క
రాటాల రామక్క రావె పోదాము.

## 3. తిరుగలి పాటలు

వీటినే "విసరురాతి పదాలు" అంటారు. తిరుగలిని విసరు రాయి అనుటచేత ఈమాట వాడుకలో నున్నది.

తిరుగళ్లు :- 1. గింజలపై పొట్టుపోవుటకు విసరే ఆళ్ల తిరుగలి.
2. గింజలను పిండిగా విసరేది "చోళ్ల తిరుగలి"
3. గింజలను పప్పుగా విసరేది "పప్పుతిరుగలి"

ఈ విధంగా ఉన్నాయి. వీటి పనులు రకరకాలు లయలతో జరుగుతూ ఉంటాయి. అందుకనుకూలంగా యీ పదాలు పాడుతూ ఉంటారు.

ఆళ్ల తిరుగలి పాట

"ఆళ్లుచోళ్లు కుప్పనూగ్సుళ్లు
అటకమీద బోడోడు అయ్యమ్మ మొగుడు"

చోళ్ల తిరుగలి పాట

"చోళ్లుసల్లన్న పిండి తెల్లన్న
అంబలి పుల్లన్న డొక్కచల్లన్న"

పప్పుతిరుగలి పాట

కరివేపకాయల్లు కంచాన బోసి
కలిగినోరంపితే గగనంబులాయె
పేరిన నేతుల్లు బెల్లపచ్చుల్లు
పేదవారంపితే లేబరములాయె
ఆదివారంనాడు అమవసనాడు
అన్న యింటికి నేను గిన్నడుగబోతె
మా వదినె శాంభవి లేదు పొమ్మనెను
మాయన్న మంచోడు మళ్ళి రమ్మనెను
చిన్నోడి చీటంగి సిలుకుకుళ్ళాయి
బాలునికి పొట్లంగి పాలుబోసేగిన్నె
నాకు ప[illegible]చీర నెమలివన్నె రవిక

వడినిండ బియ్యము వళ్లో కొబ్బరిగిన్నె
పసుపుకుంకుమ యిచ్చి పంపె మాయన్న.
తూర్పు వాకళ్లకు దూలాలు గావు
పడమటి యిండ్లకు పలకల్లు గావు
మాయింటి కోడళ్ల రోకళ్లు గావు
ధనరాసు లిచ్చేటి తండ్రి రామయ్యా
నీవైన చెప్పరో ఆ'మాని' పేరు
అమ్మరో నీకెంత వినవేడుకై తే
మాండల్లొ పొయ్యేటి మరుదుళ్ల నడుగు
మాండల్లొ పొయ్యేటి మరది సుబ్బయ్యా
నీవైన చెప్పరాద ఆమాని పేరు
అమ్మరో నీకింత వినవేడుకై తే
బారుసావిటిమీది బావల్ల నడుగు
అమ్మరో నీకింత వినవేడుకై తే
కొలువుసావిడీ మీద కొడుకుల్ల నడుగు
అమ్మరో నికంత విన వేడుకై తే"
నేలానపండిన పల్లేరుచెట్టు.

"నల్లకొండల నడుమ వుతికేటి చాకి
మాయన్న వేసిన ధట్టి పేరేమి ?
చింతకుంట నూలమ్మ శిరువేళ్ల తొగరు
నంద్యాల నల్లంచు లంజె పేటంచు
కందనోలు కరకంచు కంది బేడంచు
ఉతకరా చాకలి వుల్లి పువ్వల్లె
మడ్తవరా చాకలి మల్లి మొగ్గల్లె

ఇచ్చిరా చాకలి అన్నవాడలకి"
"ఇచ్చేను వొచ్చేను ఇల్లు నేనెఱుగ
గచ్చుతో కట్టిన గాజు స్తంభాలు
సున్నమ్ముపూసినసురటిమిద్దిళ్లు
వేపమాని యెదురిల్లు ఎద్దూలమిద్దె"

"సకియ యిల్లు జొచ్చి యెల్లజాలడె
సక్కని వాడమ్మ సారంగధరుడు
ఇరుగు పొరుగమ్మలార ! ఇతని పొమ్మనర
ఇరుగోరి మాటలు వినవచ్చిరేను
చిలుక నీళ్లుతోడె జలకమాడేను
హంస అన్నములొండె ఆరగించేను
వెలది మంచమువేయ వెన్నెలబైట
పడతి పానుపులెయ్య పవ్వళించేను
ఆకు తేవే పోక తేవే అడకత్తి తేవే
చూడ సున్నపుకాయ చుట్టియ్యే మనుపు
సన్నంగ చుట్టియ్యే సగము కొరికియ్యే
యెంగిలెంగిలి శివుండ యెగ్గుపట్టేవు
మనకేమి ఎంగిలి పుణ్యాపురుషుంకు
విసినకఱ్ఱలతోను విసరె ఒక జాము
విసిరిసిరి ఆకాంత స్తంభాన కొరిగె
కాంతకీ కన్నీళ్లు కాల్వలై పారె
వాన కురవలేదె వరద యెక్కడిది
ఆడవారి శోకంబు అటువంటిదప్ప"

"వేంకటేశ్వరుడికి పెండ్లిండ్లనాడు
వేల్పులు బట్టింత్రు వెండిసురటీలు

అక్కన్నా తిమ్మయ్య పెండ్లిండ్లనాడు
పరుపుకు బట్టించు పసిమిడి సురటీలు"
"కోటయ్య నీవంటి కొడుకుల్ల నిస్తే
కోటి ప్రభలతోటి కొండ లెక్కేము
అప్పన్న పెళ్లాము అలివేలుమంగా
ఆవుపేడ బెట్టి అరుగు లలికింది
గోవు పేడ బెట్టి గోడలలికింది"

"చిక్కుడు గాయల్లు సిరిభూషణాలు
చిలుక లొడ్డాణంబు చిన్నప్పనడుము
కాకర కాయల్లు కరిభూషణాలు
గంటలొడ్డాణాలు పెద్దప్పనడుము
కలగంటి మాంచాల కలగంటిచాల
కలలోన కలగని కలమేలుకొంటి
నాతండ్రి సిరిజూచి రాజకళజూచి
రాజులంపినారు నిలువుటద్దాలు"

"చచ్చిపోయి మా తాత స్వర్గానవుంటే
గోవుదానము జేసె కొడుకు నాతండ్రి
పున్నెము కొందరిది పూజకొందరిది
పునిస్త్రీజన్మాన చావుకొందరిది
భాగ్యమ్ము కొందరిది బలము కొందరిది
బాలప్రాయమునాడు పె డ్లికొందరిది
కాటుకచుక్క బొట్టు కడిగి తేబోదు
నొష్టవ్రాసిన వ్రాలు తుడిచినాబోదు"

“ఆరునెల్లా బాల అడ్డపడిగట్టి
ఆయెనే సీతమ్మ అడవులకు పయినం
ఎట్టులుంటావమ్మ నట్టడవిలోన
నామరది లక్ష్మయ్య నావద్దనుండ
నాకేమి భయమమ్మ నట్టడవిలోన”

“ఏటొడ్డు పుచ్చల్లు యెఱ్ఱతుమ్మల్లు
ఎలమంచి తుమ్మపూడి గంగపుట్టిల్లు
పాటొడ్డు ఫుచ్చల్లు పండుదోసల్లు
పంపాద్రి ధనికొండ పాపపుట్టిల్లు
అల్లనేరేడులు పళ్లానబోసి
అంపిస్తిము క్తిఫలమయ్యా గురువులకు
యింతచక్కనిపండ్లు ఎవరంపినారు
నాశిష్య కూతురు వై దేహిసీత”

“వడ్లలో వరిపొట్టు కలపకేతల్లి !
వంశాన నీకడుపు వర్ధిల్లవలెను
పాలల్లొ పంచదార కలపవే తల్లి !
భాగ్యాన నీకడుపు ఫలమందవలెను”

“నాతోడబుట్టిన నలుగు రన్నలకు
చదువు లెవరే తల్లి చెప్పినారు
నీళ్లలో బుట్టిన నీరు కాకులకు
నీతు లెవరే తల్లి తెలిపినా వారు ?
అడవిలో బుట్టిన్న లేడిపిల్లలకు
నడుము లెవరే తల్లి దిద్దినావారు ?”

"వెంకటేశుడవయ్య వెన్నాడవయ్యా
ఎట్లు వెలసితివయ్య యీగట్లనడుమా
గట్టుల్లుగావమ్మ ! కనకశ్రీమేడ
మేడల్లు గావమ్మ ! మేరు శిఖరాలు
శిఖరాలుగావమ్మ ! శ్రీరామగుళ్లు
శ్రీరామగుళ్లుకాడ ఏరామగుళ్లా
ఏరామగుళ్లాకు యెదురెండలాయె
ఏయించు సారంగి నారింజవనము
చీకటి కోనల్లా నేనొక్క గాన్ని
శివుడు నాకిచ్చిండు చిన్నిబాలల్ల
నాచిన్నబాలలకు పాలులేవని
పరమేశు డిచ్చిండు పాడావుమంద
పాడావుమందాకు నీళ్లులేవాని
వసుదేవు డిచ్చిండు వరదకాల్వాల్లు
కాల్వాల్ల నీల్దాగి పొలైబొల్లావు
బొల్లావు పేరేమి – భోగి పేరేమి ?
బొల్లావు బసవన్న భోగిరైతన్న
రైతునకు మనతల్లి – అలమేలుమంగ".

## 4. సంతానాపేక్ష

కొడుకుల కననాళ్ళ కడుపేమికడుపు
కుల ముద్ధరించన్ని కొడుకేమి కొడుకు
పిడికెడు విత్తనాలు మడికెల్ల జాలు
వక్కడే కొడుకైన వంశానజాలు

కొత్తచింతపండు గోనెల్ల చీకు
గొడ్రాలి వస్త్రాలు పెట్టెల్లచీకు.
గుమ్మడిపుయ్యాలి వంగవాలాలి
అతి రాచగారాల పండుపండాలి
గుమ్మిడీ మాయిల్లు వంగ మావంశం
అతిరాచగారాల పండుఅబ్బాయి
కన్న కానుపులెల్ల కడుచక్కనయితే
కన్నులపండుగే కన్నతల్లికిని
లాభమ్మ లాభమ్మ ఏమిలాభమ్మ
కొడుకుల గంటేను కోటిలాభమ్మ.

## ప్రస్తావన

జానపదులు ఒకే గేయాన్ని అనేక సన్నివేశాలలో, అనేక రాగతాళాలలో పాడుకొంటారు. వీధి నాటకాలలో పాత్రోచిత సందర్భాలలోనూ, హాస్యగాడు విరామ సమయాలలోనూ గర్భిణీ పరిణామ చిన్నెలూ, ప్రసవవైరాగ్యం, ప్రసవవేదన, చికిత్సలు అభినయపూర్వకంగా పాడి సభికులను ఆనందపరుస్తారు. వీటినే జానపదులు కోలాట భజనలో కోపులు తీస్తూ పాడుతారు.

## గర్భిణీ పరిణామ చిన్నెలు

గర్భం ధరించిందంటే నెల దప్పింది, నీళ్ళోసుకుంది, కట్టింది అంటారు. గర్భధారణ లగాయతు ప్రతీనెలా ఒక్కోరకంగా పరిణామం చెందుతూ, ఏడవ మాసంలో అడశిశువూ, తొమ్మిదవ మాసంలో మగశిశువూ జన్మించడం సాధారణంగా జరుగుతుంది.

## నాదనామక్రియ - ఆటతాళం

పల్లవి :- అత్తావారింటికి ఏలాగు నే బోదు
ఆరడి వచ్చేగదే ? ఓ యమ్మ ! నాకారడి వచ్చేగదే ॥అ॥

1. పూచిన తంగేడువలె పుట్టింట నేనుంటే
బుద్ధి చెదరిపోయె । ఓయమ్మ నాబుద్ధి చెదరిపోయెనే ॥అ॥

2. చుక్కలలో చంద్రునిలాగు । చక్కానివాడని
ఒక్క గడియ బోతినే । ఓయమ్మ నేనొక్క ఘడియబోతినే ॥అ॥

3. నేనువచ్చి నెలయాయె । నెలలోనే కలయాయె
నెలతప్పె నేమిసేతునే । ఓయమ్మ నాకు నెలతప్పె నేమిసేతునే॥అ॥

4. రెండవ నెలవచ్చె । మెండాయె వేగిళ్లు
రెండుగానక పోతినే । ఓ యమ్మ నేరెండు గానకపోతినే ॥అ॥

5. మూడవ నెలవచ్చె । ముద్దపిండం బాయె
ముందుగానక పోతినే । అమ్మయ్య నే ముందుగానక పోతినే॥అ॥

6. నాల్గో నెలవచ్చె । నలుపెక్కె కుచములు
నాడుగానక పోతినే । ఓసమ్మ నే నాడు గానకపోతినే ॥అ॥

7. అయిదో నెలవచ్చె । అవయవా లేర్పడె
అయ్యో నేనేమిసేతునే । అమ్మయ్య అయ్యో నేనేమిసేతునే ॥అ॥

8. ఆరవ నెలవచ్చె । అర్ధపిండం బాయె
అతివ నేనేమి సేతునే । అమ్మయ్య అతివ నేనేమిసేతునే ॥అ॥

9. ఏడవ నెలవచ్చె । యెదురు పిండంబాయె
ఏమి సేతునే ఓయమ్మ । ఓతల్లి ఏమిసేతునే ఓయమ్మ ॥అ॥

10. ఎనిమిదో నెలవచ్చె । వెనుబట్టి బరువెక్కె
ఏలాగు ప్రసవింతునే ఓసమ్మ । నే నేలాగు ప్రసవింతునే ॥అ॥

## ప్రసవ వైరాగ్యం

గర్భిణీ స్త్రీ ప్రసవించే ముందు తనకు కల్గుతున్న వేదనలు సహించలేక, మగడే తనకు వద్దంటూ వాపోతుంది.

### శ్రీరాగం - ఆదితాళం

పల్లవి :- జన్మజన్మకు నాగమతల్లీ । బాధలిట్లు వేధించుచుండిన
మన్మథుడైనా మగడొద్దమ్మా !
వొద్దు ఒద్దు మగడొద్దోయమ్మా ! నాగమతల్లీ ||జ||

1. ఇదియుగాక ముందిటువలె దోచిన
పెండ్లాడివగాని పెనిమిటి వదలుదు ||జ||

2. భరింపరాని యీ బాధల కోర్వను
యింత వేదన గల్గితె యెందుకె మగడు ||జ||

3. సుద్దులెల్లవిని సుదతిరో యిటులను
బుద్ధిగడ్డి తినెనో నాయమ్మా ! ||జ||

## ప్రసవ వేదన

ఉదకాలాడ్డం, నీళ్లాడడం, కనడం, ప్రసవించడం అనేవిపర్యాయ పదాలు. ప్రసవించే స్త్రీకి అనేకరకాల బాధలు వస్తూంటాయి. మంత్రసానీ, ముసలమ్మలూ ఆమెను ఓదారుస్తూ ఏవేవో చికిత్సలు చేస్తూ వుంటారు. ఈ పాటను పరిశీలించండి.

పల్లవి :- నడుమూ కళుక్కు మనెనమ్మా
అమ్మా ! ఓ యమ్మలారా ! ||న||

1. ఘడియ ఘడియకును కళుక్కుమనె నడుము
కడుపులో నులిపెట్టెను తల్లీ ||న||

2. కడుపు కొంచెము నొక్కరమ్మా
కడుపులో కల్వరించె నమ్మా
సుడివడితిని యిక చూతునో లేదో
వడివడి మావారిని యిటురమ్మనుడు ॥న॥

3. మంత్రసానిని బిల్వరమ్మ అభి
మంత్రించిన జలము నాకందివ్వరమ్మ
మంత్రసాని నిటుచెంతకు తేరే
కాంతలుపోయి కడు వేగమున ॥న॥

4. పక్కలు నొక్కసాగెనమ్మ । భయపడి యీ దేహము
పిక్కలు పొక్కిపోయెనమ్మ
పక్కలు నొక్కుచు పిక్కలు చెదరెను
చిక్కితి బాధకు దిక్కెవ్వరు యిక ॥న॥

5. కూర్చుండి ఓపలేనోయమ్మ । కుదురైన పెక్కము
దెచ్చి వెనుకను వుంచరమ్మా
కూర్చుండుటకు కుదురదు ప్రాణము
తీర్చరే కష్టము నేర్చినవారలు ॥న॥

6. ఈసారి వింతబుట్టెనమ్మ ఈబాధ యేమో
వేసారె ప్రాణమెట్లో యమ్మా
ఏ సంతుకునైనా యిటుబాధలుండిన
ఈసడింతునమ్మ దోసకారిపనికి ॥ ॥న॥

## సుఖ ప్రసవానికి చికిత్సలు

సుఖంగా ఉదకాలాడాలని, ముసలమ్మలూ మంత్రసానీ కొన్ని చికిత్సలు చేస్తారు.

ఆనందభైరవి - చతురశ్ర

పల్లవి :- అయ్యాయో పణతిని లేవదీయరమ్మా
జాగుసేయక । జావకాచి పోయరమ్మా ॥అ॥

1. చెయ్యిచ్చి గోరంతయూతమియ్యరమ్మా
చెయ్యగాదే దూలానికి తాడు పొయ్యరమ్మా ॥అ॥

2. అక్కలారా దేవతలకు మొక్కండోయమ్మా
మొక్క దేవతలకు ముడుపులు గట్టుడోయమ్మా ॥అ॥

3. నందిని త్రిప్పితే మంచి । దందురమ్మా
సందడిలో మగవారిని । ఎంచకండమ్మా॥ ॥అ॥

## ఎ న్నె మ్మ

ప్రసవమయిన వెంటనే శిశువుకు బొడ్డుకోసి స్నానంచేయించి మెత్తని గుడ్డతో తుడిచి, చేటలో పడుకోబెట్టి, మట్టిబెడ్డలు దిగ తుడిచి, మంత్రపానివైపునకు పారవేసి, ఆముదపుత్రవేళ్లు కుడిపి. తల్లి ప్రక్కలో పడుకో బెడతారు.

నాల్గవరోజు ఉదయం తల్లికి ఉడుకుకాయం పెడతారు. ఆ సాయంకాలమున గుమ్మంవద్ద కాపలాగ ద్వారానికి రెండువైపులా పేడబొమ్మల్ని పెట్టి, భూతులసీ, హనుమంతబీర, ప్రాతచెప్పు, ముంగిట కట్టి, సంధ్యాకాలములందు ఎడతెరపి లేకుండా ఎవరికి తీరుబడిగా వుంటే వారే - పురిటి గుమ్మంవద్ద కూర్చొని, "ఎన్నెమ్మ" పాట పాడుతూవుంటారు.

"రావేరావే ఎన్నెమ్మా, నీవు పోవేపోవే యెన్నెమ్మా !
నీకు చీరెడతా మెన్నెమ్మా, నిన్ను పూజిస్తామెన్నెమ్మా !
ఒక్కనాడూ యెన్నెమ్మా, నీవు ఒప్పొగనుంటివి యెన్నెమ్మా!
రెండోనాడూ యెన్నెమ్మా, నీవు లోగిళ్ళనుంటివి యెన్నెమ్మా!

మూడోనాడూ యెన్నెమ్మా, నీవుమూల్గుచునుంటివియెన్నెమ్మా!
నాలుగోనాడూ యెన్నెమ్మా, నీవునవ్వుచునుంటివియెన్నెమ్మా!
అయిదోనాడూ యెన్నెమ్మా, నీవుఅంగిళ్ళనుంటివియెన్నెమ్మా!
ఆరోనాడూ యెన్నెమ్మా, నీవు అరుస్తునుంటివి యెన్నెమ్మా !
ఏడవనాడూ యెన్నెమ్మా, నీవుయేడుస్తువుంటివి యెన్నెమ్మా!
ఎనిమిదోనాడూ యెన్నెమ్మా, నీవుయేర్దాటిపోతివి యెన్నెమా !
తొమ్మిదోనాడూ యెన్నెమ్మా, తోరణాలూగడితి యెన్నెమ్మా !
పదోనాడూ యెన్నెమ్మా, నీవు పరుగెత్తిపోతివి యెన్నెమ్మా!
పదకొండోనాడూ యెన్నెమ్మా, మేము బారసాలచేస్తి యెన్నెమ్మా !
(బాహ్మడి కూతురు మాలోడిపెళ్లాం, ఏడువాడల కెల్ల శ్రీరామరక్ష"
(అంటూ కథ చెప్తారు.)

పురుటినాడు వాడవాడల వారు వేడినీళ్లబిందెలూ, పసుపు ముద్దలూ చేస్తారు. బిందె మీద బిందె చొప్పున బాలెంతరాలికి పురిటినీళ్లు పోస్తారు. స్నానానంతరం సూర్యునికి నమస్కారం చేయించి పేరంటాళ్లు అక్షింతలు వేస్తారు.

కొత్తెమ్మ, కొర్రెమ్మ, ఎన్నెమ్మ, పోతురాజు అను నలుగురికి నైవేద్యం పెట్టించి, అందులో రెంటిని యిద్దరు బాలికలకు, ఒకటి మంత్రసానికీ, ఒకటి కుక్కకీ పెడతారు.

పురిటిమంచం మీద మంత్రసానిని దొర్లించి, బొడ్డుకోసిన కత్తితో కాటుక వేయించి, బిడ్డకు పెట్టించి, వెల్లుల్లి బొడ్డూ పసుపు దారంతో కట్టించి, శిశువునకు మొలత్రాడు కడతారు.

పదకొండవ రోజున బారసాల మహోత్సవం జరిపి నామకరణం చేస్తారు.

## 6. ఆ నం దం

బిడ్డతల్లి తనబిడ్డను చూస్తూ ఆనందంతో మురిసి పోతుంది. రకరకాల వర్ణించు కుంటుంది. లాలిస్తూ తినిపిస్తుంది. తన నోముల పంటగా భావించుకొంటుంది.

### లా లిం పు

జాజిపూల జలకమాడి
పాలవెల్లి పాలకెక్క
అత్తయింట నడుగుపెట్టి
మొగుడు రాగ మొగముదాచి
ఎందుకింత సిగ్గుపడుదు
వేల నీకు యింత సిగ్గు ?
తాడిచెట్టు తలను దన్ని
తాతనీడ తరిగి దన్ని
నిదురలెమ్ము నిమ్మకాయ
కళ్లు విప్పు కందిపిలక
త్వరగలెమ్ము తల్లిగాదె
చిలుకవచ్చి చెట్టుమీద
పిలుచుచుండె పిల్లనిన్ను
వేగలెమ్ము వెన్నయిదుగో
కితకిత కితకిత కితకిత.

ఊ ఊ ఊంగన్న
ఉగ్గుపాలు యిందన్న
గంటెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న.

ఊ ఊ ఊ ఉంగన్న
లుంగలు పెట్టకు గ్రక్కన్న
ఓర్వని సవతుల దిష్టన్న
ఒప్పాగ మసలర బుచ్చన్న.

అరటి పండంటి పండు
అమ్మన్న ముద్దు
పే పే రామన్న
పేర్రాజుముద్దు
అమ్మన్న ముద్దునూ ఏమిఎన్నాను
అచ్చనావుల పాలన్నారు
దోరగ వేగిన గారన్నారు
పాకము వట్టిన అరిశన్నారు
పటికపంచదార చిలుకన్నారు.

చిట్టీత పండెరుపు । చిలుక ముక్కెరుపు
చింతల్ల చిగురెరుపు । జీడిపం డెరుపు
దానిమ్మ పండెరుపు । తాంబూల మెరుపు
తా నెరుపులబ్బాయి । తన వారిలోన.

## మా ణి క్యం

ఆట మాణిక్యమే । పాట మాణిక్యమే
మాయింటి అమ్మాయి । మంచి మాణిక్యమే
నట్టింట అమ్మాయి రత్న మాణిక్యమే.

"అరటిపండూతీపి ఆవుపాలే తీపి
మాచిన్ని అబ్బాయి మాటల్లు తీపి"

"చదువంటె అబ్బాయి
చండికేశాడు
బద్దెపలు పారావె
బుద్ధి చెప్పాలి"
"చదువంటె అబ్బాయి
సంతోష పడును
అగసాలి రామయ్య
నగలు చెయ్యాలి
పొరుగు పిల్లలతోను
పోట్లాడ బోక
ఇరుగు పిల్లలతోను
వీట్లాడ బోక
చక్కగా నీచదువు
చదువుకో తండ్రి
చదువుకుంటే నీకు
సౌఖ్య మబ్బేను."

## దొంగబువ్వ

కుక్కే వచ్చి తింటుందో । నక్కేవచ్చి తింటుందో ?
ఎలుకే వచ్చి తింటుందో । చిలుకే వచ్చి తింటుందో ?
పిల్లే వచ్చి తింటుందో । బల్లే వచ్చి తింటుందో ?
మా అమ్మాయే తింటుందో । మా అబ్బాయే తింటాడో ?
ఎవరు వచ్చి తింటారో । **హాత్ హాత్ హాత్.**

## బూచివాన్ని పిలువ నంపనా?

బూచివాని పిలువ నంపనా। గోపాలబాల।
బూచివాని పిలువ నంపనా! ॥
బూచివాని పిలువ నంపబోతె వద్దు వద్దనేవు
బూచియిచ్చి, జోలపాడి, యాచినాను నిదురపోవు ॥
అల్లమూరగాయ పెరుగు అన్న మారగించుమంటె
వల్ల తేనె తొనలు గావలెను తెమ్ము తెమ్మనేవు॥
బంతిచేతికిచ్చి గోపాల యాడుకొమ్మనంటె
పంతగించి చేరుచోట బంతులవి గొంతెమ్మనేవు॥
బాగుగాను పూలపాన్పుపైన పవ్వళించుమంటె
నాగుబాము పడగనెక్కి నాట్యమాడవలె ననేవు॥
మత్తగజము తెచ్చి చిన్నతిత్తిలోపలుంచినా
నెత్తిమీద బెట్టి నన్నెత్తుకో యశోదనేవు॥
రామశైల భద్రగిరి రామదాసు నేలుస్వామి
కామితార్థ ఫలములొసగి కైవల్యము జూపువాడ॥
బూచివాని పిలువ నంపనా!॥

## ఉఫ్ అంటేనే ఉలిక్కి పడ్డావే!

నూకలు పెట్టెద - పకులు వదుకు
నూకలు యిచ్చెద - మేకలు కాయి
అటుకులు పెట్టెద - ఆవులు మేపు
బెబ్బులి వచ్చిన - బెదరవు కావా
చిఱుతలు వచ్చిన - బెదరవు కావా

ఎలుగులు వచ్చిన - ఏడ్వవు కావా
వడగలు రాలిన - వణకవు కావా
ఎంత ధైర్యం - యిటు చూడుమరి
"ఉఫ్" అంటేనే - ఉలిక్కి పడ్డావే.

### జుట్టు చుట్టు

మామయ్య పంపేడు — మందలో కెళ్ళి
పాలేళ్లు తెచ్చారు పాల కావిళ్లు
బుడ్డి ముంతలతోటి బుడిగావుపాలు
పదవమ్మ చెల్లెలా పట్టుకొద్దాము
తోడుపాసెంతోడు, తోడుతే నీచెయ్యి వేడి
వేడివేడి పాయసంజుట్టు, జుట్టితే నీనోరుచుట్టు.

### అమ్మాయి రూపునా అవతారమెత్తె

కాత్యాయనీదేవి కరుణించె మమ్ము
ఒడినిండె హొన్నలా ఒయ్యారిబొమ్మ
పట్టి నా నోములూ పండి వచ్చాయి
చేసినా వ్రతములూ సిద్ధించినాయి
చివికిన బ్రతుకేను చివురించె మరల
మ్రోడైన చిత్తము మోసు లెత్తింది
కన్నీటి జల్లులో కడకంటి నవ్వు
హాలాహాలమ్ములో అమృతపుధార
పుత్ర శోకాగ్నిలో పొరచేటి మాకు
తొలకరి మెరుపు మా చిలుకలాతల్లి
కోటిపల్లీశ్వరుని కూరిమికి గుర్తు
చిట్టెమ్మ మాతల్లి చిన్నారిముద్దు

శ్రీగౌరిదేవి మాచింతలు దీర్ప
అమ్మాయిరూపునా అవతార మెత్తె॥
నిత్యకళ్యాణమ్మ పచ్చతోరణము
పాపాయి వూసులే పండుగలు మాకు
ఎక్కడున్నావోయి వెర్రి శంకరుడ
'ఉంగాయి' నీకొరకు బెంగతో వుంది
పాలేన త్రావదూ పట్టుపట్టింది
జోలపాటలు వింటు సోలబోదింత
ఆలించరావోయి పాలించరమ్మ
ఆలించి పాలించి ఆదరించేవ
అమ్మాయి నిచ్చేము అల్లుడా నీకు
కాదనక చేపట్టి కనికరించాలి
కన్నెల నవ్వులే కట్నాలు నీకు
లల్లమ్మ చూపులే లాంఛనా లన్ని
చిట్టెమ్మ పలుకులే పట్టువస్త్రాలు
పిల్లడే పదివేలు పెట్టుపోతల్లు
చుట్టపక్కాలతో శుభలగ్నమందు
తరలిరాగదవయ్య పరమేశ్వరుండ
పెళ్ళిపనులూ బాగ తలపెట్టినాము
మాట తిరుగుటలేదు మనువు నిశ్చయము.

## 7. లాలి, జోల, తొట్ల ఊయెల పాటలు

బాలెంతరాలు తనబిడ్డను ఊయెలలో పరుండబెట్టి పాడే పాటలే, ఇన్ని పేర్లతో ఉన్నాయి. కొన్ని బిడ్డపరంగానూ, కొన్ని దైవపరంగానూ ఉంటాయి.

## జోలపాట

"జో జో జో జో లాలీ
నిద్రపో బలభద్ర రాజకుమార
నిద్రపో అబ్బాయి నిద్రపోవయ్యా
నిద్రకు నూరేళ్లు నీకు నూరేళ్ళు
నిను గన్న తండ్రులకు నిండనూరేళ్ళు
నిద్రించు శ్రీరామ నిద్రించు రామ
నిద్రించు రఘురామ రాజసుత్రామ
కమలాప్తకులచంద్ర కౌసల్యరామ
మునివెంట నేగిన ముద్దులరామ
తాటకాంతక రామ దశరథరామ
ఘోరమారీచుని బొరిగొన్నరామ
శివువిల్లు విరిచిన శ్రీరామ రామ
సీతాకళత్రయో శృంగారరామ".

చిట్టి చిట్టి చిట్టి చీమల్ల మట్టి
మట్టి క్రింద వాడు తొట్టినాగన్న
తొట్టి నాగన్నకు తోడెవ్వరమ్మ
గొట్టెల గాచేటి గురవడే తోడు
నిద్రపో అబ్బాయి నీరేజనయన
ముద్దు కృష్ణుడు వచ్చి ముద్దిచ్చిపోవు
ఊరుకో అబ్బాయి ఊళ్ళన్ని మనవి
ఊగుతున్నా నిన్ను ఊచెద తండ్రి.

"లాలీ లాలీ లాలీ
లాలమ్మలాలీ - లాలమ్మలాలీ

లాలమ్మ గుఱ్ఱాలు
లంకల్లో మేసే - లంకల్లో మేసే
బుల్లెమ్మ గుఱ్ఱాలు
బీడుల్లో మేసే - బీడుల్లో మేసే
అప్పన్న గుఱ్ఱాలు
అడవుల్లో మేసే - అడవుల్లో మేసే
ఊరుకో అబ్బాయి
వెఱ్ఱి అబ్బాయీ - వెఱ్ఱి అబ్బాయీ
ఉగ్గెట్టు మీాయమ్మ
ఊరికెళ్ళిందీ - ఊరికెళ్ళిందీ
పాలిచ్చు మీాయమ్మ
పట్టమెళ్ళిందీ - పట్టమెళ్ళిందీ
నీలోసె మీాయమ్మ
నీలకెళ్ళిందీ - నీలకెళ్ళిందీ."

పిల్లమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయి కన్నుల్లు కలువ రేకుల్లు
కలువరేకుల వంటి నీకన్నులకును
కాటుకలు పెట్టితే నీకు అందమ్ము
ఏడువకు ఏడువకు వెఱ్ఱినాతండ్రి
ఏడిస్తె నీకళ్లు నీలాలుకారు
నీలాలు కారితే నే చూడలేను
నిద్రపో అబ్బాయి నిద్రపోవయ్యా
భద్రకన్యక లొచ్చి నిద్ర పుచ్చేరు
కాకమ్మ పిచుకమ్మ కథలు చెప్పేరు
పట్టు ఉయ్యాలలో పండబెట్టేరు.

అబ్బాయి మామల్లు ఎటువంటివారు
వీరులూ శూరులూ విక్రమార్కులూ
అబ్బాయి తండ్రుల్లు ఎటువంటివారు
రాజ్యాలు యేలేటి రామలక్ష్మణులు
అబ్బాయి మామల్లు ఎటువంటివారు
చెవి చెవికి బారెడేసి కమలాలవారు
అడ్డపాగలవారు అంగీలవారు
వేటగుఱ్ఱాలెక్కి వేటాడువారు
జో - హాయి – జో - హాయి.

## వుయ్యాల

కొబ్బరిచెట్టుకు వెయ్యరుయ్యాలా
గోపమ్మ మనుమల్ని ఊపరుయ్యాలా
మామిడిచెట్టుకు వేయరుయ్యాలా
మాయమ్మ మనుమల్ని ఊపరుయ్యాలా.

మంచినీళ్ల బావి వెనుక వుయ్యాలా
మంచిమల్లిచెట్టు బుట్టె ,,
కోసేవారు లేక ,,
కొండలెత్తు పెరిగి పోయె ,,
కోయించు రాముడూ ,,
పంచిపెట్టు సీతమ్మ ,,
ఒక్కొక్క పువ్వునా ,,
పిడికెడు గంధంమెడన ,,
చాలుచాలుఅక్కలార ,,
సంపంగి మొగ్గలార ,,
జానికి గౌరికీ వుయ్యాలా.

## లా లి పా ట

చాలుచాలుర కృష్ణ - పోరుపెట్టకురా
చలవపాన్పుమీద - పవ్వళించావూ
ఎంత వూచినగాని - నిద్రపోవేమీ
కథ చెప్పెదను నేను - వూ అనుచు వినరా। ॥లాలి॥

సూర్యవంశమున - దశరథ మహారాజూ
అనుచు నొక్కడు - రాజ్యమేలుచు నుండె
పుత్రులూ లేరనుచు - పుత్రకామేష్టి
రామలక్ష్మణ భరత - శత్రుఘ్న పుట్టె। ॥లాలి॥

కౌసల్య రాముడూ - అనుజులతో కూడి
అయోధ్యలో పెరుగు - చుండంగా
కౌశికుని యాగమున - పిలువరాగాను
రామలక్ష్మణులుకూడి - చనుదెంచి రపుడూ। ॥లాలి॥

తాటకిని ఖండించి - యాగము నడిపి
గౌతమునిసతి - శాపములు దీర్చిపోయి
హరుని విల్లు విరిచి - సీతపెండ్లాడి
పరశురాముని - భంగపరచి పురికేగెన్ । ॥లా॥

తండ్రిసత్యము నడుప - సీతతోకూడా
రామచంద్రులు కానలకు - చనుదెంచెన్
నారచీరలుకట్టి - తమ్మునితోకూడా
గంగదాటి చిత్ర - కూటమున నుండి । ॥లా॥

భరతుడూ వేడ - పాదుక లిచ్చి పంపి
అత్రి అనసూయకును - మ్రొక్కి చనుదెంచెన్
పంచవటికి పోయి - పర్ణశాలాను
రామ లక్ష్మణ సీత - స్థిరముగానుండ్రి । ॥లా॥

పసిడి మృగమును జూచి - సీత అడుగగనూ
పట్టి తెచ్చెదనని - రాముడూ వెడలెన్
మారీచు మాటలకు - భ్రమసి జానకిని
వెంటను లక్ష్మణు - పంపించెనపుడూ । ॥లా॥

రావణుడు సన్యాసి - వేషమునవచ్చి
సీతను నెత్తుక - చనుదెంచె ననగా
హుంకారమున లేచి - శ్రీకృష్ణు డపుడూ
సౌమిత్రి విల్లు - యిమ్మనుచు పలికేనూ । ॥లా॥

కొంతసేపు యశోద - విస్మయంబంది
కలువరించెను తనపట్టి - నే డనుచూ
ప్రేమతోడుత నెత్తి - కౌగిటనుజేర్చి
హారతులిచ్చి ముద్దు - పెట్టి పాలిచ్చెన్ । ॥లా॥

ఎందుకుర కృష్ణమ్మ - యేల భ్రమసితివి
ఏమికలగంటివి - నాముద్దులయ్యా
నాతోను జెప్పరా - చిన్ని గోపాలా
సనకాదివందితుడ - శ్యామలా రారా । ॥లా॥

పదకొండు వేలేండ్లు - సీతతోగూడి
దశముఖునికొట్టి - రాజ్యమును యేలితివి
కొంకను రావణుడు - జొచ్చె ననగానే
ఖండింప లేచితివి - గోపాలబాలా । ॥లా॥

నిద్రపోవలె ననుచు - కథ చెప్పితినిరా
నీవు రాముడ వనుచు - యిపుడు తెలిసెనురా
యెనమండ్రు పదహారు - వేలపడతులను
పెండ్లాడుదువు లేరా - దుర్గసోదరుడా । ॥లా॥

లాలనుచు యశోద - కథ చెప్పగానూ
బాలకృష్ణుడు వూ - అనుచు వినుచుండెన్ ॥ ॥లా॥

"శ్రీరమ్య దేహాలాలీ, మాముద్దు
చిన్నారికూన లాలీ
గారాల కూచిలాలీ మాయన్న
కంజాత నయనలాలీ
సకలలోకాధారుడూ మునిమనో
జలజాత సంచారుడూ
అకలంక గుణధీరుడూ మము బ్రోచు
ఆర్యా మనోహారుడూ
ఇందీవ రేక్షణుండు నిజభక్త
బృందారకా వనుండు
శ్రీవాఙ్మనోధినేత నిజభక్త
చింతితాభీష్టదాత
దేవేశు డావిధాత నీకు తా
దీర్ఘాయు వొసగుగాత."

రామాలాలీ మేఘశ్యామాలాలీ
తామరస నయన దశరథ తనయాలాలీ ॥రా॥
శ్రీరామా లోక నాయకా శేషశయనా
నారాయణాచ్యుత స్వామి ననుగన్న తండ్రీ ॥రా॥
చిన్నిముద్దుల నాయన్న చిన్నికృష్ణమ్మ
తిన్నంగ సేవింపయ్య తియ్యంగుండేను ॥రా॥
సంపెంగనూనె తలంటెద స్వామి నీకు
ఇంపుతోడచుంచు దువ్వి పైకి రాచెద ॥రా॥
కర్పూర ధూపాన పొగకాపు వేసేను
అబ్బబ్బ యిక నిద్రబొమ్మా అచ్యుతానంత ॥రా॥

అద్దాలతొట్టి లేదెమొ అనుమానించేవు
ముద్దుపాపడున్నా డనుచు మురిసిచూచేవు ॥రా॥
గజ్జలందేలు కాళ్ళ ఘల్లని మ్రోయంగా
తజ్జణు కిటతకతక ధిమ్మాని తాళగతుల ॥రా॥
శంకలేక చూచుచుంటె చెలగి చూచేవు
పొంకమైన సౌమిత్రి పొంత నిదురించూ ॥రా॥

లాలి మాధవుడ లాలి మాయన్నలాలి కేశవుడలాలి
లాలి ఆచ్యుతుడలాలి మాతండ్రిలాలి కృష్ణయ్యలాలి ॥లాలి॥
బంగారు తొట్లలోను బాగుగా పవ్వళించీ యుండుమిా
అంగనా మణులుచేరి సంతోషమలరంగ నిన్నూతురూ ॥లాలి॥
నా కెవ్వరయ్య నీకు ననుగన్న చక్కని దొరవుకావా
ఆటలింకను చాలురా నాతండ్రి అరగడియ నిద్రింపరా ॥లాలి॥
తలయెత్తి చూడబోకు నీవిట్లు తంటాలు బెట్టితేను
పిలిపింతు బూచివాని కనుమూసి వేగిరము నిద్రపొమ్ము ॥లాలి॥

శ్రీవెలయ మమ్ము రక్షింపగా గోరి
యీావసుంధర బుట్టినావు దయమీారి
భావించి మిాపాద పద్మములు జేరి
సేవజేసిన సిరులు జెందు నవ్వారి ॥

లాలిబంగరుబొమ్మ లాలి మాయమ్మ
లాలి ముద్దులగుమ్మ లాలి సీతమ్మా ॥ ॥లా॥
పగడంపురత్నాల పని తొట్లగట్టి
సొగసైనపైడి గొలుసులుచేతబట్టి
మగువలూ చెదరు సంభ్రమము లెగగొట్టి
మొగలిరేకులను కొప్పులనిండబెట్టి ॥ ॥లా॥

మొలక నవ్వులను వెన్నెలలు వెదజల్ల
తళుకు చూపులకు దిక్కులు పిక్కటిల్ల
చిలుక పలుకులను పాటలను రంజిల్ల
చెలువుగా లాలియూచెదరు చెలులెల్లా ॥ ॥లా॥
గాజు లొరయగను కంకణములు చాల
జాజికొప్పులనిండి జలజలరాల
తేజ మలరను అందియలు రంజిల్లా
రాజముఖు లూచెదరు రమణి నినుజోల ॥ ॥లా॥
క్రిందుగా మొలనూలి గంటలొగి మెరయ
సందిదండల కాంతు లందందు మెరయ
చిందులుగ చీరకుచ్చిళ్ళు మెరయా
యిందు ముఖులూచెదరు యింపుసొంపారయ ॥ ॥లా॥

## కాంభోజి - ఆట

లాలి బాల ముకుంద లాలి గోవింద
లాలిపరమానంద లాలి ఘనకంద ॥లా॥
నవజలధరశ్యామ నతకుముదసోమ
ప్రవిమలగుణస్తోమ పరిపూర్ణ కామ ॥లా॥
భవభయవిరామ నిజభ క్తరిపు భీమా
భువనమోహన పుణ్య కోటివరధామా ॥లా॥
అకలంక చంద్రబింబానన సుశీలా
మకరకుండల రత్న మకుట మణిమాలా ॥లా॥
ప్రకటిత మహాభాగదేయ వసుచేలా
వికచకమలాయ తేక్షణ విశ్వపాలా ॥లా॥

కుంజరాద్రివిహార గురుతరగభీరా
మంజులాధర మానిబృందమందారా ||లా||
కుంజ భవకృత సవన కరుణావతార
కంజవాసిని హృదయ కంజ సంచారా|| ||లా||

లాలి శ్రీభద్రాచలేశ జయలాలి
లాలి శ్రీనిజభక్త వాస జయలాలి ||లా||
రంగైన నవరత్న మంటపంబునను
బంగారు తొట్లలో బాగుమీరగను ||లా||
శృంగారముగ సీత సేవించుచుండా
పొంగుచు నిదురపో అంగనలుపాడా ||లా||
పటుతరంబుగ మెరయు భాసుర కిరీటా
వాటముగ కస్తూరి తిలకంబు నుదుటా ||లా||
చాటుమాటును లేక సరసముగ నిచటా
సీటుగా నిదురపో నాకన్ను లెదుటా ||లా||
సొగసైన మొలక నవ్వుల ముద్దుగులుకా
సొగసుకన్నుల కలికి చూపులను గులుకా ||లా||
బాగుగను నీచిన్నిపలుకు సుధలొలుకా
వేగముగ నిదురపో రఘుకుల తిలకా ||లా||
నిద్దంపు చెక్కిళ్ళు నీటు మెరయగనూ
సద్దుచేయక కొల్తు భద్రముగ నిపుడూ ||లా||
ప్రొద్దు చాలగబోయె ముద్దులారామ
నిదురబోరా యికను నీరదశ్యామా ||లా||
వరభద్రగిరి వరద రామదాసునకూ
వరము లొసగుటకైన వేంచేసినావా ||లా||

వసియించి వానింట వరసీతతోడా
వసజబాంధవ వంశ నిదురబో యికను ॥ ॥లా॥

లాలి శ్రీవినోద లీలా వినోద
లాలి ద్వారకపురీ బాలగోపాల ॥లా॥
మిసిమి మించినయట్టి పసిడి గొలుసులను
పొసగ వజ్రాలతో పొందుపరచియును
అసమాన తొట్టిలో కుసుమ పాన్పునకు
జిలుగు బుటేదారి బాలీసుతోను ॥లా॥
అందముగ జాంబవతి చందనముపుయ్యా
పొందుగా కాళింది పువ్వులందియ్యా
మందయాన రాధమదుపులందియ్యా
యిందుముఖిలక్షణ వింజామ రెయ్యా ॥లా॥
సత్యభామయు చాల సంతోషపడగా
మిత్రవింద యెంతో అత్తరువు బుయ్యా
అలభద్రసతి నిలువుటద్దమందియ్యా
సుదంత సొగసుగా సురటీలు వెయ్యా ॥లా॥
చుట్టు గోపిక స్త్రీలు తొట్టి నూచంగ
కోటరంగా రాజు కోర్కె లొసగంగా
పదహారువేల గోపికలను చాలా
మోదమున నేలితివి మదన గోపాలా ॥ ॥లా॥

## ఉయ్యాలో జంపాలో

### సౌరాష్ట్రి - ఆట

ఉయ్యాలో జంపాలో మా ఉమామహేశునకు
సయ్యన పార్వతీ సరసజేరియూపె పయ్యెద చెంగు చేపట్టి ॥ఉ॥

వెయ్యారు విధముల వినోదించుచు
మునుల కుయ్యాలించు పరమ గురునకు ||ఉ||
భారతి వీణె యాబ్రహ్మతాళము
పాకారి వేణువు హరిమృదంగంబు ||ఉ||
సారసలయగాన సాహితినెరప
బృందారకు లలర నృత్యముసేయు శివునకు ||ఉ||
బత్తికి మదిమెచ్చి బాగుగ కన్నప్ప
పొత్తున భుజియించు పొంతముతోను ||ఉ||
నత్తరి సాయుజ్య మతని కిచ్చిన
గంగోత్తమాంగునకు జోలశబ్దముహాయి ||ఉ||
ఏయెడ తానయ్యు హేలాపురిని యెంతో
సోయగమున పొడజూపుచును
హాయిగా నెప్పుడు శ్రీయుమాపతి
నెడబాయకున్న మార్కండేశునకు ||ఉ||
ప్రేమతో సీతారామ దాసునకు
కామితార్థము లిచ్చి కరుణింపుచు
శ్రీమన్మహాదేవు నామము గన్నట్టి
ఆ మహామహునకు నభయునకు || ||ఉ||

## లాలిముద్దులహంస

శ్రీరాగం - ఏక

దాధ సాస ససాస - సాససస నిగరీ - గామపా
1. లాలిముద్దుల హంస - లాలిపరమాత్మా లాలిము
మగగరిస - సారిసని దాధనీప
_త్తి ... కాంత - లాలిశ్రీ కాంతా ||లా||

2. శ్రీగురు పాదముల్ చిత్తమున కోరి
సేవగావింపుడీ స్థిరబుద్ధి మీరి ||లా||

3. సకలంబు మరచి తాసత్యమును జేరి
సర్వరోగుల హృదయసాక్షి కలుపార్తి ||లా||

4. ముగ్గురు మూర్తులూ ముందుగానిలచి
బాగుగా నూచెదరు పాటిపూజించి ||లా||

5. మక్కువతో నూచెదరు మగువ నీతొట్టి
పింగళాయను గొలుసు ప్రేమతో బట్టి ||లా||

6. సూటిగా రత్నాలమేడ లోపలను
నీటుగా బవళించి నిదురపోవగను ||లా||

7. పాటించి యోగులు ప్రస్తుతించగను
నటనములు జేసెదరు నిటలమందునను ||లా||

8. కమలాక్షి ముఖముసోముని గేలిసేయు
కులుకుపలుకులు చిలుక పలుకులను గెలియా ||లా||

9. కుండలికి పైనుండి కులుకుచును మెరయా
కూడెదరు పవనమున సూటిగా గదియు ||లా||

10. ఆరుకుండల మీాద నరుదుగా నీవు
మెరయుచుందువు మేటి పరములోపలను ||లా||

11. పరబయలు దైవమున భక్తితో దలచి
వరములను గోరెదరు వాంఛతోడుతను ||లా||

12. శృంగాటకము నందు సొంపుతోడుతను
సోహమని పలుకుచును సుస్థిరంబుగను ||లా||

13. సర్వకాలములందు సాక్షిగా నిలిచి
శేషాచలయోగికిని సేవగావించి. ||లా||

## లాలి చిద్రూపుడా!

### శ్రీరాగం - ఏక

దాధసా సాససా - సాససానిసరీ

1. లాలి చిద్రూపుడా లాలిచైతన్యా
   గామపామ గగరిస - సారిసని దాధ నీప
   లాలి స్వప్రకాశ లాలి పరమాత్మా ॥లా॥
2. ఓంకార మనియెడు ఒకతొట్టిలోను
   తత్వమనియెడు చలువపౌత్తిళ్ళు బరచి ॥లా॥
3. మెరుక గల పాపణ్ని యేర్పాటుజేసి
   యేడు జగములవారు యేకమైవూచా ॥లా॥
4. సర్వపరా పరాశక్తి మధ్యమున
   ప్రాకటముగ స్వప్రకాశము వెల్గుచుండ ॥లా॥
5. యిడ పింగళ సుషుమ్న మధ్యమునందు
   తీరుగా తిరువేణి తీరుగానూగా ॥లా॥
6. నాదబిందు కళాతీతమై వెలుగా
   సుషుమ్ననాళికాధారమై వూగా ॥లా॥
7. సత్తుచిత్తానంద నిత్యాద్వైయూగా
   భ్రూమధ్యమందునా జ్యోతియై వెలుగా ॥లా॥

## లాలనుచు ఊచేరు

### శ్రీరాగం - ఏక

దాధససాసస - సససానిసరీ

1. లాలనుచు ఊచేరు లలన లుయ్యాలా
   గామపామగగరిస - సారిసని, దాధనీప
   నీలకూడలిసంగ లింగశుభశాలి ॥లా॥

పగడంపు చిన్ని యుప్పరిగె లోపలను
మగరాతి దూలముల్ మానికంబులును
తగుకోళ్ళతోఁ బట్టె కుందనపు చేరులను
బిగియించి వెసమించి ప్రేమ నెలకొనను ||లా||

2. అళికెలళికములు మిక్కిలి ముద్దుగులుకా
కలికి కన్నులను శృంగార రసమొలుకా
పలుకంగ నగుమోము ముత్యాలుగులుకా
కలకల ధ్వనులచే కంఠములు బలుకా ||లా||

3. జడలు పిఱుదులపైనబడి తొడలుజూడ
మడమలెక్కెడు కాళ్ళకడియములు గూడ
పిడికిటకు నడగు నెన్నడుము లసియాడ
తడబడక కడువడిని కుడియెడమ వీడ ||లా||

4. చెంగావి చీరగడు మెఱుగు సంపదలూ
పొంగుచును ముంగురులు అంగుగను మెదలా
రంగైన కుచగిరులు రమ్యముగ తెరలా
బంగారు పులిగోరు పతకములు గదలా ||లా||

5. మల్లెలును మొల్లలును కొల్లలుగ దురిమి
పల్లవాధరు లెల్లయుల్లమున జెలిమి
యెల్లవారలుగూడి వేడ్కతో బలిమి
తెల్లనగు యడుగులకు బాడెదరు కలిమి ||లా||

6. చెల్లు నీపాటరాజేయు ప్రజకెల్ల
కలుగు ఇష్టార్థముల్ కరుణ వెదజల్ల
చల్లనై యుండు రీజగతి వారెల్ల
అల్ల దేవుని కరుణ ఆత్మనే జెల్లా ||లా||

7. శ్రీక్షీరపురివాస శ్రీరామలింగ
రాక్షసమదభంగ రాజితతురంగ
పక్షివాహనరోపభాసిత శుభాంగ
అక్షయంబుగనేలు యాది గురులింగ ||లా||

8. పన్నగాధిప భరణ పాతకాహరణ
సన్నుతా మృదుచరణమెన్న మీకరుణ
నన్ను బసవని బ్రోచునుచున్న వితరణ
నెన్న శక్యంబెరిగి కన్యకా రమణ. ||లా||

## లవకుమార ఊయల

శ్రీహరి ఋషిపల్లె సోమవీధులనూ
ఊరికే ఉయ్యాల లమ్మవచ్చినవీ
కొమర కొడుకులతల్లి కొనరె ఉయ్యాల
చేరతో చేరెడు ముత్యాలుపోసి
కొన్నదే సీతమ్మ బంగారుతొట్టి
వేసెనే సీతమ్మ పొగడంచు చీర
కట్టెనే సీతమ్మ పొన్నమానులకు
ఇటునుంచి ఊచితే యింద్రుని ఛాయ
అటునుండి ఊచితే చంద్రుని ఛాయ
కొండవంకలలోను కోనేటి నడుమా
పాపన్న మిముగంటి కంటమరుగులను
ఏడవకు లవకుమార రాముకుమారా
ఏడిస్తే నిన్నెవ్వరెత్తుకొనువారు
పుట్టుటందెలుబూని పులిగోళ్ళుబూని
భూదేవి మీయవ్వవచ్చె నేడువకు
దేవతార్చనపెట్టె దేముళ్ళుబూని

జనకుడూ మీతాత వచ్చె నేడువకు
ధనము మిక్కిలిబూని ధాన్యాలబూని
దశరధులు మీతాతవచ్చె నేడువకు
పరగ దేవాసుర యుద్ధమూ నాడూ
సీలపుడు విరిగియు తేరు(గుంకంగ
తీవితో కైకమ్మ తేరుయెత్తంగ
మీతాత దశరధుడు తానేమొ మెచ్చి
కోమలి కోరుమీ వరము లిచ్చెదను
నాటి వరములు అయిన నేడు తాగోరి
మీతండ్రి పట్టాభిషేకమ్ము నాడు
వరములందిన అవ్వవచ్చె నేడువకు
చెవుల పోగులబూని చెల్లాలుబూని
శాంతమ్మ మేనత్త వచ్చె నేడువకు
రూడైనబంగారు రుమాళ్ళుగొనుచు
ఋష్యశృంగుడుమామ వచ్చె నేడువకు
ఉగ్గుబంగరుగిన్నె ఉయ్యాలెగొనుచు
ఊర్మిళాపినతల్లి వచ్చె నేడువకు
చక్కనిచుక్కల్ల చెక్కిళ్ళు మెరయు
శృతకీర్తి పినతల్లివచ్చె నేడువకు
మల్లెలుమొల్లలు మాండలేగొనుచు
మాండవి పినతల్లి వచ్చె నేడువకు
బంగారు పాలాలె గొడుగులు గొనుచు
భరతుడు పినతండ్రి వచ్చె నేడువకు
లక్షవేలూజేయు రాజులానణచు
లక్ష్మణుడు పినతండ్రి వచ్చె నేడువకు

శాత్రవులజంపంగ నాయుధముబూని
శత్రుఘ్నుండు పినతండ్రి వచ్చె నేడువకు
అంచు పంచలుబూని అందలాల్ బూని
హనుమంతు మనబంటు వచ్చె నేడువకు
ఒడలెల్ల విభూతి జడలెల్ల దాల్చి
కులగురువు వశిష్ఠుడు వచ్చె నేడువకు
పట్టుగొడుగుల నీడ పల్లకీ లెక్కి
పట్టభద్రుడు తండ్రి వచ్చె నేడువకు
మనమంత గూడుకు అందలాలెక్కి
అయోధ్య కెళదాము అయ్యేమేడువకు
బంగారు మేడల్లో రత్నాలతొట్టిలో
మిమ్ము పడుకోబెట్టి జోలపాడెదను.

## చిన్నికృష్ణాడా !

అంచె అంచె అడుగు దీసి
మంచిబాలుడూ తాను
పంచవేగ సరులు అన్ని
పలికె గజ్జెలు పక్షిణి అంచెలు
రత్నా కంఠాలు మ్రోయగను
కుసుమరాలి రేఖ మధ్య - కాయలమరెను
అంకించి తల్లి బిలువ
సంకోచములాయె
పంకజనాభు డనగా

## స్త్రీ సారస్వతం

పరుగు నొచ్చేను
ఉబ్బుచూ కన్నతల్లి
గొబ్బునా దురుములేచి
నిబ్బరాన చెయ్యిపట్టి
నిలిపె కొడుకుని
ఎక్కడికి బోకుమా
ఎదుటనే ఆడవయ్యా
చక్కని నాతండ్రి చాలనమ్మితి
పాలలూదూలినావు సతుల యిళ్ళదూరి
పాలు ఆరగించవయ్య బాలకృష్ణుడా
కొంటిపనులు చేయకయ్యా చెయ్యి విడచి
పోవకయ్యా చిన్నికృష్ణుడా !

## శ్రీకృష్ణుని కోరికలు

1. తూర్పు తెల్లవారె లేగదే
   అమ్మనీకు దణ్ణమైన పెట్టమనగదే
   తల్లివైన నీవు లేగదే
   అమ్మనాకు తైలముతో శిరసునంటవే॥
2. పరిమళాల నలుగుపెట్టుమీ
   అమ్మ నాకు పన్నీట జలకమార్చుమీ
   పట్టుశాల చంగులియ్యుమీ
   అమ్మ నాకుకట్టుదట్టి సొబగు గూర్చిమీ॥
3. గుత్తమైన గులివెందలూ
   అమ్మ నాకు గుచ్చి సందిటగట్టుమీ

ఎక్కువైన మాణిక్యములూ
అమ్మ నాకు కంఠాన హారమెయ్యుమీ॥

4. చిరుగంటల పతకమియ్యుమీ
అమ్మ నాకు గంటశాల చేతికియ్యుమీ
కడవనిండ పాలుపొయ్యుమీ
అమ్మ నాకు ఉడగ్గాన కజ్జం పెట్టుమీ॥

5. ఉక్కతోటి బువ్వపెట్టుమీ
అమ్మ నన్ను ఎత్తుకొని తినిపించుమీ
అటుకులన్ని వొడిని బొయ్యుమీ
అమ్మనాకు అరటిపళ్ళు చేతికియ్యుమీ॥

6. పాలపళ్ళు వొడిని పొయ్యుమీ
అమ్మనాకు పనసతొనలు చేతికియ్యుమీ
సెనగలన్ని వొడిని పొయ్యుమీ
అమ్మ నాకు చెఱుగ్గడలు చేతికియ్యుమీ॥

7. ఈతపళ్ళు వొడిన పొయ్యుమీ
అమ్మనాకు యీాడిపళ్ళు చేతికియ్యుమీ
వీధిలోను ఆడుమనూమీ
అమ్మ నన్ను వీరావతారుడనుమీ॥

8. గోవులను గాయుమంటివి
అమ్మనన్ను గోపాలకృష్ణు డనుమీ
మేఘాలుగాయు మనుమీ
అమ్మనన్ను మత్స్యావతారుడనుమీ ॥

# రుక్మిణి సమర్త

అల్లోనే రేడల్లో అతివ రుక్మిణి సమర్తాడె నీవేళా
సరిగాను పండ్రెండు వత్సరంబులో
పరిశుద్ధమగు మాఘమాసంబులోను ॥
శుద్ధపంచమి శుక్రవారము పగలూ
సురుచిర హస్తనక్షత్రంబులోను ॥
సౌభాగ్య యోగమును తైతులాకరణం
సఖియ రుక్మిణి సమర్తాడె సద్భరణం ॥
శ్రేష్ఠమైనట్టి మేల్ సింహ లగ్నమున
చెలియ రుక్మిణి సమర్తాడె నీమయున ॥
వర్జములేక ధావళ్య వస్త్రమున
ఒనరుగా భోజనంబైన తర్వాత ॥
యీతిథి వారాన బలిమినీ సరికీ
యీమూడు లోకముల నేలు విభుడవునూ ॥
వలనొప్ప యీపుణ్యవతిని గన్నట్టి
తలిదండ్రు లెన్ని నోములు నోచినారో ॥
సన్నాయి మేళముల్ శృతులు సవరించి
సరిగా భజంత్రీలు వాయించరారో ॥
వేశ్యకన్యకలార వరమృదంగములూ
వీణెలూ శృతిగూర్చి పాడరే మీరు ॥
సొంపైన చిమ్మిలి నానశనగలునూ
సఖియలు పొంగడాల్ సుదతి కివ్వారే ॥

పాయసాన్నము దోసె లతిరసంబులునూ
వడలు పులిహోరలన్ వనిత కివ్వారే ॥
అయిదవరోజు స్నానంబు చేయించి
ఆశ్రిత బంధులకు భోజనం బిడరే ॥
పువ్వులపాన్పేసి రంజిల్లగాను
పాలతి కూర్చోబెట్టి పాటపాడంగా॥
చామంతి జాజి దవనంబు మల్లెలతో
సంపెంగములతో కురుల నలరించరే॥
అగరు గంధముబూసి పన్నీరుజల్లి
అత్తరు జవ్వాది అలదరే మీరు ॥
అరటి పంపరపనస జామిఫలములునూ
మరి నారికేళాది ఫలము లివరమ్మా ॥
పచ్చకర్పూర కుంకుమపువ్వుతో నూ
జాపత్రి మిళితంపు తాంబూల మిడరే ॥
ఈలాగు నాలుగుసమర్తాల వరకూ
కేళిగా వేడుక ల్జేయవలె నమ్మా ॥
యేస్త్రీలు చెడువారతిథి సమర్తైనా
యిలనవగ్రహముల పూజించవలెనూ ॥
పృథివి నెల్లూరు రంగయ్య సన్నిధిలో
పొంగళి మొదలైన తళియలీవలెను ॥
పిళ్ళారిశెట్టి కోదండరాముండు
పెద్దల గ్రంథముల్ శోధించి చెప్పె ॥

# ౩. సాంఘిక (సంబంధ) సారస్వతం

సాంఘిక సంబంధ సారస్వతాన్ని స్త్రీలవేడుక పాటలంటారు. ఈ జాన పద వాఙ్మయంలో సాంఘిక సారస్వతానికి ప్రత్యేకస్థానం వుంది. సమాజానికి పాటలకూ వున్న ప్రాముఖ్యము మరి వేటికి లేదని చెప్పినా చెప్పవచ్చును.

వీటిలో మన సాంఘికాచారాల హద్దులు బహుసున్నితంగా తెలియబడుతూ వుంటాయి. నిజానికి ఆప్రత్యేకత సంఘాలలో, కులాలలో, పెళ్ళిపేరంటముల సందర్భాలలో, వేరువేరు సమయాల లోను పాడేపాటలు నిండివుండే సంపూర్ణ స్వరూపమే.

## 1. వియ్యము

త్రోవలో ఒకరాజు తోట వేసినాడు
తోట లోపలపండ్లు దొర్లుతున్నాయి
దొర్లుతున్నవి తియ్య దోసపండ్లన్ని
ఆ పండ్లు పంపాడు ఆరగించంగ
తింటేను తియదోస పండ్లే తినాలి
కంటేను కొడుకుల్ల కాన్పే కనాలి
కంటేను కొడుకుల్ల కాన్పే కనాలి
అందితే అన్నతో వియ్యమందాలి
అందితే అన్నతో వియ్య మందాలి
ఆడితే వదినతో జగడమాడాలి.

ఇల్లలికి ముగ్గెట్టి యింతపని చేసి
ఈ యింటి సుందరి యెందు పోయింది
సుందరి పుట్టిల్లు చూడబోయింది
అన్నలతో వియ్యమ్ము లందబోయింది
వదినలతో వాదంబు లాడబోయింది.

కలిగినవారు పేదవారు వియ్యమందితే
అరచేతి బెల్లమ్ము చిరుచేదు లాయె
మా వెంకు రామయ్య వియ్య మందితే
పానకం పన్నీరు కలిపినట్లుండె.

## 2. పెళ్ళిచూపులు

"రావాకు జలకమ్ము" అనే పాటలలో కొన్ని మార్పు కూర్పు లున్నాయి. బాలికలు బొమ్మల పెళ్లిళ్లలో పాడేవి ఒకరకం, మరోరకం సాంఘిక సంబంధమైనవి.

"రావాకు జలకమ్ము లాడరే పాప
రాజుల్లు మీవైపు చూడవచ్చారు
చూడవచ్చిన వారు ఏమి తెచ్చారు
తులంబెట్టి చేయించిరి చుట్టుమట్టెలు
* మడుంబెట్టి చేయించిరి ♦ మంగళసూత్రాలు
ప్రధానపు ఉంగరం భమిడివత్తులు
అందకందన మొక్క తాగుజ్జుమొక్క
గుజ్జుము ముందరికి బాలుణ్ణితెచ్చి
బాలుని ముందరికి కురువేరు తెచ్చి
కురువేరు ముందరికి నాము దేరమ్మ
నాముకు నాకొక్కబొట్టు దేరమ్మ
బొట్టుకు బొమ్మంచు చీరదేరమ్మ
చీరకు చిలకల్ల రవికె దేరమ్మ
రవికకు రత్నాలపేరు దేరమ్మ
సొమ్ముకు సోమందగరిగ దేరమ్మ
గరిగకు గంధపుచెక్క దేరమ్మ
చెక్కకు బారెడు బుక్క దేరమ్మ.

## 3. నలుగుపాట

కాంభోజి-ఆది.

నలుగిడరావమ్మ నళినాయతాక్షీ
చెలువుడే శ్రీరామచంద్రునకిపుడు

---

* మడుం=మడువు, మణుగు అని అర్థము. మదుం అని రూపాంతరం; అనగా మదుపు పెట్టిన సొమ్ములోనిదని భావం.

♦ మంగళసూత్రము = శుభప్రదమైన తాళిబొట్టుదారముగల భూషణము మాంగల్యము పుస్తె, తాళి అనుపేర్లతో వాడుకొంటారు.

మృగనాభి ఘనసార మిళిత గంధమున
చిగురాకు నగుతళ్కు జిగికేల బూని
పసిడి నిగ్గుల గుల్కు పసుపు లందగను
కుసుమ రజము కేలగొని కూర్మితోను
సారమై వెలయు కాశ్మీరరజ మీవు
కోరి చేకొను మొకసారి మరచేవు
సరసంపు తమిపెంపు విరిజాజిసరులు
కరమున ధరియించు మరుదండజనులు
నీటుగ తిలకంబు నిటలభాగమున
పాటించు కస్తూరిబెట్టి హాస్తమున
పసిడి పళ్లెరముల బాగైన నలుగు
కృశమధ్య లందియ్య కీర్తింప వెలుగు
వేడుకలను జూడ నేడెల్ల జనులు
గూడినారిట చాలుకొని దేవమునులు
పూరతు లెత్తిన వారికి నిపుడు
కోరిక లొసగును శ్రీరామవిభుడు
మారజనని లోకమాత కళ్యాణి
వారిజముఖి మంజులవాణి ఫణివేణి
తాపూస మేటికి తల్లి సీతమ్మ
కామిత ఫలద శ్రీకరిముద్దుగుమ్మ.

## 4. తలంటు-పాటలు

పల్లవి :- శుభమనుచు సతీపతుల దీవించి పాడిరి
చంచలాక్షులంతను నక్షింత లుంచి శిరసున ॥శు॥

1. ముఖరునకు శ్యామలాంబకు ముద్దుల మోముల
కుంకుమ నిడి కోమలాంగులు ॥శు॥

2. బంగరుగిన్ని యనుబోసిన సంపెగనూనె
మంగళకర మనుచు నంటిరి ||శు||

3. అతివలు జలకమ్ము లార్చిరి
అచ్చుమాంబకాహ్లాదకరమనుచు వేడిరి. ||శు||

## 5. తిలకము

పల్లవి :- తిలము దీర్చరే కలికి శ్రీరుక్మిణికి
మొలక నవ్వుల చెలిమోమున కస్తూరి ||తి||

1. వారిజనాభుని కోరి తనింటికి
మాటని మాటని మామను గోరెడు మోమున ||తి||

2. మామని ధేనుగిరి మదనగోపాలుడు
చానను రమ్మని సఖియను బంపెనట. ||తి||

## 6. సువ్వి పాటలు

ఆడవారు పెళ్ళిళ్ళలో సువ్వి అను పదములతో, ఆలాపము చేసి పాడేపాటలు. వీటిని సువాల, సువ్వాల, సువ్వాలాల అనే పేర్లతో వాడుతుంటారు.

"ఇంతి రావె, గొజ్జంగి బంతిరావె, రత్నాల
దొంతి రావె, మదనుని దంతిరావె ||ఇం||
కొమ్మరావె, బంగారు బొమ్మరావె, చివురులే
గొమ్మరావె, ముద్దుల గుమ్మరావె ||ఇం||
చెలియరావె, చేడెరావె, చిన్నిరావె, పొన్నరావె
వెలదిరావె, కొట్నములు వేగదంచుదము ||ఇం||
గరుడవాహనములు, మంచి గౌరికుంకుమము
రత్నసరులు పచ్చగన్నేరు సన్నదినుసులు ||ఇం||

కలయగూర్చి కరములందు కంకణక్వాణము మెరయ
నలరు టందె లెల్ల ఘల్లుమనగ దంచుదము ||౩౦||

సువ్వి, సువ్వి, సువ్వి సువ్వి
సువన్న సువ్వి సువ్వాల.

సువ్వి సువ్వి సువ్వి లాలి సువ్వి పరమపురుషలాలి
సువ్వి శ్రీముఖలింగ చంద్ర రాగదే ||సు||

కొండమీద పండినావి గోవర్ధన ధాన్యాలు
పాడుకొని దంచరమ్మ పడతి కొట్నము ||సు||

పల్లాన పండినావి అవి బ్రహ్మబాసికాలు
విస్తరించి దంచరమ్మ రామ కొట్నము ||సు||

మంచినీళ్ళ బావివద్ద అంచులేని ఆకుబుట్టె
యెంచి యెంచి పిలవరమ్మ పేరంటాళ్లను ||సు||

జాజికర్రపెట్టెలోని చేర్చుక్క–బొట్టుబెట్టి
పేరుపేర పిలవరమ్మ – పేరటాళ్ళను ||సు||

వాకరివాకరి కొప్పులోన బారెడేసి మొగ్గలుండ
సదాశివుని కొప్పులోన సన్నజాజులూ ||సు||

మేనమామ పంపినాడు మేలైన పట్టుచీర
చెంగు చివర కట్టరమ్మ రంగుమీరగా ||సు||

## 7 పెండ్లిపాటలు

పెండ్లికొడుకునూ, పెండ్లికూతురునూ, పేరంటాళ్లు, ఆశీర్వాదం చేస్తారు. వారిని సర్వవిధాల కరుణించండంటూ, పురాణ దంపతులను ప్రార్థిస్తూ, ఆపురాణదంపతులమీద పాటలుపాడుతూ వుంటారు.

శ్రీ మహాలక్ష్మని శ్రీ విష్ణుబోలి
తామర తంపరై తవిలిదంపతులు
పూవును తావియు బొందినయట్లు
ఈ వధూవరులుందు రెనసియెల్లపుడు
కలికి మాగౌరమ్మ కడగంటిచూపు
కలువపూవులదండ కరకంతునకును
చెన్నగపూవుల చేరెత్తినట్లు
కన్నె మా గౌరమ్మ కాపురం బొప్ప
కడువేడుకలచేత కడుపుచల్లగను
కొడుకులకోటవై కొమరొందవమ్మ
వెలయంగ దగుచోట్ల వియ్యంబు లంది
కలకాల మఖిలభోగముల వర్ధిల్లు ॥

శంకరాభరణం - అటతాళం

పల్లవిః లక్ష్మీకళ్యాణమే వైభోగమే
సీతకళ్యాణమే సౌభాగ్యమే ॥ల॥

1. పన్నీటి స్నానంబు పరగగావించి
చెన్నగా ధరియించె చీనాంబరములూ ॥ల॥

2. కస్తూరికుంకుమ ఘనలలాటములా
దస్తుగా సీతారాములూ దీర్చె ॥ల॥

3. కనక కంకణ మంగళ సూత్రములనూ
ఘనవసిష్ఠుడు చెప్పిగట్టించె వరుసా ॥ల॥

4. ముత్యాల కురువిందములు తలంబ్రాలూ
ముదముతో నొకరొకరు మొగిబోసికొనిరి ||ల||
5. గౌరి వాణిశచీ కాంతలందరునూ
శౌరి సిరికిచ్చె మేలలరు నివ్వాళి ||ల||
6. శివబ్రహ్మ లింద్రాది వందితామరులు
కవగూడి కానుకల్ కట్నముల్ దెచ్చి ||ల||
7. బహు షడ్రసోపేత భోజనంబులునూ
బాగుగా భుజించిరి సరగ నందరును ||ల||
8. సిరిగల్లు నెల్లూరి శ్రీరంగసామి
రామదాసుడు పాడ రంజిల్లుచుండె || ||ల||

## 8 మంగళసూత్రం

పల్లవి: ఆనంద మానందమాయెను
మనరాముడు పెండ్లికొడుకాయెను।
ఆనంద మానందమాయెను
అలజానకి పెండ్లికూతురాయెను ||ఆ||
1. రత్నాలపలక వేసిరీ సీతా
రాములిద్దరు కూరుచుండిరీ
చెలులతివేగ విరులు శృంగారించిరీ
బ్రహ్మానందవాద్యము లచట బ్రోయించిరి ||ఆ||
2. ముందుగా పురోహితులొచ్చిరీ
మంత్రములు క్రమముగ ఘోషించిరీ
సతులందరు మంగళములు పాడిరీ
మంచి అపరంజీ బాసికము లావేళగట్టిరీ ||ఆ||

3. ఎదుట పార్వతి సరస్వతి యల
యింద్రాణిదేవి యరుంధతి
వనిత లదిగో మైత్తిరీ కదలీహారతి
మంచి ఆణిముత్యాల సేస లమరజల్లిరి ॥ఆ॥

4. ఘనుడో జనక భూపాలుడూ
కన్యాదానముచేసె గుణశీలుడూ
పొంగుచు మంగళసూత్రము రాముడు తా
గొబ్బున గట్టె క్షేమము గనువేడ్కతోడ నేడు. ॥ఆ॥

## 9. గంధంపూత

పేరంటాళ్ళు, వధూవరులకు గంధంపూస్తూ ఆ విధానాన్ని వర్ణిస్తూ పరిహాసంచేస్తూ పాడుతూవుంటారు.

గంధము పుయ్యరె ముందు రాములకు గంధముసీతమ్మకు ॥గం॥
గంధము నలుగులు ముందుగ పుయ్యరె సీతమ్మకుపుయ్యరే ॥గం॥
అత్తరు నలుగు లెత్తుకొని మీరు,
చిత్తము శ్రీరాముని హస్తమున పుయ్యరె ॥గం॥
పన్నీరు నలుగులు ఉన్నవి యికమీాను,
తిన్నగ సీతమ్మకు అమ్మమీారు పుయ్యరె ॥గం॥
సురలెల్ల చూచి మరిచోద్యమునందగ,
వరుసతోపుయ్యరె సరసము మీారగను ॥ ॥గం॥

బావకుపూయరే పన్నీరు గంధము పద్మినిచేత బూని ॥బా॥
పసమించు ననమూన పసిమిబుగ్గలమీద
చిమ్మనగ్రోవితో చిందరవందరగ ॥బా॥
వయ్యారి సరదారి వహ్వారి బావకు
గంధము చేతిలో జిందగ జేయరే ॥బా॥
బావ రమ్మని పిల్చి పడమటింటికి రాగ
బట్టంత జేయుచు బల్మారు జవ్వాజి ॥బా॥
డంబైన పగడంబు మీరినవానీ
లాగి పీకి చాల లాలన జేయుచు ॥ ॥బా॥

## 10. బువ్వంబంతి పాటలు

బూజమ్మ బంతి:- బువ్వంబంతి అంటే పెళ్ళిళ్ళలో చుట్టాలందరూ ఒక పంక్తిగా కూర్చుండి, వేడుకగా భుజించడం. ఆ సమయాలలో కొందరు కట్టు పద్యాలు చదువుతూ వుంటారు. కట్టు పద్యాలు అంటే చదివిన పద్యానికి, చివరవచ్చే అక్షరం ఆదిగాగల మరోపద్యం చదవడం. కొందరు పదాలు పాడుతారు. కొందరు నామస్మరణ చేస్తూంటారు.

"పచ్చంగ కట్టిన పందిళ్ళ కింద
కృష్ణున కమర్చిరీబూజమ్మబంతి
తాళమేళముల సంగీతాలవారూ.
సత్యభాగవతులు తమరు కూర్చుండ్రు
తోట యరిటాకులే పయిడి పళ్ళెములు
వెండిగిన్నెలతోను వెలసె బూజమ్మ
రాజనాలన్నమూ కందిపప్పులునూ
వెన్నగాచిన నేయి వెలసె బూజమ్మ

* అరవై కూరలూ పిండివంటలునూ
అమర విద్వాంసులతో' అమరె బూజమ్ము.

---

* "ఆవు చంటిలో అరవై యూరు పిండివంటలూ వున్నాయి." అని వ్యవసాయ సామెత చెప్పుతుంది.

"అరవై యూరు పిండివంటలూ, నవగాయపచ్చళ్ళూ, నాల్గు కూరలూతో వడ్డించారు" అంటూ జానపదులు వాడుక కథలలో చెప్పుకుంటారు.

౧. నాలుగుకూరలు :- 1. కూర (దప్పళము), 2. పులుసు కూర (పుల్లకూర), 3. లేహ్యాము=(ఇగురుకూర) నాకి తినేది 4. సాంబారము.

౨. పచ్చడి=నంజు, రుచిగాయ, ఊరుబిండి, ముద్ద, సరువడము పిండి అనే పర్యాయ పదాలున్నాయి.

3. ఊరుగాయలు :-

సీ. మామిడికాయయు, మారేడుగాయయుఁ
గొండముక్కిడికాయ । కొమ్మికాయ
గరుగుకాయయు వెల్ల । కాయ యందుగుకాయ
లుసిరిక కాయలు । నుస్తికాయ
లేకరక్కాయయు । వాకుడు కాయయుఁ
జిటినెల్లికాయయుఁ । జిల్లకాయ
కలబంద గజనిమ్మ । కాయ నార్దబకాయ
చిన నిమ్మకాయయు । జీడికాయ
తే. కొండనపుఁ గొమ్ము మామెన । కొమ్ము బుడమ
కాయ యల్లము మిరియంపుఁ । గాయబీర
కాయ కరిబాలు కరివేప । కాయలాది
మైన యూరుఁ గాయలుగల । వతనియింట.

(హంస వింశతి 4ఆ. 135ప)

తరువాయి 108 వ. పేజీలో

## శ్రీరాముల బువ్వము

పల్లవి :- వివరా మెరుగని దశరథరాజుతో
వియ్యామొందెనుగా వియ్యామొందెనుగా
కరుణతో శ్రీరాముల బువ్వాము
కన్నుల జూచితిమి బువ్వాము ॥వివ॥

1. యెవ్వారే యీరాజేంద్రు డితడెవ్వారే కొమ్మ
జవ్వాని యాయోధ్యపుర మేలే జనపాలకుడమ్మా ॥వివ॥

---

107 వ. పేజీ తరువాయి

ర. కాయకూరలు :-

గీ. దొండకాయ, ములుకికాయ । తొట్లకాయ
జంచికాయయు నెట్టుల । సందకాయ
వెలయు నుస్తె కాయయు రామ । ములుకకాయ
మేడికాయ కాచరకాయ । గూడనింక.

సీ. రామగుమ్మడి యోబ । రాజుగుమ్మడి చార
గుమ్మడి బూడిదె । గుమ్మడులును
గిండిసొఱయు దీఁగె । కిన్నరసొరయును
బీఱ సముద్రపు । బీఱనేతి
బీఱ పిచ్చుక పొట్ల । పెద్ద పొట్లనుఁగు
దంతపుఁ బొట్లయు । తంబలు వెలి
కాకర పొట్టికా । కరలు మేఁక చెవి చి
క్కుడు పాలకణుపుల । గోరు చిక్కు

తే. డులు సుగంధాలు బొంతనం । టులు సురళలు
గంజి పందిటి కపుర పొం । కాయతరులు

తరువాయి 109 వ. పేజీలో

2. మందయానా విన్నావా యీమన్య దొరలెవరే
సుందరి కౌసల్య నోచిన సుతుడు గాడటవే ॥వివ॥

3. జలజాతంబుల బోలెడు కన్నుల జననాయకు లెవరే
అనుజునిగూడి తాటకి నేసిన యలమనీషుడు గదవే ॥వివ॥

4. నవరత్నంబుల మకుటము గలిగిన నవనాయకు లెవరే
రఘువంశంబున దశరథసుతుడు రాముడు గాడటవే. ॥వివ॥

---

108 వ. పేజీ తరువాయి

బూజు పచ్చకురాసాని । పుచ్చ బెద్ద
దోస నక్కదోసలు వాని । తోంట గలవు.

(హంసవింశతి 4 ఆ. 129, 130ప)

౫. పిండివంటలు:-

సీ. "కలవంటకములు బూ । రెలు దేనె తోలలు చా
పట్లు మండెంగ బొ । బ్బట్లు వడలు
కుడుములు సుకియలు । గడియంపుటట్లు వె
న్నప్పాలు వడియంబు । లప్పడాలు
పొంగరంబులు సొజ్జె । బూరెతాగులు సేవ
లుక్కెర లరిసెలు । చక్కిలములు
ఖర్జూరగోస్తనీ । కదళికా సహకార
ఫలములు కొబ్బరి । పనసతొనలు

తే. తేనియలు జున్నుమీఁగడ । లానవాలు
పానకములు రసావళ్ళు । పచ్చడులును
అపచి యొలుపుఁబప్పునుకూర । లు పరమాన్న
మపుడు ప్రజనెల్లఁ దనియించె । నహరహంబు.

(కళాపూర్ణోదయము 8ఆ. 81ప)

తరువాయి 110 వ. పేజీలో

పల్లవి :- ఇంతి! యీబువ్వము । బంతి సోయగమెంతచోద్యమే
స్వాంతమున కత్యంతలీల వింత మీరెనే ॥ఇం॥

1. కంటికింపగు ననంటుఁ మొదలంట నాటిరి
కంటివా వాల్గంటి భోజనమంటపోన్నతిని ॥ఇం॥

2. పోలగ్రొన్నెల ఊల దనరు కుడ్యాలపై తగన్
జాళువా మేల్ బొమ్మల వేనవేలుగ వ్రాసిరి ॥ఇం॥

3. మేలుగుల్కు ముత్యాల బలుతోరణాలతో తరణిన్
మేలమాడుచునున్న సన్మణిదీపాలు చూడగను ॥ఇం॥

4. వన్నెమీరిన సన్నబియ్యపుటన్నమాత్రలో
నెన్నదరముకాని కూరలెన్నొ జేసిరి ॥ఇం॥

5. అప్పడాల్వడియాలు నుక్కెఅల్ గొప్పనోసెలును
మెప్పుగల్గు గోఘృతంబు దొప్పలాడిగను. ॥ఇం॥

---

109 వ. పేజీ తరువాయి

గారెలు, నానవాలు, పోకుండలు, సున్నుండలు, పాల తావెదలు, జంతికలు, రొట్టె, అట్టు, పకోడీ, లడ్డూ, జిలేబీ, పుణుకులు, ప్రసాదము.

పెండ్లిలో ముఖ్యంగా పూర్వులు "ఐరేని" పూజించేవారు. నిఘంటువులలో ప్రమాణాలు.

ఐరేని=పంచరంగులతో చేసిన పెండ్లికడవలు.

అయిరేని=బచ్చెనపని చేసిన పెండ్లికుండలు.

"ఐరేని గొనివచ్చి రైదువల్ పాటలుపాడుచు శుభవేళ
వేడు కలర."

(విజయ విలాసము 3ఆ. 98ప)

ప్రజావాడుకలో అరివేణి, అవిరేణి అనే పదాలున్నాయి.

## విందు

పల్లవి॥ ఆహాహా పెండ్లివారింట అందమయిన విందుగా
ఓహోహో యొప్పగ జెప్ప వహావ్వాబడాయనేగా ॥ఆ॥

1. ఉప్పులేదు పప్పులోను । ఉడకలేదు కూరలు
చప్పని కమ్మని సున్ని । చప్పిడి మెతుకులేగా ॥ఆ॥

2. ఆజ్య మూచెవులోని ధారయే । అప్పడమైనా లేదాయె
ఎన్నికైనా పిండివంట । యేనాడయిన లేదాయె ॥ఆ॥

3. చింతపండు లేని చారు । క్షీరము లేని పాయసము
చిత్రమయిన చిత్రాన్నము । పాత్రమంతానిండేగా ॥ఆ॥

4. నిమ్మ్మాకు నీరుమజ్జిగ । నెన్నికగా వడ్డించిరి
కమ్మ పెరుగైనలేదు । కలికముకైనా లేదుగా ॥ ॥ఆ॥

## 11. తాంబూలంపాటలు

ఆకువక్కా మణుపు లందిచ్చేరారా మణుపు లిచ్చేరారా
నా కుల దైవమా రాజగోపాలా ॥ఆ॥

ఏలాలవంగమున ఎండు కొబ్బెరనా
ఫాలలోచననుత బాగు సున్నమున ॥ఆ॥

ఏలాలవంగమున యెండు కొబ్బెరను
తెల్లనాకుల మడుపు తెచ్చిచ్చేరారా ॥ఆ॥

జాజికాయ జాపత్రి సంకోచమున
మాధవ శొంఠియు మరిలవంగమున ॥ఆ॥

అత్తరువు పన్నీరు అతివలందియ్యా
వేణుగోపాల నీవు వేగరావయ్యా ॥ఆ॥

అచ్యుతరంగదాసుడు ఆనందమున
పచ్చకప్పురము విడెము సహితమున. ॥ఆ॥

పల్లవి॥ ఆకు మణుపులందవే అంగన నాపై కోపమేలనే ॥ఆ॥

తుంబురు నారదులే పాడ తూర్య ఘోషములెల్ల చెలగ ॥ఆ॥

రంభాదులెల్ల నాట్యమాడ రమణులెల్ల అందివ్వగా ॥ఆ॥

కంఠహార కౌస్తుభ కంకణములు ఘల్లుఘల్లుమోాయ ॥ఆ॥

వెంటజంటగాను చెలులు జంటగీతములె పాడ ॥ఆ॥

వేద పాఠకులకునెల్ల వేద వేద్యు డగుచుధీర ॥ఆ॥

నెలతరొోఘున వాడిని ఆది దేవుడనుచు నెల్ల॥ ॥ఆ॥

## 12. సొగటాలు పాట

పల్లవి॥ సొగటా లాడేరే రాముకు సీత సొగటాలాడేరే ॥సొ॥

1. సొగటా లాడెనే సొగసు గుల్కగ రాము
డవనీజా గుణధామ మగువా తోడుతగూడి ॥సొ॥

2. మొగమింపుగానూ యిరు వేళ్ళాలా
మెంచగా శంఖ చక్రములూ మెరయూ
జిగిబిగీ ఫణిపాచీకలూ చేతనుబూనీ ॥సొ॥

3. నగవుయింపుగానూ ముఖబింబము తగుచొొక్కముగనూ
వర్ణింపగా తగును ఇద్దరికె ముజ్జగములుగొని ॥సొ॥

4. ముదము తోడుతగూడీ మారామచంద్రూలూ
జగతీపై పాళీయొప్పుగ వేసీ సమముగా ॥ ॥సొ॥

## 13. ప న్నీ రు

పల్లవి :- పన్నీరుజల్లె బల్ వేడుకన్
పరమాహ్లాదకర హృదయిుండై ॥ప॥

1. వరలక్ష్మియు సరస్వతి శచిమొదలగు
సురసతులెల్ల శుభము శుభ మనన్ ॥ప॥

2. హరుడునగవుతో గిరిజయొడలిపై బరపెడిచూడ్కుల
సరసతతో భామామణిపై బంతులు చెలగి ॥ప॥

3. జొచ్చి జగములు మేలు నొసగవే
అచ్చమాంబి కాహ్లాదకరాయని
సచ్చారిత్రుని సాధుజనులనన్. ॥ప॥

## 14. పూలచెండ్ల పాటలు

పెళ్ళి తంతుపూర్తి అయ్యాక, వధూవరులచేత పూలబంతు లాడిస్తారు. ఆ సందర్భంలో పాడే చెండ్లే బంతులు.

పల్లవి :- పూలచెండ్లాడవె పూబోణిధవునితో
బాలికామణి మల్లెపూలబంతినివెస
కేలదాల్చి చెల్వునికేల రహింనుంచుమ ॥పూ॥
ధరణీదేవులు మంత్రార్థములను జదువగ
సురదుందుభీ నిస్వనములు మ్రోయగ ॥పూ॥
వారాంగనామణులు వరనాట్యవిధులను
మేరమీరజూపగా మృగనేత్రలుగొనముగ ॥పూ॥

### శుద్ధసావేరి - జుల్వా

బంతులాడెనే పూలబంతులాడెనే మేల్
బంతులాడెనే, మెగసి గంతులాడెనే ॥బం॥
బుట్టిముక్కు, తొట్టినోరు బట్టెగొంతు పెండ్లికొడుకు
చిట్టిముట్టులాడి పూలచెండులాడెనే ॥బం॥
కొంగకాళ్లు వంగువేళ్లు బొంగజొల్లు పెండ్లికొడుకు
చెంగుచెంగు మనుచు పూలచెండులాడెనే ॥బం॥

గోరులెల్ల చేయితీట గీరుకొనుచు పెండ్లికొడుకు
పారపండ్లు తెరచి పూలచెండులాడెనే ॥బం॥
గోచిపాత పీడ జనులు చూచి నవ్వపెండ్లికొడుకు
పాచిపండ్లతోడ పూలచెండులాడెనే ॥బం॥
సిగ్గుపడుచు పెండ్లిబాల మ్రొక్కిమ్రొక్కి చేతులెత్త
సిగ్గుయింతలేక పూలచెండులాడెనే. ॥బం॥

## 15. *నాగవల్లి

పల్లవి :- నంగీనంగక లేచిరావోయి
పెళ్ళికొడుక నాగవల్లికి ॥నం॥
1. ఎంతోమంచి వాడవని యెంచినీకు పిల్లనిస్తే
రంతులు మానవు రాద్ధాంతాలు చేసేవు ॥నం॥
2. పోకిల్లు పోతావు పోకిరీ తనం మానవు
కూకున్నచోటినుంచి కూస్సైన మెదలవేమి ॥నం॥
3. బ్రరెదూడలాగ వెర్రిచూపులు చూస్తావు
తొర్రినోటిమాటలైనా తోచవేమయా॥ ॥నం॥

## 16. పెండ్లికొడుకు హాస్యం

నిన్న చిన్న విస్తళ్లు నేతుట్టు లడ్డాయి
సీతిమాలిన పెండ్లికొడుక లేచిరావయ్యా

* నాగవల్లి "నిష్ఠూరం" అని లోకోక్తివుంది - అనగా పెళ్ళిఅయిన అయిదవనాటి దెప్పులు అనిభావం.

"లోలక యింక నాకబలి లోపల నిష్ఠురమేల పల్కెగన్"
(విజయవిలాసము 3ఆ. 72.ప)

"నాకబలి" అని అసలుపేరు. పెండ్లినాటి చివరితంతు అనేభావం.
నాగవల్లి అంటే తాంబూలవల్లిక, తమలపాకుల తీగ అనే అర్థాలు న్నాయి.

మొన్న దిన్న వి_స్తళ్లు మోపులడ్డాయి
మొండిపెళ్ళికొడుక లేచి రావయ్యా
యేనుగులు లేవని యేలడిగినారూ
వెల్లగాడిద నెక్కి లేచి రావయ్యా
గుఱ్ఱాలు లేవని యేలడిగినారూ
గుడ్డిగుఱ్రము నెక్కి లేచిరావయ్యా
పల్లకీల్లేవని యేలడిగినారూ
పందికొక్కూ నెక్కి లేచిరావయ్యా
మేనాలు లేవనీ యేలడిగినారూ
మేకపోతూ నెక్కి లేచిరావయ్యా.

## పిల్లికళ్ల పెళ్లికొడుకు

ఓ పెండ్లికొడుకా లేచిరావయ్యా

1. శ్రీరంగకస్తూరి తిలకమేదిద్ది
బాగైన గంధముపోడి కప్పూజల్లి
పదిమందిలోపల పరుగె_త్తివ_స్తి
ఓ పెండ్లికొడుక హాయిలేమొ చేశావు ॥ఓ॥

2. కట్టింతురా నిన్ను కొట్టింతు కొరడాల
తన్నింతు యీవూరిపదిమందిచేతా
హాయిలేమొచేశావు ఓపెండ్లికొడుక ॥ఓ॥

3. కండె తలపాగ చుట్టుకొని
వెండిబె_త్తము చేతపట్టుకొని
చంద్రహారము మెడనువేసికొని
దండిగ వ_స్తివి పిల్లికండ్లపెండ్లికొడుక ॥ ॥ఓ॥

## * తిమురు పట్టిన పెండ్లికొడుకు

ఓ పెళ్ళికొడుక నీపెత్తన మేమోయీ

1. పెళ్ళికొడుక నీవు ప్రేమతో పెత్తనము చేయవస్తే
వున్నచోట నుండనియ్యక, ఊరువెళ్ళ కొట్టిస్తాను ॥ఓ॥

2. తిండితిమురు పట్టిన పెళ్ళికొడక
తీటలెల్ల తెచ్చుకొంటివి
ఏవేళ చూస్తా మన్నను
యిల్లువిడిచి బైటరావు ॥ఓ॥

3. మంచి వాడవని నీవు
మావూరు పడుచునిచ్చె
పంచలా తిరిగేటి బుద్ధి
కొంచెమైనా మానక పోయె॥ ॥ఓ॥

## ♦ గోటు పెళ్ళికొడుకు

చాలుచాలు పెండ్లికొడుక చక్కనైన వాడవే
వీలుసాలులేక యిటుల విఱ్ఱవీగనేలరా ॥చా॥
కోటుమీద కోటు తొడిగి కోఱచూపు చూచుచున్
నీటుగా తలాడ నొంగి - గోటుచూపుచుందువా ॥చా॥
జేబులోని వాచిగొలుసు - చేతదీసి మాటికిన్
నీబడాయి దెల్పికొనగ నీతిగాదు మానరా ॥చా॥
లోటులేని వానివలెను బూటకంబు లాడుచున్
తేటసొమ్ములెల్ల నెరువుతెచ్చి పెట్టుకొంటివా ॥చా॥

*తిమురు=తిమ్మిరి

♦ గోటు=ఒయ్యారము, విలాసము.

కల్లుద్రాగు వానివలెను కన్నులెఱ్ఱ జేయుచున్
తెల్లబోయి చూడనెటుల చెల్లు క్రొత్తయల్లుడా ॥చా॥
కొత్తపల్లి వంశ శశధరుండు సుందరార్యుడే
జిత్తులెల్ల జూచి నగిన చిన్నబుచ్చుకుందువే ॥ ॥చా॥

## 17. బావగారి పరిహాసము

బావగారు మీరురండి - సావధానముగ వినండి ॥బా॥
కుదురుగ కూర్చుండిమీరు - పదరి పొగలుతీసిరండి
బంగళాలో చేరిమీరు - ఉంగరాలే తీసినారండి ।బా॥
ఎత్తయిన పచ్చలుగోరి - మచ్చుతనమే చేసినారండి
దొంగగానె మిమ్ముబట్టి - మంగళము పెట్టినారండి ॥బా॥
అన్నగారు అడ్డమునచ్చి - మిమ్ము వదలినారండి
ఇక్కడికి మీరేల వచ్చితిరి - అక్కడి పనులెల్లవదలి
రామరామ యనిమీరు - నామము మనసున దలచండి ॥బా॥

## 18. మ ర ది హే ళ న

యదుకుల కాంభోజి - అట

జైను మంగళం - మరదికి - తగును మంగళం ॥
స్నానము జేసేడంట - సంధ్యలు వార్చేడంట
సంధ్యవేళ మా మరది - చాకలిదానితోన వ్వేడంట ॥జై॥
ఈనెలు చీల్చేడట - విస్తళ్లే మో కుట్టేడట
వీధిలో మామరదిగారు - ఈడిగదానితో మాట్లాడేడట ॥జై॥
గుంటలు త్రవ్వేడట - కుప్పలు యేమో పెట్టేడంట
కుప్పచాటున మా మరదిగారు - కుమ్మరి దానితో
మాట్లాడేడంట ॥జై॥

ధోవతులేమో కట్టాడంట - దొంగతనంయేమో చేశాడంట
దొడ్డవాడే మా మరదిగారు - దొమ్మరదాంతో మాట్లాడేడట
॥జో॥

ఉడికినవులవలు వడబోసికొని - తడిసిన కుక్కనెత్తివేసికొని
లంజింటికిమరిపోనేలా - రాయి తగిలిపడనేలా ॥జో॥

ఉల్లిగడ్డ తవుడు సున్నము - ఉడికించి కట్టనేల
చక్కానిమరదికి జయమంగళం చుక్కవంటి మరదికి -
జయమంగళం. ॥జో॥

## 19. వదినె పాటలు

### వదినెకు దిష్టి

పల్లవి :- ఎంతో దృష్టితాకె - హెచ్చైన వదినెకెంతో దృష్టితాకె
అ. ప. ఎంతో దృష్టి దాకె - యీమచ్చల ముఖమునకు
కండ్ల వింతలకు - పండ్లదొంతలకు ॥ఎం॥

1. లొట్టకన్నులకు - లోకువమైన మిట్టనాసలకును
తట్ట చెవులకును - తుట్టపెదవులకు
మట్టుమీరిన పొట్టికళ్ళకు - బెట్టులేని చట్టిమూతికి ॥ఎం॥

2. బాన కడుపునకు - ఘనమైన బొడ్డుగూని వీపునకు
అనువుగాని యట్టి - యందమౌ కుచముల మినుకునకు
కొప్పువిరులు మానిని - శునకమువంటి నీచగుణమున ॥ఎం॥

3. వర కేశవ పట్టణవాసుడైన - శ్రీహరి కరుణ
మిరపరాతిని వదినె - మేనికి దిగదుడిచి
పరగకూటికుండ పైన వేసిన - త్వరగ దృష్టియు మరలి పోవు.
॥ఎం॥

## వదినె భోగము

మాయన్న వల్లగదా - నీకింత యోగము
ఎవరికి గల్గు వదినా - యింత భోగము ॥మా॥

1. బంకమట్టితో తల రుద్దనదిపోయెనే
పొంకముతో సీకాయచే రుద్ద నాయెనే వదినా ॥మా॥

2. తలకు ఆముదము పూసినది పోయెనే
కలికి సంపెంగనూనె పూయనాయెనే వదినా ॥మా॥

3. గోనెలు కట్టుకొన్న కాలమంత పోయెనే
కమత కర్నాట చీరెలన్ని కట్టనాయెనే ॥ ॥మా॥

## వదిన కనుసన్నలు

రైలుమీద గార్డుదొర నిన్నే రమ్మని పిలిచేడే
పలుమారు నిన్నే మనసునదలచేడే ॥రైలు॥
గోలుకొండ జాతిదొర కన్నులార జూచేడే
చూచి నిన్ను పలుమారు బిలిచి వేగరమ్మనెనే ॥రై॥
నాతిపట్టుచీర నీకు వదినరో వాడంపేడే
వాసిమీర మోహముండి కన్నులార పిలిచేడే ॥రై॥
వన్నెకాడు వానినీవు కన్నులార జూచితివి
కన్నులార జూచినీవు కనుసన్నలు జేస్తివిగా ॥రై॥
చెన్నపట్నపు జాతివాడు చెన్నుగుండీలు పంపెనే
వానివేగరమ్మంటివే నీకు మోహమింతింత తాయెనే ॥రై॥
చందమామ ముఖముదాన అందమైనమోముదాన
చిందుమాటలాడి వాని డెందము కరగింతువో ॥ ॥రై॥

## వగలాడి వదిన

వగలాడి వదినరో వయ్యారముగ
నింతవగలాడెద వెందుకే ॥వగ॥

సొగసు జేయు మంచి సొమ్మాటు గలిగితే
పల్లవపాణిరో నీకిది చెల్లునే ॥వగ॥

నీచక్కదనమునకు నిలువుటద్దములో
చూచుకొందువు మంచి సుందరివటవే ॥వగ॥

చూచైన నెరుగని సుందరివటవే
సంగనాచిరో నీనోరాచి మాట్లాడవే ॥వగ॥

పల్లవపాణిరో చెల్లునసీకిది యెల్లవారలు నవ్వారే
కల్లకోటయగారి పిల్లవాడిని నీవు నల్లజల్తరు
చీరదెమ్మంటివే ॥వగ॥

నగరిలోపలనుండు మగవారినల నీవు
సరసమాడుటయు యెందుకొరకే ॥వగ॥

సుఖమూరు పుసులూరు సుబ్బరాయుని హేలే
ధరవరదుని నమ్మవే బుద్ధిగలుగునులే ॥ ॥వగ॥

## 20. పెళ్లికూతురి చిన్నెలు

చెలి చలమేల నీదు – చిన్నె లెంతో వింతలే
చిన్నె లెంతో వింతలే – చెంతనిక్కకు పోపోవే ॥చె॥

1. పొట్టికాళ్ళతోను నీదు – మిట్టపండ్లతిట్టకే
మిట్టపండ్ల తిట్టకే – మిట్టిపడకు పోపోవే ॥చె॥

2. మొట్టముక్కు మరియు నీదు – తొట్టినోరుదూరకే
తొట్టినోరు దూరకే – పిట్టపీగకు పోపోవే ॥చె॥

3. కంచుకావులను బెట్టి - మించికరము త్రిప్పకే
మించికరము త్రిప్పకే - పొంచియుండక పోపోవే ॥చె॥

4. కాకిగళముతోను నీదు - మూకస్వరము నింపకే
మూకస్వరము నింపకే - చీకాకుపడక పోపోవే ॥చె॥

5. కేశవపుర వరమునను - వాసుడే శ్రీనివాసుడే
శ్రీనివాసుని - వాసిగ గొల్వ పోపోవే ॥ ॥చె॥

పల్లవి :- ఎంతదాన వబలా ! నీవెంతదాన వబలా !
నీకింత భ్రాంతియేల బాల యీలీల ॥ఎం॥

1. కూళతనము మాను బాలా । యీ సభలోను
కాలముకాదనకను వలపు । సొగసులేల జేసెదే ॥ఎం॥

2. నెయ్యమరయ రాదా । నీకియ్యది మరియాదా !
కయ్యమూని లాతివారి । గీవొయ్యన బోవగనెయ్యది ॥ ॥ఎం॥

## 21. తలుపుదగ్గర పాట

శ్రీ వెంకటేశ్వరస్వామి - అలివేలుమంగాదేవి.

శ్రీకాంతామణి నేనీ సఖుడను శీఘ్రముయ నాకిలి తియ్యావే
నీవు శీఘ్రము నాకిలి తియ్యావే
ఓ కాంతుడ నీగుణములు దెలిసెను వూరికివెళ్ళగదోయీ
నీవు వూరికి వెళ్లగదోయీ
యీమాటల నివెన్నడాడవిదియేమే యలమేలుమంగా
యిదియేమే యలమేలుమంగా
భామల మరగినవాడవు నాతో పలుకులేల పోవోయి
నాతో పలుకులేల పోవోయి

పరభామలనే కూడితినని యిటపలుకుట కారణమేమే
సఖి పలుకుట కారణమేమే
తరుఃఖల గూడకయుండిన మరి యీ దండలుఎక్కడివోయీ
పూలదండలు ఎక్కడివోయీ
హరిహరి నేనేమెఱుగను భక్తులు అర్పించి యిచ్చిరి
చెలియా నాకు భక్తులు యిచ్చిరీ
సరసిజాక్ష నీ యధరమునొక్కిన సరసిజాక్షి యెవతోయి
నొక్కిన ఆ సరసిజాక్షి ఎవతోయి
తరుణిరో యిదియొకఫలమని చిలుకలు తగిలిపొడిచెనేభామా
అవి తగిలి పొడిచెనేభామా
వరదుడ నీ నునుచెక్కుల యీ నెలవంకలున్న వేమోయీ
నెల వంకలున్న వేమోయీ
గోరువంకల బట్టుకు బట్టుకురాగా గీరికెనే ముద్దులగుమ్మా
అవి గీరికెనే ముద్దుల గుమ్మా
సారసాక్ష నీ మేనున తెల్లని చందనమెక్కడిదోయీ
ఆ తెల్లని చందన మెక్కడిదోయీ
పూలతోటలో విహరించగ యీ పుప్పొడిరాలెనే తరుణీ
యీ పుప్పొడి రాలెనే తరుణీ
పూలతోటలోవిహరించుటకును పోయినకారణమేమీ
నీవు పోయిన కారణమేమీ
పావురంబు దప్పించుకపోగా జేపట్టబోతినయో చెలియా
నే పట్ట బోతినే చెలియా
దేవదేవ నీ బుగ్గన కాటుక దిద్దిన సఖియెవతోయీ
ఆ దిద్దిన సఖ యెవతోయీ

గ్రక్కున చెమటకుజారిన కస్తురిచుక్కబొట్టైమగువా
అది చుక్కబొట్టై మగువా
చక్కని నీ కొనగోరులు వంగినచందం బదియేమో
యా చందం బదియేమో
పొలతిరో మును చాణూరుని ముష్టినిపొడిచి తే వంగినవే
చెలియా యివి పొడిచితే వంగినవే
చెలియల గూడి సరసము లాడిన చిన్నెలున్న వేమోయీ
ఆ చిన్నెలున్న వేమోయీ
భామరో నేనే మెరుగను యికబల్ పామునైనబట్టెద నే
నే పామునైన బట్టెదనే
పాములమీద నాట్య మాడినవారికి పట్టుకున్న భయమేమీ
చేతపట్టుకున్న భయమేమీ
అతివల నెవ్వర కలయలేదని అగ్నినైన మ్రింగేనే
నే నగ్నినైన మ్రింగేనే
అడవి రగులః కార్చిచ్చుమ్రింగునీకగ్ని యందుభయమేమీ
నీ కగ్నియందు భయమేమీ
శషభిషలను నమ్మవు నేనిక విషమైనను మ్రింగేనే
నేనిక విషమైనను మ్రింగేనే
విషధర దానవిచన్నుగుడిచిన విషమెక్కున గుణధామా
విషమెక్కున గుణధామా
తప్పు లేదు నను కావవె మంగా యిఁకదయతో అలమేల్ మంగా
దయనేలుకోవె యిక మంగా
తప్పు గాచెదను ఒప్పుగాను నీ పేరుచెప్పుగుణధామా
నీ పేరుచెప్పు గుణధామా
విరివిగ తిరుమల కొండనువెలసిన వేంకటేశుడనె చెలియా
నే వేంకటేశుడనె చెలియా.

## మేనత్త కొడుకు

### నాదనామక్రియ - ఆది

### కృష్ణ - భామ సంవాదం

వేములింగ చనురాత్రివచ్చిన ద్రిమ్మరివారెవరోయీ
ఆ ద్రిమ్మరి మగ వారెవరోయీ
భామామణిరో నినుపెండ్లాడిన రామకృష్ణుడనెకొమ్మా
నే రామ కృష్ణుడనె కొమ్మా
కృష్ణుడవైతే రాత్రివేళల వచ్చిన పనులేవేవోయీ
ఆ వచ్చిన పనులేవేవోయీ
మత్స్యగంధిరో ని పొందుకు నేకూడి వస్తినేభామా
నేకూడి వస్తినే భామా
మచ్చికవగలుశాయగ రాత్రి రచ్చలేల పోవోయి
ఆ రచ్చలేల పోవోయి
రచ్చలబెట్టక రమణిరో యివిగో పచ్చలకడియము భామా
పచ్చలకడియము భామా
పచ్చలకడియము మాకువద్దుయిక వాకిలి తియ్యనుపోవోయి
నే వాకిలి తియ్యను పోవోయి
చీరలు సొమ్ములు నీకని దెస్తినివాకిలి తియ్యవెభామా
ఓర వాకిలి తియ్యవె భామా
వాకిలితియ్యను రావోయీమరి దూరరాకునిలవోయి
నీవు దూరరాకు నిలవోయి
అతివరో నేను దూరివస్తినే నెక్కువబ్రహ్మచారినే
నే నెక్కువ బ్రహ్మచారినే

ఎక్కడవ బ్రహ్మచారివై తే నీ చెక్కిట గీరేమోయీ
నీ చెక్కిట గీరేమోయీ
పంచవన్నె చిలుకను ముద్దాడితె పట్టి గీచెనే భామా
అది పట్టి గీచెనే భామా
చిటపటచినుకులు దుప్పటితడిసెను రానివ్వగదే భామా
నను రానివ్వగదే భామా
చిటపటచినుకులు దుప్పటి తడిసితే దానింటికిపోవోయి
అల దానింటికి పోవోయీ
రవ్వలుచెక్కిన రాగిడిదెస్తిని రానివ్వగదేభామా
నను రానివ్వగదే భామా
రవ్వలు చెక్కిన రాగిడిదెస్తే రాధ కడకు పోవోయి
కృష్ణ రాధ కడకు పోవోయీ
పచ్చలుచెక్కిన పతకముదెస్తిని చెయ్యివ్వగదేభామా
పవళింప నివ్వవే భామా
పచ్చలుచెక్కినపతకము తెచ్చితె భామకడకు పోవోయి
గొల్లభామ కడకు పోవోయి
కస్తురి పరిమళ గంధము తెస్తిని కౌగిలియ్యవేభామా
నాకు కౌగి లియ్యవేభామా
కస్తురి పరిమళగంధము తెచ్చితె భామలకే అలదవోయి
గొల్లభామలకే అలదవోయి
పూబోణిరో యెవ్వరో బోధించిన పలుకులు పలికేవేమే
భామ పలుకులు పలికేవేమే
వెన్నదొంగ నీ రొమ్మున దాకిన కుంకుమదెక్కడిదోయి
ఆ కుంకుమ దెక్కడిదోయి

కుంకుమ కాదే గురుతులు పాదం కూడిన కెంపులె భామా
యివి కూడిన కెంపులె భామా
మక్కువ పాన్పునపరచిన మొగ్గల నొక్కు లెక్కడివోయి
ఆ నొక్కు లెక్కడివోయి
నిన్నటిరాతిరి పరచినపానుపువత్తుకున్న దే భామా
అది వత్తుకున్న దే భామా
చన్నటిరాతిరి జడల విరిసిన నెలతల పేర్లేమోయి
ఆ నెలతల పేర్లేమోయి
నీ కంటెను పరస్త్రీల నెరుగను పామునైన బట్టెనే
భామా నే పామునైన బట్టెనే
పామునిూద పవళించిన వారికి పాము అనగ భయమేమి
కృష్ణ పట్టుకున్న భయమేమి
అందగాడ నీ చెంపలనలదినగంధము లెక్కడివోయి
ఆ గంధము లెక్కడివోయి
విందుచేసి ఒకచుట్టము నాకు పూసినాడె ఓ భామా
నాకు దెలియదె సద్గుణభామా
నారాయణ నీచక్కని దేహము నలుపెక్కిన దేమోయి
కృష్ణ నలుపెక్కిన దేమోయి
బృందావనమున గోవుల గాచిన చందంబిదె నీలవేణి
ఆ చందంబిదె నీలవేణి
అన్నిటికన్నీ సరిచెప్పేవు మెన్ని నేర్చినావోయి
నీవెన్ని నేర్చినావోయి
కన్నెరొాయన్నీ నిజములుకాని కల్లగాదుపూబోణి
ఇది కల్లగాదు పూబోణి

వేణువు బట్టిన తాండవ కృష్ణుడు ఏమి వరస గావలెనే
నీకేమి వరస గావలెనే
అక్కరో నన్ను వలచిన దేవుడు అత్తకొడుకుగావలెనే
మే నత్తకొడుకు గావలెనే.

నాదనామక్రియ - ఆదితాళము

రాముడు - సీతా సంవాదం

రామామణి శ్రీరాముడనే నిటురమ్మని వాకిలిదియవే
యిటు రమ్మని వాకిలి దియవే
రాముడ వైతే రామామణులతో రాతిరిపనులేమోయి
ఆ రాతిరి పనులేమోయి
అడవుల తిరిగియు బడలికచేత నలసివస్తినే సీతా
నే సొలసి వస్తినే సీతా
అడవుల బడలికతీర్చగ నచ్చట చెలులున్నారు పోవోయి
ఆ చెలు లున్నారుపోవోయి
ఎంతచెప్పినను పంతముమానవు కాంతరో తల్పిటుతియవే
నా కాంతరో తలుపూ తియ్యవే
ఇంతులకేటి పంతము సాగును కంతుజనక పోపోరా
మామకకంతు జనకపోపోరా
రాతిగుండె యీ నాతుల నమ్మగదగదే వో సీతా
నిను నమ్మరాదుగదె సీతా
రాతినాతికి గుండె లెక్కడివి నానాయక యికపోపోరా
నానాయక యిక పోపోరా
వలచి వచ్చితిని వయ్యారివి నీవాడనుగదవేభామా
నీవాడను గదవేభామా

వలపులు చాలిక వారిజనేత్రులుచాలగలరు పోపోరా
నీకు చాలగలరు పోపోరా
నీకు మించ నే నితరుల నెరుగను వారిజాక్షిరో రావే
ఓ నీరజాక్షిరోయిక రావే
చిన్ననాడు నీవాడినమాటలు నమ్మివస్తినే సీతా
నే నమ్మివస్తినే సీతా
కంతుజనక నీ పయి దుప్పటిపై పసుపంటిన దేమోయీ
పసుపంటిన దేమోయీ
భువి లోకోక్తుల నాలింపగనే పోయి వస్తినే సీతా
నే పోయి వస్తినే సీతా
చిన్నిరామ నీ చెక్కిలిపయి చిరుచెమట లున్న వేమోయి
చిరు చెమటలున్న వేమోయి
చెమటలు కావివిశాలియరో భక్తులవలచివస్తినే సీతా
నే వలచివస్తినే సీతా
కామజనక నీభామనుగద శ్రీరామ లేచిరావోయి
శ్రీ రఘురామ లేచిరావోయి.

## అన్నాచెల్లెలు - సంవాదం

శంకరాభరణం - చాపుతాళం

**అన్న** :- ముత్యాల వానగురిసె । ముగ్ధ మీావగిన తడిసె
తలుపు దీయండమ్మ । చెల్లె తగువు లెందుకూ ॥ము॥

**చెల్లె** :- ముత్యాల వాన కురలేదు । ముగ్ధా మావదిన తడలేదు
తలుపు తియ్యమన్న మేము । తగువు లుండగ ॥ము॥

**అన్న** :- పగడాల వాన కురిసె । పణతి మీావదిన తడిసె
తలుపు దీయండమ్మ । చెల్లె తగువు లెందుకూ ॥ప॥

చెల్లె :- పగడాల వాన కురలేదు । పణతి మా వదిన తడలేదు
తలుపు దియ్యమన్న మేము । తగువు లుండగ ॥ప॥

అన్న :- వజ్రాల వాన కురిసె । వనిత మీా వదిన తడిసె
తలుపు దీయండమ్మ । చెల్లె తగవు లెందుకు ? ॥వ॥

చెల్లె :- వజ్రాలవాన కురలేదు । వనిత మావదిన తడలేదు
తలుపు దియ్యమన్న మేము । తగువు లుండగ ॥వ॥

అన్న :- రతనాల వాన కురిసె । రమణి మీావదిన తడిసె
తలుపు దీయరమ్మ । చెల్లె తగువులెందుకు ॥ర॥

చెల్లె :- రతనాల వాన కురలేదు । రమణి మావదిన తడలేదు
తలుపు దియ్యమన్న మేము । తగువు లుండగ ॥ర॥

అన్న :- ముందూ మురుగులు పెడత । వెనకా పోచీలెడత
తలుపు దీయుడీ చెల్లె । తగువు లెందుకు ॥ముం॥

చెల్లె :- ముందూ మురుగులు వద్దు । వెనుక పోచీలు వద్దు
తలుపెట్లు తీతుమన్న । తగువు లుండగ ॥ముం॥

అన్న :- ఎక్కా-గుర్రాలు యిస్తా । యేలా రాజ్యాలు యిస్తా
తలుపు దీయుడీ చెల్లె । తగువు లెందుకు ॥ఎ॥

చెల్లె :- ఎక్కా-గుర్రాలువద్దు । యేలా రాజ్యాలువద్దు
తలుపెట్లు తీతుమన్న । తగువు లుండగ ॥ఎ॥

అన్న :- ఆకలిగొని మీావదిన । అలమటజెందుతుంది
తలుపు దీయుడీ చెల్లె । తగువు లెందుకు ॥ఆ॥

చెల్లె : ఆకలైతే మాకెందుకు । ఆడుబిడ్డ కట్నముంది
కట్న మిచ్చినను గాని । కదలనివ్వము ॥ఆ॥

అన్న :- చేతిలో చెయివేసి యిపుడు । చెప్పుచుంటిని గదమ్మ
తలపు కోర్కెలెల్ల దీర్తు । తెలుపుదీయరే ॥చే॥

చెల్లె : అన్నావదినలు మీరు । ఆశీతప్ప బోకండి
అన్నవదిన మీపట్టి నిచ్చి । అరణ మియ్యుడి॥ ॥ము॥

## మరదలు-వదిన సరసం

మర :- కులదేవంబుల పూజలుచేసుక
కూర్మితో మేమిటు రాగానే
తలుపులు మూసుక [illegible]లు చేసేది
తగువులెంచరే ఓవదినా॥

వది :- ఇలలో నడిచేటి సుగుణాదకునే
యింటికి యిలనడిపించితినా
తలిరుబోణిరో పతిపేరు జెప్పను
తలుపు దీసి నిను రానివ్వనే॥

మర :- పుడమిలో నడచేటి మరియాదకునే
పురుషుని నామము అడిగి తెలిసి
[illegible]యు తనంబున లంచము తెమ్మని
జూజపు మాటలు ఆడకనే॥

వది :- కడువడి సేయక నాపతినామము
లడుగక నన్నటు పోనిస్తే
ముదిత వదినరో వినవే నీ విపుడు
అడిగిన లంచంబిచ్చేనే॥

మర :- తోచీ తోచని మాటలాడక
దోవవిడిచి ననుపోనిస్తే

పూచిన సీతల వెంద్రుకలకు నే
వీచిత్రపు సవరా లిచ్చేనే॥

వది:- నిండిన సభలో మెండిలీలామణి
పుండరింపక సనుపోనిస్తె
దండివదిన నీ మొండికాలికీ
దండము లయివా పెట్టేనే॥

మర :- మెండుగ సుంకముకన్న వార్తల
దండన చెల్లి పోనివ్వానే
బాహుబలంబున తలుపులు మూసుక
చక్కని మోహిని వలెనుండే॥

వది :- సాహసమాడే మోహానాంగిరో
మోహాన మాలిక లిచ్చేనే॥

మర :- సాహసబుద్ధులు గలవారికిని
మోహాన మాలిక లబ్బునటే
సాహసమాటె మోహానాంగిరో
మోహామాలికలు కరవగునే॥

వది :- గుంపులు గూడుక వాకిట నుందర
రంతులు సేయక యుండేను
రంపి వదెనరో చింపిరి తిలకా
దంతపు దువ్వెన లిచ్చేనే॥

మర :- దంతపు దవికెలు దొంతరయుండగ
యింతులార మీరెరుగరటే
దంతపు దువ్వెన యెంత లేదన
పొంత చెల్లక పోనివ్వగనే॥

వది :- గుంపులు గూడుక వాకట ముందర
రంతులు సేయక యుంటేనూ
రంపి వదినరో చింపిరితలకు సం
పెంగ సరములు ఇచ్చేనే॥

మర :- సంపెగ సరములు నీకరుదైతే
గంపలాచి తెప్పించేనే
దంపతులిద్దరు పేర్లు చెప్పుకొని
సొంపుగనీళ్లకు పోగలరే॥

వది:- వండివేసు యీ వాకిట ముందర
అమ్మనీవు రాకుంటేను
నడ్డి వదినరో గుడ్డి కంటికి
అడ్డుగల దగిలించేనే॥

మర :- అడ్డుగ లందంబనుచును గారడి
విద్దెలు సుద్దులు మానకవే
దుద్దుపెట్టినే పోయెదినంటీ
పద్దువిడిచి పోనియ్యానే॥

వది :- గుంపులు గూడుక వాకిట ముందర
రంతుసేయక యుంటేను
కలికి వదిన నీయెలుకల చెవులకు
చిలుకల లవిలీలిచ్చేనే॥

మర:- వెలలేని సొమ్ములు కలికి యుండగా
చిలుకల బావిలీ లరుదటవే
కులుకులాడిరో విను మరదల నీ
పలుకుల కివ్వతె భయమంను॥

వది :- ముక్కలి చిక్కులు పెట్టకె వాకిటి
అక్కరతో ననుపోనిస్తే
ముక్కోటి వదెనరో ముక్కుకు ముత్యపు
ముక్కెర చేయించిచ్చేనే॥

మర :- ముక్కుకు ముక్కెర లేదని యెవతె
అక్కరతో నిన్నడిగినదే
తక్కిడి టిక్కిడి మాటలిక్కడ
చిక్కుబడక తప్పినపోవే॥

వది :- గుంపులు గూడుక వాకిట ముందర
రంతులు సేయక యుండినను
కేశివదిన నీబాకినోటికి
విడియాం తెప్పించిచ్చేనే॥
విడియముగల దానసని
బాడిస వలికెదవో భామా
పిడెం కలిగితే వేసుకోగదవె
నావేడుక చెల్లక పోనివ్వనే॥

మర :- వదినరో వినవే వాకిట ముందర
వదినెవనినిను పోనిస్తే
సరసియవదినరో సామిమైనమా
సరము లాడుచు నుందామే॥

వది :- వినవె మరదల విభునితసమిటా
వేడ్కల సల్పకువేమా
వనితను తల్పటుతిస్తి తలిరు
బోణిరో నీ పిటూ చెల్లగదే॥

## వదినె - మరదలి సంవాదము

వది :- తలిరు బోణిరో నేను తడవాయె వచ్చియున్నాను
వెలదిరో తలుపు తియ్యవే మరదల

మర :- తలుపు చిలుకదీసెగాని తడవుసేయరాదుగాని
సఖియ నీ విభుని పేరు చెప్పవె వదెనరో॥

వది :- ముక్కిడీ మరదల నీకు ముక్కెరదీయింతుగాని
తక్కిడి మాటలాడక తలుపు దీయవే

మర :- బాగైన నీమొల్ల కంటికి పారజూచేటందులకు
తేటగు అద్దమొకటి తెచ్చియిచ్చెనే॥
ఆగుడ్డిలో మొల్లశ్రేష్ఠమన్న మాట మరువకా
అందరిని ఒక్కకంట జూచెనే

వది :- నీ పేను నాకినయట్టి నత్తికి రాగిశీయిత్తు
వాపిగొట్టు మరదల వాకిలిదియ్యవే

మర :- బాపురే తంటాల మారి బట్టతలకు మోకాళ్లకు
వపనానికి ముడులు బెట్టెనె వదెన నీవు॥

వది :- ఉవిద నీవంకరతుంటకి తగిలించ వడ్డాణమిచ్చె
తడవుసేయక తలుపు గ్రక్కున దియ్యవే

మర :- అవునె నీనాథుని పేరు అతివరో నే జెప్పమంటే
అప్పుడంటె తప్పుడన్నరీతి అనిరో వదినమ్మా॥

వది :- మరదల నీవడిగినట్టి మంచిసొమ్ముల్లిచ్చెగాని
తరుణి దయలేచి తలుపు గ్రక్కున తీయవే

మర :- అరయ చంకదుష్టతరశార్ధులమన్న సాకొనను
మరులు కొలిపియెన్న మాటలాడేనే॥

వది :- ఉల్లివాసనగొట్టు నీ ఒడలికి సంపెగగంధము
ఇల్లిదే పూసేను వాకిలి యిప్పుడు దియ్యవే

మర :- ఉల్లిపూసలపేరు వదెన వేసికొంటివేమొ
అల్లవానికంపు నీకు అమరియుండును॥

వది :- కాసువీసమైన నీకు కానుకలిచ్చేగాని
రోసపడక మరదల తలుపు తియ్యవే

మర :- ఆసను జెంది పిడికెడాళ్లను తెగించి దానము
చేసిన వారలు నీకు స్నేహితులటే॥

వది :- పంకజాక్షి నీవిభుడు బైటనుండివచ్చెనదిగో
బింకము జాలించి బిగువు తలుపు దియ్యవే

మర :- రంకుబోయిన బొంకులాడి నేరగయన్నట్టు
బొంకులు నేరిచినన్ను బొంకించెదవే॥

వది :- అత్తగారు వచ్చుచున్న దల్లగదిలోనజేరి
తత్తెయాలాడక వచ్చి తలుపు తియ్యవే

మర :- తత్తెయ్యాలకు భోగముదాని చెలిమి చేసినావె
పెత్తనము విడవె మగనిపేరు జెప్పనే॥

వది :- మాయన్నగారితో కూడ మెలతరో నేవచ్చినాను
పాయక యికనైన తలుపు బార్లదియ్యవే

మర :- ఈయెడ చేసిన దోసమెప్పుడైన బోవుగాని
మీయన్న పేరు స్మరించి నాటలాడవే॥

వది :- నలినాక్షి శ్రీవెంకటాద్రినాధుని నేరీటివిభుడు
పలికితిని నిజముగాను తలుపు దియ్యవే
చెలియ నాపంత మిఘుడు చెల్లించుకొంటినంచు
తలుపుదీసి వదెన మరదళ్ళరుగు చుండిరి॥

## ఈలాటి వియ్యాలవారు

ఈలాటి వియ్యాలవారు మాకెక్కడ దొరికినారో
ఈఅప్పడాలు అంటకొనక జెప్పలేదు శాస్త్రినిక్కెన ||ఈ||
చప్పని పచ్చళ్ళు వడ్డించి చక్కగా భోంచేయమన్నారు
వడియము లెండబెట్టితే తడిసి ముద్దైపోయినవట ||ఈ||
గడియ గడియకు మంచినీళ్లు కావలెనాయని యడిగేరు
కూరలు బజారులో కొనబోతే దొరకలేదట|| ||ఈ||
కోరికమీర తోటకూర ఒక్కటే వేయించినారు
ఈపంచదార మణిగెలోన పాలు పసుపు కలసిపోయె ||ఈ||
కొంచెము పరమాన్నము కొండనాలుక కందరాదు
తమల పాకులు మొదలే లేవట తమ కేచాలలేదట ||ఈ||
తమకైతే ప్రొద్దుకు ముమ్మార్లు తాంబూలము లడిగేరు
చక్కనివియ్యాలవారు మాకెక్కడదొరికేరో.

## ఇంతచక్కని వియ్యాలవారు

ఎచట దొరికినారు - యింతచక్కని వియ్యాలవారు ||ఎ||
తెచ్చిన నెయ్యంతా నేడె - తీర్థమువలె తాగినారు
భక్ష్యములుబాగుగచేస్తే - మెచ్చరేలాకో వీరు ||ఎ||
సన్నబియ్యము వీరు - యెన్నడు నెరుగరేమో
ఎన్నిసార్లు వడ్డించినా - యింకా తెమ్మని యడిగేరు ||ఎ||
అరటాకులలవాటులేక - చిరుకులు చేసుకొన్నారు
పెరుగుపాలు చేర్చుకొని - జుర్రు జుర్రని జుర్రుకొనేరు ||ఎ||
పప్పు కూరలువద్దు - పచ్చళ్ళే తెమ్మనేరు
చెప్పకుండేసిగ్గుచేటు - గొప్పవారని వీరికి పేరు ||ఎ||

## 22. వియ్యపురాలు

వియ్యపురాలిని యెంతో - నెయ్యమునా బిలువబోతె
గయ్యాళితనము జూపెనే - సుందరులారా
కయ్యమునకు కాలుద్రవ్వెనే ॥వి॥

పుయ్యబోవగంధము - దయ్యమువలెనేజూచి
చెయ్యిబట్టి విదలించెనే - యోసఖులార
తెయ్యి తెయ్యిమని యాడెనే ॥వి॥

కాలి పసుపు పుయ్యబోతె - సోలిసొక్కినట్టులుండి
తూటుమాటలాడ సాగెనే - రమణులార
తాలిమియింతలేకుండెనే ॥వి॥

మొగమున కుంకుమబెట్ట - బగబూనిన దానివలె
మొగమునటు దిప్పుకొనెనే - వామాక్షులారా
యగడు సేయకానె మానెనే ॥వి॥

చీరగట్ట బోయినంత - సిగ్గుమొగ్గులేక వేగ
జీరవిడిచి పారదొడగెనే - మగవారలెల్ల
నోరగంటజూచుచుండిరే ॥వి॥

అత్తరునివ్వగబోతే - మొత్తము తల దిప్పుకొనుచు
క్రొత్త క్రొత్త మాటలాడెనే - పదుగురుజూచి
చిత్తినిగానున్న దనిరే ॥వి॥

ఇట్టిదని మొట్టమొదట - గుట్టు దెలిసినట్టయితె
గట్టుదిట్టములను సేతునే - వినకున్న జాల
రట్టు జేసిబెట్టు పరతునే ॥వి॥

## 23. బావల హాస్యం

పోయివస్తారా ? పెదబావ! పోయివస్తారా ?
చినబావ! మీరిద్దరు పోయివస్తారా ? ॥పో॥

1. కాకిరెక్కల బియ్యమట । కందిపప్పు[1] సుద్దలట
పూనికతో వడ్డిస్తురట । పున్నెమేమో తెలియదట ॥పో॥

2. చామకూర వరియన్నము । చారిడేసి కుడుములట
మాటిమాటికి బూరెలట । మళ్లిమళ్లివడ్డిస్తారట ॥పో॥

3. ఆవకాయ దప్పళములు । ఆవిశాకు దొప్పలట
ముంతలతో ముంచుతారట । మునిగేటటు పోస్తారట ॥పో॥

4. పంచదార పుణుగులట । ఎంచకుండ వేస్తారట
పంచకొంగు నైదువేసి । పట్టుకుపొమ్మంటారట ॥పో॥

## 24. పాన్పు

హిందుస్థానికాఫి-ఏకతాళము

పల్లవి : పాన్పువెయ్యరే పడతులార,
పసిడిచేమంతితో పడక శృంగారించి ॥పా॥

1. జవ్వాది పునుగును మువ్వగోపాలునకు
నవ్వుచునుండెడు నవమోహనాంగునకు ॥పా॥

2. జాజివిరులతోను రోజాపువ్వులతోను
వాసనలు మెరయ వనితలార గూడి ॥పా॥

3. పంకజనేత్రునకు పరమదయాళునకు
పరిపరి విధముల పరగశృంగారించి ॥పా॥

---

1 సుద్ద=తెల్లమన్ను.

4. అలివేణి వాసునకు అభయదాయకునకు
వెలయు సర్వేశునకు మూలాధారునకు ||పా||

5. కోరికలెల్లవే నొసగెడు ధీరునకు
వరకేశవపుర వాసునకు నలర ||పా||

## పారిజాతముల పాన్పు

కేదారగౌళ—ఆది

గాగసమగ - రీగసా - సాససని - సారిగాగా
లాలియనుచు యూపెదన్ మేలుగ సావిత్రిరో నిను
గమపాదపా-గమపామపా-గమపాద
సేవింతునూ భావింతునూ సావిత్రీరో
పా, మగరి - సాసరీరిగా - గపమగ - రిరిరిగారిసా
ఓ-నిన్ను చాలాప్రొద్దు పోయె నిదుర చెందుమా
విరజాజులే, వరమల్లెలే- దవసంబులేకురు
వేరులే- పారిజాతముల పాన్పు పరచిరి ||లా||

## పవ్వళింపు

హిందూస్థానీ-రూపకం

సాససాసస- సారిగరిగా- సరిగపమగ - రిగరిసా
పవ్వళింపుము పార్వతీతో వేగనేడు పరాత్పరా
పని నినిని-దాని-పనిదపమగ-రిస-సరీగమగ మరిగరిసా
సవ్యముగ విరిశయ్యపై - పన్నీరు చల్లిరి చంగునా

చక్కనీ కమలాఫలములు - నారికేళ ఖర్జూరముల్
చక్కగను మీచేతికిచ్చును - మక్కువతో భుజియింపుమా
యుల్లమున క్రీడాటకును - మాతల్లికిన్ బల్ వేడుకా
మల్లెపువ్వుల చెండు వేయును - మళ్లితిన్నగ వేయుమా
చిలుకపలుకులు పలుకుచున్న - యాచెలియతో భాషింపుమా
కులుకులాడిని కూడిమన్మధ - కేళిలోసుఖియింపుమా
అందముగ బెజవాడ వరపుర-మందునా నివసించిన
ఇందువచ్చిన సుందరాంగులు - అందరూమీభక్తులే ॥ప॥

## ౨౫. శోభనం పాటలు

సలలిత క్రమ మొప్పసనికంటెమీాద
తరుణిని సప్తపాదములు ద్రొక్కించె।
మరుని జేగంట నామంగళ సూత్ర
మంగనామణి కంఠమందుంచియొనగ।
మంగళ స్థితి సర్వమంగళ గళము
నందుబొందుగ గట్టె నర్ధేందు మౌళి ॥సలలిత॥
శోభనమే శర్వునకు శోభనమే పార్వతికి
శోభనమే కైలాస శుభమందిరునకు శోభనమే
మణితతుల హారతులు మదవతులు ఇయ్యరమ్మా
మతియుతుడు శివ్వన్నమగువగౌరమ్మకు ॥శోభనమే॥

సిరిసందెలు సూకగను - శ్రీరాముల లేపేరె
సీతాలంకారములు - శీఘ్రమ్ము చెయ్యారె ॥సిరి॥
సిరిదేవిని లేపారే - శృంగారించగవలెను
కురులువిప్పి దువ్వారె - కూర్చుండగనూ బెట్టి ॥సిరి॥

పసుపొప్పుయ్యారె - తీరుగ కుంకుమదీర్చి
మల్లెపువ్వులగూర్చి - దండలు మెడ వెయ్యారె ||సిరి||
కన్నుల కాటుకలుంచి - గంధామొప్పుగ బూసి
కాంతాలం కారములు - శీఘ్రమ్ము చెయ్యారె ||సిరి||
పట్టిమంచము వాల్చి - బరుపొప్పపక్క వెయ్యారే
పండుటాకులు దెచ్చి - పానుపుననుంచారే ||సిరి||
పిన్న పెద్దలుకూడి - ప్రియముతో తీసుకువచ్చి
ఆశీర్వాదముచేసి - అక్షతలు యివ్వారే ||సిరి||
అతివాలందరుగూడి - హారతి పళ్లెములివ్వారే
కాంతాలందరుగూడి - ఘడియలు వేయారే ||సిరి||
పాలూ నెయ్యి ఆరగించి - ఫలప్రదానము లిప్పించి
హారతులిచ్చిరి శ్రీరాముకు - అరుంధతి మొదలుగాను ||సిరి||
కొబ్బర బెల్లము తినుసీతా - కోరిక కొడుకులు గనుమీా
హంస పానుపుమీాద - అటుపోయి పవ్వళించుమీా ||సిరి||
హెచ్చుగా మెడనున్న - పచ్చలహారములిచ్చెనే
ముచ్చటలాడముద్దు - మొగంబైనా చూపేనే ||సిరి||
మెడనూ కంఠమాలా వేగా - మానిని కిచ్చెనురావే
సొగటాలాటాడుదాము రావె - పాన్పుపై పవళించి ||సిరి||
సందిటీ దండాలిచ్చె - స్వర్ణాభరణములిచ్చె
వేలివుంగ రామిచ్చె - వెలది పలుకావేమే ||సిరి||
వేలీముద్దుటుంగరము - నిన్న యమునాతీసికొని
భామరో యిదియేమని - తనభయమున తలనొంచె ||సిరి||
యింతదూరంవచ్చి యెన్ని-నీకిచ్చితి పలుమారు
పలుకవటెందుకేమారు - పిలిచిన పలుకవటెందుకో ||సిరి||

చిన్నదిసుమి, సీతమ్మ సిగ్గునరాకున్న
శ్రీరాములూ నీవెళ్లి తీసికొనిరమ్మా
చిన్నానాటినుంచి బుద్ధులు మెరిగివుండేనా
తల్లి దండ్రినివిడిచి తరుచుండలేదు ॥చిన్న॥

## శోభనమే-శోభనమే

శ్రీరఘుకుల చంద్రునకు - శ్రితకైరవచంద్రునకు
భూరిదయా సాంద్రునకు-భోగమహేంద్రునకు ॥శో॥
శోభనమే రామునకు-సుగుణాభి రామునకు
ప్రాభవభయ ధామునకు - శోభనము రామునకు ॥శో॥
సుందరాకారునకు - మందరనగ ధీరునకు
మందరోద్ధారునకు-మాన్యాధారునకు ॥శో॥
సత్యసంకల్పునకు-నిత్యోదిత కల్పునకు
నిగమాకల్పునకు - శ్రీరామునకు ॥శో॥
సీతాహృదయేశునకు-సేవితబ్రహ్మేశునకు
కాంతవరాధీశునకు-ఘనఘనసంకాశునకు ॥శో॥
గట్టిగా మముబ్రోవ - కంకణములచేత
గట్టిగా సాకేత - పట్టాభిరామునకు ॥శో॥

## 26. అత్తకోడలను పిలుచుట

దువ్వెనవచ్చి దొంతిలోవున్నది రావేకోడలా !
దువ్వెనవస్తేనాకేమి ? అదిదొంతిలో వుంటెనాకేమీ ?
ఈర్పెనవచ్చి యిరుపులోవున్నది రావేకోడలా !
ఈర్పెనవస్తేనాకేమి ? అదిఇరుపులోవుంటే నాకేమి ?

పూవులువచ్చి బుట్టలోవున్నవి రావేకోడలా!
పూవులువస్తేనాకేమి? అవి బుట్టలోవుంటేనాకేమి?
కోకవచ్చి కొయ్యపైవున్నది కట్టుకొ రావేకోడలా!
కోకవస్తేనాకేమి? అదికొయ్యపైవుంటేనాకేమి?
బొట్టువచ్చి తట్టలోవున్నది పెట్టుకరావే కోడలా!
బొట్టువస్తేనాకేమి? అదితట్టలోవుంటెనాకేమి?
బ్రాహ్మలొచ్చి పంచాగంచెపుతున్నరు రావేకోడలా!
బ్రాహ్మణులొస్తేనాకేమి? పంచాంగం చెప్పితె నాకేమి?
పెండ్లికొడుకువచ్చి పీటపైనున్నాడు రావేకోడలా!
పెండ్లికొడుకు వుంటేవస్తాను, పీట్లపై నేను కూర్చుంటాను.

## 27. వసంతం

పూల వసంతములాడెనే
దమయంతి నలరాజుతోను ॥పూల
ఇద్దరు గూడుక వనములకేగిరి
ముత్యాల గద్దెపయిని
ముదముతో గూర్చుని వజ్రాల
వాహిరీ మెరయుచు నిద్దరు ॥పూల॥
చుట్టుజల్తారు చీరె మల్లిమొగ్గలరవికె
జిగుజిగు మనియేటి ధగధగ సొగసుల
రాజాధిరాజు నలదమహారాజు దమయంతితోను ॥పూల॥

## 28. కంత పాట

పెండ్లి అయిదవనాడు పెండ్లికొడుకు వైపువారికి తలంటుటకై
1 పసుపు 2 కుంకుమ 3 గుమ్మడికాయ 4 కుంకుడుకాయలు

5 సున్నిపిండి 6 సలంటునూనె మొదలైనవాటిని, పెండ్లికూతురువారు పంపించే తగవు.

కమ్మవారువంటి కొన్నికులాలవారు పెళ్లికూతురును తమ యింటికి తీసుకవచ్చేముందు, అచ్చుకున్నప్రకారం పెళ్లికూతురునకు యిచ్చే ఆభరణాలూ, చీరా, రవికలగుడ్డా, పసుపూ, కుంకుమ, తమలపాకులూ, పోకచెక్కలు, అరటిపళ్లూ మొదలైనవాటిని (పెండ్లికొడుకువైపువారు,) యిచ్చేతగవు.

ఈ కంతనడిపే సందర్భంలో పాడేపాట.

శ్రీరాగం - ఆదితాళం

రిమపానిసా - సరిసనిపామ - రీసరీమపనిసా
కంత తెచ్చిరీ-కన్యయింటికి-నేడుకంత తెచ్చిరీ,
పనిసాసా రీరి - సరిసరి - మారిసాసా - రీరిసాని
రంభ ఊర్వశీలు - నాట్యమాడగాను - తుంబుర
పనిసరీ - సరిసనిపామ - రీస - రిమపానిసా
నారదులు - వీణమీటు - చును - కంత తెచ్చిరీ

2. కౌసల్య మొదలైన కైక సుమిత్రయూ
జనకమహారాజుపుత్రికకు నేడు ॥కం॥

3. రంభ ఊర్వశీలు నాట్యమాడగాను తుంబుర
నారదులు వీణమీటుచూను ॥కం॥

4. పచ్చిపోకలతోను పండుటాకులతోను
హెచ్చైన యాలకులు మనసీతకు ॥కం॥

5. ఖర్జూరఫలమూలు అరటిపండ్లు గెలలు
పనసపండ్లతోను మనసీతకు నేడు ॥కం॥

6. ఉప్పూపప్పూలతోను ఉల్లిగడ్డలతోను
చిత్రముగ మన సీతాసతికి ॥కం॥

7. బనారసుచీర బొనమూని రవిక వజ్రము
లతో గొలుసు వనితసీతకు నేడు ॥కం॥

8. వైకుంఠ పురమున వెండిగ్లాసులతోను
చెప్పచోద్యముగాంగ శ్రీరాములవారి పెండ్లికి ॥కం॥

## 29. అప్పగింత

వదినెరో మాబాలనిదె యొప్పగింతూ
సదయవై గైకొమ్మా సరగూన రమ్మా
యెన్నో నోములునోచి కన్నాను దీన్ని
కన్నులలో బెంచు కొన్నాము తల్లీ
కననేమి నాబిడ్డగాదు నీబిడ్డ
యెనలేని ప్రేమతో నెట్లు బెంచెదవో
ఎంతో గారాబానఎత్తి పెంచితినీ
గొంతెత్తిగట్టిగా కోపించి యెఱుగ
తల్లిచేతులలోను తండ్రిచేతులనూ
అల్లిబిల్లిగ బెరిగెనమ్మా యీ బిడ్డ
మీాపట్టిగానియిక మాపట్టిగాదు
చేపట్టిరక్షించు చేరి మ్రొక్కెదమూ
నీలవేణిరో దాని నీటుముంచెదవో
పాలుముంచెదవో నీపాలవైచితినీ
బిగ్గఱగా బిల్వ బెదరిజూచెడినీ
దగ్గఱ రమ్మన్న తరతరలాడు
మాయ లెరుంగదు మర్మమెరుగాదూ

పాయక యీ నలుసు బ్రతికించుకోమ్మా
నల్లనిదీనీరు తెల్లనివీపాలు
కల్లగాదిదియెంచు చల్లగానేలూ
తనకుమిక్కిలి బాధతగిలియుండిననూ
మనసు మర్మము జెప్పుకోనజాలదమ్మ
పనులేమినేరదు పసిబాలయబలా
కనినబిడ్డగనేర్పి కావుమోయమ్మ
తెలివిలేమిని నేరములు చేసెనేని
చలముపూనకుమమ్మ సాగిలబడుదు
లాలించి బేలించి లలిబుజ్జగించీ
మేలుత్రోవను నేర్పి యేలుకోతల్లీ
కోడలుగాదిదికూతు రేయనుచూ
పాడిమైదయతో కాపాడిరక్షించూ
ఈ చిన్న కన్నియ నిన్నాళ్లు బెంచీ
నీచేతబెట్టితి నీకొప్పగించీ
ఇట్టిదాయీ చిట్టి పట్టినీ విడిచి
యెట్లుజీవింతునో యీశునికెఱుక
పొరుగింటి కాడుకోబోయినయపుడు
తిరిగివచ్చినదాక దిగులొందుచుందు
ఒకగడియనన్విడిచి తానుండలేదూ
ఇకమీద కాపురా మెట్లుచేసెడినో
యిన్నాళ్లు ప్రాణమేయీడుగా బెంచి
చిన్నతల్లికి పెండ్లి చేసితిమిపుడూ
అత్తాయింటికి బోయివత్తువాయమ్మా
చిత్తమందున భీతిజెందాకు మమ్మా

పోయిరామాయమ్మ బుద్ధితోనుండే
మాయందరికి మంచిమాట తేవమ్మా
అత్తామామల మాట కడుగుదాటకుమా
చిత్తాము మెప్పించి చెలగు మాతల్లీ
బావలూ మరదులూ బంధుజనంబు
నీవారియెడ మాటయేమి రానీకూ
పతినిదైవముగా భక్తితో నమ్మి
మతిమంతురాలవై మనుము మాయమ్మా
పోయిరాముద్దులామూల్లె మాతల్లీ
పోయిరావే చిలుక మురిపెంపు మొలక
యెన్నడు నిన్విడిచి యెడబాయనైతీ
కన్నతల్లిగో నేను కడతేరుటెల్లో
బొమ్మరిండ్లను గట్టి శాలతులను బిలిచీ
అమ్మరో యెవరింక నాటలాడుదురో
పేర్వేర బొమ్మల పెండ్లిండ్లుచేసి
వేర్వేర నెవరింత వియ్యామందెదరూ
చిటిచిట్టి నోములుచేడెలాగూడి
ఎవరింక మాయింట నోమునోచెదరూ
నెయ్యాగత్తెల గూడినిండు వేడుకనూ
ఉయ్యాల నెవ్వారు ఊగుదూరికను
చిన్నవీణియ ముద్దుచేతులను బట్టి
వన్నెనెవ్వారింక వాయించగలరు
వరహాలమూట నావజ్రాలకోట
మురియుచు పాటలెవ్వారు పాడగలరూ
గారాలపట్టి నాకన్నార చిట్టీ

పేరంటముల కెవరు వెంటావచ్చెదరూ
మామిడిపండు నామల్లియ మొగ్గా
నీముద్దుపలుకుల నేనెపుడు విందూ
మించినాప్రేమతో బెంచినామమ్మా
కొంచెముగ మము మదినుంచుమోయమ్మా
నన్నుగన్నమ్మ నానాణెంపు సొమ్మా
చిన్నమాణిక్యమ్మ చింతించకమ్మా
కంటనీరు దుడువు కనకంపుబొమ్మా
జంటగాపతితోడ సుఖియింపుమమ్మా.

## 30. కొంటెనీతులు

అత్తమామలుగాని-ఆడబొట్టెలుగాని
లేరమ్మ నీదెంత-పున్నెమోగాని
మగడొక్కడేగాన-మనసుకెక్కినయట్లు
మర్దించి నీవశము-జేసికోవమ్మ
నీమాటవినబడ్డ-నిమిషంబునందు
హడలిపోయేటట్లు-అతనిభయపెట్టు
ఇరుగుపొరుగు వార-లేమైన అంటే
ఏడ్వక వెయిరెట్లు-దుమ్మెత్తిపోయి
మగడుదెచ్చినవెల్ల-పైపైనఅమ్మి
సతతంబు పుట్టింట-గడుపుమోతల్లి
పతికోపపడినప్డు-పడియుండబోక
అంతకు పదిరెట్లు-అతనిమర్దించు
ఆటలాడెడివేళ-నతడొచ్చికోపింప
వూరకబడియుండ-కుండదోయమ్మ

భర్తనువంచుకోగల-భార్యగౌరవమెన్న
రారాజునకునైన సారమణిరోలేదు
ఇదియెల్లమరువక-ఏమాత్రమలియక
సుఖపడుచుండుమా-సొగసువూదీవ.

## 31. మంగళ హారతులు

ప్రతీ శుభ కార్యములోనూ కట్టకడపట హారతి యిస్తారు. అప్పుడే మంగళహారతులు పాడడం పరిపాటి.

బావకు మంగళం

అలికిన పూసిన అరుగులమీద
ఆకుతేలు కుట్టింది నిన్ను బావయ్య
చీపురు కట్టొకచేత దీపమొకచేతి
దిగదుడువ వచ్చిన బావనుకుట్టె
అన్నదమ్ముల బాధతాజూడలేక
అట్టెవెళ్లి పెదబావ నట్టేటదిగును
కానక వారమ్మ కాలువలోదిగును
ఎరుగలేక వారితండ్రి ఏటిలోదిగును
శతమానాలకు వెళ్లినచేడెలనుజూచి
కంసాలి లింగయ్య కాలువలోదిగును
అవిరేణికివెళ్లిన అక్కలనుజూచి
కుమ్మరివెంకన్న గుంటలోదిగును

బొసికాసికి వెళ్లిన బొవలను జూచి
మంగలిసుబ్బయ్య మంటలో దిగును.

## నారాయణు రాణికి మంగళం

శహానరాగం - మిశ్రతాళం

ప॥ నిసారిరీ-రిరీరీరీ-రిరిగమపపా-పమగాగరిరిస
మంగళామా నీకు మంగళామమ్మ శ్రీ
పనిసమా మగరీ-సపారిసని సదాదా-పనినినరిరీ
రంగా నాథు నీ కొమ్మా రక్షించా
పమగమరీ సాసా
వ మ్మా

చ॥ పపపపమదా-నీనీసాసా, సదరిసాసా-రిసనిసపదప
అంగజా జననీ నీకు భంగీ మా యమ్మ
పదరిసాసా, రిసదసపదపా-సరిగమపాపా
శృంగార రాము మించూ బంగారు
పమగామా-మమరీసా
బొ మ్మా ॥మం॥

2. పక్షి-రాట్ప్రభుగూడి బరగుమాయమ్మా-అక్షయ
కరుణచే రక్షించ వమ్మా ॥మం॥

3. క్షీరాబ్ధికన్యనే-నినుకొల్తునమ్మా-నాదారిద్ర్య
ము బాపి దయ నేలు కొమ్మా ॥మం॥

4. శ్రీ రంగమునందే చెలగుమాయమ్మా-నా రా
యణునిరాణి, నాతిలలనాను ॥మం॥

## రఘురాజాయ మంగళం

### మోహన-మిశ్ర

ప॥ గగారిససరిగగాగాగరిగగాపాదాససాదపగరి
రామ రఘురాజాయ మంగళం సీతా
గపాగరిసస-సదాససరీ-గగపగరిసా
రామ దశరధాతనయా మంగళం

చ॥ దదాదాదదదదసదపదాపపప పాదపగగ
కౌసల్యా వర కుమార ఘనత చేసిన
పాదసాసాదాదదరిసాదాసాదాపాపగపదసదప
భాను వంశా పాలకా నీకు వజ్రాల హా
గదపగరిసరి
రతులివిగో ॥రామ॥

2. మునివెంట తాను వెడలిన-తాటకినిమద
మణచిన-యజ్ఞమును గాచిన స్వామి-నీకు
ముత్యాల హారతులివిగో,

3. శృంగారముగ సీతకు మంగళ సూత్రము గట్టిన
రంగూగరామానీకు మంగళ హారతులివిగో,

4. ముత్యాల తలంబ్రాలు, ముదముతో సీతకుబోసిన
సత్యస్వరూపులకు, చంద్రాలహారతులివిగో,

5. నాలుగోనాడు నాగవల్లికి యిపుడు, బలిగావిం
చినస్వామీ, మీకు పచ్చలహారతులివిగో,

6. మెచ్చిసీతానప్పగించి, సంతోషించినస్వామి
రంగుగా నీకు - నీలాలహారతు లివిగో,

7. జనకుల కుంతురని-పెండ్లియాడిన వరరామ
చంద్రానీకు, నక్షత్రాలహారతులివిగో ||రామ||

## సీ తా ప తి కి

ఆరభి - ఆది

ప|| పదపపాదపమరిససనిదా-సనిసరి-రిమాంగగరీ
పతికి మంగళ హార తి వ్వారే
రిమప దదపదరి-సాసనిదా-పామగరిమ
భామ లలర సాకేత పతికి

అ|| సదసరిరి-రీమగ-రిరిససస-సనిదా-సాసా
ప తికి సొంపు గాను జేయు సద్గుణా
దరిససనిదా-పామపదా-పామగరీ
తతికి మానా పతికి శ్రీ
రిమపద-సనిదాపా
సీతా పతికి

చ|| పాపాద పపస-మపగప-మపమగరిసరీ
కామాది రిపు సంహాతికి హారికీ
మపద పదాపా
ము ర హా రి కి
రిపమగరిరిసస-రిమపమా-సాసప
సమది నిగమ చరికి సూర్య
సోమాత్మునికి త్యాగరాజ ప్రేమా
వతారునికి కోసలపతికి ||మంగళం||

## భద్రగిరివరాయ భద్రమంగళం

శంకరాభరణం–మిశ్ర

ప॥ సారిసానీ–దపదనిని ని–సారిగామ–గారిసాసి–సారిసానీ

రామచంద్రాయజనక రాజజా మనోహరాయమా

దపదసీని – దపదనిసరి సాసా

మకాభీష్టదాయ మహితమంగళం॥

1. కౌసలేయాయ నంద, వాసదాసపోషణాయ, వాసవాది
   వినుత, సర్వదాయ మంగళం॥
2. చారుకుంకుమోపేత, చందనానుచర్చితాయ, హార
   కటకశోభితాయ, భూరిమంగళం॥
3. లలితరత్న కుండలాయ, తులసీవనమాలికాయ,
   జలజ సదృశదేహాయ, చారుమంగళం॥
4. దేవకీపుత్రాయ, దేవదేవోత్తమాయ, భావజా
   గురువరాయ, భవ్యమంగళం॥
5. పుండరీకాక్షాయ, పూర్ణచంద్రాననాయ, అండజాధి
   వాహనాయ, అతులమంగళం॥
6. విమలరూపాయ, వివిధవేదాంత వేద్యాయ,
   సుముఖచిత్త కామితాయ, శుభగమంగళం॥
7. రామదాస మృదులహృదయ, తామరసనివా
   సాయ, స్వామిభద్రగిరి వరాయ, భద్రమంగళం॥

## రంగా ! నీకిదెమంగళం

ఆనందభైరవి – మిశ్ర

ప॥ ససని సగగా–గగామాపా–మపమగారీ

రంగా – నీ – కిదే – మంగాళం

ససానిస-రిగరిరిససని
కస్తూరి - పరిమళ॥

చ॥ ససాపాపా-పనిపపమమగ-రిగమామా-మపమ
రంగా ఖగ త్తురంగా కలుష
మగగరి-గగామామా-గగామాపా-పాపనినిపా
విభంగా మోహా నాంగా
మసను గరిసని
పయ్యారి ॥

2. హరివిభధాహరి-ఉభయకావేరి - తీరవిహరి
వయ్యారి॥ ॥రం॥

3. లీలావేషాసునీలా-కరుణాలవాల-జగత్పరిపాల
వయ్యారి॥ ॥రం॥

4. హసావనచిద్విలాసా - శేషాచలవాసా - ర్పితపరమేశా
వయ్యారి॥ ॥రం॥

## వేంకటనాధునికి మంగళం

### రీతిగౌళ-మిశ్ర

ప॥ గమాపాపమ-గరీసాసని-పనీసాసా-సా
మంగళ మనీ పాదరమ్మా
సానని-సపాపాపా-పనిపద మమగ-గమా
మీరు పొంగి వేంకట నాధునీ
పమగమ-రిగగమామా
గన ౖ రమ్మా ॥

1. మగామానీ-నిసీనిదదమ-నిదాసాసాసా
మదనా మన్మథుడమ్మ విడూ
సాసాదసానీదా-మమామామా-గమా
వనీ యుదారణమె జగా మూలాయునీ
పామా గరీగామా
లీలే విడూ వుమ॥

2. సదయుడై బ్రోచె మనలను, వీడు కదనమునను
గెల్చె, ఘన రాక్షసులను॥ ॥మం॥

3. పదములు చిగురుల తీరు-వీనివదనము
విరించి వనజము గేరు॥ ॥మం॥

4. తరుణు లిరుగెడల యందు, తనరునిల్వ
గోరుపతిగేల, నడిమి మేఘమె, తనరు॥ ॥మం॥

5. నిరుపమంబగు శుభ్రపీటి, సామి సురుచిర
హేమాద్రీశ్వరునితో సాటి॥ ॥మం॥

## లక్ష్మీదేవి మంగళహారతి

ప:- సుదతులారతు లివ్వారే ఆండాళ్లకు
సుదతులారతులివ్వారే

1. మదకరీంద్ర సుయానకూ కొదమసింగ సుమధ్యకూ
రదనజితకుందేందు ముఖికిర క్తమా క్తిక హారగళకును ॥సు॥

2. క్రూరదైత్య విదారికి సూరిజనమందారికి
పారిజాత సుపుష్పధాతు నితంబనిర్వాత వేణీ భారకు ॥సు॥

3. తులసివనసంజాతకూ లలితలోకా మాతకూ
యిలనుగోదా దేవియాఖ్యను బిలువబడు ఆండాళ్లకు ॥సు॥

4. ఇందు ఖండపు మౌళి కచ్యుత సుందరాంగునిరాణికీ
మందరాచల మేరుధీరికి మహితశోభిత తనువు శేషికి ||సు||

5. పంచబాణుని తల్లికి మించుసమ తనువల్లికి క్రౌంచగర్బ్బలి
హారుని జనకునిగాంచిమించిన బ్రహ్మాజననికి ||సు||

## గౌరీ ప్రియునకు మంగళం

జింగ్లా-ఆది

ప|| రిరీమమూపా-మపసనిదా-పాపాపమపని
హా ర తి గై కొ ను మా గౌ రీ
దదద పమగరిస
ప్రి య హా||

1. సాససా సరిగా గరిగా-సానిదానిసా-సనిదాపాపా
నా ర ద ను త ని న్ కో రి భ జిం చె దా
రీమమా పామ పససనిదా-సాపాపమ పని
కో రి క లో స గు ము రా గౌ రీ
దదదప మగరిస
ప్రియ హారతి ||హా||

2. ఇందు శేఖరా నాడెందము-నందా-వందిత
ములు దీర్చరా-గౌరీప్రియా ||హా||

3. ధరననంతవర-పురమున వెలసిన-కరుణను
బ్రోవుమురా - గౌరీప్రియ ||హా||

## లింగా ! నీ కిదే మంగళం

(రంగా నీకిదే వరుస)

ఆనందభైరవి – మిశ్ర

ప॥ లింగా నీకిదే మంగళం ॥

చ॥ లింగా – వృషభతురంగా-దక్షవిభంగా,
కరుణాంతరంగ జయశివ ॥లింగా॥

2. దక్ష పాపవిమోక్ష – జ్ఞానపరోక్ష-భక్తసంరక్ష
ఫాలాక్ష జయశివ ॥లింగా॥

3. సోమ పవిధామ-సంగరభీమ-నిర్జితకామ
రామేశ జయశివ ॥లింగా॥

4 వృత్రాసురజయస్తోత్రా, భవ్యచరిత్ర-పరమ
పవిత్ర పురహర జయశివ ॥లింగా॥

5. నాగభూషణ – భోగినుతఫాల-భాగనిలయ
శ్రీ భోగి కంకణ జయశివ ॥లింగా॥

## ఏడుగురు అమ్మవార్ల మీద హారతి

1. అంగనామణి సారంగ లోచన మోము
శృంగారమైనట్టి సుదతి యెక్కడికే ?
గంగ పార్వతులకు ఘనుడైన నగమున
లింగమైన నీలకంఠు సన్నిధికే ॥మంగళం-మంగళం॥

2. చక్కని బేసరి ముక్కున ధరియించి
చొక్కంపు బంగారు చుక్కయెక్కడికే ?
చక్కని రుక్మిణి సఖియతో కలసిన
సదయుడైన సర్వసముని దగ్గరికే ॥మం॥ మం॥

3. అందమైన బాహు బందులు భుజమున
అమరి యుండిన యలివేణి యెక్కడికే ?
చందనమునందున చలువకూర్చినయా
కుందరదన పాదముల పూజసన్నిధికే? ॥మం॥ ॥మం॥

4. సన్నంపు చీరతోనున్న ముద్దులుగులుకు
చున్నయాయేనుగు గున్న యెక్కడికే?
కన్నులకాటుక కలకలమనెడి మోము
యెన్నంగలేని త్రిపురాంబసన్నిధికే ॥మం॥ మం॥

5. కువలయనేత్రి నీభుజములపై గొప్ప
రవికెకూ కుంకుమరేఖ యెక్కడికే ?
నవరాపురమున సదయుడై యున్నట్టి
కేవలముగ సాంబశివుని సన్నిధికే ॥మం॥ ॥మం॥

6. భాసురాంగి చిద్విలాసముతో నాగ
వాసునగర రాజహంస యెక్కడికే ?
వాసిగా కస్తూరి వంశ శేషాచల
దాసుని బ్రోచేటి ధన్యసన్నిధికే॥ ॥మం ॥మం

## ౪ గృహజీవన సారస్వతం

దీనిని కుటుంబ సాహిత్యము అనికూడా అంటారు. ఈ సాహిత్యంలో అత్తాకోడళ్ళ విషమసంబంధాలు, బావమరదళ్ల సరససంభాషణలు, వదినా మరదళ్ల వాత్సల్యసంబంధాలు, మరదీ వదినల పూజనీయ సంబంధాలు, ఆడపడుచుల అడకత్తెరసంబంధాలు అన్నీ చక్కగా వర్ణింపబడిఉంటాయి. యీసాహిత్యమునకు పునాది క్రొత్తకోడలే. ఆమె అత్తవారినుండి భర్తను విడదీయుటకు అనేక పన్నాగాలు పన్నుతుంది. భర్తను క్రమంగా పెద్ద కుటుంబంనుండి కత్తిరించి, పూర్తిగా తనస్వాధీనంలోనికి తెచ్చుకొని, తన ప్రత్యేక కుటుంబానికి అనగా తనకు, తనపుట్టింటివారికి, తనబిడ్డలకు అనువర్తించేటట్లు తగు పునాదులు వేసికొని, తనప్రత్యేకత స్థాపించుకోవడంలో సతమతమవుతుంది.

ఈవాఙ్మయంలో కోడలు తన అమ్మగారి తరపున గల సామాన్య విషయాలనుకూడా గొప్పగా చెప్పుకుంటూ, అత్తవారి తరపునగల మహత్తర విషయాల నన్నిటినీ అలతిగా యీసడించడం స్పష్టముగా కానవస్తూంటుంది. అయితే అది సరసంగా వ్యతిరేకింప బడుతూవుంటుంది. తానుమళ్ళా అత్తగారుగా మారేవరకు ఆమెవ్యక్తీకరించినభావాలు ఆమెకు సబబుగానే కనబడుతూ ఉంటాయి. తనకు కోడలు వచ్చేక తనభావాలు తనకే ప్రతికూలంగా తోచి గతానికి నవ్వూ, ఆగతానికి దుఃఖమూ, ఈ రెండు భావాలకు మధ్య ఆమె నలిగిపోవడం చూస్తూవుంటే మనకు చాలా జాలిగాను సరదాగానూ వుంటుంది. ఇది "కుటుంబజీవన నాటకము" వంటిది.

## ఇల్లాలు సోత్కర్ష

గృహయజమానురాలు బిడ్డగా; కోడలుగా; అత్తగా సంసార రంగంలో వేరువేరు వ్యక్తిత్వాలను నిరూపించుకుంటుంది. ఆరితేరిన అనుభవశాలిగా అన్నిరంగాలలోనూ మసలుకొంటుంది.

ఆమెకు, తనింటిలోవున్న కోడళ్ళూ, ఆడబడుచులూ, మనుమరాండ్రూ, ఎంతో అందాలవారుగా కనబడతారు వారి అందచందాలకు మురిసిపోతుంది. మురిపెంలో ముచ్చట భావంతోనే, చిలకలను, కోయిలలను, హంసలను, పావురాలను వర్ణిస్తూ వాటివాటి రూపాలను తోసిరాజని తనవారిని అగ్గించుకుంటుంది. ఈదిగువ జానపదగేయం చూడండి.

చిలుకల్లు చిలుకల్లు అందురేగాని;
చిలుకలకు రూపేమి ? పలుకులేగాని,
చిలుకల్లు మాయింటి చిన్నకోడళ్ళు.
కోయిల్లు కోయిల్లు అందురేగాని;
కోయిల్లకు రూపేమి ? ఘూమలేగాని ;
కోయిల్లు మాయింటి కొత్తకోడళ్ళు.
హంసల్లు హంసల్లు అందురేగాని;
హంసలకు రూపేమి ఆటలేగాని;
హంసల్లు మాయింటి ఆడబడుచుల్లు.
పార్వాలు పార్వాలు అందురేగాని;
పార్వాలకు రూపేమి? పాటలేగాని;
పార్వాలు మాయింటి బాలపాపల్లు.

## వదినా - మరదళ్లు

వదినా వదినా

వల్లంకి పిట్టా

గదిలో పెట్టా

గంజినీళ్లొయ్యా

నీకొడుకు పుట్టా

నాపేరు పెట్టా

మాఅన్నకొట్టా

నువుపారిపోవ

నే బతిమాల

నువ్వేడవ

నేనవ్వ.

చింతచెట్టుమీద చిగురు

వాలుగొమ్మమీద వగరు

అన్నయ్య బట్టలకు తొగరు

వదినకు వచ్చింది పొగరు.

---

వావి వరుసలు

"వావి" అంటే బంధుత్వం. "వరుసలు" అంటే బంధుత్వక్రమం "–వరుసకు తాతా: వావికి మగడా! కూతురు మీయత్త కూటికి రమ్మంది–అన్నట్లుగావుంది నీ వ్యవహారం–" అంటూ జానపదులుకథను చెప్పుకుంటారు.

" తే. గీ॥ వావి వరుసలు గణియింప వచ్చితేని
వనిత మాతోడ మాటాడ వశమెనీకు"

(ఉ. రా. 4 అ)

(1) తండ్రి తండ్రినీ, తల్లి దండ్రినీ తాతయే; తాత భార్య అవ్వ, తాత తండ్రి ముత్తాత, ఆయన భార్య ముత్తవ్వ.

వదినెకు వగదర
బిందెకు బిగదర
బంగరు కుచ్చుల మావదినే
గోడపొంట రెండునల్లులు పారితే
ఉలవలంటదీ మావదినే
బొక్కుతిననంటది మావదినే
నరాలపొంట తేళ్లు పారితే
సేవాలంటది మావదినే
తింటాననంటది మావదినే
దూలాలపొంట పాములు పారితే
కడియాలంటది మావదినే
పెట్టుకుంటనంటది మావదినే
అట్లుతిన్నా అన్నయ్య అలిగి పడుకుంటే
తిట్లుతిని వదినమ్మ తీపులందింది

---

మామ్మ=అవ్వ; తండ్రి తల్లినాయనమ్మ, తల్లి తల్లి అమ్మమ్మ వీరిద్దర్నీ అవ్వలే అంటారు.

(బావ-మరదలు) (వదినె-మరిది)

ఈ జంటవరుసలు రెండు విధాలుగావున్నాయి.

1. జానపదగేయం – భావింపనేర్చితే బావయేతండ్రి.
మన్నింపనేర్చితేమరిదియే కొడుకు.
వడ్డింపనేర్చితే వదినయేతల్లి.

తనమగని అన్నగారు–బావ. ఈ బావగార్ని మరదలు మన్నిస్తుంది "బావగారిమన్నన" అని ప్రజావాణిపలుకుతుంది. బావగారియెదుట కూర్చుండదు. దూరంగావుంటుంది. బావగారికొడుక్కితన యెంగిలి సహితం పెట్టకూడదు–అలాగే బావగారు. ఈ మరదలుపట్ల పుత్రికావాత్సల్యం చూపుతూ వుంటాడు. ఆమెతో ముఖాముఖిమాట్లాడడు. తనమగని తమ్ముడు. మరది. ఈ మరదిని వదినెగారు పుత్రవాత్సల్యంతో చూస్తుంది. అలాగే అన్నభార్య అయిన వదినెగారిని తల్లిగాభావించి ఈ మరిది మసలుకొంటాడు.

పొద్దోయిపొద్దోయి అన్నయ్యా వస్తే
జల్తారు చీరల్లు కట్టువదినమ్మ
చింతాకు చక్కన్న చీరచక్కన్న
సిరిదేవి మావదిన చీరచక్కన్న
వదినగారూ మీరువాసిగలవారు
వండబోయినచోట కుండనాకేరు.

## వదినెగార్లు

వరుసలగూడి పీటలుపెట్టి వదినెలు వార్లంతాను
బిరబిరా పరుగెత్తుకు వచ్చిరి పందిట్లోకి ॥వరుస॥
గుంపులు గుంపులు వదినెలు కుక్కపిల్లవలెవదినెలు
యెక్కిరి పీటలమీద యెలుగు గొడ్డవలెను ॥వరుస॥
పెద మా వియ్యపురాల బియ్యంబొక్కేచేమె
గయ్యాళి కుయ్యకువదినే గడుసువందురేనిన్ను ॥వరుస॥

---

2. అక్కగారి మగడు బావ, ఈతనితో పరిహాసమాడుతుంది. ఈ తడుడు యీమరదలితో పరిహాసమాడుతాడు. చెల్లెలిమగడు మరిది. ఈ మరిదిని వదినెగారు వేళాకోళంచేస్తుంది. ఈ వదినెగారితో మరది హాస్యాలాడుతాడు
3. బావ:- తోడబుట్టినదాని పెనిమిటి. తనకంటె పెద్దవాడైన మేనత్త మేనమామలకొడుకూ బావయే; భార్య తోడబుట్టినవాడూ బావయే. వీరలొకరినొకరు పరిహాసం చేసుకుంటారు.
4. మరది:-చెల్లెలి మగడు, భార్యతమ్ముడు, మేనత్త మేనమామలకొడుకు (తనకంటెచిన్నవాడు) మరది. వీరొకరినొకరు వేళాకోళం చేస్తూవుంటారు.
5. మరదలు:-భార్యచెల్లెలు, తనకంటె చిన్నదైన మేనత్త మేనమామల కూతురు. వీరొకరినొకరు పరిహాసంచేస్తూవుంటారు.
6. వదిన:-భార్యకు అక్క, తనకంటెపెద్దది అయిన మేనత్త మేనమామలకూతురు. మగని తోబుట్టువు.

ప్రేమతో బిలిచిన వియ్యపురాలవు పిలిచిన రావేమే
పిల్లికి పల్లంవేసి నల్లన పిలవానంపేము ॥వరుస॥
వెట్టికి బిలచిన వియ్యపురాలవు వేగిరమింటికిరావే
ఎలుకకు పల్లంవేసి ఎల్లన పిలవానంపేము ॥వరుస॥
గాడిదగాళ్ల వియ్యపురాలవు (*కుక్కనయింటికిరావే
గాడ్దెకు పల్లంవేసి గయ్యాన పిలవానంపేము ॥వరుస॥

## వదినె మరదండ్ర సరసం

కులదైవంబుల పూజలుచేసుక
కూర్మితో మేమిటురాగానే,
తలుపులు మూసుక తంటాలుచేసిన
తగువుయెంచరే ఓవదినే,

---

### మేత్తన - మేనమామ, మేనల్లుడు - మేనకోడలు

1. మేనత్త=తండ్రి తోబుట్టువు, ఈమెనుగడు "మేనత్త మగడుమామ" అంటారు. ఈ మెకు అన్నదమ్ముల కొడుకులు మేనల్లుళ్లు, కూతుళ్లు మేనకోడళ్లు అవుతారు.
2. మేనమామ=తల్లి తోబుట్టినవాడు, ఈతనిభార్య "మేనమామపెళ్లాం అత్త" అంటారు. ఈతనికి అక్కచెల్లెండ్ర కొడుకులు మేనల్లుళ్లు, కూతుళ్లు మేనకోడళ్లు అవుతారు—మేనరికమనగా, అన్నదమ్ములకూతుళ్లను స్త్రీ తన కొడుకునకు పెండ్లిచేసుకొనవచ్చును - ఎదురుమేనరికమనగా, అక్కచెల్లెండ్ర కూతుళ్లను, మగవాడు తనకొడుకులకు చేసుకోరానిది.

### సవతి - ఏరాలు

1. సవతి=సపత్ని, ఏరాలు.
2. ఏరాలు=ఎరవు+అలు=అలువుండగా మరొక అలు.

సీ. ఏరాలిపట్టి బిట్టెత్తిచెక్కిలి నొవ్వఁ
గఱచి వాఁడేడ్చినఁగాఁగిలించు (పాండు. 3 ఆ. 62ప)

ఇలలో నడిచేటి మరియాదకు నేయింటికి
యిల నడిపించితినా
తలిరు బోణిరో నీపతిపేరు జెప్పక తలుపు
దీసి నినురానివ్వనే
పుడమిలో నడచేటి మరియాదకు నీపురుషుని
నామము అడిగితినే
సుడియు తనంబున లంచ[illegible] తెచ్చినిజూజపు
మాటలు ఆడకనే
దొడవడిసేయక నాపతి[illegible] సు[illegible]నుగక
నన్నటు పో[illegible] నే
మడియ వదినరో వినవే విపుడ[illegible]గిన
లంచంబుంచెనే
నిండిన సభలో మొండిలీలామణిపుండరింపక
ననుపోని స్త్రీ
దండివదిన నీ మొండి కాలికి కండములయినా
పెట్టెదనే
మొండుగ సుంకరకన్నా వార్తలదండన
చెల్లిపోనివ్వనే
బాహుబలంబున తలుపులు మూసుకమాగక
మోహిని వలెవుండే
సాహసమానే మోహనాంగిరో మోహన
మాలికలిచ్చేనే
సాహసబుద్ధులు గలవారికిని మోహన
మాలికలబ్బునటే

సాహసమా నే మోహనాంగిరో మోహన
మాలిక నీకొఱకే
గుంపులుగూడుక వాకిటి ముందరరంతులు
సేయక యుండే నే
రంపివదినరో చింపిరి తలకూదంతపు
దువ్వెనలిచ్చే నే
దంతపుచవికెలు దొంగిలితడవగయింతు
లార మీరెరుగరటే
దంతపుదువ్వెన యెంత వేదన
పొంత చెల్లక పోనివ్వావే
గుంపులు గూడుక వాకిటిముందర రంతులు
సేయక యుంటేనూ
రంపివదినరో చింపిరితలకు సంపెగ
సరములు యిచ్చే నే
సంపెగ సరములు నీకరుదై తేనేగంపలాది
తెప్పించే నే
దంపతులిద్దరు పేర్లు చెప్పుకొనిసొంపుగ
నిళ్లకుపోగలరే
వండకేను యీవాకిటముందరకొమ్మ
నీవు రాకుంటేను
వడ్డివదినరో గ్రుడ్డికంటికి అడ్డుగలదని
పించేనే
అడ్డుగలదనుచునుగారడి విద్యల
సుద్దులు మానకవే

దుద్దుపెట్టి నేపోయెదనంటేపద్దువిడచి
పోనియ్యానే
గుంపులగూడుక వాకిటముందరరంతు
సేయక యుంటేను
కలికివదిన నీయెలుకలచెవులకుచిలకల
బావిలీలిచ్చేనే
వెలలేని సొమ్ముల కలికియుండగాచిలుకల
బావిలీలరుదటవే
కులుకులాడిరో వినుమరదల నీపలుకుల
కెవ్వతెభయపడునే
మిక్కిలిచిక్కులు పెట్టక వాకిట అక్కతో
ననుపోని స్తేను
ముక్కిటివదినరో ముక్కుకుముత్యపుముక్కెర
చేయించిచ్చేనే
ముక్కుకు ముక్కెరలేదని యెవ్వతెఅక్కరతో
నిన్నడిగినదే
తక్కిడి బిక్కిడిమాటలిక్కడచిక్కులిడక
తప్పినపోవే
గుంపులు గూడుకవాకిటముందరరంతులు
నేయక యుండినను
గేడివదిన నీ బాకినోటికివిడియం
తెప్పించిచ్చేనే
విడియముగలదానవునివనిబలుజాడన
వలికేవో భామా
వీడెంకలిగితె వేసుకోవె నావేడుక

చెల్లకపోనివ్వానే
వదినరో వినవే వాకిటముందరవదినేటు
నన్నూ పోనిస్తే
సరసియువదినరో సామిర్మైననూసరసము
లాడుచునుండూవే
వినవె మరదల విభునితనమిటు
వేడ్కల సల్పక పోనివ్వనే
వనితను తల్పటు తీస్తినిగదవే
తలిరు బోణిరోవెళ్ళగదే.

## ౨. అన్నా-చెల్లెలు

కట్లమీద రెండు జిట్లరేగుల్లు
అవిఅల్లుకొన్నాయి అల్లనేరేళ్లు
అల్లిబిల్లిచెల్లు అల్లనేరేళ్లు
అల్లనేరేడు క్రిందచల్లన్ని చెలమ
చల్లచెలమ కాడచల్దారగించి
చద్దిదిన్నాగుడ్డ జలములాగలిసె
జలముపచ్చనాయె గుడ్డ తెల్లనాయె
పచ్చన్ని చెట్లక్రింద పచ్చడాలు పరచి
అన్నచెల్లెలువారు నిద్రపోయూరు
తోడిమమాగిన పండు తొడమీదపడెను
అన్నయీపండు మనయింటెవరిబోలు
ఈ తీగెమనయింట ఎవ్వరినిబోలు
తీగెమీవదినమ్మ తీరులనుబోలు
ఈ ఆకుమనయింట యింకెవ్వరినిబోలు

ఆకుమీావదినమ్మ అడుగులనుబోలు
ఈ మొగ్గ మనయింట ఎవ్వరినిబోలు
మొగ్గమీావదినమ్మ పుస్తైను బోలు
ఈ పూవుమనయింట ఎవ్వరిని బోలు
పువ్వుమీావదినమ్మ కన్నులనుబోలు
ఈ పిందె మన యింట్లో ఎవ్వరినిబోలు
పిందెలు మనయింట్లో బిడ్డలనుబోలు.

## 3 ఆడపడుచు

కాకర కాయ అవ్వానమ్మ
యింటయ్యా యింగువ
సోదరులు సొంటయ్యా
మాామపన్నె మగ్గాన్ని
మాాగాణి మాామయ్యా
పట్టిందల్లా బంగారం
పుట్టినింటికి సింగారం
ఆడపడుచులే యేౘ్రాసి
తోడుపడుచులే దూౘ్రాసి
పెట్టి నింటికిపీసాణం
పుట్టి నింటికి పువ్వుల్లు
అమ్మాయి అంతేరంగాణి
తాడిమేటికి పారాణి.

## తనవారిగొప్ప

మందగట్టుల మీాద అన్నల్ను జూచి
మచ్చికలుచేసేరు మాామకూతుళ్లు
చేనుగట్టులమీాద అన్నల్ను జూచి
చిరునవ్వు నవ్వేరు అత్తకూతుళ్లు.

## 4 మేనత్త కొడుకు

మేనరికంగల పడుచులూ, యువకులూ సరసోక్తులతో సంభాషించు కుంటారు.

"నవ్వులనారాజు మేనత్తకొడుకు
నన్ను జూడవచ్చిన నరకానబడును.

### మేనమామ కూతురు

మేనమామ కూతురు మేళమ్ముగట్టె
మేళంబులాడుతూ మేడదిగనీదు.

### సంవాదం

వ్యవసాయం వృత్తిగా గలిగిన ఈ పల్లెటూరి యువతీ, యువకుల ప్రసంగం ముచ్చట గొల్పుతుంది.

నవ్వులనారాజు అత్తకొడుకొచ్చి
నువ్వులు నూర్చాలని నూరెడ్ల నడుగు
పాలుదాగిమాయెడ్ల ప్రత్తినూర్చవెళ్లె
నూరుపుట్లధాన్యమ్ము నూర్చేముగాని
ప్రత్తిచే నెన్నడూ నూర్చియే మెరుగ
నూరుపుట్ల ధాన్యమ్ము నూర్చేముగాని
నువ్వుచే కెన్నడూ నూర్చియే మెరుగ
అత్తకూతురువని అడిగితిగాని
అతిజాణవేయాట నిన్ను నే నెరుగ
మామ కొడుకువని మన్నించితిగాని
మాటకారివియాటనిన్ను నేనెరుగ.

దండాదగదగలాడి
కుచ్చూ నిగనిగలాడి
దండా నీకెవరేశారే
కొండమ్మ బుల్లీ
దండా నాకెవరేశారూ
మేనత్తాకొడుకమ్మ
ముద్దూల బావయ్య
దండానందియ్యవేశారూ
వారు చేసేదమ్ములాకు
మనమూడ్చే ఊష్పులాకు
బలేగమ్మత్తుగున్నాదిలే ”
అంతల్లపుంతల్ల మేనత్త కొడుకు
నన్నుజూడావచ్చి సరకానబడును
కదలడూ మెదలడూ కరుకోలలాగ
ఉలకిడూ పలకడూ ఉలవగింజల్లె
సొమ్మన్నవీధులకు సోదిఅడగెత్తె
బతకడని చెప్పేరు భాగ్యవంతుల్లు
అప్ప కయిదువతనము లేదుకాబోలు
అతనికి నావుసురు అంటుకాబోలు.

## 5. బావ

బావాబావా పన్నీరు
బావనుపట్టుకు తన్నేరు
మూలా మంచం వేశేరు
మూడూ గుద్దులు గుద్దేరు

నులకామంచం వేశేరు
నూరూ గుద్దులు గుద్దేరు.

బావగారు మీరు ప్రతిభగలవారు
నిండున్నసభలోన పిండి బొక్కేరు
చక్కిలాలబుట్ట చంకబెట్టుకొని
సభలోన మాబావ సంగీతపరుడు.

## 6 మరదలి మీది పాట

ఆహా మరదలా నీనోరాచి మాట్లాడవు
సాహసమేల పోవే శ్రీహరిభక్తవుగావే
దేహమొల్లని యతుల మోహింప నెవ్వరు
నాముని లోకముల గలరే ॥
ఈ మహిలోపల యిటువంటి చోద్యము
యెమ్మెలాడి గానము కొమ్మన మోహనా
కారుడు మాగుంటనుకొనిపోయి సమ్మతి
పెండ్లాడి సంతసమున నుండ్రి ॥
అడవిమూర్ఖులు మీవారన్నదమ్ములు
జడులు ఆవులగాసేవు పణతిరో
మీవారినడతెరుగనె పామూపడగసై
మీయన్నవడిగ చిందులుద్రొక్కె ॥

చేడెదేవరకొండ శ్రీ కృష్ణమూర్తికి
దోడబుట్టూలాను ఆడక వేమాని
అవనిలోపల మంచి వాడుకా
వేంకటావరదుని కృపగలిగి ॥

## 7 మరది-వదిన సంభాషణ

దండ్లోకి వెళ్లేటి నాచిన్ని మరిది
అసమల్ల కుసుమపువ్వు దండనా కంపు
నా దండలడిగేవు నారాచవదిన
నేనోమాటడుగుతాను నాకుబంపగలవా
దున్నన్న నాగలి వదిన చెక్కన్న మేడి
ఎద్దన్న యెదలోని జల్లన్న కొట్టి
కొయ్యన్న కొట్టిచేను దంచన్న పిండి
పొయ్యన్న నూనెవదిన వెయ్యన్న బెల్లం
చేట తడిగాకన్న చెయ్యంటకన్న
చేతి చలిమిడిచేసి నాకుబంపువదిన.

ఓ మరది సిగలోను వెండిమెరిసింది
ఓ మరది సిగలోను పమిడి మెరిసింది
మామరది సూరన్న కుంచెసిగలోను
బంగారు పువ్వుల్లగుత్తి మెరిసింది
గుత్తి వెయ్యాజేసు కుందనం వెయిజేసు
మామరదిసూరన్న మాట వెయిజేసు.

### మరిదికి మంచిమాట

ఏనాడు రానివారు మరదివచ్చారు
యింటిలో జొన్నలులేవు నేనేమి సేతు
సన్నబియ్యమెట్టి జొన్నలూ దెత్తు
జొన్నలూ ఒక జాము జారకు మేస్తాను
తడిపిడక పొడిపిడక దాయలూ వేసి

ఏడు చిల్లులకుండ నెసరెట్టినాను
మూడు చిల్లులకుండ మూతెట్టినాను
దాహము, వదినగారు దాహాలనిమ్మా
ఉడికేది జొన్నకూడు మొల్లల్లుతేలె
ఊరుచేరువవుంటె ఉండుము మరిది
వెళ్లితేవెళ్లండి వేగంబుగాను
దయయుంచునామీద దండములు మరిది.

## కోడలు

ఇల్లలికి ముగ్గుపెట్టి రింటిమగవారు
పేడకళ్లు దీయు పెదబావగారు
ఇంటిపనులుచేయు ఇంకోబావయ్యా
అంటులన్నియుదోము మా ఆడబడుచు
ఇంటిపనులునయ్యో విడిదిలేవమ్మా
పలుదోముపుల్లఏది? పంచటరుగేది?
చిట్టిముంతనీళ్లేవి? చిరుపానుపేది?
కుంకుమబరిణేది? అద్దమూఏది?
చూడరాఆడదాని సురటిమాటల్లు
చూడరా ఒకదెబ్బ చూడరాయికను
ఎక్కరా చింతచెట్టు విరవరాజూక
వెయ్యరాఆజూక వెన్నుపొడుగునను
ఆరునెలలబాల చంకబెట్టుకొని
పుట్టింటి కప్పుడు మరిదారిదీసె
అల్లంతదూరాన అన్నలుచూసి
ఏమమ్మచెల్లెలా యిట్లువచ్చేవు

కానకకాండ్రేగు పళ్లు నేగోర
నేరక నేరేడుపళ్లు నేగోర
కారుడ్డములుపలికె కాంతుడునూవారు
నేరాలుమోపేరు వారందరూను
కుదించికుదించి గోడుచెందంగ
ఓదార్చితమయింట నుండమన్నారు.

## 8. ఇకనైనలేవరాదా ఇంటాడదానా!

పగలమారి గోంగూర మిగలుడికింది
గిల్లి తాలింపుపెడితే గిన్నెలోకిరాదు
వండితాలింపుపెడికే ఒక్కరికిరాదు
మాఅత్తమామగార్లు ఊరేగినాక
వడ్లుదంచనొకమరిది వండనొకమరిది
పేడకళ్లాపిచల్ల పెదబావగారు
ఇల్లలికి ముగ్గుపెట్ట యింటిమగవారు
ఇకనైనాలేపరాదా యింటాడదానా
పలుగారాపుల్లయేది పంచటరుగేది
జారిచెంబులోనీళ్లేవి ఛాయపసుపేది
పళ్లెములోఅన్నమేది కట్లపీటేది
పండామంచమేది దూదిపరుపేది
ఏమిరాఆడదాన్ని యీవింతసేమిని.

## 9. తాతోయి తాత

తాత్తోపీత్తో ముంజికాయమూత్తో
ఉల్లికోసుడూత్తో తాత్తోయితాత ॥

తాతో మాయింటికి రారో య్మాటుంది
నువ్వు కూసుంటె కురిసీల పీటుంది
నువ్వు నుంచుంటె నిమ్మచెట్టు నీడుంది
నువ్వు తొంగుంటె పట్టిమంచం పరుపుంది
నీకాకలైతే సన్నబియ్యంకూడుంది
అందులోకి వొంకాయకూరుంది
నువ్వు చస్తేను వల్లకాటి దిబ్బుంది ॥

## తాత పెండ్లి

ఊచకఱ్ఱో చేత - ఉగ్గమో చేత
ఊగుతావచ్చిన తాతెవ్వరమ్మా!
మానికానిండాను మాడలేసుకొని
మనుమరాలానిన్ను మనువడగవస్తి.
వాడినపూవుల్లు వాసనలుగలవా?
ఓ తాత, ఈమనువు వొద్దయ్యనాకు.
ముసలోడుమాతాత పసినిమ్మపండు
ముసల్దాన్ని పెళ్లాడి మూలకూర్చుండు
పడుచుదాన్ని పెళ్లాడి పైకాపులుండు.
తాతగారింటిలో తూతూలపెళ్లి
బూరిముక్కడిగితే బుగ్గపొడిచేరు
గారిముక్కడిగితే కసరికొట్టేరు
అరిసిముక్కడిగితే అదిమితన్నేరు.
తాతల్లు గట్టిన్న ధర్మసాత్రిల్లు
అవ్వల్లు అలికిన అరుగుల్లమీద
ముత్తవ్వ పెట్టిన ముగ్గుల్లమీద
కుదిమట్టుగామనము కూరుచుందాము.

## 10 అవ్వను పలకరించడం

ఇవ్వాళచచ్చేవు రేపుచచ్చేవు
ఏమోం లే ముసలమ్మ పిడక లేరేవు ॥

### మనుమని పాట

జల్లిసవరము తెల్లనాయె జనపనార తెల్లనాయె
నాకు యింక శృంగార మేమిరా, ఓరిమనుమడా ॥ఓరి॥
ఓరీముసలంటివి నన్ను ముసలంటివి, ఔరా
ముసలంటివి మనుమడ ముసలంటివి ॥ఓరి॥
అద్దము చెక్కిళ్లంటివె ముసలవ్వా
నీ మొగమేలవాడె చెప్పవేముసలవ్వ
జగమునసూర్యుడు మాసెపావనచంద్రుండుమాసె
నా మొగముశృంగార మేమిరా ॥ఓరి॥
దానిమ్మగింజలంటివే ముసలవ్వా
నీపళ్లేలవూడెచెప్పవే ముసలవ్వ
ఆకాశానాచుక్కపొడిచె, అర్జునూడి గంటమోగె
నాపళ్లశృంగార మేమిరా ॥ఓ॥
కిన్నెరకాయలంటివే ముసలవ్వా నీవాళ్లేల
జారెచెప్పవే ముసలవ్వ
పడమటను ప్రొద్దుపొడిచె తూరుపున
తెల్లవారె నావంటశృంగార మేమిరా ॥ఓ॥
నల్లని చెరుకువంటిదే ముసలవ్వా నీ నడుమేల
వంగెచెప్పవే ముసలవ్వ

హనుమంతూని తోకవంగె అర్జునూడివిల్లు
వంగె; నానడుము శృంగారమేమిరా ॥ఓరి॥
అరటిస్తంభాలవంటివే ముసలవ్వ నీతొడలేల
చిక్కచెప్పవే ముసలవ్వ
శీతాకాలము నాలుగునెల్లు వానాకాలము
నాలుగునెల్లు, కుంపాటిసెగనూ చిక్కేరా ॥ఓరి॥

## 11. అత్త - అల్లుడు

అల్లుడురావడంచూచి కుమార్తెతో చెప్పే తల్లి చమత్కార వచనాలు.

ఆటకూటమ్మలో ఆడేటినెమలీ
వేటగాడొచ్చాడు, ఆటచాలించు
బంగారుమేడలో నవ్వేవుతల్లి
నాఅల్లుడొచ్చాడు నవ్వుచాలించు॥
అల్లుడల్లుడంటె వళ్లుమండేను
అల్లుడత్తకుతెచ్చె అద్దాలరవికె
విప్పితొడిగితేను నిప్పల్లురాలు
మల్లితొడిగితేను మల్లెల్లురాలు ॥
చేటుకాలమొచ్చి చెట్టెండిపోయె
అల్లుడికిజ్వరమొస్తే అత్తెండిపోయె
అత్తపోసినగంజి సత్తువలేదు
అల్లూడుసిరిపురపు గట్టెక్కలేడు ॥

### అల్లుని కోరిక

అందలముకోరింది కుందనపుకుచ్చు
అతిభోగికోరాడు అత్తావారిల్లు
పల్లకీకోరింది పచ్చన్నికుచ్చు
పరదేశికోరాడు పంచటరుగుల్లు.

## 12 కాపురం

కాపురంమంచిదీ కూటికేలేవు
పెనిమిటిమంచివాడు మాటలేలేవు
కుదుళ్లుచక్కనా కుండలేలేవు
కొడుకుదుండగీడు కోడలుగయ్యాళీ
కూతురుచిత్రాంగి కూడెట్టదమ్మా॥

## 13. అత్త - కోడలు

అత్తాకోడళ్ల మైత్రి పులిమేక మైత్రిలాంటిది. వీరిద్దరికి సంబంధించి జానపదులుఅనేక గేయాలుపాడుకోనడమేగాక, సంభాషణ సందర్భాలలో సామెతలుకూడా పాడుతూవుంటారు. చూడండి మచ్చుకి :—

1. అత్తలమంచీ వేములతీపూ వుండదు.
2. అత్తలేనికోడ లుత్తమురాలు, కోడలులేనిఅత్త గుణవంతురాలు.
3. అత్తచచ్చినదని కోడలేడ్చినట్లు.
4. అత్తచచ్చిన ఆరునెలలకు, కోడలికిదుఃఖం వచ్చిందంట.
5. అత్తచేజారినది అడుగోటికుండ, కోడలుచేజారినది క్రొత్తకుండ.
6. అత్తచేసినపనులకు ఆరళ్లులేవు.
7. అత్తాఒకింటి కోడలే.

తే॥ వేణికాభరమునసీకు వెదురుటాకు
కలికికోడలయెబ్బంగి గల్గెజెపుమ ॥

అంటూ అత్తగారడిగితే,

చెప్పి చెప్పించుకొనుటెంత గొప్పతనమొ?
అత్త నీవీపువెలిమిడి యంటనేమి?

అని కోడలు ఎదురుప్రశ్న వేసిందట.

అత్తగారన్నదీ తా పెద్దమనిషీ
కోడలికి దుడ్డెట్టి తాగడ్డితినెను
గడ్డితిన్నా అత్త గడ్డపాలాయె
దుడ్డుతిన్న కోడలు దున్నల్లెవుండె ॥
అత్తచస్తె కోడ లేమనీయేడ్చు
అడవితంగెడుపూచు ఆరళ్లుబాసు
మామచస్తె కోడలేమనీయేడ్చు
పోయికాడ చీద్రంబుపోయెననియేడ్చు ॥

## అత్తగారి ఆరళ్లు

కోడలా! కోడలా! కొలికి ముత్యమ్మా!
గంగరేగుపండు బంగారుబొమ్మ!
దివ్వెట్టినాకొక్క పేనునొక్కమ్మా
కూటికుండమీద గుర్తులేవమ్మా
పచ్చిపాలమీద మీగడేదమ్మా
వేడిపాలమీద వెన్నలేవమ్మా
ఇరుగుపొరుగులార! ఓఅమ్మలారా!
ఎన్నడు మాయత్త చోద్యాలువిన్నారా!
ఈయాడజన్మంబు! మెత్తిన్నబదులు
అడవిలోఅలచందమా నవ్వరాదా!
కూటికుండమీద గుర్తులేవనునూ
పచ్చిపాలమీద మీగడేదనునూ
వేడిపాలమీద వెన్నలేవనునూ॥

## 14 అత్తింటికి పోవడం అసమ్మతి

అమ్మనేనుచిన్నదాన్ని అల్లుడొస్తేఅంపబోకు
ఢిల్లీకోటసల్లగుంటె దినానికి టంకంతెస్తా;
సద్దిగట్టగుడ్డలేదు సాగనంపపొద్దులేదు
ఇరుగుపొరుగు అక్కల్లారా! ఒక్కటేతుమ్ము అచ్ఛీ-
మాయత్త మాయత్తగారు
నన్నుదోలుక పోవచ్చినారు
ఊళ్లోనున్న ఓకుమ్మరన్నా!
పచ్చికుండలు ఎదురుగా తెమ్మా
ఊరుతిరిగే ఓజంగుపిల్లీ!
దోవకడ్డం నువ్వన్నరావే
గూడెంలోనున్న ఓచాకలన్నా!
పచ్చిబట్టలు ఎదురుంగా తేరా
వాడనున్న ఓ యక్కలారా
ఒక్కతుమ్మునన్న తుమ్మంగరారే.

## 15 పుట్టింటి మమత

తెలంగాణాప్రాంతం పదాలూ సంప్రదాయ విజ్ఞానం ఈ గేయంలోవున్నాయి.

రచ్చలుమేలేటి రాజేంద్రభోగి
రావయ్యమాయమ్మ వేరుబోతుంది
ఆడేటిబొంగరము ఆటసాలించి
తిరిగేటిబొంగరము తీసిపారేసి
తెల్లన్నిగుడ్లకు తెచ్చుకోపమ్మ
ఎర్రన్నిగుడ్లకు మెత్తుకోపమ్మ

కాటుకకండ్లాకు నీళ్లొచ్చినాయి
కల్కిమీఁకోడలను యెవ్వరేమనిరి!
పొరుగిల్లుపోకన్న జగడమొద్దన్న
రోటికాడిచిట్టునకతొక్కవద్దన్న
సందెకాడదీపంబు పెట్టేటివేళ
సప్పుడుకాకుండ బెట్టిరమ్మన్న
మాఁపుకాడదీపంబు మలిపేటప్పుడు
మళ్లిచూడకుండ మలిపిరమ్మన్న
చేటెడుబియ్యంబు చిరిపోటువేసి
సాటివారలతో సరిదూఁగమన్న
చేరేడుచేరేడు సకినాలుచేసి
సఖియరోపుట్టింట సారెతెమ్మన్న
పులిపాలబడ్డావె పుట్టిల్లుమరువు
నాపాలబడ్డావె నాయిల్లునెరువు
పుట్టినాటినుండి పువ్వల్లేసాకి
పున్నడానేనెట్లు పుట్టిల్లుమరతు
కన్ననాటినుండి గారానసాకి
కాముడానేనెట్లు కన్నోరిమరుతు
ఏరుపారినపోదు ఏటిమీఁదిసుక
తలుచుకున్నాపోదు తల్లిపైమరులు ॥

## కోదండ రామునిపాట

### పుట్టింటి భ్రాంతి

కొండకొండలరాము కోదండరాము
నల్లగొండలపైని నన్నిచ్చినారు

నన్నిచ్చినకన్నోరు ననుచూడరారు
బూరుగులుపూచాయి భూమికొరిగాయి
మావుళ్లుపూచాయి మన్నుకొరిగాయి
తంగుళ్లుపూచాయి ధరణికొరిగాయి
తోవలెరగా మానినారుకన్నోరు
వానలుకురిసాయి వంతరలు తేరి
గాలులేసినాయి చెట్లువిరిగాయి
గట్లున్నుపుట్లున్ను యేకపదునాయి
భూములెరుగమాని రారుకన్నోరు
చిన్నన్నయిచ్చాడు చిన్నావుపడ్డ
నడిపన్నయిచ్చాడు నానుపట్టెడా
నానైనలరిగింది రారుకన్నోరు
పెద్దన్నయిచ్చాడు పెద్దావుపడ్డ
పడ్డైనపెరిగింది రారుకన్నోరు
ఘానల్లకొండలకు నన్నిచ్చినారు
నన్నిచ్చినకన్నోరు ననుజూడరారు ॥

## కాకిశకునం

కాకమ్మనీకాల కట్టేనుగజ్జె
రత్నాలమావార్ని రాగుయ్యోకాకి
కాకమ్మకూతలు కల్లలూగావు

---

కాకిశకునం

జానపదులు అనేకరకాల శకునాలు చూచుకుంటారు. అందుముఖ్యంగా కాకిశకునం వివరంగా చూచుకుంటారు. కాకి కూస్తూవుంటే చుట్టాలొస్తారని యెదురు చూస్తూవుంటారు "శిఖినరసింహ శతకం" అనేపేరుతో ఒకశకున శాస్త్రం పద్యములుగా ప్రాచీనకవి రచించాడు.

కన్నవారొచ్చేటి వేళలూగావు
కాకమ్మో! కాకమ్మా
చుట్టాలొచ్చారు చూచిపో

---

కం॥ ఒక్కటి తీర్చిననిర్భయ
మక్కటశుభఫలము రెండు నటతీర్పంగన్
నిక్కముగ మూఁడుదీర్చినఁ
జిక్కు నొక రాజ్యలక్ష్మి శిఖినరసింహా,

కం॥ తిరిచికట్టిన మరణము
తీరకమున్ గట్టెనేని దీనతఁగను వి
స్తారముకట్టినఁ, దీర్చినఁ
శ్రీరమణా! కార్యసిద్ధి శిఖినరసింహా.

కం॥ వెనుకను ముందై తీర్చిన
పనిలక్ష్మికరమునగుదు భాసిల్లును గ
ట్టినఁ గత్తి మీఁదిసాముగు
చినయోబళగిరివిహార శిఖినరసింహా.

1. తీర్చుట :- తీరుచుయొక్క రూపాంతరము. దీర్పుచేయుట, లేకచక్కబర చుట అనిఅర్థము. కాకిసవ్యంగా తిరుగుటను తీర్చుటఅని చెప్తారు.

2. కట్టుట :- బంధించుట, ధరించుట, ఆరోపించుట, నిర్మించుట, మొదలైన వాటికర్థమగును. కాకిఅపసవ్యంగా తిరుగుట కట్టుట అంటారు.

## కాకులశాస్త్రం

ప్రయాణసందర్భంలో బయలుదేరునప్పుడు, కాకికుడివైపునుండి ఎడమవైపు నకు వెళ్ళితే కార్యంజయమవుతుంది. ప్రవేశసందర్భంలో ఊరియందుగాని, ఇంటి యందుగాని ప్రవేశించేటప్పుడు కాకిఎడమవైపునుండి కుడివైపునకువెళ్ళితే శుభం కల్గుతుంది.

ప్రయాణకాలముననూ, ప్రవేశకాలముననూతప్ప, తక్కిన కాలములందు మార్గమధ్యమందు కాకులశకునం పాటించనక్కరలేదు.

కుడినుండి ఎడమకు వెళ్లే కాకిఒకటియే అయితేమేలు. రెండయినచో శుభ ప్రదము. మూడయినచో భూలాభం.

పక్కాలోచ్చారు పారిపో
నీకాళ్లకు గజ్జెలుకడతా
కాలుతీసి ఖంగునగంతెయ్యి ॥

## నీళ్లబిందె

( ప్రతిపాదం చివరనూ "రామరామాచిలుక" అనాలి. )

రాచవారి చిన్నకోడలు - రామరామాచిలుక
రత్నమే, మాణిక్యమే ,,
రాగిబిందె పట్టుకొని ,,

---

కాకిముందుగా కుడివైపునుంచి యెడమవైపునకువెళ్లి వెంటనేమరలి, ఎడమవైపునుండి కుడివైపునకువస్తే, మృత్యుతుల్యమగు ఆపద సంభవించుననియూ, ఎడమవైపునుండియే కుడివైపునకు వెళ్లితే ధైన్యముకల్గుననియూ చెప్పుచున్నారు –

రెండువైపులకు కాకులు ఊరకతిరుగుచుండినచో కార్యసిద్ధికల్గుతుంది. కుడినుండి ముందునకు కాకులువస్తే కార్యసానుకూలము. ఎడమనుండి కుడికివెళ్లేటప్పుడు వెనుకనుండి ముందునకు వెళ్లుటవలన కార్యహాని కల్గుతుంది. దూరంనుండి కాకులు ఎగురుచూ. కుడినుండిఎడమవైపునకు వెళ్లేనేని ఆలస్యంగా అనుకొన్న కార్యం సిద్ధిస్తుంది. దగ్గరనుండి ఎగురుచు ఎదురైకుడివైపునుండి ఎడమవైపునకు వెళ్లేనేని మేలనియూ మొత్తమున కాకులు ముందునుండి ఎదురై తనవెనుకకువెళ్లుట కార్యహాని అనియూ పండితులంటున్నారు –

ఆహారంగాని కట్టెపుల్లగాని, కాకినోటకరచుకొని తనకుడిమండి ఎడమవైపునకువెళ్లితే లాభమునూ, ఎక్కువసంఖ్యలో కాకులు కుడినుండి ఎడమదిక్కునకు వెళ్లుటయూ, ఒక్క కాకి వాటికెదురుగా ఎడమదిక్కునుండి కుడిదిక్కునకు వెళ్లుటయూ, తనకెదురుగా సంభవించుటయూ, తానుదానింజూచుటయూ మిక్కిలీ శుభప్రదములని చెప్పుదురు –

జోడు కాకులు రెండుమూడు పర్యాయములు తనకుడివైపునుంచి ఎడమవైపునకు వెళ్లేనేని తానుఅనుకొన్న కార్యము నెరవేరుట మహాకష్టము –

కాకుల మైథునం చూస్తే, ఆపదతటస్థించునట. తనతలను కాకి తన్నితే కార్యం చెడిపోతుంది. అశుభమూ, బాధాకరమూ అగునని చెప్పుచున్నారు –

కాకులు గూళ్లువిస్తారంగా కట్టుకొనుట క్షేమసూచకమని దైవజ్ఞులంటున్నారు. –

నీళ్లకేపోయెనమ్మా రామరామాచిలుక
ముంతమావి చెట్టుక్రింద ,,
బావిలోన ముంచెబిందె ,,
బుడబుడ ముంచెబిందె ,,
మోకాలు పట్టెనమ్మా ,,
భూమిదేవిని తలచినాది ,,
భుజాన కెత్తిబిందె ,,
తల్లిదండ్రుల తలచుకొంది ,,
శిరస్సుకే యెత్తెబిందె ,,
యింటికైనా పోయినాది ,,
దింపినాది బిందెతాను ,,

## * 17. పుట్టింటిప్రయాణం

కలవారికూతురు గారాబుపట్టి
కలువలువడబోసి కడుగుచున్నాది
వాడలకాముడూ వీధిలోరాగా
నాడుమల్లెచెండు వనితపైవిసరే
ఏమితెలియనికన్నె యెత్తిముడువగను
అత్తగారనియేటి ఆపెద్దరాలు
ఆకులుతెప్పించి లేఖవ్రాయించి
పుట్టింటికొకకమ్మ అంపించెనమ్మ
బంధువులకొకకమ్మ పంపించెనమ్మ
ఏడుగురుఅన్నల్లు పైరులూనాట

* పుట్టింటి ప్రయాణంపదాలు, అత్తగారి అధికారం ప్రాంతాలవారిగా మార్పులతో చాలావున్నాయి. 6 పదాలు నా సేకరణ.

ముద్దు చెల్లెలిమాట విని సాగిరప్పుడు
ఏడుగురుఅన్నల్లు ఏనుగులమీద
వచ్చి రేవేళమంచి పట్నమ్ముదాటి
నగరివాకిటకొచ్చి నయముగానిల్చి
పయిడిచెంబుల నీళ్లుపాదములకిచ్చె
స్తంభాలమరుగుకు పోయికన్నీరు
తుడుచుకొకన్నీరు ముడుచుకోకురులు
ఎత్తుకోపాపని ఏనుగులమీది
అత్తరో ఓయత్త పోయివచ్చేను
నాయన్నలొచ్చారు నన్నంపవలెను
మామరో ఓమామ పోయివచ్చేను
నాయన్నలొచ్చారు నన్నంపవలెను
బావరో! ఓబావ! పోయివచ్చేను
నాయన్నలొచ్చారు నన్నంపవలెను
అడ్డగంధంపెట్టి ఒడ్డనిలుచున్న
ఆయన్న తమ్ముడా! పోయివచ్చేను
తోటలోదవనమూ తోడికోడంట్లా
మాయన్నలొచ్చారు నన్నంపవలెను
వ్రేలిఉంగ్రంపెట్టి వీధిలోనిలుచున్న
వివరముగలమొగవాడ! పోయివచ్చేను
అమ్మరోఓయమ్మ మాపార్వతమ్మ
నీముద్దుకోడల్ని ఏమంటివమ్మ
పసుపారుపసుపిచ్చి పసుపాడుమంటి
వీధిలోతలవిప్పి దువ్వవద్దంటి
చిన్నగడపలోకాలు వుంచవద్దంటి

అయినను నామాట పాటించకపుడు
చిన్నగడపనె వుంచెకాలుతానింతి
వాడాలకాముడు చెండువిసరగను
ఒయ్యారమొలకంగ యెత్తితాముడిచె
పచ్చిపొగడీపువ్వు బంగారుబొమ్మ
భాగ్యముకలిగిన లక్ష్మినేనంప
వీధిలో నేనిల్చి చెండువిసరగను
ముద్దరాలునాభార్య యెత్తిముడిచేను
అమ్మరోఓయమ్మ నాముద్దుతల్లి
యిందులోతప్పేమి వివరించవమ్మ
అబలనూదానట్లు నిందశాయగనూ
మనసెట్లుఒప్పెనే తల్లిరోనీకు
వచ్చినోరిచెల్లె విందుశాయగనూ
పోయిరేసంతసమున ఎలమంచిదాటి ॥

(ప్రతిపాదంచివరను చందమామ, అంటూపాడాలి)

ఓయినాయిల్లాల! ఓవన్నెరాలా! – ఓచందమామ
ఏకులొడికినపాప
ఎఱ్ఱన్నిపాప ,,
అంచెగామాయన్న లొస్తనున్నారా
వారెందుకొస్తారు రాజులల్లుళ్లు ,,
నమ్మకుంటేమాట
నదురెక్కిచూడు ,,
గోడపైనిచ్చెనలు
మేడలకువేసి ,,

మేడెక్కి చూశాను
మేలమ్మగన్న ఓచందమామ
ముందరా పెద్దన్న
ముత్యాలగొడుగు ,,
ఎనకాలచిన్నన్న
ఎండిపురిగొడుగు ,,
మద్దినపిన్నన్న
మైనపురిగొడుగు ,,
మేడదిగివచ్చాను
మేలమ్మగన్న ,,
అరుగుమీద వెండిముంత
అటఅందుకోని ,,
వీబూదిరేకేసి
వివళంగాతోమి ,,
చెంబుతో ఉదకాలు
చేబూనుకోని ,,
పాదాలుకడిగింది
పైజల్లుకొంది ,,
కుచ్చులా చెంగుతో
గుత్తులా త్తింది ,,
పయ్యెద చెంగుతో
పాదాలొత్తేను ,,
దూలాలునాయిల్లు
దూరిరారన్న ,,

వాసాలునాయిల్లు<br>
వంగిరారన్న ఓ చందమామ<br>
దూలాలుతగిలితే<br>
దుఃఖమొస్తాది ,,<br>
నాసాలుతగిలితే<br>
వస్తాదియేడ్పు ,,<br>
అనిపిలుచుకొచ్చింది<br>
కూకొబెట్టింది ,,<br>
కంచానకూడెట్టి ,,<br>
అందునావెన్నెట్టి ,,<br>
స్తంభానజేరబడి ,,<br>
కంటినీరొంచింది ,,<br>
అందరికిపెద్దన్న ,,<br>
మరిజూచినాడో ,,<br>
తుడుచుకోకన్నీరు ,,<br>
ముడుచుకోకురులు ,,<br>
ఏమమ్మచెల్లెలా ,,<br>
ఏడ్చుచునున్నావు ,,<br>
పెద్దన్నపెట్టేడు ,,<br>
పెయ్యైనపెరిగింది ,,<br>
చిన్నన్నపెట్టేడు<br>
చీరైనచిరిగింది ,,<br>
నడిపన్నపెట్టేడు<br>
నానులరిగాయి ,,<br>
అట్లయితేమీవారి<br>
నడిగిరావమ్మ ,,

వరుసవరుసనబోయి
వరునిదగ్గఱికెళ్లి ఓ చందమామ
పూలతోటలోవున్న
పున్నెపురుషూడా ,,
మాయన్నలొచ్చారు
మమ్మంపుతారా ,,
ఏమేమిపనులుండి
వెళ్లెదవునీవు ,,
తనుపుగల పుట్టింట
తమ్ముడికిపెళ్లి ,,
ఆశగలపుట్టింట
అప్పలకుపురుడు ,,
అట్లైతె నీవెళ్లి
తొందరగ రమ్మా ,,
ఆమాటవినగానె
మేలమ్మమనసు ,,
పాలుపొంగినరీతి
ఉప్పొంగినాది ,,
మాటమల్లెసర్ది
మగనికీచెప్పి ,,
అత్తమామలకైన
అందముగజెప్పి ,,
అన్నదమ్ములతోను
బయలుదేరింది. ,,

చిలుకమ్మ వచ్చెను
సీతమ్మ కడకు
చిలుకరో ఓ చిలుక
శ్రీరామ చిలుక
మాఅన్న వచ్చేను
మాకెఱుక చెప్పి
నీకెఱుక చెపితేను
నాకేమికద్దు
నీపోవుత్రోవ - దానిమ్మ వేయింతు
పాల్ద్రావి పండుకో - పనస వేయింతు
అక్కరో ఓ అక్క
అక్క సీతక్క
పచ్చడము కప్పుకొని
పల్లకీ యెక్కి
అంపమని వచ్చెనే
అన్న పెద్దన్న
కాళ్ళకు నీళ్ళిచ్చి - కన్నీరునింపె
ఎందుకు కన్నీరు - ఏమికష్టంబు
తుడుచుకో చెల్లెలా - ముడుచుకో కురులు
ఎత్తుకో బిడ్డను - ఎక్కు అందలము
పెట్టుకో సొమ్ములు - కట్టుకో చీరె
చేరి మీఅత్తకు - చెప్పిరావమ్మ
కుర్చీపీట మీద
కూర్చున్న అత్త
మాఅన్న వచ్చెను
మమ్మంపుతారా?

నేనెఱుగనే నెఱుగ
నీమామ నడుగు
పట్టె మంచము మీద
పడుకొన్న మామ
మాఅన్న వచ్చెను
మమ్మంపుతారా?
నే నెఱుగనే నెఱుగ
నీ బావనడుగు
భారతము చదివేటి
బావ పెదబావ
మాఅన్న వచ్చెను
మమ్మంపుతారా?
నే నెఱుగ నే నెఱుగ
నీఅక్క నడుగు
ఓ వంట చేసేటి
ఓఅక్కగారూ
మాఅన్న లొచ్చారు
మమ్మంపుతారా?
నే నెఱుగ నే నెఱుగ
నీభర్త నడుగు
రచ్చలో మెలిగేటి
రాజేంద్రభోగీ
మాఅన్న లొచ్చారు
మమ్మంపుతారా?

పెట్టుకో సొమ్ములు
కట్టుకో చీరె
పోయిరా సుఖముగా
పుట్టి నింటికిని
ఇరుగక్క పొరుగక్క
ఇదె, పోయివత్తు
చెల్లిళ్ళ పెళ్ళిళ్ళు
సేవించబోయి
మఱదుల పెళ్ళికి
మఱలి వచ్చెదను.

## తుమ్మెదపదం

(మార్గమధ్యంలో - మనోభావం)

ఏవూరు ఏపల్లె? తుమ్మెదా?
ఎక్కడికి వెల్తావు? తుమ్మెదా?
గులకల్ల పాడూ గుమ్మడీ
గోదారి ప్రక్కనే గుమ్మడీ॥
గులకల్లపాడూ తుమ్మెదా
అత్తోరువూరూ ,,
పుట్టిల్లు లేక ,,
పుట్టిల్లు మాదా గుమ్మడీ
గులకల్ల పాడే ,,
పాడిపంట ఉందా తుమ్మెదా
సంతానం ఎందరే ,,

పాడిపంటల్లేవు గుమ్మడీ
సంతానము లేదు ,,

అత్తగారూ ఉందా తుమ్మెదా
ఆడుబిడ్డలున్నారా ,,

అత్తగారు పోరు గుమ్మడీ
ఆడుబిడ్డలపోరు ,,
పడలేక నేనూ ,,
మావూరు పోతున్నా ,,

పెద్దవోరు లేరా తుమ్మెదా
కొంతబుద్ది సెప్పడానికి ,,

బుద్ది సెప్పేవోళ్ళకి గుమ్మడీ
అసలు బుర్రే లేదు ,,

అత్త లేని యిల్లు తుమ్మెదా
ఆరళ్ళు ఉండదు ,,
హాయిగా ఉంటాను ,,

## 18. అత్తాకోడళ్లు

అత్తాకోడళ్ల మైత్రి పులీమేకా మైత్రిలాంటిది. అత్తగారు కోడల్ని చూచి

"కోడలా! కోడలా! కొడుకుపెళ్లామా!
కొడుకువూళ్లో లేకు మల్లె లెక్కడివి!"

అత్తగారిప్రశ్నకు జవాబీయకుండా కోడలు లోలోన కుము లుతూ,

"అరటిపూసింది, అరటి కాచింది
అత్తపెట్టినఆరళ్లు మరపునకురావు
ఆరళ్లఅత్తయిన సవతిపోరైన
తల్లిల్లుదూరమైన భరియించలేము"

(అనుకుంటూ వేరేకాపురంకోరకు ప్రయత్నాలుచేస్తుంది.)

అత్తలేని కోడలు వుత్తమురాలు
కోడలులేని అత్త గుణవంతురాలు
అత్తింటి కోడలువుత్తమురాలు
చేటలోచెయ్యెట్టి చేనిద్రపోవు
అంతలోవచ్చింది ఆరళ్లఅత్తా
ఏతల్లిగన్నదే ఏబ్రాసినిన్ను
వులికిపడి కోడలూ వుగ్రానలేచి
రచ్చలోకూర్చున్న రాజేంద్రభోగీ
మీాయమ్మయేరుండు లేచిరావయ్యా
అమ్మరోమాయమ్మ మముగన్నతల్లి
నీవుతెచ్చినకోడల్ని ఏమిటన్నావు
పొద్దున్నపొరుగిళ్ల కెళ్లవద్దంటి
మూడిళ్లముంజూరు దుయ్యవద్దంటి
నడుస్తూతలకురులు విప్పవద్దంటి
పొద్దోయిచాకింటికెళ్లవద్దంటి
అత్తింటికోడలూ అలిగిపడుకుంటే
అలుకల్లుతీర్చేది ములకల్లకఱ్ఱ.

## 19. పెనిమిటికి కొండెములు చెప్పుట

చాయపసుపులాగ నను దెచ్చినావు
సరసుడా! మీతల్లి సాధింపుచూడు
ముద్దపసుపులాగ నను దెచ్చినావు
ముద్దుడా! నీతల్లి మూతిరుపుచూడు.

### వేరేపోదాము

సందమామకన్న సక్కాని మొగుడా
వేరేపోదామా వేరేపోదామా  సం॥
అత్తమామలపోరు నేనుపడలేను
ఆడబిడ్డలపోరు అసలెపడలేను  సం॥
ఉంగరాలచేయి ఊగెరా మొగుడా
కందిరీగనడుము కదిలెరా మొగుడా  సం॥
కొండంతకొప్పేమొ కదిలేర మొగుడా
కొప్పుపై జాజులు వాడెరా మొగుడా.  సం॥

### వేరేకాపురం

అత్తింటికోడలు అత్తగారిఆరళ్లుపడలేక మొగుణ్ణి తన చెప్పు చేతల్లోకి మప్పుకొని, వేరేపడదామంటూ ఏవేవో ఆడి ఆసలుపెడు తుంది చూడండి -

పల్లవి:- వేరేవుంటేమేలురా నాథా కూడివుంటేపోరురా!

అ॥ప॥ వేరెవుంటేలక్కరాజు గంగయదాసు గోరిపోషించేటి శౌరీశుడే దిక్కు॥వే॥

1. పాలుమాలకనీవు। పాలుపంచుకుంటే
కూలినాలిజేసినిన్ను। కూర్చోబెట్టి
సోలబియ్యములోను। సారగొట్టియొకగిద్ద
విడుపుబత్తెమక్రింద। వెనకేతునొకరోజు ॥వే॥

2. గిద్దపెసరాపప్పు। గిన్నెతోడనువండి
వద్దువద్దననీకు। వడ్డించి నే తినగ
ముద్దజేసికొంత। మూలదాచిపెట్టి
ప్రొద్దునచద్దితో। పొలముకే పంపింతు ॥వే॥

3. మాటలేటికిక్రొత్త। రాటము మనకొస్తే
పూటకునేనేడు। పుంజాలు నూలొడికి
నీటయినతలగుడ్డ। నీకు నేయించంగ
కోటబొమ్మంచునా। కోక కేమిగిలింతు ॥వే॥

4. పదిరూకలకునీవు। పాడిగేదెనుకొంటే
ముదరకాచిన పాలు। ముందునీకుబోసి
ఉదయాన పెరుగయిన। వుంచినీకొడ్డించి
కడమపెరుగుతో నెలకు। కడవనెయ్యిజేతు ॥వే॥

5. కట్టడిగనాపెగ్గె। కడచూడు ముమ్మూర్నరు
చిట్టుతవుడునీళ్లు। చిక్కంగ నే కలిపి
తొట్టికుడితిదాపి। తొలికోడికుయ్యంగ
తట్టిగడ్డిమేపి। తవ్వెడూపితికేను ॥వే॥

6. అత్తమామలవలె। అతివేగ నాయింట
పెత్తనము గట్టుకొని। పేదోళ్ళుజూడంగ
ముత్తుమామిడివడ్లు। ముందుసాలుకుపండు
కొత్తవడ్లాదాక। కోరి నేగడిపేను ॥వే॥

7. మిఱ్ఱుపల్లములేని। మెట్టదాపుననున్న
మఱ్ఱిచెట్టుచేను। మనపాలు కౌ స్తేను
ఒఱ్ఱెమాటలుగావు। ఒక యేటికీ సంత
బఱ్ఱెపాలుమీఁద। పయిఖర్చుగడిపేను ॥వే॥

8. గట్టిగా వేరుంబె। కడ రేగటిచేనులో
మట్టినెడదోలించి। మనపొప్పదున్నించి
కట్టించినేగొర్రు। కనిపెట్టిపెనవేసి
పుష్టైనవడ్లయితే। భుజబందులుచేయింతు ॥వే॥

9. వేకువజామునలేచి। యేకులయిననువడికి
కాకులుకుయ్యంగ। గడపచిమ్మియలికి
నీకునిచ్చులబావి। నీరుఅన్నమువండి
ఆకుకంచములోను అదిమదిమి నేనెడుదు ॥వే॥

10. కోడికుయ్యగలేచి। తోడినావడ్లన్ని
తోడికోడ్లాలైన। తోడులేకనుదంచి
కూడొండివంకాయ। కూరతో తినిపింతు
మూడుచెక్కలుతినను। మనకేమిగతి మగడ ॥వే॥

11. కలతచెందకనీవు। కష్టమనకను రేపు
నలుగురిని వనగూర్చి! న్యాయమెంచామని
పొలమునందుయిల్లు। ప్రొద్దుననే పంచితే
మొలత్రాడుచేయింతు। మొదటినెలలోనీకు ।వే॥

12. ఏవలచూచినను యెవగుపొలముపోరు
బావపెత్తనదారు। బైటతిరిగివచ్చు
నీవలనకాపురము। నెరవేరుచున్నది
నావలన లాభంబు। నన్నడుగుచెప్పేను ॥వే॥

13. మొక్కజొన్న నీవు। మొదటనే వెయ్యంగ
అక్కరకురాగానే। అతివేగ నేపోయి
నక్కలకుచూపింతు। నా ప్రజ్ఞ యొకకాకి
వాలకుండగజేతు। వన్నెమాటలుకావు ॥వే॥

14. కలవారుమావారు। కరువైన మనకేమి
కలదు మాపుట్టింట। కాపురముచేవచ్చు
పొలముమాయన్నలు। పోసియ్యమనినిన్ను
ఇలమీదయాగంటి। యీశ్వరునిదయవల్ల ॥వే॥

15. కొండవీటిసీమ। కోరికలుదీరంగ
దండిమైగుంటూరు దరితూర్పుకరెవరం
అందుకాపురముండు। గంగయదాసు
ఖండితముగమనము। కడనుంటొకవిగట్టు. ॥వే॥

## 20 ఎర్రిబాగుల నామగడ!

ర్యాలీరాఘులపాడు - రేలంగిసంతలోన
బొచ్చుపరిగె తెచ్చినానె - ముక్కెయ్యవేపిల్లముక్కెయ్యవే॥
ఓరోరినామగడ-ఒయ్యారి నామగడ
ఎర్రిబాగులమగడ — ఏబ్రాసి నామగడ।
రెక్కలున్న సేపకీ - ముక్కులుంటాయా
నరసాపురంపాలకొల్లు - మూరుటేరుసంతలోన
కోడిపెట్ట తెచ్చినాను - గుడ్డెయ్యవే పిల్ల గుడ్డెయ్యవే।
ఓలోరినామగడ - ఒయ్యారి నామగడ
ఎర్రిబాగులమగడ - ఏబ్రాసి నామగడ।
జుట్టున్నకోడికీ - గుడ్డుంటదా!

భీమారం ఆకీడు ఈరాసరం-సంతలోన
గేదెపెయ్య తెచ్చినా నే-పాలేయే పిల్లపెరుగేదే
ఓరోరినామగడ-ఒయ్యారినామగడ
ఎర్రిబాగులమగడ-ఏ్రబాసినామగడ
కొమ్మున్న గేదెకూ-పెరుగుంటదా పాలుంటయా.

## మందుతింటానని మగనితో చెప్పుట

మందుదింటున్నానురో - ఓరోరిమగడా
మందుదింటున్నానురో - నేనుమందుతింటున్నానురా! ॥మం॥
మందుదింటున్నానుమగడ - ముందుగనీకెరుగజేసి
సందుజేసుకవస్తివేమో - సాగదురనీబాస ॥మం॥
అరగదంచినపాతబియ్యం - అర్ధసేరువండుకొని
అరిసిముక్కో-గారిముక్కో - అంచుననె యద్దుకొని ॥మం॥
అర్ధసేరుఆవునెయ్యి - పావుసేరుపంచదార
సీరుకలవనిఆవుపెరుగు - నిమ్మకాయపూరగాయ ॥మం॥
పత్తెమనిపరమాన్నమొండితె-పండుగుమ్మడిపులుసుచేసితె
హెచ్చుగావంకాయ తియ్యని పచ్చిమామిడిఆవపచ్చడి ॥మం॥
కమ్మగావేయించినట్టిది - కందిపప్పువండుకోని
జిహ్వాకురుచిపుట్టునని - చింతపండుపులుసువేసి ॥మం॥
పండిపండనిజామిపండ్లు - పండినదానిమ్మపండ్లు
ఎండిఎండనిద్రాక్షరసము - ఖండశర్కరవుండజేసుక ॥మం॥
కొర్రకూడువండినాను - కోడిచారుగాచినాను
కాకరోగముచేత నేను - బాధపడుతున్నానుమగడ. 

## 21. భార్యాభర్తలు

పు:- ఏరాల్ని తెస్తాను - యింటిలో పెడతాను । ఏ
రాలిమాట లినాలే - సుందరిపిల్ల । ఏ
రాలిమాట లినాలి - నాయుడోలమ్మ ॥

స్త్రీ:- ఏకులోడు తాను - ఏకొండిపెడతాను । ఏ
రాలిపోరుపడలేను - సుందరమగడ । ఏ
రాలిపోరుపడలేను - సోకుదారిమగడ ॥

పు:- వండిపెట్టలేవా - వడ్డించలేవా । కో
నేటినీలు తెలేవా - సుందరిపిల్ల । నా
మాటలైనాయినాలే - నాయుడోలమ్మ ॥

స్త్రీ:- కూకుంటెలెగలేను - కూడొండిపెట్టలేను । కో
నేటినీళ్లు కెళ్లలేను - సుందరమగడ । కాని
మాటలాడాబోకు - సోకుదారిమగడ ॥

పు:- బంగారపుబొమ్మ - బెంగుళూరుగుంట । దాని
నడుమువాగబంధములే - సుందరిపిల్ల । దాని
నడకహంసనడకలే - నాయుడోలమ్మ ॥

స్త్రీ:- దానిమాయలోనుపడబోకు - నాయుడుబావ । దాని
సోకులోనుదిగబోకు - సుందరమగడ । దాని
మాటలైన యినబోకు - సోకుదారిమగడ ॥

పు:- వడ్డాణ మిదిగోనె - వయ్యారిభామా । నీ
నడుముకైన పెట్టుకోవె - సుందరిపిల్ల । నీ
నడుముచక్కగుంటాదె - నాయుడోలమ్మ ॥

స్త్రీ:- ఎప్పుడెట్టుకోవాలో - అప్పుడెట్టుకోవాలి । అది
పండుగవున్నానికి - సోకుదారిమగడ । అది
అప్పుడెట్టికోవాలి - నాయుడుబావ ॥

## 22. సంసారపు పాట

కోరినసొమ్ములు చేయిస్తానే కోపముచేయకె ప్రాణసఖి
ఊరికెయింట్లోనున్నాననికం ఢ్లురిమిచూడకే యిందుముఖి
రాజీవోపమనేత్రీవినుమా రాజనిపొగడరెభూజనులు నా
పూజాఫలమో అనుకొనినన్ను భూషింతురుగా సమ్మతులు
ఇంటికికాపు బంట్రోతీరీ అవుతుందే ముందవుతుందే
అంతకంతకెచ్చేస్తారే అవుతుందేముందవుతుందే
తరుణీతాళీల్దారుపనికినే తగనే తగనే చెప్పగదే
దొరలందరితో పేపగలంచము తగులందిస్తుగదా ॥
పలకసర్లపట్టెడి కొనుమనినే పలుమారడిగినను
పల్కువు నేసొట్లుండగ పట్టెడిమెడగట్టేవు
నానారంగులచీరలు కొనమని నేనడిగి తెసివూ
తిడితివూరకె బంట్రోతుమిటారి మెడుగుచీరగంటే ॥
వెలదిరో యీవియ్యాలవారిది మెరుకులకులమమ్మా
వీరిదియేనాదికులమమ్మా మెరిగిమెరుగక
ఎరిగీ ఎరుగక వీరితోమేము వియ్యామొందితిమి
గాండీవంబును గలిగినవారు ఘనుఢూమాతండ్రి
గజ్జెలగుర్రము నెక్కిమరికదలీవత్తుమూవెలదీ ॥

కాలభైరవుని అవతారముతామనీ జెండాబుచ్చుకు
యూరునూరుతిరిగే వారితో వియ్యామొందితిమి
తట్టాబుట్టాలల్లుదువమ్మ మాయింటిపెదవాదిన
వెలదిరోయీచిన్నవాదిన వెలకూర్చెనమ్మ వదిన॥

---

# ౨౫. వ్రతోత్సవ వాఙ్మయం

ఈ శీర్షికలో సంప్రదాయకమైన విజ్ఞానాన్ని అనుశ్రుతంగా పాడిస్తూ వుండే ప్రాచీనాచారాలుంటాయి. 1. వ్రతములు, 2. నోములు, 3. పండుగలు, ఇందులో వస్తాయి. ఇవి జాతియొక్క సంస్కృతిని, నాగరికతను, ఆచారాలను, సభ్యతను తెలియజేస్తూ వుంటాయి.

స్త్రీలు నోచే నోములలో స్త్రీజన విజ్ఞాన మెంతో యిమిడి వుంటుంది. వ్రతాలలో భక్తి, నీతి, నియమాలు ఉంటవి. పండుగలలో దేశీయత, జాతీయతలకు సంబంధించిన విజ్ఞానాలు వెల్లివిరుస్తూ వుంటాయి.

సంవత్సరంలో ఒక్కసారియైనా దేవుని గురించి, కాలమును గూర్చి, మానవజాతిని గురించి, సభ్యతను గురించి, తలచుకొనుటకు ఏర్పాటు చేసినవే యీపండుగలు. ఈమూడున్ను ప్రకృతినిబట్టి వచ్చే జీవన సాహిత్యం ప్రకాశిస్తూ వుంటాయి. పండుగలలో వుత్సవాలు చేస్తూ వుంటారు. భగవంతునియొక్క ఆనందమయ స్వరూప వికాసాలు మానవ జీవితములపై ప్రసరింపజేయునవే ఉత్సవములు. అందుచేతనే యీ [illegible]కకు వ్రతోత్సవ వాఙ్మయం అని పేరు పెట్టవలసి వచ్చింది. దీని నంతను కలిపి సంప్రదాయకవిజ్ఞానసాగరంలో సెలయేరుగా భావించాలి.

వీనినే ప్రాచీనాచారాలంటారు. జాతియొక్క ఆచారాలు తరతరాలుగా మార్పుకుంటూ నేటివరకు నిలిచిన విజ్ఞానాన్నే "సంప్రదాయక విజ్ఞానం అంటారు, దీనిలో ఆజాతియొక్క విజ్ఞానము – శాస్త్రాలు, అనుభవాలు, చారిత్రక విషయాలు, సామెతలు, జాతీయతలు, ఉక్తులు,

పై యుక్తులు. ఆటలు, పాటలు, కళలు, కాలక్షేపాలు, వేడుకలు, వినోదాలు వెల్లు రూపాలుగా విరాజిల్లుతూ వుంటాయి.

జాతి సంస్కృతి:- మనదేశానికి నాగభూమి యని పేరువుంది. మనవారు సర్పములను పూజ చేయుటచేత నాగులనబడుతున్నారు. అందు చేతనే నాగరాజు, నాగేశ్వరరావు, నాగమ్మ మొదలగు మనుజులపేర్లు; నాగులేరు, నాగులపాడు మొదలగు గ్రామములపేర్లు; నాగజోడు, నాగరము మొదలగు వస్తువుల పేర్లు; నాగులకోక, నాగులపంచె మొదలగు వస్త్రాలపేర్లు వున్నాయి. అందుకే మనవారు నాగపూజ అనుశ్రుతంగా చేస్తూ వున్నారు.

## 1. పూజలు

1. నాగులచవితి, 2. నాగపూజ:- కార్తిక శుద్ధచవితి విష్ణుమూర్తి నిద్రనుండి లేచుఉత్థానైకాదశికి సమీపమందుంటుటచే పవిత్రమైనదని అంటారు. ఈ చవితినుండి జ్యోతిర్మండలమునందు అనంతశయనాకృతి గోచరిస్తుందని పెద్దలంటున్నారు. కార్తికశుద్ధ చవితి నాగులచవితియని మరునాడు నాగపంచమియని మనప్రాంతమందు వాడుకలోవుంది.

చవితినాడు స్త్రీలుపాములపుట్టలో పాలుపోస్తారు. నాగమయ్య ప్రతిమనుచేసి చలిమిడి, వడపప్పు, పానకము, పాలు, కోడిగ్రుడ్లు ఆరగింపుచేస్తారు. దీపంమాత్రంపెట్టరు. నాగమయ్యకు వేడివస్తువులు పనికిరావు. ఈ ప్రసాదం స్త్రీలకు కడుపుచలవని, ఇంటినిండాపిల్లలుకలిగి క్షేమంగావుంటారని, మనప్రాచీనులనమ్మకము. పుట్టలోపాలుపోస్తూ యీపాటపాడుతారు.

నాగేంద్రుడా! నాగేంద్రుడా
మావాళ్లుచీకటి వాకిటతిరుగుతారు
నడుముత్రొక్కితే నావాళ్లనుకో
పడగత్రొక్కితే పారిపోతండ్రీ ॥
నాగులచవితికి నాగన్న
స్నానసంధ్యలు నాగన్న
పువ్వులుపడగలు నాగన్న
మడిబట్టలతో నాగన్న
చిమ్మిలిచలిమిడి నాగన్న
పాలూపండ్లూ నాగన్న
దివిటీతేజున నాగన్న

ఉపవసించుచు నాగన్న
ఉద్యాపించుచు నాగన్న
ఊరేగొస్తాం నాగన్న
పుట్టకువస్తాం నాగన్న
పూజలుగొనరా నాగన్న ॥

మరునాడు నాగపంచమి. ఆనాడుస్త్రీలు శుచులై నాగప్రతిమను పుట్టదగ్గఱపెట్టిపూజిస్తారు. అప్పుడీక్రిందిపాట పాడుతారు.

మాఅత్తకొలిచిన నాగేంద్రుడా!
ఆవిడత్తకొలిచిన నాగేంద్రుడా!
మాపూజలందుకో నాగేంద్రుడా!
సిరిసంపదలియ్యవా శ్రీనాగన్నా!.

## నాగదేవునిపాట

1. నాగస్వరం పాడితే – నాగులకునిద్ర
పుట్టలో నుంటేను – భామలకునిద్ర
అమవాసపున్నాల – మసగలేసుద్ది
పాటిమీదాకొస్తే – కక్షుకట్టేను
బూకరించుచు పడగ – బుస్సుకొట్టేను
గుడిలోననాగులు – కొల్చిన దేవుడు

2. పిల్లలందరుగూడి – పుల్లలేరాబోతె
పుల్లల్లోఉండేటి – ఓపుల్లనాగ
ఇల్లలికిముగ్గెట్టి – మల్లెలువిరజల్లి
మల్లెల్లొఉండేటి – ఓమల్లినాగ
గొల్లభామలుగూడి – చల్లల్లుచేయంగ
చల్లకుండక్రింద – చల్లనాగయ్య

3. యివతలయిదికొండ - అవతలఅదికొండ
నట్టనడుమకొండ - నల్లతాచయ్యా
ఉసిరికచెట్టుకింద - పసిరికపాము
కూసమూడ్చినాపాము - పడగబున్నంది
పాముననా్న చూచి - పడగనెత్తింది
పడగలెత్తకునాగు - పగవారమూకాము

4. పడగెత్తిసూసింది - నాలుకలురెండూ
నాలుకలుదూయకే - నీవారమూనాగు
మంచినాగూలైతే - పంచెలెట్టేము
కోడెనాగూవైతే - కోకలెట్టేము
పడగలెత్తకునాగు - పగవారమూకాము
మాచేనుపండితే - చలిమిడేసేము

5. మానువ్వులుపండితే - చిమ్మిలేసేము
నాలుకలుదుయ్యకే - నీవారమూనాగు
మాపత్తిపగిలితే - పంచెలెట్టేము
మాయావులీనితే - పాలుపోసేము
పడగలెత్తకుపాము - పగవారమూకాము
నీపూజచేసెదము - నీకుమ్రొక్కెదము.

నాగాదిగురా - నాతంఢ్రిదిగురా ॥
నాగన్నదిగురా - నాగాదిగురా
దిగుదిగునాగన్న - దివ్యసుందరనాగ
నల్లచుక్కలనాగ - నాముద్దునాగా ॥నా॥

నవనవలాడేటి - నల్లచుక్కలనాగ
తళతళలాడేటి - తెల్లచుక్కలనాగ
పసిమిపోరలుగల - పచ్చన్నినాగా ॥నా॥
కొండచిలువలకెల్ల - కోర్కెతోరాజువై
పరుగుడుపాములకు - ప్రభువువై రాజిల్లి
మొగలిచెట్లపైని - మొగిసితిరుగులాడి
పాలు ఆరగించు - పచ్చన్నినాగా ॥నా॥
పక్కనుపదిహేను - మచ్చల్లుగలవాడ
గురువిందపూసల - కళ్లయినకలవాడ
పరికిముళ్లవంటి - పళ్లుగలవాడా. ॥నా॥

పుట్టలోనాగన్న బూచినాగన్న
ఎండలోపడుకొన్న ఎర్రినాగన్న
కలవోరికోడళ్లు గర్వవంతూలు
కళ్లాపిజల్లేరు కాళ్లచిమ్మేరు
ఎంగిళ్లుజల్లేరు భంగపుచ్చేరు
అటుబోకునాగన్న చాకిరేవులకు
చాకిరేవులలోను చేరిపడుకుంటె
సాలెపురుగూవని చంపేరునాగూ
అటుబోకునాగన్న చెఱకుతోటలకు
చెఱకుతోటలలోన చేరిపడుకుంటె
నల్లచెఱుకూవని నరికేరునాగూ.

## 2. వృక్షపూజ

మనవారు తులసిచెట్టును, వేప, జమ్మి, రావి, మారేడు వృక్షములనూ, కందదుంపనూ పూజిస్తూవున్నారు. ఆర్యులు రావిచెట్టునూ,

జమ్మిచెట్టునూ పవిత్రంగాయెంచారు. మనవారు వేపచెట్టును పవిత్రంగా భావించారు. అందుచేత ఆర్యద్రావిడ అచారాలు కలబోసికొని రావిచెట్టునూ, వేపచెట్టునూ ఒకే కుదురులో పెంచి పెళ్లిళ్లు చేస్తారు. పూజిస్తారు. ఇదే ఆర్యానాగసమ్మేళనం.

రావిచెట్టుకు ప్రదక్షిణంచేస్తూ పూజిస్తేసంతానప్రాప్తి వుందనినమ్మకం.

## పూజావృక్షజాతులు

1. తులసి :- దీనిలో 1. తెల్లతులసి లేక లక్ష్మీతులసి. 2. కృష్ణతులసి 3. రామతులసి 4. అడవితులసి 5. రక్తతులసి 6. కుక్కతులసి 7. భూతులసి అను రకాలున్నాయి. తులసిరసం విషాన్ని హరిస్తుంది. త్రిదోషాలను తగ్గించి శుభం కూరుస్తుంది. దీనిమీదనుంచి వచ్చే గాలి దీర్ఘాయుః ప్రదమంటారు.

2. వేము:- పంచనింబ లంటూ అయిదింటినీ, సప్తనింబలంటూ ఏడింటినీ చెప్పుచున్నారు. 1. చేదువేప 2. కరివేప 3. పినవేప 4. తురక వేప-ఇదిపారసీక దేశంనుంచి తేబడినది, అందుచేదీనికి పారసీవేపంటారు. 5. తియ్య 6. నల్ల 7. నేలవేము. దీనిలో 5, 6 రకాలను తప్పిస్తే పంచనింబ లవుతాయి. వేపచెట్టు నూరుసంవత్సరాలు గడిచినదైతే, దానిమ్రాను సహజంగా పగిలి లోపలినుంచి రసం వస్తుంది. దానిని వేపకల్లు అంటారు. అది పైత్యజబ్బులకు మహౌషధమంటారు. ఇటువంటిచెట్టుమొదట తొర్రచేసి అప్పుడే వండిచల్లార్చిన అన్నమును ఆ తొర్రలోపెట్టి ఆ చెక్కతోనే మూత వేసి, గాలిచొరకుండా పైన ఆవుపేడ పూసి ఒకసంవత్సరంవుంచి, మరుసటియేడు దానినితీస్తే అన్నంఎర్రబడి వుంటుందట. దానినిఎండించి, చూర్ణంచేసి, పూటకు పావు

తులంచొప్పున 40 రోజులుతింటే పదునెన్మిదికుష్ఠవ్యాధులూ పటా పంచలై పోతాయట - పోతుతాటిపాతబెల్లం ముక్కలుచేసి, అటు వంటివేపతొర్రలో నాల్గురోజులుంచితే, అదిమైనంలాగ అవుతుందట. దానినిపూటకు కుంకుడుకాయ ప్రమాణం చొప్పునతింటే కుష్ఠ వ్యాధులు పోతాయట. దీనినీడను కూర్చున్ననూ దీనిగాలిసోకిననూ అంటువ్యాధులు రావట.

3. జమ్మి:- ఈశమీవృక్షములలో 1. జమ్మి 2. తెల్లజమ్మి అను రెండు రకా లున్నాయి.

పూర్వం పాండవులు అజ్ఞాతవాసానికి విరటుకొల్వులో చేరు టకై వెళ్లేముందు తమ ఆయుధాలను జమ్మిచెట్టుమీద దాచారు. దానిజ్ఞాపకార్థం దసరాపండుగలలో కడపటిదినమగు విజయదశమినాడు ఈచెట్టుదగ్గరకువెళ్లిదానిని పూజించి, ఆకులుధరిస్తారు.

చెట్టుదగ్గరకు వెళ్లినప్పుడు

॥శ్లో॥ శమీశమయతేపాపమ్। శమీశత్రువినాశనీ
అర్జునస్యధనుర్ధారీ। రామస్యప్రియదర్శినీ ॥

అనుశ్లోకం పఠించుచూ, జమ్మికొమ్మలను త్రుంచి ధరించడం ఆచా రంగావుంది.

4. రావి:- దీనిని అశ్వత్థము, శ్రీవృక్షము అని పిలుస్తారు. ఇందు 1. తెల్లరావి 2. నల్లరావి 3. గంగరావి అను జాతులున్నాయి.

రావిమొదట నారాయణదేవుని ప్రతిష్ఠించి, అశ్వత్థనారా యణునిపేరిటపూజిస్తారు. రావి - వేపమొక్కలకు ఒకచోటపెండ్లిచేసి "వీథిదంపతులు"గా పూజిస్తారు.

ఈ చెట్టుక్రింద కూర్చుంటే బుద్ధి వికసిస్తుందని పండితులంటు న్నారు.

5. కంద:- దీనిని అర్శోఘ్నము అంటారు. ఆయుర్వేద వైద్యశా స్త్రంలో "పంచకందలు" సిద్ధౌషధములు. 1. తైలకంద 2. క్రోడకంద 3.సుధాకంద 4.రుదంతికంద 5.సర్పాక్షికంద అని వాకొనబడింది-కాని ఊరకందలో పాటి, సీటి అను రెండుజాతులున్నాయి-2. అడవి 3.చాలి 4. ధరిగీ 5. తెల్ల 6. మహా 7. నల్ల 8. వారాహీ 9. పుల్ల 10. గంధనాకులి అంటూ పదిరకాల కందలున్నాయంటున్నారు.

6. మారేడు:- దీనిలో 1. బిల్వము=మారేడు, 2. లక్ష్మీఫల=నల్ల మారేడు అను రెండు జాతులున్నాయి. ఇది శైవులకు ప్రీతికరమైనది; మహాశివరాత్రినాడు ఈవృక్షానికి పూజచేస్తారు. శైవులుదీనిని సదా పూజావృక్షంగానే భావిస్తారు.

## పరమౌషధములు

## వేపచెట్టు

వేము దివ్యౌషధి. దీని కషాయము దీర్ఘవ్యాధులకు అసాధ్యరోగ ములకు అనుపానక్రమముతో వాడితే నివారణ కలుగుతుంది. క్రిమిసం హారమున కిది పెట్టిందిపేరు. వేపగాలి చల్లగను, ఆరోగ్యప్రదముగను ఉంటుంది. ఈచెట్టుకు గ్రామదేవతల పూజావిధానంలో స్థానంవుంది. గ్రామదేవతల ఉత్సవపుటూరేగింపులలో దీనిఆకులుకూడా ఊరేగవల సిందే. పందిళ్ళు వేపతోరణాలు లేకుండా ఉండవు. అందుచేత యీ వృక్షం పూజాస్థానం ఆక్రమించుకుంది. సంవత్సరాదిపండుగనాడు వేపపువ్వుపచ్చడి తినుటవలన కష్టాలుతొలగి సుఖాలు చేకూరతా యని భావిస్తారు. ఉగాదిపచ్చడి త్రిదోషహరం.

## రావిచెట్టు

వేప లక్ష్మీయంశమైతే, రావి మహావిష్ణువుఅంశముగా మహాత్ములు నిర్ణయించారు. దీనియొక్క పవిత్రత వర్ణనాతీతమైనది. దీని కషాయము వ్యాధినివారకమేగాక, కాయసిద్ధి కలిగిస్తుంది. (రావి చెట్టునందు మొలచిన జమ్మిచెట్టుకొమ్మలతో అరణులను తయారుచేసి అగ్నిని పుట్టిస్తారు. ఆయగ్నినే యాగములం దుపయోగిస్తారు. ఇదే హోమాగ్ని.)

## కందపూజ

శ్రావణబహుళఅమావాస్యనాడు ముత్తైదువులు కందచెట్టును పూజిస్తారు. దానినే పోలేరమ్మఅమావాస్య అనికూడా అంటారు. చెట్టుమొలచినకందదుంపకు పసుపురాసి, కుంకుమబొట్లు పెట్టి పూజిస్తే, తమసంతానము కందపిలకల్లాగ తామరతంపరగా వృద్ధిఅవుతుందని నమ్ముతారు. కొన్నిప్రాంతములందు దీనిని పోలాలమ్మఅమావాస్య అనికూడా అంటారు. ఇది వ్యవసాయములకు సంబంధించినది. ఆనాడు పశువులను కడిగి కొమ్ములకు పసుపురాసి, బెల్లము నువ్వుల నూనెతో పులగం వండి పశువులకు పెడతారు. ఈపులగము పశువులకు ఒళ్ళునొప్పులు పోయి బలము కలిగిస్తుంది. ఇది పరమౌషధం.

## తులసిపూజ

ఇది రెండువిధములు. తులసికోటలో యీచెట్టునుపెంచి ప్రతీ దినమూ దీనిని పూజిస్తారు. తులసిని లక్ష్మీఅంశగా భావించి శాంతిదూతగా ఆరాధిస్తారు. తులసి పూజావృక్షము - ఓషధీవృక్షము - కన్నెలు పెండ్లికావలెననికోరి "కన్నెతులసమ్మనోము" అనుపేరుతో నోస్తారు.

ప్రొద్దున్నే లేచి శుచులై తులసమ్మముందు అయిదుపద్మములు, ముగ్గులుపెట్టి అయిదువత్తులు వెలిగించి భక్తితో ధ్యానిస్తారు. ఈనోము శివరాత్రికి ప్రారంభించి ఒకసంవత్సరం చేస్తారు. నిర్ణీత క్రమంతో వ్రతాంతంచేస్తూ దానధర్మాలు చేసి వ్రతసమాప్తి చేస్తారు. తులసిపూజ చేసేటప్పుడు తులసిపూజాపాటనూ, పూజానంతరం మంగళహారతి పాడుతారు.

## తులసీ*దేవి పూజపాట

### శ్రీరాగము - ఆదితాళము

తులసీ నిన్నే పూజించెద — సంతతము
శ్రీతులసీ నిన్నే ధ్యానించెద
అలసిరిని హారిని యాగమముల
బృందారకుల సర్వతీర్థముల
గలసి మెలసి తెలిసి వెలసి తిలనని ||తులసీ||

తులసికోట గట్టించెద
అందు లోనినదులునిండజేసెద
సలలితశుభముహూర్త
సమయాన కృష్ణతులసి మొక్కలువేసి
కొలచి తలచి నిలచి యలసటను విడిచి ||తులసీ||

---

* విశేషాంశం:- స్త్రీలూ, ముఖ్యంగావితంతువులూ తులసిని పూజిస్తారు

చిలుకుద్వాదశిదినమున తులసిపూజ లధికంగా తులసిబృందావనందగ్గర స్త్రీలు జరుపుతారు. పూర్వం వ్రజమండలమున శ్రీకృష్ణునకు సమకాలికురాలైన "బృంద" అనే భక్తురాలు శ్రీకృష్ణునిఅనుగ్రహమునకు పాత్రురాలైనదనియూ ఆమెకే తులసిచెట్టు చిహ్న మనియూ పెద్దలంటున్నారు.

ఆలవాలము గట్టెద ప్రతిదినముత్రి
కాలములనీరెట్టెద
వ్రేళ్ల వా జలబిందువులను
మంత్రమంత్రార్థముల నొడువుచునోడ
తెల్ల జల్ల వల్ల సిల్లి మదిశ్రీ ||తులసీ||

బుధసోమవారములందు చీడ
దీయించి ముదివెన్నెల ద్రుంపుచును
అందునెరింగినీ మానుమొదలద్రవ్వి
బలమాబురదబోసి బెంచుచునిన్
బొదల మొదల కదల చనలికి శ్రీ ||తులసీ||

కాలమందున లేచెద వేవేగనీపయి
మేలుకొల్పులు బాడెద
వాలాయముగనునీ
యాలవాలముచుట్టుచాలాదిరిగెనిన్ జూచి
మేలు మేలు నన్నేల జాలు దని ||తులసీ||

కాలోచితకృత్యముల తీర్చుకుని ప్రాతః
కాలస్నానసంధ్యాదుల
వేళదప్పకజేసివేగనీ కోటను
లీలదుడిచియాలికి ప
ద్మాల చాల చాలు కేల నిడివడి ||తులసీ||

మూల మందున్న జలముల మళ్లా
మళ్లా నళ్లల్ల జల్లుకొని కేల
నల్లనల్లనిమృత్తువల్ల దిలకముబెట్టి
యుల్లమలర మరల మ్రొక్కి
తల్లి తల్లి నను దయను బ్రోవుమని ||తులసీ||

నవరత్నఖచితపీఠమున గూర్చుండ
నిడి సువర్ణకలశోదకము
తనపాద్యార్ఘ్యాచమనార్థ
మిడిపంచామృతములవరోదకముల
స్నానము లఘుస్మరణమంత్రముల జేయుదు. ॥తులసీ॥

## తులసి మంగళహారతి

ఆనందభైరవిరాగం - ఝంపతాళం

పల్లవి జయమంగళం నిత్య శుభమంగళం
జయాజయ మంగళం మహోత్సవమంగళం ॥జ॥

1. పతివ్రతని యిహామందు ప్రకటించిన బుధులు
శ్రితజనులు గొలుచుచు న్నతివనీకును
హితవుగ భక్తులకు గతిజూపినటువంటి
యతివ శ్రీతులసమ్మ కిపుడు ॥జ॥

2. మునులంత శ్రీతులసి వనమాలికలు ద్రిప్ప
ఘనులు జేసిన తులసి వనమునకును
వనరుగ పళ్లెమున కర్పూరహారతులు
ఘనమైన శ్రీరామ తులసమ్మకు ॥జ॥

3. భూజనులు నుతియింప పూజనీయులా లగుచు
తేజరిల్లెడు తులసి భామ కిపుడు
రాజదశరథమహారాజులును
పూజింప రమణతో శ్రీకృష్ణతులసి కిపుడు ॥జ॥

4. వెన్నులును ఆకులును యేపుగల దళములును
తిన్నగను శ్రీతులసి కొమ్మలకును
వన్నెమీరగ తులసి వనపుత్రికైనట్టి
కన్నె శ్రీఆండాళ కాంతమ్మకు ||జ||

5. వేమారు ఉదయమున గోమయము గొంపోయి
ప్రేమతో తులసిముందర నలికియు
రమణీయముగ ముగ్గులిడిన రమణులపాపములు
తూలగొట్టునట్టి తులసిమహాలక్ష్మికి ||జ||

6. ప్రదక్షిణము జేసి తులసికోటకు మ్రొక్కి
వనరుగ నచట నొక జ్యోతిని నిలిపే
పరమభక్తులకును ధనధాన్యసంపద
లొసగి విలసిల్లుచున్న శ్రీ తులసమ్మకు. ||జ||

## 2. నోములు (వ్రతాలు)

నోము=వ్రతము, నోచునది అనిఅర్థం.
వ్రతము=నియమము, పుణ్యకము, నోము, అనేఅర్థాలు వస్తాయి.
పూజ=అర్చనముచేయుట.
వ్రతములు 365 వున్నాయి.

నోములు, మాంగల్యరక్షణకూ సిరిసంపదలు కలుగుటకూ, పుట్టింటివారూ, అత్తింటివారూ సకలైశ్వర్యాలతో తులదూగుటకూ స్త్రీలు ఆచరించేవిగా ప్రచారంలోవున్నాయి.

చిన్ననాటినుండియూ ఆడవారికి సౌశీల్యమూ, మితభాషిత్వమూ, భక్తీ, ఉపవాసమూ, నియమమూ, నీతీ అలవడడానికి యీ వ్రతాలు ఎంతోతోడ్పడతాయి.

ఈనోములలో కొన్ని యేకవార్షికములు, కొన్ని బహువార్షికములుగా ఉన్నాయి. ఏకవార్షికము లనగా రథసప్తమినాడు గాని, శివరాత్రినాడు గాని ప్రారంభించి ఒకయేడాదిపాటు చేసేవి. బహువార్షికము లనగా సంవత్సరములో యేదేని ఒకమాసమున గాని ఒకరోజున గాని ఆచరించేవి. ఇవి కొన్నిసంవత్సరాలు చేయవలసి యుంటుంది.

1. పెండ్లి అయినవారు పట్టేనోములు:- దంపతి తాంబూలం: ఎల్లప్పుడు దంపతులకు తాంబూలములిచ్చి వారిచేత అక్షింతలు వేయించుకొనుట, వారి ఆశీర్వాదము పొందుటచేత వీరిదాంపత్యము అన్యోన్యంగా, అనుకూలంగావుంటుందని ప్రసిద్ధి.

2. నిత్యశృంగారము:- ప్రతిరోజు సాయంకాలమున ఒకముత్తైదువకు పసుపురాసి పారాణిబెట్టి తాంబూలమిచ్చి తలదువ్వి అద్దము చూపుట దాని విధానము.

3. ఉదయకుంకుమ:- ప్రొద్దు పొడవకుండగనే లేచి ముత్తైదువకు కుంకుమపెట్టి తానలంకరించుకొనుట, భరిణనిండా కుంకుమ ఉంచి ఉద్యాపనముచేయుట.

4. చిట్టిబొట్టు:- ప్రతిరోజూ ఉదయం అయిదుగురు పేరంటాండ్రకు పసుపు, కుంకుమ, గంధము, అక్షింతలు యిస్తూ ఇట్లు ఒకయేడాదిచేసి సంవత్సరాంతమున ఆ అయిదుగురు స్త్రీలకు కుంకుమభరిణలతో ఉద్యాపనముచేయుట.

5. మంగళగౌరీవ్రతము:- ఇదిదీర్ఘకాలపునోము. శ్రావణమాసములో వచ్చు ప్రతిమంగళవారమునాడును, క్రొత్తగాపెండ్లి అయిన బాలికలు దీనిని ఆచరిస్తారు. ఈమాసములో పౌర్ణమనాటికి ముందువచ్చే శుక్ర

వారమునాడు వరలక్ష్మీవ్రతముచేయుట ఆచారం. ఈనోములతో వానిని ప్రశంసించుకథలు చెప్పుతుంటారు. నూతనవధువునకు అత్త వారు యీవ్రతంనాటికి బంగారువస్తువులు తెచ్చియిచ్చుట ఆచార మున్నది. ఈ మంగళవారవ్రతం అయిదు సంవత్సరాలు చేయాలి. ఈరెండువ్రతాలు సౌమాంగల్యమును ఐశ్వర్యభద్రతను కలిగిస్తాయి.

శుక్రవారంనాడుపూజయూ, శనివారంనాడు పునఃపూజయూ చేస్తారు. వరలక్ష్మీదేవిని ఉట్టిమీద బెట్టి* పాట పాడుతారు. తరువాత "వరలక్ష్మీమంగళహారతి" నిస్తారు.

## వరలక్ష్మి మంగళహారతి

హారతిగొను - వరలక్ష్మీకర్పూర ॥ ॥హా॥
రతికోటిసుందరీ - సుకుమారీ
క్షీరసాగరపుత్రి - కరుణింపుమమ్మ ॥హా॥
సర్వలోకములకు - మూలమైనాతల్లి
చల్లనినీచూపులెన్న - మాకువ్రొద్దు ॥హా॥
నాదుహృదయ - మందిరవాసినీ
నీపాదపద్మముల - నీడచేరియుంటి ॥హా॥
భక్తపాలనీ - సర్వార్థదాయనీ
నీదృగంచలమె - జయలలితమాంబ. ॥హా॥

## వరలక్ష్మి వ్రతం - పాట

కైలాసగిరిలోను - కల్పవృక్షముక్రింద
ప్రమథాదిగణములు కొలువుండగాను
పార్వతీపరమేశ్వరులు బాగుగాకూర్చుండి

*శ్రావణశుక్రవారవ్రతంపాట నాసంకలనం "సెలయేరు"లోవుంది చూడండి:—

పరమేశ్వరునిగూడి పార్వతపుడూ
జయమంగళం నిత్యశుభమంగళం ॥ ॥జయ॥

ఏవ్రతముసంపదల నెలమిఁతోడుతినిచ్చు
ఏవ్రతముకామితార్థము లొసగునూ
ఏవ్రతముపుత్ర పౌత్రాభివృద్ధినొసంగు
అనుచుపార్వతితాను హరునడిగెను
హరుడుదానికిమిగుల హర్షమొందుచుతాను
పార్వతీదేవితో పలికె నిట్లు ॥జయ॥

కుండినయనునొక్క పట్టంబులోపలా
చారుమతియనునొక్క చేడెగలదూ
అత్తమామలసేవ నతిభక్తితోచేసి
పతిభక్తికలిగిన పరమసాధ్వి ॥జయ॥

దారిద్రదుఃఖాన తానుచింతిల్లుచూ
వరలక్ష్మినీ వేఁ వనితపైన
దయగల్గిలక్ష్మి తాతప్పకను స్వప్నాన
వచ్చిచెప్పను ప్రీతివర్థిల్లగా ॥జయ॥

శ్రావణమాసాన శుక్లపక్షమునందు
శుక్రవారమునాడు మునిమాపునా
పంచకలశలతోడ భక్తితోడనునిల్పి
పూజచేయుము నన్నుపుణ్యసాధ్వి ॥జయ॥

ఆమాటలాలించి యధికసంతోషమున
లేచి చారుమతీసతి లేపె మగని
స్వప్నవృత్తాంతంబు చయ్యనను యెరిగించె
శ్రావణామాసాన చేసెనోము ॥జయ॥

తొమ్మిదిపోగులా తోరమొప్పగబోసి
వరలక్ష్మికిని యిచ్చె వనితతాను
వేదవిదుడైనట్టి విప్రునీబిలిపించి
గంధమక్షతలిచ్చి కాళ్లుకడిగి
గోమరొప్ప తాంబూల దక్షిణల నిచ్చియు
వాయనమ్మునుయిచ్చి వరలెనపుడూ ॥జయ॥
వరలక్ష్మితానపుడు వరుసతోడుతనిచ్చె
సౌభాగ్యసంతాన సంపదలను
యీవ్రతముచేసినా యింతులందరికితా
వరలక్ష్మిచేకూర్చు ఫలముమిన్నియును. ॥జయ॥

## శ్రావణశుక్రవారపు పూజపాట

మ్రొక్కెనునా పాలి శుక్రవారపులక్ష్మి
ఒక్కచిత్తంబున హృదయమందు
చక్కగాకూర్చొని సౌభాగ్యములనొసగు
అక్కరకురావమ్మ! ఆదిలక్ష్మి
పెక్కువన్నెలముగ్గు ప్రేమతోగద్దెపై
చక్కగాపెట్టెను సరసిజాక్షి
చుక్కవలెపౌడజూపి గ్రక్కునగద్దెపై
యెక్కినిలుపావలెను శుక్రవారపులక్ష్మి
పసుపుకుంకుమయును పన్నీటివర్ధనము
పసుపుకస్తురిబొట్టు పొందుగాను
శశిముఖీ! నీకిపుడు తెచ్చిఅమరించితీ
ఒప్పుతో నోతల్లి శుక్రవారపులక్ష్మి
మల్లెలూ మొల్లలూ మంచిసంపెంగలూ
ఎన్నెన్నొజాతులా జాతిపుష్పముల

కోమలాంగికి కొప్పు బెట్టిరపుడు
గొజ్జంగిలుజాజుల మొగలిపువ్వులతోడి
వాసనలకురువేరు దవనమ్ముతో
ఒప్పునొనరగగూర్చి నిను పూజచేసినా
ఒప్పుతో నోతల్లి శుక్రవారపులక్ష్మి
పాలవెల్లికి నిమ్మపండ్లు దానిమ్మపం
డ్లల్లనేరేడుపండ్ల రటిఁపండ్లు
వెలగకిచ్చిలిపండ్లు వెలయుబంగరుపండ్లు
సరిపోయెమాలక్ష్మి వేడుకలర.

## వరలక్ష్మిపిలుపు

ప॥ లక్ష్మీరావేమాయింటికి
క్షీరాబ్ధివరపుత్రి
వరలక్ష్మీరావే మాయింటికి
లలితమైనెలకొన్న సూక్ష్మదేహధారి
నసురారిబృందావన విహారిణీ ॥లక్ష్మి॥
కుంకుమ పచ్చకర్పూరం
అంకితముగ నలరుగంధం
నంచితముగ సాంబ్రాణిధూపం
మాతా!నీకు ప్రేమతో భక్తితో
సమర్పించెదమమ్మా ॥లక్ష్మి॥
సన్నజాజులు జలలతలూ
తీరైనగొజ్జంగిరేకులూ
మేలైనపారిజాతంబులూ
కోమలాంగిరో యిడుదునీకు ॥లక్ష్మి॥

అందముగా గవ్వాక్షులచీర
కుందనపు పూవులరవిక
ఇంద్రానుజుపట్టపురాణీ
మందగమనరో గైకొమ్మా. ॥లక్ష్మి॥

## లక్ష్మీవ్రతములు

1. లక్ష్మీవ్రతాన్ని కార్తీకబహుళ అమావాస్యనాడు చేస్తారు.

2. లక్ష్మీపూజను మాఘశుక్లపంచమినాడు చేస్తారు.

3. లక్ష్మీపంచమి, - దీనిని శ్రీపంచమి అంటారు. చైత్రశుద్ధపంచమి నాడు ఆచరిస్తారు.

4. శ్రావణమంగళవారాలూ, మంగళగౌరీవ్రతాలుగాను, శ్రావణ పూర్ణిమకు ముందువచ్చే శుక్రవారమునాడు వరలక్ష్మీ వ్రతంగానూ భావించారు.

అట్లతద్ది:- ఆశ్వయుజ బహుళతదియనాడు రోహిణీనక్షత్రముతో కూడి యున్న చంద్రునిపూజించేవ్రతంయిది. చందమామవంటి భర్త కావాలని పెళ్లికానివారును, అందమైనసంతానము - అయిదువతనముకోరి పెండ్లిఅయినవారున్ను యీనోము నోస్తారు. ఇదిపదిసంవత్సరములు నడుపవలసినవ్రతం. దీనిని తదియగౌరీవ్రతమనికూడా అంటారు. చంద్రదర్శనము యీవ్రతమునకు ముఖ్యము.

## బొమ్మలనోము

బొమ్మలనోము సంఘసంబంధమైనది. ముత్తైదువలు, బాలికలు కలసి ఒకచోటగూడి, ఈ వ్రతాన్నినోస్తారు. దీనికయ్యే ఖర్చు అందరూ ఉమ్మడిగాభరిస్తారు. దీనిని సంక్రాంతి వెళ్లిన ముక్కనుమనాడు

ప్రారంభిస్తారు. ఆ రోజున స్త్రీలందరూ మేళతాళములతో కుమ్మరి వారింటికివెళ్ళి రేగడిమట్టితో బొమ్మలుచేయించి తెచ్చుకుంటారు. కుమ్మరికి ధాన్యం బహుమతిగాయిస్తారు. సావిత్రిగౌరీ దేవియు, పంచాంగపు బ్రాహ్మణుడు ప్రధానమైన ప్రతీకలు. 9 దినములు రోజుకొకపిండి వంట చేసి, నైవేద్యంపెడతారు. ఈలాగు 9 సంవత్సరాలు చేయాలి.

1. దండనాలు:- బియ్యముతిరగబోస్తూ యిలాఅంటారు "తల్లిదండన, తండ్రిదండన, మామదండన, పురుషుడిదండన, పుత్రునిదండన, రాచదండన, యమదండన ఎప్పటికీవద్దు. సహోదరదండన చాలాకావాలి. స్వర్గానికివెళ్ళినా సవతిపోరువద్దు. మేడమీదికివెళ్ళినా మారుతల్లివద్దు. సావిత్రీగౌరీదేవమ్మా నీదండనయెల్లకాలంకావాలి. కలగాలి.

2. దీపాన్నినీళ్లలో ప్రతిబింబింపజేసి చెప్పుకునేది:- "చూస్తిచూస్తి. ఏమిచూస్తి? దేవునిదేవరనుచూస్తి. దేవీదేవర ఏమిచేస్తున్నారు? ముత్యాలురత్నాలు జూదమాడుతున్నారు. యెవరుగెలిచిరి? యెవరుఓడిరి? ఇద్దరూఏకసమానమే. అందుకు ఎవరుసాక్షి? నంది సాక్షి, నాగయ్యసాక్షి, కోటసాక్షి, కొమ్మసాక్షి, కోటలోవుండే పంచాంగం బ్రాహ్మడుసాక్షి, ఎడనున్న ఎల్లమ్మసాక్షి, కడనున్న గంగమ్మసాక్షి, సావిత్రిగౌరిదేవమ్మా నీకునేనుసాక్షి - నాకునువ్వు సాక్షి."

3. నీళ్లను తలపైచల్లుకొనుచుచెప్పేది:- "కంటి కంటి. ఏమికంటి, క్రిందనుగిరులుకంటి, మీదనుమెట్లుగంటి, సావిత్రిగౌరిదేవిగంటి? చల్లమెట్లుగౌరిగంటి, కోరినకొడుకులగంటి, తరు గని అయిదు వతనముగంటి, సావిత్రిగౌరితల్లి మీపాదాలుగంటి."

4. బతుకమ్మపూజ:- జీవనాధారమైన తల్లిఅనిన్ని ఆడవారికి అయి

దువతనమిచ్చి రక్షించుచల్లనితల్లిఅనిన్ని "బ్రతుకుఅమ్మ" అను పేరుతో వెలయుచున్న "చల్లనితల్లి" అని భావము. ఈ అమ్మ మంగళగౌరీ దేవి అనుపేరట పూజింపబడుచున్నది. బొమ్మలనోములాగే యిదిన్ని సంఘవ్రతమే.

ఆశ్వయుజశుద్ధపాడ్యమినుండి మహార్నవమివరకు ఆడవారు యీ వ్రతమునుచేయుట ఆచారము. ఈపండుగకుముందు తొమ్మిదిరోజులు బొడ్డెమ్మపండుగ అనిచేస్తారు. బాలికలుపీటమీద మన్నుతో అరుగుకట్టి పూవులు నాలుగుమూలలను గుచ్చి, కలశారోపణచేసి, బాలికలు మాత్రమేఆడుకొంటారు. అంతవరకు బొడ్డెమ్మనోమే. తరువాత పాడ్యమినాడు బాలికలు, ముత్తైదువలు అందరుకలసి తంగెడు, రుద్రాక్షు గుమ్మడి, గోరింత, బంతి మొదలగు పుష్పములను తెచ్చి బతుకమ్మల నేర్పుతో పేరుస్తారు. ఆడుచుపాడుచు నృత్యములుచేస్తారు. తొమ్మిదవ నాడు బతుకమ్మలనన్నింటిని నదిలోగాని, చెఱువులోగాని ఓలలాడి స్తారు. గౌరీపూజాపదము గౌరీ దేవిని నీళ్ళలోకలిపేటప్పుడు ఈక్రింది పదం బృందగానంగా పాడతారు.

ఒక్కొక్క అక్షింతలే గౌరమ్మా
ఒక్కొక్క మల్లెపూలూ గౌరమ్మా ॥ఒ॥
చిన్న చిట్టి వత్తులూ గౌరమ్మా
సన్ననిదీ పాలును గౌరమ్మా ॥ఒ॥
నీలాటి జలధివద్ద గౌరమ్మా
నీనోము నీకు చెల్లె గౌరమ్మా ॥ఒ॥
నీనోము ఫలము చెప్ప గౌరమ్మా
బాలుని పెండ్లాడవే గౌరమ్మా. ॥ఒ॥

## చంద్రునకు ఒక నూలుపోగు

అమావాస్య వెళ్లిన విదియ రోజున బాలచంద్రుని దర్శన మవుతుంది. దీనినే నెలపొడుపంటారు. ఆ చంద్రుని చూచి, బంగారమును, ఆవును, తాటి చెట్టును, పుణ్యపురుషులను చూస్తారు. చంద్రునకు నూలుపోగు సమర్పిస్తూ ఈపాట పాడతారు.

నెలా నెలకు బాలుడవై
నెలకోమాటు రావడమై
మాఅమ్మ*కు తమ్ముడవై
మాకు మేనమామవై
మా అందం మాకిచ్చి
నెయ్యముతో మముజూచి
పాతవస్త్రం పుచ్చుకొని
కొత్తవస్త్రం యియ్యి.

## చిక్కుళ్ళగౌరినోముపాట

చిట్టీ చిట్టినగాని చిక్కుళ్ళ
గౌరినోము చెల్లిపట్టావే ॥
కంటి కాటుక కరగకుండా
చేతిగాజులు చెదరకుండా
కాలిమట్టెలు కదలకుండా
చీకు చింతా చేరకుండా
చిక్కుళ్లగౌరి నోము చెల్లి పట్టావే ॥

*అమ్మ=లక్ష్మీదేవి —లోకమాత.

విడిచిన చీర కట్టాకుండా
తొడిగిన రవిక తొడగకుండా
ఒంటి సొమ్ములు వదలకుండా
యింటిపురుషుడు వెంటానుండా
చిక్కాళ్లగారీనోము చెల్లి పట్టావే ॥

11. గొబ్బిపండుగ:- అన్ని వ్రతములలోను ధనుర్మాసవ్రతము ఉత్తమమైనది. దీనికి కాత్యాయనీదేవిని పూజించుట ఆచారము. స్త్రీలు అందరు చేస్తారుకాని, కన్నెలుచేయుట సర్వోత్తమము.

పూర్వము రేపల్లెలో వర్షములులేక కరువువచ్చుటచేత, నందాదులు భయపడి మహావిష్ణువును ప్రార్థించగా "వానలు కురుస్తాయి" అని మహావిష్ణువు సెలవిచ్చెనట.

అపుడు గోపకులు తమకన్యలచేత యీవ్రతముచేయించగా ఆ కన్యలు తమ మనస్సులందు వానలేదన్న బెంగలేక, విష్ణ్వాంశమైన శ్రీకృష్ణుడు తమకు మగడు కావలెననుకొని, అదే మనస్సులో నుంచుకొని, పైకిమాత్రము వర్షముకోరినట్లు నటించి వరునికి వర్షానికి ఒక్కటే మంత్రం అనుష్ఠించారు. అప్పుడు కాత్యాయనీదేవి వారియందుకరుణ కలదై, చక్కనివర్షాన్ని కురియించి అనావృష్టిదోషాన్ని తొలగించింది. నందగోపాలుడు ఆ కన్యలకోరిక ప్రకారముగా వారిమనోభీష్టములను నెరవేర్చాడు.

వ్రతవిధానం:- పండుగనెలయందు ప్రొద్దుట సాయంత్రం వివిధజాతి పూవులను తెచ్చి, పసుపుగౌరీదేవిని పీటపైఉంచి కుంకుమ చందనం, ఫలతాంబూలాలతో నైవేద్యముచేసి, కుప్పలుకుప్పలుగా పూవులతో ఆదేవిని కప్పవలయును. ఈమెకుగొబ్బెమ్మఅనిపేరు. గొబ్బెమ్మఅంటే నమస్కారముల దేవత, లోకజనని, అనే బిరుదునామాలున్నాయి.

ఈదేవిచుట్టూ బాలికలునిలిచి కరచరణద్వయముల అభినయవిశేష ములతో గొబ్బినితట్టుతూ, గొబ్బిపాటలుపాడతారు. ఈ నోమునకు ఉద్యాపనం[1] కనుమపండుగనాడు చేయాలి. ఆ రోజునగొబ్బిని జల ములో ఓలలాడించి, అందరుగూడి దేవిసన్నిధిని చిత్రాన్నము[2] తింటారు. పళ్లుతాంబూలాలు ముత్తైదువులకిచ్చి దేవిశ్రీమందిరము నకు వస్తారు. ఆదేవిని మరల షోడశోపచారాలతో పూజిస్తారు. పూజానంతరం యీక్రింది పాటలుపాడతారు. ఈ వ్రతమువలన సకలైశ్వర్యములు, అనురూపమైన వరుడు, కీర్తిప్రతిష్ఠలను సంపా దించు సంతానము ప్రాప్తిస్తాయి.

గొబ్బిపాటలు:- సంక్రాంతిపండుగకు గొబ్బిళ్ళుపెట్టి, ప్రదక్షిణంచేస్తూ ప్రార్థిస్తారు.

సుబ్బిగొబ్బెమ్మ - సుఖపడనిస్తావా
తామరపువ్వంటి - తమ్ముణ్ణిస్తావా
చేమంతిపువ్వంటి - చెల్లెల్నిస్తావా
మల్లెపువ్వంటి - మరిదినిస్తావా
మంకెనపువ్వంటి - మరదల్నిస్తావా ॥

## ఆదిలక్ష్మి (కేదారగౌరిదేవి) మంగళహారతి

*శుక్కురావారాన సక్కంగశ్రీలక్ష్మి
అవతారమెత్తెనే ఆదిలక్ష్మి

1—ముగింపు

2—ఒకవిధనుగు వంటకము

* శుక్రవారంనాడు, అని అర్థము.

సిరితోడవచ్చెనూ మానగరికీ
వచ్చితనశాలలో వలపటాలేసుక
పుట్టినింటికిపోయి యేమితెస్తివిగౌరి
సిగ్గుపడకనాతో చెప్పమందూ
పసుపుకుంకుమాలు పసుపురంగుచీర
మావారుపెరవారు మాకుయిచ్చినవి
మిరపకాయపట్టుచీరె
మిరుమిట్లుగొలుపంగ
అల్లమోబెల్లమో అరటిపండ్లు
తెప్పించియిచ్చినవి కేదారగౌరికి
రంగైనపచ్చటి రయికతోడిగి
వెన్నకాచిననెయ్యి గిన్నెలోబోసుక
అన్నలకుబోసినే తలనంటుకొనగ
నిండుపున్నమనాడు నేనొకపొద్దుండి
నిండయినకోనేళ్ల స్నానమాడి
నేనుదెస్తానమ్మ వజ్రాలరాశి
తేనెతోమాగిన తియ్యమామిడిపండ్లు
తెప్పించియిస్తునే కేదారగౌరికి.

## గౌరినోముపాట

శ్రీగౌరినీమహిమ - గౌరమ్మా
చిత్రమైతోచెనమ్మ - గౌరమ్మా ॥ ॥శ్రీ॥
భారతీదేవివయ్యి
బ్రహ్మకిల్లాలివై

పార్వతీదేవివై
పరమేశురాణివై
పరగ శ్రీలక్ష్మివయ్యా - గౌరమ్మా
భార్యవైతివిహారికినీ ॥ ॥శ్రీ॥

ముక్కోటిదేవతలు
చక్కనీకాంతలూ
ఎక్కువగ నినుగూర్చి
పెక్కునోములునోమి
ఎక్కువవారైరి-గౌరమ్మా
యిహాలోకములయందునూ ॥ ॥శ్రీ॥

గొప్పయగునీముద్దు
కొప్పింద్రనీలములు
గప్పచీకటిజగతి
గప్పకొప్పనబిళ్ల
చెప్పతరమూగానిదీ-గౌరమ్మా
చంద్రరేఖాసాటిదీ ॥ ॥శ్రీ॥

నిగనిగలాడెడు నీ
నగుమోము జూచితే
జగతిపున్నమనాటి
చంద్రుణ్ణిఓడించు
సొగసైననీతిలకమూ-గౌరమ్మా
చూచితేఆనందమూ ॥ ॥శ్రీ॥

నల్లవరిబియ్యమో
మల్లెమొగ్గలరేక
తెల్లవజ్రంబులో

ముల్లోకముల నేలు
పల్లునీదంతంబులు-గౌరమ్మా
దానిమ్మబీజంబులూ ॥ ॥శ్రీ॥

అదునుగా యిదిటీకు[1]
బొదలు నుదరంబుపై
ఎదజిమ్మువల్లిపై [2]
పయ్యెదలోన నూగారు
కదల నీనల్ల్రతాచూ - గౌరమ్మ
ఘననాభిపొన్నపువ్వా ॥ ॥శ్రీ॥

బాలలూవృద్ధులూ
ప్రాలంకనలుకన్నె
ప్రాయంపుకాంతలూ
పరగాశ్వయుజశుద్ధ
పాడ్యమీ మొదలుకొనియు-గౌరమ్మా
భక్తి నీయందునిల్పి ॥ ॥శ్రీ॥

తొమ్మిదీదినములూ
నెమ్మనంబునబొంగి
అమ్మలకకులుగూడి
ఆస్తితోతమకున్న
సొమ్ములూధరియించుచూ-గౌరమ్మా
శోభనంబును బాడుచూ ॥ ॥శ్రీ॥

1 విలాసము-నడకలోని సోయగం.

2 తెల్లనివస్త్రం.

బంగారుపువ్వులూ
బ్రతుకమ్మయనిపేర్చి
మంగళంబనినిన్ను
మధ్యనానిల్పియు
రంగుగుమ్మడిపువ్వులూ-గౌరమ్మా
రాశిగానర్పింతురూ ॥ ॥శ్రీ॥

కట్లపుష్పంబులూ
కాకరాపువ్వులూ
కలగోలుపువ్వులూ
గన్నేరుపువ్వులూ
పొట్లపువ్వులుజల్లుతూ - గౌరమ్మా
పొగడపువ్వులునింపుచు ॥ ॥శ్రీ

పారిజాతంబులూ
పైడితంగెడుపూలు
గోరింటపొన్నలు
కురువిందమల్లెలు
తీగరుద్రాక్షపువులూ - గౌరమ్మా
ఏరినాకుసుమంబులు ॥ ॥శ్రీ॥

పాలమీగడలట్లు
పానకంబులుజున్ను
పోళీలుమరిమడుగు
పువ్వులూనేమియాల్
మేలుశర్కరగింజలూ - గౌరమ్మా
మెప్పుగానర్పింతురు ॥శ్రీ॥

గంగనర్మదయమున
కావేరి గోదారి
తుంగభద్రాదిమించి
కుందనదితీరముల
పొంగివేడుక మీరగా - గౌరమ్మా
పుణ్యపురుషులుగూడిరి ॥ ॥శ్రీ॥

కోరికలుతీరగా
జేరిపూజింతురూ
చారుసుందరమైన
సౌభాగ్యములనిచ్చి
కారుణ్యమున నేలుమా - గౌరమ్మా
కల్పాయువొసగిమాకు ॥ ॥శ్రీ॥

## 3. ఉత్సవముల పాట

(గౌరమ్మను తీసుకువస్తూ పాడేపాట)

ప॥ కాకరపువ్వొప్పునే గౌరమ్మా
కాకరపండొప్పునే గౌరమ్మా ॥కా॥

మిశ్రం:- కాకర పువ్వుపై - వాలినచిలుకలు
వసంత రేకులు - నైకోగుబ్బలి
మైకో మేడలు - చందమామ నీడలు
పవరపు దండలు
ఆగడియలో శ్రీగడియలు

దరువు:- దంచినపాలు - ధరణికి లొంగవు
దానత్తా బోసిన - పట్టెళ్ళు
కోకోతడపలు - రాముడుయ్యాలు
గంటసిరి పువ్వుల - గౌరమ్మ
నీసుతుడేడే - గౌరమ్మా ॥
వాడిన పువ్వులు - వడిలో బోసుక
వాడలు వెదికిన లేడమ్మా
మేడలు వెదకిన లేడమ్మా గౌరమ్మా

1. చిక్కుడు పువ్వొప్పునే - గౌరమ్మ
చిక్కుడుకాయొప్పునే - గౌరమ్మా
చిక్కుడు పువుమీాద - వాలిన చిలుకలు
గైకోగుబ్బలి - మైకోమేడలు
చందమామ నీడలు - గౌరమ్మా ॥

2. బీరాయి పువ్వొప్పునే - గౌరమ్మ
బీరాయి పిందొప్పునే - గౌరమ్మా ॥

మిత్రం:- బీరాయిపువు మీాద - వాలిన చిలుకలు
గైకోగుబ్బలి - మైకోమేడలు.

(అని పై విధంగానే పాడాలి)

## సావిత్రీ గౌరిదేవి పూజపాట

ఆనంద భైరవి - ఆది

సావిత్రీ గౌరీ దేవమ్మా నిత్యసౌభాగ్య మివ్వగదమ్మా
భావళ్యమూర్తి యర్ధాంగమందు సంభావ్యమాన వైభవ
మున నున్న నిన్

భావమందున దలచి కొలిచెద నావిర్భవించి వేగముగను
కావలసియున్న వరములనిడి ఘనముగా మాటాడుమిక శ్రీ
సావిత్రీ॥

వైవాహికాబ్దమునందూ తొలివచ్చు అయనమందూ
దేవినినునావాహనముజేసి సావధానముగ నవ
దినములు దీక్షగానుంచీ॥

తావకధ్యానార్చనము విధిగాస్వగృహ్యోక్త ప్రకారము
గావించి సాష్టాంగపడి సంధ్యావసరముల హారతిచ్చెద॥

అఖండ దీపారాధనతో ఓలలాడించెద సంభ్రమముతో
ఆ ఖండేందుధరుననుమతి సిరిసంపదనఖండముగ నిచ్చియైదువ
తనమొసంగి

అఖండ సంపూర్ణతర బ్రహ్మానందరసవార్ధి లోపల
అఖండముగ దిరిగి ఓలలాడించు మిహాపరములను నను॥

నీ నోము తొమ్మిదేళ్ళు జేయునెలతపుణ్యవతియై
నూరేళ్ళు బ్రతుకు మానకనుద్యాపనము జేసిన
మానవతులు కీర్తి జ్ఞానము లబొంది నీ
సాన్నిధ్యమున నుండు పరమున శాస్త్రవిదులు వచింతురిలలో॥

ఆశాంబరుని నిన్ను వేడియుండే దాసవర్గము తోడగూడి
కాశీచయనుల లక్ష్మణకవికృతిజేసె వ్రాసిన జదివినవాంఛలు
చేకూరు

నీశుభప్రదవ్రత మహాత్మ్యము నెరిగి యే మగువలిలలో
నిదిజేసెదరో ప్రత్యక్షముగ వారే సౌభాగ్యవతులౌదురు॥

## 13. లక్షవత్తుల నోముపాట

మల్లన్న నినుదలతు మల్లికార్జునుడా ।
సిరులిచ్చి రక్షించు శ్రీనీలకంఠా ।
విను నీకు చెప్పేను విన్నపము దేవా ।
మాసవ్రతములు సలుప మహిమమునులకును ।
సాజమైన మేలు సమకూర్చినట్లు ।
తొల్లిపెద్దలు జెప్ప మహాఋషుల కెల్ల ।
పుష్పవారిదెచ్చి పురములోపలను ।
లక్షణయనగాను లలన యొక్కర్తె ।
బలముగలచేత ఫలబలముగల చేత ।
ధనముగలచేత జక్కదనముగల చేత ।
ఘనతకుమరి యొక్క జగములు మెరిపించి ।
జాణుడనగానపుడు తనయుడు శూద్రుడు ।
ఒక్కని తగులుకొని యుండె నావనిత ।
తీరొప్ప గౌతమీ తీరంబునందు ।
సరగున ఋతువులో స్నానంబుజేసె ।
ధవళాక్షియొక విచిత్రము జూచెనప్పుడు ।
సతిఁగూడి పెనిమిటి చనియెనావేళ ।
బంధులు చుట్టాలు బలసి యుండగను ।
మోహమున రొమ్ము మరిమోదు కొనుచు ।
ఆ నికటానమరిపొర్లి అడలుచుండగను ।
ఏకర్మములచేత నీబాల్యమునను ।
యీాదశ ప్రాప్తింప జేసెనో సతికి ।

కరుగున లక్షణా కరుణతోడుతను ।
యెందుండి వచ్చెనని ఎద చింత జేసె ।
అడిగితే చెప్పెను అతివనీకనెను ।
జగతిలోపల యీడుజన్మమ్ము కంటె ।
ఇక దుఃఖమున్నదా యింతలపోయ ।
సతులకు ఎన్నడూ దుఃఖమేగాని ।
ఈగకాలంతయిన యిల సుఖములేదు ।
సుతులు లేకుంటేను సొక్కుతుందూరు ।
కలిమి లేకుంటేను కలగుతుందూరు ।
కలిమిలేములు చాలకలిగుంటెనేమి ।
పెనిమిటి కలిగితే వనిత సుఖియించు ।
అటుమీద పతిహీనురాలయిన ।
అతి దుఃఖమొచ్చును అతివలాకెల్ల ।
అనుచున్న అంతలో అంతన ఒకక్క ।
పుణ్యాత్ములనువారు పురుషోత్తములు ।
యాచకులని వారు ఏతెంచినారు ।
ఓవిప్రపుంగవా యోపుణ్య చరిత ।
భూలోకమాతవు ఓపుణ్యశాలి ।
స్త్రీలకు యముచేత వైధవ్యమేల ।
ఎందుండి వచ్చెనని యిటుచింత జేసె ।
అడిగితే చెప్పేను అతివనీ కనెను ।
సతులకు అయినాను యతులకు అయినా ।
వచ్చినకర్మచే వనిత తానుండె ।
వందుతూ నైనాను వారుస్తునైన ।

కలిసీటబియ్యాలు కడుగుతూనైన।
పెట్టుతూనైనాను మెట్టుతూనైన।
జననాధ కడలికి అప్పుడది జనియె।
అప్పుడది కానక అతివ లోభాన।
చక్కబెట్టి లెస్స సవరించి వినక।
కడకుబోయెద నేమి కలిసుండె నేమి।
ఇట్టి దోషమ్ములు చెప్పెను వినుమి।
పతిలేదు దయలేదు సద్గుణంబును లేదు।
కృపగలిగి యుండుట గోరంతలేదు।
మానినీ కింతని నిలుచుటలేదు।
మానానికింతని మగ్గుటలేదు।
భయమున మానమ్ము కాచుటలేదు।
పెనిమిటి పిలిచినా ప్రియమాడలేదు।
పెనిమిటిని మరివిడిచి పెరవారి మరిగె।
పెనిమిటికి విసమెట్టి తానేగెగాని।
తనయు బాల్యమునందు తానెరుగలేదు।
పడతి యప్పుడు పరాన్నముకాసపడగ।
నాతియప్పుడు దుఃఖజీవియై పుట్టె।
అత్తలు కోడండ్రు ఆడబిడ్డలును।
దుఃఖపెట్టుచు వారితో కూడ నుండె।
పణతికి బాలవైధవరికమ్మువచ్చె।
యిట్టి దోషంబులు యీసుందరులకు।
తొలగిపోయేటట్లు త్రోవ జూపెదవో।
భామరోఋషి పంచమినాడయిన।

శాకదానము లెస్సచేసి రెవరయిన ।
సతులకు సకల పాపమ్ములే బాయు ।
కాంతరో యే శుద్ధ కార్తీక మందైనా ।
కుచగురులు యెవ్వారు కోరిచేసినను ।
సతులకు సకల పాపమ్ములేబాయు ।
మగువరోయేమాఘమాసమందయిన ।
వైశాఖ మాసాన వ్రతము చేసినను ।
సకలపాపంబులు సంఘుంబులోను ।
ఉద్యాపనవిధి మధ్యాహ్నమంత ।
చెప్పేను వినవమ్మ చిత్తమందుంచి ।
ఉదయ కాలమునందు ఒప్పుతోలేచి ।
స్నానమ్ముచేసి తా ధవళ వస్త్రములు ।
ఉత్తమంబుగగట్టి గోమరొప్పగాను ।
ఋష్యశృంగుల నేటి ఋషులబిలిపించి ।
శాస్త్రజ్ఞులనియేటి బ్రాహ్మలను బిలిచి ।
కోడె లేగనుగల గోవు నొక్కటిని ।
దానమియ్యవలెను తగినవానికిని ।
చేడెరో అందుకు శక్తిలేకున్న ।
భద్రమయినట్టి ముప్పది పావుసేర్లు ।
కంచాము తెప్పించి మంచిపూజ్యాన ।
వత్తులలో పదిభాగముగల సంఖ్య ।
బంగారువత్తి శోభనంబుగా జేసి ।
వ్రతముల లోపల వ్రతముగావించి ।
ధానమియ్యగవలెను తగినవానికి ।

చేడెరో అందుకు శక్తిలేకున్న ।
కలదైన కొలదైన కలిగినాగాని ।
కాంత దేవరభక్తి కావించవలెను ।
చేయవలె యీపూజ చేయుట కొఱకు ।
భావించవలె పూజ పావనలచేత ।
పాయసాన్నము నెయ్యి పాలుమీగడలు ।
నివ్వర్లతోగూడి యివ్వంగవలెను ।
అద్రివాసునిసతి నమరంగనిల్పి ।
ఆ శోభననేత్రి ఆ నీలగాత్రి ।
ఆ రుద్ర ఆ భద్ర ఆ కాళిరూపి ।
ఆ జగన్మోహినీ ఆ సుప్రకాశ ।
పురమందు నాభిలో నొప్పయినట్టు ।
పున్నెములు మిన్నగల జగము లోపలను ।
పురమున పదములే పూలగర్భములు ।
జగమున పదములే జాలగర్భములు ।
కలిగిన వ్రతమిట్టు చేసిరెవ్వరైన ।
సతులకు సకల పాపమ్ములేబాయు ।
ఏపాపమైనను యేదోషమైన
సకల పాపదోష సంగ్రహాముపోను ।
చిచ్చులు బెట్టినా శిశుహంతలైన ।
గరళాన్నమునుచేత కలిపి పెట్టినను ।
దుష్టులు బ్రహ్మహత్యలు కోటి చేసినను ।
కాంతనంటెడి మహాపాతకము బాయు ।
స్త్రీవధ్యులైనను శివద్రోహులైన ।
గోహంతలయినను బ్రహ్మఘ్నులైన ।

సకలపాపదోష సంగ్రహాముపోను ।
వైశాఖ మాసాన వ్రతము జేసినను ।
అద్భుతమ్మ్గాగ పట్టు ఆవ్రతముజేసి ।
తరుణికి దయచేత తగధారబోసి ।
దిగ్గున లేచెనే బ్రాహ్మణోత్తముడు ।
పసుపు కుంకుమ పళ్లు పడతివడిగట్టి ।
చల్లవలె వేగిరము జతనంబుతోను ।
నీవునుపెనిమిటి నియమముగాను ।
చనవలె వేగిరము సంతసముతోను ।
నవనీతమును తెచ్చి దేవరకిచ్చి ।
బ్రహ్మను విష్ణునుమామహేశ్వరులు ।
లక్ష్మణకుయెదురుగా చనుదెంచిరపుడు ।
తనవస్తువులు తెండి తనయులను తెండి ।
తనబంధువుల తెండి తనవారి తెండి ।
అప్పుడు లక్ష్మణ ఆ గంగలోను ।
తానునుపతియును తానముచేసి ।
భద్రముగనిద్దరు ఆ రథము నెక్కి ।
పార్వతి మొదలైన పణతులందరును ।
సరస్వతి మొదలైన సఖియలందరును ।
మహాలక్ష్మి మొదలైన మగువలందరును ।
లక్ష్మణ కెదురుగాజనుదెంచిరపుడు ।
కనకసింహాసనమున గూర్చుండబెట్టి ।
లక్ష్మణకు మహాలక్ష్మి పాదములుగడిగె ।
ఇచ్చితివరములు పట్టుమని పలికె ।
వేణుపకృష్ణ నిన్నేమివేడెదను ।

చక్కనిసామ్రాజ్య పదవినాకిమ్ము ।
ఈపాటయెవ్వరైన పాడినావిన్న ।
నిలమీదసత్రాలు గట్టినఫలము ।
కోటికన్నెలదానము చేసినఫలము ।
గోవుదానంబులే చేసినఫలము ।
విన్న వారికిగలుగు విష్ణులోకంబు ।
పాడినవారికి బ్రహ్మలోకంబు ॥

## స్త్రీలపూజపాట

### నవరోజురాగం - అదితాళం

శ్రీమహాలక్ష్మీశ - జేరిమిముభక్తిన్
గామించిపూజింతు - కరుణగైకొనుమా ॥ దేవా ॥ శ్రీ
శ్రీనివాసామిమ్ము - ధ్యానించిమరియు
బూనియావాహనము - బొందుగాజేతున్ ,,
నవరత్నసౌవర్ణ - నవ్యపీఠంబు
నారాయణానీకు - నయమారగూర్తున్ ,,
అమలతీర్థముచేత - నచ్యుతామీకు
నర్ఘ్యపాద్యములొసగి - యాచమనమిత్తున్ ,,
సంశుద్ధజలముచే - స్నానమర్పించి
సౌవర్ణచేలముల్ - సంప్రీతినిత్తున్ ,,
మకరకుండలకటక - మకుటాదులైన
సకలభూషణముల్ - జక్కనర్పింతున్ ,,
తిలకమర్పింతునో - దేవేశనీకు
జలజశంఖరథాంగ - శార్ఙ్గాదులిత్తున్ ,,

యజ్ఞోపవీతంబు - నర్పింతునయ్యా
విజ్ఞానదాయకా - వేడ్కజేకొమ్మా ॥దేవా॥ (శ్రీ)
చందనాదులమేన - బొందుగాబూసి
మందారతూలిక - ల్మరియు నర్పింతున్ ,,
అతిమనోహరమైన - యక్షతలుమీకు
నంఘ్రియుగ్మమునందు - నర్పింతుభక్తిన్ ,,
మందారవకుళ చా - మంతిపుష్పములన్
మల్లికాపుష్పముల - మరియుబూజింతున్ ,,
వివిధంబులైనట్టి - విరులచేనీదు
విలసత్పదంబులన్ - విధినిబూజింతున్ ,,
పరిమళధూపముల్ - బాగుగానిచ్చి
వరదీపశతములన్ - విరివిగాగూర్తున్ ,,
బంగారుపాత్రలన్ - భక్ష్యాదులైన
పంచవిభాగాన్నము - ల్పరగ నర్పింతున్ ,,
పులిహోరయును మంచి - పొంగలియుచాలా
మేలుపొంగళిమీకు - మేలుగానిత్తున్ ,,
పరమాన్నములుచాల - పరమాదరమున
మరియుదధ్యోదనము - విరివిగానిత్తున్ ,,
సకలఫలంబులన్ - సంప్రీతిమీకు
చాలగానర్పింతు - సర్వేశ్వరేశ ,,
విడెముమీకతిభక్తి - నిడుదునోదేవ
కడుదయాదృష్టిచే - గైకొనుముస్వామి ,,
కర్పూరహారతుల్ - గైకొనుముస్వామి
కరుణాపయోనిధి - కమలేశవరద ,

మంత్రపుష్పంబుల - న్మరియు నర్పింతు
తంత్రస్వరూపకా - దయతోడగానవే ॥దేవా॥ శ్రీ
సంప్రదక్షిణములన్ - సల్పిసర్వేశా
సాష్టాంగముగ మ్రొక్కి - సంస్తుతుల్ సేతున్
చిత్రమైనట్టి స - చ్ఛత్రమర్పించి
చామరాదులనిచ్చి - శయనింపజేతున్ ,,
అపచారములనెల్ల - కృపతోడకృష్ణా
యుపచారములునుగాను - నిపుడుమదిజూడు ,,
అజముఖులైన - నిన్నర్చింపలేరు
భజియింపనేనెంత - పరమాత్మరూపా ,,
పంకజోదరనన్ను - పాలింపు లింగం
వేంకటరామదాస - విమలహృద్వాస ,,
ఇదిపఠించు రమణు - లెవరైనగానిన్
యిందిరేశున కర్పన - లిచ్చిరయేనిన్ ,,
సకలమంగళములున్ - సంధిలుభువిని
సత్యంబుసత్యంబు - సంశయములేదు ,,
మరియుదేహాంతమున - వరునితోగూడి
పరమపదమునవారు - తిరముగానుంద్రు ॥ ,,

## పూజపాట

ఉదయకాలమునందు మధ్యాహ్నకాలాన
సాయంకాలమందు బంగారు పువ్వులా
సంపెంగ పువ్వులా కోరిపూజింతు
నను గన్నతల్లివో నాతల్లి నిన్ను ॥

చక్కారముంచి ఎర్రటిపళ్లు తల్లిరోనీకు
సమర్పింతు సర్వకాలాలయందు
మరవకా నామాట బ్రహ్మతోనీవు
మనవిచెయ్యమ్మ నన్మరువకమ్మ ॥
కోరినా కోరికలు కొనసాగవలెనాకు
అడిగినా వరములు యివ్వవలెనమ్మా
మరణ కాలాన బొందితో కైలాస
లోకములు కావలెను తల్లిరోనాకు ॥
ఏయిల్లు మంచిదో యేవాడమంచిదో
వచ్చి లక్ష్మీదేవి ముంగటను నిలచె
వాటమైన దామరాజు వారినట్టింట
వెలసితి వా సరస్వతమ్మవునీవు ॥
వాటముగ మడమలకు వన్నెలొప్పగబెట్ట
పాటించి మడమలకు పసుపుబూసి
శ్రీవత్స గోత్రము పీఠముననుంచి
అవతార మయితివా తల్లిరోనీవు ॥

## 3. సంబరములు

### * వీరభద్రుడిపళ్లెం — ఖడ్గాలు

వీరభద్రపళ్లెమనే ఉపాసనాక్రమంలో, వీరభద్రునిమూర్తియైన రౌద్రక్రియ గోచరిస్తుంది. "ఖడ్గాలు" అనిచదువబడేవి సీసపద్యాలు. వాటిలో వీరభద్రుని లీలాదిక మేవుంటుంది — వాటి అర్థంమీద దృష్టి

*మిక్కిలిపెద్దపళ్లెమునే వీరభద్రుడి పళ్లెమంటారు. వీరభద్రుడు ఏకాదశరుద్రులలో ఒకమూర్తి, కాని ప్రముఖులలో ఒకడైన వీరేశ్వరుడు — ఈయనపేరునజరిపే ఉత్సవంలో పాడేపద్యగద్యాత్మకమైన పదాన్నేఖడ్గమంటారు.

పోదు. ఒకవిధమైనరౌద్రం, ఉద్రేకం కల్గుతాయి — ఆ వుద్రేకమంతా అప్పటిపాఠకుల భయావహ, వేష, భాషాదికంవల్ల కల్గుతుంది.

చిన్న చిన్న మాటలుగా యీఖడ్గాలుచదువుతారు. ఒక్కొక్క మాట అనగానే "అల్లల్లవీరా!" అని అంటాడు పాఠకుడు. చుట్టూ వున్న వారు "అశ్శరభ! శరభా!" అని అరుస్తారు.

ఖడ్గాలుచదివేవ్యక్తి ఒకచేతిలో వీరభద్రునిపళ్లెంపట్టుకొని, మరోచేతితో ఒకఖడ్గం ధరించి ముందుకూ వెనుకకూ అడుగులు వేస్తూ చెబుతుంటాడు. వీరశైవుల గృహములలోనేగాక కొందరుస్మార్తుల యిండ్లలోకూడా శుభకార్య సమయాలలో - ఈ పళ్లెంపట్టడంవుంది.

కత్తులంతపదునుగా వాక్యాలుచ్చరించుటచేత వీటినిఖడ్గాలంటు న్నారోలేక,ఖడ్గంచేతబట్టి చదవడంచేత ఖడ్గాలంటున్నారో చెప్పలేము. ఖడ్గాలనేమాట ఛందోగ్రంథాలలోనూ, శైవగ్రంథాలలోనూలేదు.

"అల్లల్లవీరా!" "అశ్శరభశరభా!" అనేవి తొలగించితే చదివే వాక్యాలు సీసపద్యభాగాలుగా వుంటాయి. ఒక్కొక్కపాదాన్ని నాల్గు తుంపులుగాచేసి, వారు చదువుతూ వుంటారు.

సీ॥ విభూతి యొకచేత; వీరాంగమొకచేత;

ఘలుఘల్లు; మనుచును; ఘంటమ్రోయ

ఈలా నాల్గుభాగాలుగాతుంపి, మధ్యమధ్య "శరభ;శరభా;" అంటూవుండడం, రౌద్రరసోత్పాదకంగావుంటుంది. వీరభద్రుడు శివ రూపాంశమే. ఆ విద్యలో రమించే పరమభద్రమూర్తి. ఆ మూర్తిని ఆరాధించడమంటే తామూఅటువంటి భద్రమూర్తులు కావడానికి ప్రయత్నించడమే - మానవునిలోని సమస్తాంశలు పరమేశ్వరాభి ముఖాన్ని పొందితేనేగాని ఆ భద్రమూర్తిత్వం చేకూరదు.

మానవునిలోవున్న ఆవేశాలు, రజోగుణసంబంధమైనవి. అతని లోని ఈ రజోగుణాన్నంతా పరమేశ్వరాభిముఖంచేయడానికి ఉద్దిష్టమైనదే ఈ వుత్సవం.

## గంగజాతరా * (దేవరసంబరం)

### మొక్కుబడిపదాలు

యాదవులు గంగజాతరచేస్తారు. వారియాచకులగు కొమ్ముల వాళ్లు - కొమ్ముబూరలతో వూదుతూ, కాళ్లగజ్జెలుమ్రోగేటట్లు చిందులువేస్తూ ఈపదాలు పాడుతారు.

ప॥ సాకబెట్టి నీకు మ్రొక్కే మేకవీరమమ్మ
సాకి సంతరించవమ్మ యేకవీర ॥సా॥

ఏట్లోపారేడి యెఱ్ఱనిగంగ
పాలలోనుండేటి పచ్చనిగంగ
ఏట్లోమాయన్న యెచ్చరించంగ
పారేడిగంగొచ్చి పవ్వళించంగ ॥సా॥

చల్లనితల్లిమీకు జాతరలుసేసేమమ్మా
సల్లావులపాలు పొంగళ్లుపెట్టేమమ్మా
గొల్లలకెల్లను కొలముదేవరవై
యెల్లమ్మయెల్లమ్మ యేలుకోవమ్మ ॥సా॥

### మొక్కుబడి చెల్లింపుపదం

ప॥ ఎక్కలమ్మకునేడు మొక్కుచెల్లింతాము
వక్కలాకులు వేగపంపరా ఓరి ॥ఎ॥
మఱ్ఱిమానికిందున్న మాతంగిరావె
ఎఱ్ఱిమ్మచెరుపు చేయించేనుగాని ॥ఎ॥

---

*జాతర—అమ్మవారికి చేసేఉత్సవం.
సంబరం—అమ్మవారికి కావించే తిరునాళ్లు—
ఈ రెండుపదాలూ సమానార్థకములే,
"కం॥ గోవిందసంభరము సంభావింపు" (భా. ఉ౩౮ ౩ప.)

చింతమానికింద సివమెత్తి రావె
సంతబైటనున్న ఓసాంబవీరావె ॥ఎ॥

చిత్తితోతిరువళిక యెత్తేనునీకు
బుత్తిముత్తులియ్యి వమ్మపోలేరమ్మ ॥ఎ॥

సత్తెముగల్గినతల్లి సమకూర్చుమేలు
పత్తిచేనిబైటనున్న ముత్తేలమ్మనీవు ॥ఎ॥

పన్నెండునేతి దీపములుపెట్టేనునీకు
సిన్నాడనమ్మ ఓ కొల్లూరిగంగ ॥ఎ॥

## కాటంరాజుపదం

పంబలవాళ్లు పంబ అనే చర్మవాద్యంమీద వాయిస్తూ ఈపదం పాడుతారు. కొమ్ములవాళ్లూ, పంబలవాళ్లూ యాదవులను ఆశ్రయించే వారలే.

ప॥ - కుంబములోపుట్టినట్టి కుంభకర్ణునికొడకవై
కుంబమల్లాదింటివిగదరా। ఓకాటమరాజా
కూరనారవెతకవుగా ॥కుం॥

అంబారికసాగసాన అంబుధిదాటేవేళ
పంబలువాయింపుచు। ఓకాటమరాజా!
కంబళినాచుకొంటివిగా ॥కుం॥

సుప్పనాతిముక్కుపోయి నొప్పిచేతమూలుగంగ
యిప్పపూలదండవేసితివిగా। ఓకాటమరాజా
అప్పుడేకూడితివిగదరా ॥కుం॥

# 4. కదిరి నరసింహుల బ్రహ్మోత్సవము

(గాడగీతము)

తిరుపతి-తిరునారాయణముల మధ్యను కదిరి అనే పుణ్యక్షేత్ర ముంది. అక్కడి దేవుడు కదిరినరసింహస్వామి. యీయనను "కాటమ్మ రాయుడు" అనే పేరుతో జానపదులు స్తుతిస్తూంటారు. ఫాల్గుణ శుక్లపక్షంలో బ్రహ్మోత్సవం జరుగుతుంది. ఆ వుత్సవానికి చుట్టుపట్ల పల్లెటూళ్ళవారు చాలామందివస్తారు. వారు గాడగీతాలతో స్వామిని వేడుకోనడం పురాతనకాలంనుంచీ వస్తూవుంది. స్వామివారిపట్టమహిషి "లక్ష్మీదేవి", రెండవ దేవేరి "చిన్నాదేవి".

జానపదులు స్వామివారి లీలలను భక్తిపరవశులై పాడుకొంటూ ఆత్మానందం పొందుతారు.

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో, శివలీలామహాత్మ్యము అనే అముద్రితగ్రంథంలో "శివగీతములు", "గాడగీతములు", "గాడ గేయములు"అనే శీర్షికలతో కొన్నివున్నాయి. గ్రంథం శిథిలావస్థలో వున్నందున అక్షరాలు సరిగ్గా కనబడపోవుటచేత వాటిని వ్రాసుకొనుటకు వీలుచిక్కలేదు పామరజనులు పాడే ఈదిగువ గాడగీతములో శ్రీమహా విష్ణువుయొక్క దశావతారాలు వర్ణించబడ్డాయి. పాడుటకు అనువు గానూ, తేటతెలుగు మాటలతోనూ, భక్తిని ప్రబోధించేదిగానూ వున్న యీగేయం జయదేవుని అష్టపదులలో మొదటి దానికి సరి పోతుంది. విజ్ఞులు పరిశీలింప ప్రార్థితులు. బ్రహ్మోత్సవమునందు ఈ గాడగీతములతో స్వామిని జానపదులుసేవించే వాడుక ప్రాచీనకాలం నుంచీ వస్తూవుంది.

## దశావతారముల పాట

### పున్నాగవరాళి రాగం - ఆదితాళం

పల్లవి: బెత్రాయిసామి దేవుడా! నన్నేల్నినోడ
బెత్రాయిసామి దేవుడా ॥బె॥

అ ॥ప॥ కాటమ్మ రాయుడా! కదిరి నరసింహుడా!
నీశైన పేరువోడ! నిన్నే నమ్మితినోర ॥బె॥

౧. చేపకడుపున చేరిపుట్టగా! రాకాసిగాని
కోపాముగా చేసికొట్టగా
ఓపినన్ని నీళ్ళలోన! వలచీ వేగామె తిరిగీ
బాపనోళ్ళ చదువులెల్ల! బమ్మదేవర కిచ్చినోడా ॥బె॥

౨. తాబేలై తానుప్పుట్టుగా! ఆ నీళ్ళకాడ
దేవాసురులెల్ల గూడగా
దోవసూపి కొండకింద ! దూరగానే సిలికినపుడు
చావులేని మందులెన్నొ ! దేవర్ల కిచ్చినోడ ॥బె॥

3. అందగాడ వవుదు లేవయా, గోపాల, గో
వింద రచ్చించ రావయా!
పందిలోన సేరికోర! పంటితోన నెత్తిభూమి
కిందుమీద సేసినట్టి! సందమామ నీవెగాద ॥బె॥

౪. నారసింహా నిన్నెనమ్మితి! నానాటికైన
కోరిపాదమేగతి! ఓరినీవుకంచాన
చేరి ప్రహలాదుగాచి
కోరమీసాలశత్రుగుండె! దొర్లసేసినోడ ॥బె॥

౫. బుడుత బాపనయ్యావై తివి। ఆ చక్రవర్తి
నడిగిభూమి నేలుకొంటివి
నిలువు కాళ్లోడవై అడుగు। అడుగు వానినెత్తిబెట్టి
తడవు లేకలోకమెల్ల। పాదవుతోడ త్రొక్కినోడ ॥బె॥

౬. రెండుపదులు ఒక్కమారుతో। ఆ దొర్ల నెల్ల
సెండాడితౌర పరసుతో
చండకోలబట్టు కోదండ। రామసామికాడ
బెండుకోలసేసికోని। కొండకష్టు మోగినోడ ॥బె॥

౭. రామదేవ రచ్చించు। మాసీతమ్మతల్లి
శ్యామసుందరి నన్ను మెచ్చగా
సామి తండ్రిమాటగాచి। ప్రేమభక్తుల నాదరించి
ఆ మత్తాసురుల నెల్ల। దోమలుగ జేసినోడ ॥బె॥

౮ దేవకీదేవికొడుకుగా। యీజగము నెల్ల
దేవుడై నిలిచినావురా!
ఆవులా మేపుకొని। ఆడోళ్లగూడుకొని
తావు బాగజేసుకొని। తక్కిడిబిక్కిడిచేసినోడ ॥బె॥

౯. వేదాలు నమ్మరాదని, ఆశాస్త్రాల
వాదాలు బాగలేవని
బోదాలు సేసికొని। బుద్దూలు సెప్పికొని
వాదావినోదుడైన। నల్లనయ్యనీవెకావ ॥బె॥

౧౦. కలికీ నాదొరవునీవెగా। నాతోడదయతో
పలికినాబాలశిశువుడా!
చిల్లగౌడపురములోన। చిన్నగోపాలుడౌర
పిల్లగోవిచేతబట్టి। పేటపేటతిరిగినోడ॥ ॥బె॥

# ౬. భక్తిసాహిత్యము

భక్తి అనగా కొలువు, సేవ, భయభక్తులతో కూడిన స్నేహం అనే అర్థాలున్నాయి.

భక్తి సంఘ జీవనంలోనూ, వ్యక్తి జీవితంలోనూ కూడా ప్రధాన స్థానమే ఆక్రమించుకుంటుంది. ఏదోవిధంగా యీభక్తిభావం యిష్టమున్నా లేకపోయినా సంఘజీవనంలో మనకు సంబంధం ఏర్పడుతూనే వుంది. అది తప్పనిసరికూడా.

భక్తి భావం కేవలం పారమార్థికవిషయమైనా, మన నిత్యజీవితంలో భక్తితోనూ, రక్తితోనూ సంబంధం పెంచుకొంటూ సంఘాన్ని వ్యక్తిని ముక్తిపథంవైపు నడుపుతూవుంటుంది.

ఈభక్తి సంఘజీవనంలో మనకు అనేక రూపాలతో సంబంధిస్తూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు భజనలుగా, మరొకప్పుడు సమారాధనలుగా, ఇంకొకప్పుడు జాతర్లుగా, మరొకప్పుడు ప్రార్థనలుగా, వేరొకప్పుడు వ్రతాలూ నోములూ రూపాలుగా, మరికొన్ని సమయాల్లో కళారూపంలోనూ, మరికొన్ని సమయాల్లో ఉపదేశరూపంలోనూ, మనజీవితంలో విడదీయడానికి వీల్లేకుండా, ఓతప్రోతంగా అల్లుకొని వుంటుంది. మన భారతీయ సంస్కృతీ సంప్రదాయాల్లోని విశిష్టత యిది.

అందులోనూ మన తెలుగునాట జానపదవాఙ్మయంగా మనకు ప్రతి నిత్యమూ ఏదోగంట ఏదోమూలనుండి మవ శ్రవణాలతో సంబంధం పెట్టుకొని యీ భక్తిభావం, సంసారసాగర అగాధంలోకి పోకుండా ప్రతి నిమిషం మోక్షపథంవైపుకే ఆకర్షించుతూ వుంటుంది.

మానవులు భగవంతుని చేరుటకు నవవిధ భక్తిమార్గముల ద్వారా మోక్షాన్ని సాధింపగలరని మహర్షులు స్థిరపరచి యున్నారు.

## నవవిధ భక్తిమార్గాలు

1. శ్రవణము:- పురాణములను వినుట
2. కీర్తనము:- భగవన్నామ సంకీర్తనము లేక భజన సేయుట
3. స్మరణము:- భగవన్నామమును స్మరించుట
4. పాదసేవనము:- తీర్థమును సేవించుట
5. అర్చనము:- పూజావిధి
6. వందనము:- నమస్కారము
7. దాస్యము:- ఉపచారములు సల్పుట
8. సఖ్యము:- స్నేహితునియందువలె ప్రేమాసక్తులు కల్గివుండుట
9. ఆత్మనివేదనము:- తనసర్వమును ప్రాణంతోసహా భగవంతుని యందు శరణ్యామునుపొందుట.

ఇందులో కీర్తనము స్త్రీ పురుషాది ఆబాలగోపాలమూ ఆచరింపదగ్గదే. కావున తాము యిష్టదైవమును సేవించడం అనూచానంగా వస్తూవుంది.

### భజనలు

1 పండితభజన 2 తరంగాలు 3 తాళాలు 4 చిఱతలు 5 హరికథ 6 సప్తతాళాలు 7 కోపులు 8 పండరీ 9 జండా 10 కోలాటం 11 క్లైటో 12 తప్పిడికుండల 13 డోలక్ 14 కరతాళాలు 14 సమారాధన (వేదాంతగోష్ఠి) మున్నగుభజనలున్నాయి.

1 పండిత భజన:- తరంగాలు సప్తతాళాలు గల భజనలు గలవు. ఇందులో-పండితభజన, తరంగాలభజన సప్తతాళాల భజనలు చేసేవారు సంగీతసాహిత్యాలలో అనుభవంకలవారు. దేవునిపీఠానికి ఎదురుగా కూర్చొని మధ్యను హార్మోనియం-మృదంగం వేసుకొని, కంచుతాళాలు పుచ్చుకొని వాయించుకుంటూ యీభజనలు చేస్తారు.

వివిధకీర్తనలు పాడుతూ, కీర్తనలకు స్వరం-స్వరసంచారం, శబ్దం-శబ్దసంచారం, నామం, నామసంచారం, మూడు కాలాలలోనూ తీర్చి పాడుతూ వుంటారు. ఒక తాళంనుంచి మరో తాళంలోనికి మారుస్తూ, కీర్తనల యొక్క నడకలనుకూడా మారుస్తారు.

## విఘ్నేశ్వరునిమీది పాట

ప॥ ఇభరాజవదన పార్వతీపరమేశనందనా
 పరమేశనందనా భక్తసుచందనా ॥ఇ॥
ఫాలాక్షసుతు డని నిన్ను నే పాటలుపాడితి
 నిను గొనియాడితి ॥ఇ॥
శరణన్న జనులను మరువకరక్షించువాడవు
 రక్షించువాడవు పోషించువాడవు ॥ఇ॥
జయ విజయనగరీ పురిగౌరీవరకుమార
 కరిముఖ నీవేరా కరుణతో ప్రోవరా. ॥ఇ॥

## సరస్వతిమీది పాట

కళ్యాణిరాగము - అటతాళము

పల్లవి:- వాణీ నిన్ బూజించెద। వందితగీర్వాణీ నిన్ వర్ణించెదా॥
పాణికంకణధ్వనుల్ భరతశాస్త్రముగాగ
నాణెమౌ మాణిక్యవీణ వాయించుచు
రాణిశ్రీసూక్త
విధిగా నారాధనము జేతు నవరాత్రుల ॥వాణీ॥

ప్రాణాయామముజేసి ప్రస్తుతించి ధ్యానించి
ప్రత్యక్షమగునిన్ గని మాణిక్య సింహాసనముగూర్చొనిడి త్రి
వేణీపుణ్యజలముల్ వేగముగా దెచ్చి పు

రాణీ నీకర్ఘ్య పాద్యార్థము రమ్యమంగళనానార్థము
మాణిక్యఖచితపాత్ర న నర్పియర్పించెదగైకొను ||వాణీ||

జాణనీకుమృదు జాతరూపదుకూలము
శోణకంచుక మొసంగి సూత్రమునిచ్చి
మాణిక్యస్థగితవిమలతరమృదుహీర
ణ్మయదివ్యాభరణముల్ మైబూన నిడి క
ళ్యాణికుంకుమతిలకమిడి య
త్యాదరంబుగ కజ్జలంబిడి
త్రాణగలహరిచందనము వి
స్తారముగతనువున నలందుచు ||వాణీ||

నాణెమయినవిరుల నాతినిన్ సాహస్ర
నామములంబూజించి మంచిసాం
బ్రాణిధూపమునిచ్చి
పంచార్తి దీపికపంక్తిజూపించిమహా
నైవేద్యము చాణక్య సూపశర్కరా
భక్ష్య భోజ్యఘృతంబుగనొసగి యళి
వేణీ కరణచరణములు గడుగుచు
విమల వస్త్రమున తడియొత్తుచు ||వాణీ||

పణతీ తాంబూలమ ర్పణముజేసిఘనతర
పచ్చకర్పూరహారతీ జూపిజలకణములాచమనంబు గావించి
పుష్పముల్ మణులుస్వర్ణ ముద్రలుబూనినిల్చి
యణిమాదిమైశ్వర్యములను యిహమునపరమున
మోక్షమొసగుము కరుణ సతతముగోరి నేనీ
క్రమముగా పుష్పాంజలిచ్చుచు ||వాణీ||

ఆశ్వయుజ శుక్లపక్షాదినారంభించి అవిరళముగ
బూజించి నవరాత్రులు శాశ్వతంబైన యా
శ్రవణార్క్షమందున శారద ని న్నుద్వాసనజేసి యిట్లెటా
జేసెదను సతతంబుకాశీ శ్రీలక్ష్మణకవిని ననునీ
వాశీర్వదించి విద్యనొసగు మమ్మా
సుతుని గదమ్మ బ్రోవుము ॥వాణీ॥

## మోక్షలక్ష్మి

పల్లవి:- ఘల్లుఘల్లు ఝుంకారం చేసే గజ్జెలు పావడా లడిగితినా!
అందముగానీ నడుమున వెలిగే బంగారువడ్డాణ మడిగితినా
మోక్షములియ్యవె లక్ష్మి నీమోహాపు కృష్ణునిగూడి ॥మో॥
శ్రీకంఠసవరం రాగిడిబిళ్ల లోకమాత ని న్నడిగితినా
కేతకిచెక్కిన బంగరుగొలుసుల జడకుప్పెలు నిన్నడిగితినా॥మో॥
ఆదిలక్ష్మి నీ హస్తమున వెలిగే అపరంజి గొలుసు లడిగితినా
అందముగా నీకంఠమునవెలిగే బంగరుకంటే నడిగితినా ॥మో॥
అందముగా నీముక్కునవెలిగే ముక్కర లిమ్మని అడిగితినా
కమ్మకున్న ముత్యాలుకూర్చిన కానుక బావిలీ లడిగితినా॥మో॥
గరుడవాహనము నెక్కి దంపతులు గూడిరమ్మని అడిగితినీ
వేడుకతో మాదంపతులకు నేడు వైకుంఠమిమ్మనిఅడిగితినీ॥మో॥

## వరలక్ష్మి పాట

(ముఖారి అట)

పల్లవి:- వరలక్ష్మి నను బ్రోవవమ్మా, నీకు, వందనములుజేతునమ్మా
హరిరాణి భవదీయ వరభక్తులను బ్రోవ
కర మొప్ప తల్లివై ఘనత జెందితివమ్మ ॥వర॥

మురిడీలుకంకణాల్ మెరల బంగరుకర్ణపుష్పముల్ కదల
సురుచిరమగు బిందిల్ చుక్కబొట్టునుదుట
నురుముత్యముగల బొట్టుంచెగమ్మృదువుగ ॥వర॥

రాగిడిచంద్రవంకలను విరాజితమొగలిరేకులను
ప్రాగల్భ్యమగు తమలపాకుపోకచెక్క
బాగుగనిడి చంద్రభానుల నుంచెద ॥వర॥

బంగారుకీల్జెడవేసి రత్నబంతులుతూలాడజేసి
అంగనని మేన యఖిలాలంకారముల్
పొంగుచుదిద్దెద పూర్ణచంద్రానన ॥వర॥

కస్తూరితిలకమునుదుట కనులకాటుకబెట్టి నీయెదుట
ప్రస్తుతింపుచు నిలిచి ప్రబలదర్పణ ముంచి
సిస్తుగ సుమములు శిరమునపూజింతు ॥వర॥

నీదివ్యనామముల నెన్ని ప్రణవమాది నంత్యనమస్కృతిని
పాదుకొల్పి సహస్ర పత్రకుంకుమాక్షతల
మోదముగ బూజింతు నోదివ్యసుందరి ॥వర॥

ధూపదీపముల నొసంగి మధురపక్వాన్నని వేదనొసగి
యాపోశనంబిడి యారగించినపిదప
నాపముల కరచరణములగడిగెదను ॥వర॥

తాంబూలనీరాజనముల మంత్రపుష్పప్రదక్షిణములా
గొబ్బున నిచ్చిమగువలగూడి శ్రీ
కోమలి నివ్వాళిగూర్చియిచ్చెదనమ్మ ॥వర॥

చారుమతీదేవి కనునీవు సెలవుయిచ్చిన చందమునను
సారెసారెపూజ సలిపి కల్పమువిని
తోరముకరమున దూర్ణముగధరియింతు ॥వర

ఆరోగ్యముగ ఫలములనురాత్రి యారగించుమనికోరుచును
సారసాక్షినీకు సమర్పించి కర్పూర
హారతియొసగి పొగడెదమదిలోన ॥వర॥

ఈరీతిగా నిన్ను స్త్రీలుభువి నెల్లకాలంబుపూజలు
సారసాక్షినీకుసలిపి యిహపరముల
కోరికల్దీర్చు కొనం గూర్చితి నీకృతి ॥వర॥

ఆశ్రితుడను నీకు వారికి మా యమ్మవు నీవుయీకృతికి
విశ్వాసముంచి ప్రవీణునిచేయుము
కాశీలక్ష్మణ కవి నీసుతుని తల్లి ॥వర॥

## గౌరీదేవి పాట

ఆనందభైరవి

పల్లవి:- బాలవుగదవే గౌరమ్మా కాపోరీముసిలి ఆయెనమ్మ
నీలవేణినీవు చాలతపముచేత
వాలాయముగ తపసి వానిపెండ్లాడితివి ॥బా॥

తలనిండ జడలవాడమ్మా- భస్మధరుడు దిగంబరుడమ్మ
కులగోత్రములులేవు సలలితంబుగముద్దు
పలుకులతోమున్ను వలపించెగాయున్న ॥బా॥

ఎద్దువాహనముగదమ్మ ఏప్రొద్దుతిరుగుచుండుకొమ్మ
పెద్దతెల్లగూడి ప్రస్తుతిసేయగ
ముద్రికమరియొకటి కద్దులే జగతిపై ॥బా॥

కట్ట వల్వలు లేవమ్మ పైని కప్పిందిపులితోలె కొమ్మ
కుట్టుపోగులుపాము పెట్టుకొనేవాని
గుట్టుతెలియక నీవెట్లు గోరితివమ్మ ॥బా॥

స్థలము శ్మశానభూమమ్మ - ఇల్లు దాసులకు వరమిచ్చుకొమ్మ
తెలివెంతగలదని తెలియదేమో యతని
కంఠమందు కాలకూట ముండేటివాని ॥బా॥

పెంగోల్లుపురీశుడమ్మ - నాథు నరయుడు మల్లేశుకొమ్మ
ముదముతోడుత మీపాద సేవకుడు
కూర్మి ప్రేమతోడుత వెంకటదాసు నెజనని ॥బా॥

## అన్నపూర్ణదేవి పాట

పల్లవి:- చెలియామెవ్వరు విశ్వనాథుసన్నిధి
చిన్నది తెలియజూస్తే అన్నపూర్ణ దేవివలెనున్నది
కలికికన్నులతీరు కల్వపువ్వుల రేకులే
అలరుబోణిచక్కదనము అందమైయుండునే ॥చె॥

అందెలుపాదములయందు అందిఅందిమోయగా
అందమైనభక్తజనులు అందునాట్యముసేయగా
సందడిగొనిపొందియున్న సంఘమెల్లదాయగా
సంతతమ్ముసుందరాంగి చూడవేడుకలాయెగా ॥చె॥

నలినాక్షికొప్పుచాయ నల్లమబ్బునిగ్గులే
అలరుబోడిపలువరుస అచ్చమల్లిమొగ్గలే
ఇంతి పతితోనిప్పుడు యేకాంతమాడుచునుండెనే
ఇంతలోనెకాయకూర లిట్టితానువండెనే
బంతులుసాగించియున్నా ప్రజలకడుపులు నింపెనే
ఇంతికన్నులజూచువానిని యిచ్చకమ్ములు బల్కెనే ॥చె॥

పచ్చమేనుపట్టుచీరె పయిట సవరించెనే
హెచ్చుగబంగారుగరిటె యింతి చేతబట్టెనే

వెచ్చనీ పరమాన్నములు వింతగా వడ్డించెనే
ఇంతి కన్నులజూచివారిని యిచ్చకమ్ములు బల్కెనే ॥చె॥
ప్రేమతోడుత నిడుకొలను భీమలింగస్వామిపై
కామితార్థములిచ్చిమమ్ము కరుణతోగృపజూడుమీ ॥చె॥

## కనకదుర్గ పాట

బెజవాడ కనకదుర్గమ్మా! నీ నిజరూపు జూపవేమమ్మా
నీరజదళనేత్ర నిత్యపూజలునీకు మనసందుజేసెద
మనవిగైకొను తల్లీ యెల్ల జగములనీవు కన్నతల్లివలె
బ్రోచినావని యుల్లమందున నమ్మియుంటిని
కల్లగాదిద పల్లవాధర ॥బెజ॥
శ్రీకృష్ణతీరమునందు నీవు కోరివసించితివందూ,
మునిజనంబులునెల్ల ఘనముగ గుడిచుట్టు
తన తపఃఫలమెల్ల దనర చింతించేరు, మనమున
నేమరి యెగ్గుసేయక వినయముగ వారందరికిని
తనువుతో కైలాసపురికి దనరుగా సెలవివ్వవమ్మా ॥బెజ॥
బంగారు బొమ్మ మాయమ్మ నిన్ను శృంగారింపక
చూస్తినమ్మా, ముత్యాల హారాలు ముదముతో
మెడవేసి, అత్యంత పట్టు వస్త్రములు నంగము జుట్టి!
మిక్కిలిగ నవరత్నకీల్జెడ కంకణంబులు కరమునందున
కింకిణీరవమొసగె అందెలు పంకజాక్షి నీ పాదమందు ॥బెజ॥
హాయి రాణివైయుండి నీవు భక్తుల్ ముందు నేనైతిని
కావు, ధనముకోసము నేను మనవి సెంచగలేను
కనకదుర్గాంబ నన్ కరుణించి బ్రోవవె, యిలను పిలికప్పన్న

దాసుని వలను వరములు వేడి వేగను కలలో
హరిగొనివచ్చినట్లు అతనికినీ దయ సేయవమ్మా ||బెజ||

## ధర్మసంవర్ధనీ

(బేడరాగం - అటతాళం)

ప|| ధర్మసంవర్ధనీ! మాయమ్మా! నమ్మితి నేనీ దాసుడను
నను బ్రోవవలె నమ్మా! ||ధ||

అ||ప|| చర్మవసనుని రాణియౌ కొమ్మా! ముఖ్యముగా నీ
చరణమే గతి వేరు లేదమ్మా! బంగరు బొమ్మా! ||ధ||

1. తల్లి గర్భమునందుండి పొరలి తల్లడిల్లి యెన్నెన్ని
జన్మము లెత్తితినో తొల్లి;
యిక యెన్ని జన్మము లున్నవో? మళ్ళీ యేవగనైన
యన్ని భయములు దీర్పవే తల్లి కల్పవల్లి ||ధ||

2. తప్పు లెంచుటయేమొ యిటుగలదా; నా వెతలెల్ల
దలచిచూడగ నీకు దయరాదా?
ఇప్పుడును నామొరలు వినలేదా! యూరకుంటే నీ
గొప్పతనమున కేమి మర్యాద? పావనివిగాదా? ||ధ||

3. శ్రీపరమేశునితోడ నటియించి, అందు భ్రమియించి
శీఘ్రముగ మహిషాసురుని ద్రుంచి,
దీనరక్షకి నీదు దయయుంచి, ఏవగ నైనా
తనయుడను నను నీదు కృప యుంచి ప్రోవు రక్షించి ||అ||

## గంగలు

౧. పంచగంగలు:— 1. కావేరి 2. తుంగభద్ర 3. కృష్ణవేణి
4. గౌతమి (గోదావరి) 5. భాగీరథి (గంగ)

౨. సప్తగంగలు:— 1. గంగ 2. గౌతమీ 3. కావేరి
4. తామ్రపర్ణి 5. సింధు 6. సరయు 7. నర్మద.

౩. అష్టగంగలు:— 1. గంగ 2. యమున 3. కృష్ణవేణి
4. గోదావరి 5. సరస్వతి 6. నర్మద (రేవానది) 7. సింధు
8. కావేరి.

## గంగమీదిపాట

(మోహన - త్రిపుట)

ఓ తల్లి గంగాభవానీ రావె - ఖ్యాతిగ నిచటికి
కపటము మాని ॥ఓ॥

హరిపాదమున బుట్టినావు । పురహరుని
జటాజూటమున నిలిచినావు
పరమ పతివ్రతవైనావు । మాపాలిట
వెలసి పూజలు గైకొన్నావు ॥ఓ॥

హరి కర్పితము శ్రీతులసీ । దళములనర్చతో
నిన్ను గావింప వెలసి
తరుణి పెంచిన మెరసి । యున్న నరలేక రావె
శేషాద్రిలో వెలసి ॥ఓ॥

వాసిగ నిను చాలనమ్మి - చిన్నవాండ్ర కాదరువుగ
నున్న సొమ్మమ్మి
చేసితి నిను పనినమ్మి । చేయ నిరవుగ నిచటికి
బిర బిర రమ్మి ॥ఓ॥

తరికొండ నరసింహుడైన । నీలగిరివాసు నేవేళ
కీర్తింపు జ్ఞాన
కరుణ నాపై నుంచు చాన । మమ్ము కడ తేర్చు
భారము కల్గినదాన ॥౭॥

## శివునిపై పాట

శంకరాభరణం - అట)

పల్లవి :— ఏమయా స్వామి శివశివా కైలాసవాస! ॥ ఏ ॥
ఏమయాస్వామి సొమ్ములేమి లేకపోయె నీకు ॥ ఏ ॥
పాములను ధరించు టెంత పాపమో శివశివా ॥ ఏ ॥
వెట్టివాడ వయితే కావు వెండికొండ దొరవునీవు ॥ ఏ ॥
పుఱ్ఱెలో భుజించుటేమి పుణ్యమో శివశివా ॥ ఏ ॥
లెక్కలేని వాహనములు యెన్నియైన గలవు నీకు ॥ ఏ ॥
ఎద్దు నెక్కి తిరుగు టెందుకోసమో శివశివా ॥ ఏ ॥
ఎగ్గులేని పరిమళములు యెన్నియైన గలవు నీకు ॥ ఏ ॥
బుగ్గి బూసుకొనుట యెంత పుణ్యమో శివశివా ॥ ఏ ॥
ఎల్ల వేల్పులకును నాదిమూలమైన వేల్పువీవు ॥ ఏ ॥
బిచ్చమెత్తుకొనుట యేమి కర్మమో శివశివా ॥ ఏ ॥
వరుసను చామర్తి నరసింహులు మిమ్ము వేడగాను ॥ ఏ ॥
అరసి బ్రోవవేమి అన్యాయమో శివశివా ॥ ఏ ॥

## కుక్కుట లింగని మహిమ

పల్లవి :— కుక్కుట లింగ నీ మహిమ
కంజదృక్కంజభవు లెన్నదరమా ॥ కు ॥

అక్కజముగ సర్వదిక్కుల కాంతులు
పిక్కటిల్లగ ననలపృథులింగ మైనపుడు
నిక్కముగ బ్రహ్మాచ్యుతులు తారెక్కువని
యాద్యంతమును గన కొక్క రూపమాట
విస్మయ మొందరే యది యెంత చిత్రము ॥ కు ॥

అగణితులగు నాసురలు కలశాంబుధి
మథియింప దెరలు నిగనిగయగుచాయ
పొగలెగయు మంట లొగిబిగి
జిగికల్గి జగములూ నిండిన
పొగరు విసమున పొగులు వేల్పుల
ప్రగడ లందరు నిలక భయమున
తగు విధంబున భజన చేసిన
ద్రావిన విషభయ మణచి కాచిన ॥ కు ॥

దక్షుడు మది దెలియలేక లోకదక్షులు మానులమూక
రక్షించునని యజ్ఞదక్షులు భార్యతో దీక్షగైకొనగను
పేక్షచే కోపము, అక్షులను వెలికురక రౌద్రం
డాక్షిణంబున బట్టి యందర శిక్ష జేసిన జడిసి శంకర
రక్ష రక్ష యటన్న బ్రోచిన ॥ కు ॥

మ్రోయగ మూడు లోకములు ఘోరముగ త్రిపుర
నాయకులు, సేయగవారల మాయించి లోకములు
శ్రీయుతంబులు గాగ జేసే పీఠాపురి బాయకను
జగదంబతోడ నమేయలీల మెలగుచు
సదుపాయమున సద్భక్త వెంకట
రాయఘోషణ బిరుదు గలిగిన ॥ కు ॥

## శ్రీరంగ విన్నపములు

రంగపురీ కనుగొంటిని - యంగజ జనకుండు
బంగారు విమానములను - పరిజనములను ॥ రం ॥

రంగుగ నుభయకావేరి వెలంగగ - మధ్యరంగమున
[1] రంగ రంగవైభవముతోడ - చెలంగుచు
కోర్కె లొసంగెడు కస్తూరి ॥ రం ॥

ప్రాకారము లారు నొకటి - ప్రబల మంటపములు కోటి
శ్రీకారమువలె గృహములు - చెలగుచు కోటానకోట్లు ॥ రం ॥

[2] తిరుపతులును నూటెనిమిది [3] వరతీర్థములును తొమ్మిది
[4] తిరు తేరులును మూడును - దివ్యతరముగా నున్నవి
గరుడాళ్వారుల సన్నిధి - ఘనధ్వజస్తంభ మున్నది
దొరరంగని [5] బలిపీఠము - తొలకరి మెరుపై యున్నది ॥ రం

కరులను నాల్గును గంటిని - తురగము నొక టనగ వింటి
వరుసను జయవిజయులున్న వైభవమును గనుగొంటిని
పరవాసుల శరణంటిని - వరశుకరవముల వింటిని
పురమేలెడు నమరసింహ - పుత్రికకై వెళ్ళ గంటి ॥ రం ॥

సుందరమగు శేషశయ్య - పొందికకే ప్రణమిల్లితి
అందరివలెగాక రంగని - యందే నామది నిలిపితి
కందర్ప జనకుడైన - కస్తూరి రంగని వేడితి ॥ రం ॥

పగల్ జగా వుత్సవములు - పడయు ముదము సేవించితి
భగవంతుని యొయ్యారపు - పదవులకే దండ మిడితి
మగువల యాటల చూచితి - మర్యాదల కేలొగ్గితి
సొగసుగ బంగరు గొడుగులు - సొంపుగని జోహారు లిడితి

వరుసను [6] పన్నిద్దరాళ్వారుల నే సేవించితి
వడయురు గీతములమీద - నదివిని సొక్కుచు నుంటిని
సరసులు శ్రీపాదశ్రితుల - సాహానమున కే మెచ్చితి
గురుతరముగ కొట్టాయని - కొలువుండగ నే కొలిచితి ॥ రం ॥

శ్రీశనివారోత్సవపు - చిత్రము నేనే మందును
భూసురులచే వేదగోష్ఠి - పొందిక చెవి వినుచుంటిని
కేశవుసతి రంగనాయకి - కేశవువందన మిడితి
వాసిగ శ్రీరామానుజ - దాసుని బ్రోవు మని వేడితి ॥ రం ॥

## ఉ భ య కా వే రి

ఉభయము :- గుడి ఉత్సవపు కట్టడ (గుడి పారుపత్తెదారులునూ, లోకులునూ చేరి చేయు ఉత్సవము).

కావేరీభవానీ సంగమము. కోయంబత్తూరు జిల్లాలోని ఈరోడ్డు పురం నుంచి ఏడుమైళ్ళదూరాన "భవాని" అను పురం వుంది. దాని దగ్గర అమృతలింగేశ్వర దేవాలయ ముఖాన భవానీ నది కావేరీ నదిలో సంగమించు పవిత్ర స్నాన తీర్థము - దీనినే ఉభయ కావేరి అంటారు.

## తు లా కా వే రీ మ హా త్మ్య ము

కవేరుడనే రాజర్షి తపం చేయగా బ్రహ్మ అనుగ్రహించేత విష్ణుమాయ కవేరుని పుత్రికగా పుట్టింది. ఈమె అంశమే లోపాముద్ర. ఈమె భర్త అగస్త్యుడు.

కవేర కన్య తండ్రి ముక్తికొరకు శివునిగూర్చి తపస్సు చేస్తుండగా, బ్రహ్మ అగస్త్యునితో ఆమెను పెండ్లాడమని చెప్పగా, ముని

ఆమెను కోరగా, తాను నదిని కాబోవుతున్నా ననగా ముని సమ్మ తించి, ఆమెను పెండ్లాడి, తన కమండలంలో వుంచాడు.

అగస్త్యుడు వింధ్యపర్వత గర్వ మణచుటకై పోతూ, తన ఏడుగురు శిష్యులకు కమండలమును జాగ్రత్తగా రక్షింపుడని చెప్పగా, శిష్యులు కమండలాన్ని జాగ్రత్తగా తెస్తూ, సహ్యాపర్వతం దగ్గరకు వచ్చారు.

అంతట కావేరి తన కార్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని నదీ రూపంతో ప్రవహించింది. శిష్యు లామెను ప్రార్థించారు - కాని, తానిదివరకే అగస్త్యునకు చెప్పి, అనుజ్ఞ పొందానని చెప్పింది.

సహ్యాపర్వతమున, తులాసంక్రాంతినాడు, విష్ణుస్వరూపమైన ఉసిరిక చెట్టు దగ్గర ఉద్భవించి, బ్రహ్మ నిర్మిత శంఖాన్ని చుట్టి ప్రవ హించి, సాగర సంగమం పొందింది. అప్పుడు బ్రహ్మ, శివుడు, వచ్చి ఆమెకు వరాలిచ్చారు.

దక్షిణగంగ, సహ్యాచల సంభవ, కావేరి, దివ్యదేవి, సర్వతీర్థ మయి, అను పవిత్రనామములతో విలసిల్లుతూ వుంది. తులా సంక్ర మణంలో జన్మించుటవలన తులా కావేరీ అంటారు.

తులా సంక్రమణము మొదలు ఆ నెల ముప్పది రోజులూ స్నానం చేసినవారు, సర్వపాపములు పోగొట్టుకొని మహా పవిత్రు లవుతారు.

శ్రీరంగమునందు తులా కావేరీ స్నానం చేసినవారికి వైకుంఠ ప్రాప్తి కల్గుతుంది.

భవానీపురం వద్ద అమృతలింగేశ్వరుని దేవాలయంలో పూజలు సల్పినవారికి కైలాసం సిద్ధిస్తుంది.

ఈ నదిగట్టున నివసించువారికి పరలోక సౌఖ్యాలు కల్గు తాయి - "తులాకావేరీ మహిమ" విన్ననూ పుణ్యాత్ము లవుతారు.

1. అంగ రంగ వైభవములు: శ్రీరంగంలోని రంగనాథస్వామి వైభవములు అంగరంగ వైభవములు అనగా సమగ్రము లైన ఆరగింపు లని భావం.

బాల భోగము లనగా ౧. గంధం ౨. తాంబూలం ౩. పుష్పం ౪. భోజనం ౫. వస్త్రం ౬. సతి ౭. స్నానం ౮. సంయోగం.

అష్ట భోగము లనగా - ౧. గంధం ౨. తాంబూలం ౩. పుష్పం ౪. అన్నం ౫. వస్త్రం ౬. స్త్రీ ౭. పాన్పు ౮. గానం.

2. తిరుపతులు: విష్ణు క్షేత్రములు 108 వున్నాయి.

3. వరతీర్థములు: మహర్షులు స్నానం చేసిన, పుణ్యోదకములు గల పవిత్ర క్షేత్రములు 9 వున్నాయి.

4. తిరుతేరులు: శుభకరమైన రథములు.

5. బలి పీఠము: గర్భగుడికి యెదురుగా వుండే పీఠము. దీని దగ్గర భక్తులు, తమ దోసగులను తొలగించుకోవాలని భావము.

6. ఆళ్వారులు: వైష్ణవ భక్తశిరోమణులు 12 గురు.

## గోవిందస్మరణ

(ముఖారి - అట)

పల్లవి: గోవిందా గోవింద హరిగోవింద గోవింద ||గో||

ఎంచ రెండుమూడు యేకము తత్వము
కొంచెము గాదది కొండంతరా
పంచ పంచ కరుణ ప్రకృతి వికృతివాగ
దించివేయువాడు దేవుడురా హరి|| ||గో||

మసకతిత్తివంటి మానవ దేహము
కుసి గుంపులచేత గూడినది
మసకతిత్తిలోని మర్మము దెలిసితే
తనుకు గాదుర పరతత్వమురా, హరి|| ||గో||

కాషాయవస్త్రాలు గట్టినంతలోనె
దోషములెక్కడ దొలగిపోవు
శేషగిరీశుని దెలగుచు నిరతము
భాషింపకుండిన ముక్తిలేదు, హరి|| ||గో||

గాలిలేని దీపకళిక చందంబున
చాలగ నెమ్మది షణ్ముఖునీ
లాలించి కూడేటి రాజయోగికి శివ
జాలమేల గోపాల కృష్ణ, హరి|| ||గో||

## తాండవకృష్ణా

పల్లవి: తారంగం తారంగం తాండవ కృష్ణా తారంగం
తారంగంబని సారెకు నాడర
వారువీరు జూడవత్తురు కృష్ణా ||తా||

అందమైనా చెవులా మద్దికాయ లల్లాడగా
పులిగోరు పతకము బొజ్జపై నుండి తూలాడగా ||తా||

తందన ధిమి ధిమి తకతై
అనుచును అందరు జూడగ ఆడర కృష్ణా ||తా||

ముందర రాముఁడు మురళిని సల్పగ
అందరు జూడగ ఆడర కృష్ణా ||తా||

అందమైన నుదుటా కస్తూరి తిలకము జారాడగా
తద్దయు రాముఁడు తాళము గొట్టగ
విద్దియలు జూపుచు ఆడర కృష్ణా ||తా||
అందెలు గజ్జెలు సందడి సేయగ
మందరధరుడా ఆడర కృష్ణా ||తా||
కుందనచొక్క ట్లందము మీరగ
దంధన తకతక ధిమిధిమి యనుచును ||తా||

## శంకింపక జేకొనరా

(భైరవి - చాపు)

ప॥ నందనందనా, ముచి, కుందపాలనా, బృందారక బృందవందిత
పాదారవిందుడ శ్రీయిందిరానందవద నీ, విందురా ॥నంద॥

1. జగదీశ్వరా, యో, నిగమగోచరా, నిగనిగలాడు
నగుమొగమున, దిగులాడగ, దగజూడుము, ఖగ
వాహన, కరుణాకర ॥నంద॥

2. జాలమేలరా శ్రీలోలవేగరా, మేలా గోపాలా యీ
లీల సుశీలా యిక, జాలును బోజాలను నను,
బాలించుము, మేలెంచుము ॥నంద॥

3. వేడుకొంటిరా, నే, నేడబోదురా, కూడునా
పీడగ పీడు నావాడని, కీడు దిగనాడుచును,
నను పోడిమితో బోషింపుము ॥నంద॥

4. పంకజోదరా, నాజంకుదీర్పరా, వేంకటరమణ
సంకటహార, నీ, వింకను నావంకనుదిగి,శంకింపక జేకొనరా॥నంద॥

## జంకు తీర్చుమా

రేగు ప్తి - ఆట

ప॥ కోదండ రామా, కోటిరిపునా కోసలధామా,
కాదనకుమా, కళ్యాణసీమా, పూలదండ లొసంగుచు,
నేదండమిడుచుంటి, వేదండపాలకా, నీదండ జేర్చుమా ॥కో॥

2. భూరమారమణ, భారము బాప, రారా శ్రీరామా,
రక్షింపరాదా, రాజలలామా, యేరీ నీసాటివా,
రీరేడు జగముల, కారుణ్యాంబుధులైన, ఘనులు వెదకిన
గాని ॥కో॥

3. కరుణింపరాదా, శరణని వేడి మొరసేతుగదా,
పరులను వేడ, నెరుగనుగాదా, కరుణింపరా, వట్టి
కలుపాత్ముడైన యా, కాకాసురుని మున్ను గాపాడితివి
గాదా ॥కో॥

4. పుష్పాద్రివాసా, బ్రోవుము దేవా, పుండరీకాక్షా బ్రోవగ
వ్రతము, బూనియుంటివిగాదా, భువిలో నీకొకమారు
బూని ప్రణతిసేయ, బొంగివారల భయము బోదోలుదట
గాదా ॥కో॥

5. పంకజనాభా పాదముబట్టి ప్రణుతింతు గాదా
యింకనైన నన్నేలగరాదా, పొంకముతో లింగం
వెంకటరామదాసు జంకుదీర్చువానివంక వ్రాలగలేదా ॥కో॥

## రామా రక్షింపవే

(సౌరాష్ట్ర) రాగం - ఆది

ప॥ రామ శ్రీరామ రక్షింపవేమమ్మ రాజలలామ
రామ ప్రణతసుత్రామ విజిత భృగురామ
మనోహరనామ సుధామ ॥రామ॥

శ్రీమనోహరోద్దామ సుగుణసంధామ
మనోజ్ఞరుచిసీమ దైత్యసంగ్రామభీమ
బలభూమ కామద శ్యామ
కోమలధామ లలామ ॥రామ॥

గట్టికృపనించు భక్తుడ చేపట్టి రక్షించు
వట్టి వట్టి భ్రమ గట్టిపెట్టి బలు
జెట్టివని నినుబట్టితి వేలుపుచెట్టుతుండనుచు
దొట్టినభక్తిని దిట్టిన, గొట్టిన, గట్టిన విడువ ॥రామ

ఏలరావేమి పిలిచిన పల్కవేల నాసామి
తాళజాల నన్నేలవేల కరుణాలవాల
శుభలీల నీలరుచిజాల జాల మిటులేల
పన్నాల బ్రహ్మ పరిపాలనలీలా

## మేలుకొలుపులు

### కృష్ణా మేలుకో

(భూపాల రాగం)

బంగారు చెంబుతో పన్నీరుపట్టుకు పణతి రుక్మిణివచ్చె మేలుకో
రంగైన బంగారు కెంగేల బూనుకు తరుణి సత్యవచ్చె ,,
దంతకాష్ఠముబూని తామరసాక్షి సుదంతవచ్చియున్నది ,,
అంతకుముందే రుమాలు పట్టుకు జాంబవంతునిసుత వచ్చె ,,
పొందుగకస్తూరి బరణి పట్టుకు కాళింది వచ్చియున్నది ,,
అందముగ నిలువుటద్దము పట్టుకు మిత్రవింద వచ్చియున్నది ,,
బాలభోగములు పంచదార తేనె భద్ర తెచ్చియున్నది ,,
వాలాయంబుగ తాంబూలము పట్టుకు లక్షణ వచ్చి నిలుచున్నది ,,
ముదముతో వీణ వాయించుచు నీరేజ వదన రాధవచ్చె ,,
పదహారువేల గోపికలు సొగటాల పాళి దెచ్చియున్నారు ,,

## కృష్ణుని మేలుకొల్పు

రాజగోపాల శ్రీ - రాజరాజాభోగి - రాజతల్పము
నుండి లేవయ్యా, కృష్ణా, తేజఃపుంజములతో రావయ్యా ॥రా॥

1. అరుణోదయంబాయె, నంభోజములు విచ్చె, అదుగో
తూర్పువేగె లేవయ్యా, కృష్ణా, అఖిలలోకాధీశ రావయ్యా ॥రా॥

2. వాతపోతములెల్ల, ఆతతముగ దిశల శీతలముగ
వీచె లేవయ్యా, సకల, భూతాత్మక వేగ రావయ్యా ॥రా॥

3. క్షిప్రముగా నదుల విప్రవరేణ్యులు వోగి వేదపాఠకులైరి
లేవయ్యా, కృష్ణా, వేదాంత సంవేద్య రావయ్యా ॥రా॥

4. పూనిదాసకోటి స్నానాదివిధులకై, సంభారములు దెచ్చె
లేవయ్యా, కృష్ణా, సకలామరసేవ్య రావయ్యా ॥రా॥

5. నవపీతాంబరముల, నానాభూషణముల, నాతి రుక్మిణి
దెచ్చె, లేవయ్యా, శ్రీమన్నారాయణా దేవ రావయ్యా ॥రా॥

6. సకల గంధములను సమకూర్చి ప్రీతితో, సత్యభామయు
తెచ్చె, లేవయ్యా, కృష్ణా, సత్యసంకల్పకా రావయ్యా ॥రా॥

7. జాజిపూలసరుల భాజనముం దెచ్చె, భామజాంబవతి
లేవయ్యా, భక్త, భవబంధమోచక రావయ్యా ॥రా॥

8. సుందరియైన కాళిందీ తాంబూలము లందముగ దెచ్చె
లేవయ్యా, కృష్ణా, నందనందన వేగ రావయ్యా ॥రా॥

9. మిత్రవిందయు నీకు, చిత్రమైన శ్వేత, చ్ఛత్రముదెచ్చెను
లేవయ్యా, కృష్ణా, చిత్ర సచ్చారిత్ర రావయ్యా ॥రా॥

10. తరుణి నాగ్నజిత్తి ధవళ చామరములు, ధరియించి
నిలిచెను, లేవయ్యా, కృష్ణా, దమితదైత్యజాల రావయ్యా ॥రా॥

11. భద్రాదేవియు నీకు బహువిధములుగాను, బాలభోగ
మొనర్చె, లేవయ్యా, సకలభద్రసంధాయకా రావయ్యా ॥రా॥

12. రమణి లక్షణ షడ్రసయుక్తమైనట్టి, రాజభోగము
గూర్చె, లేవయ్యా, శ్రీమద్రాజగోపాలక రావయ్యా ॥రా॥

13. నూరుపదహార్వేలు నారులందరు నిన్ను జేరి సేవించేరు
లేవయ్యా, కృష్ణా, కోరికలీడేర్ప రావయ్యా ॥రా॥

14. రాజులెల్ల మకుట రత్నదీపముల, నీ - రాజనమిచ్చేరు
లేవయ్యా, కృష్ణా, రాజాధిరాజేంద్ర రావయ్యా ॥రా॥

15. భాష్యకారులు నిన్ను, భాష్యార్థములచే సంభాషింపు
చుండిరి లేవయ్యా, కృష్ణా, భామాపతిజనక రావయ్యా ॥రా॥

16. ధర్మవరములోని, దాసగణములనెల్ల, దయజూచి బ్రోవగ
లేవయ్యా, కృష్ణా, తగు సింహాసనమునకు రావయ్యా ॥రా॥

17. దారుకుడను, రథసారథిరథమును, గోరిసిద్ధముచేసె,
లేవయ్యా, సభం - జేర గరుడధ్వజ రావయ్యా ॥రా॥

18. వినతుడగుచు లింగం, వేంకట రామదాసు, వినుతింపు
చున్నాడు లేవయ్యా, స్వామి, వేగ మాతని బ్రోవ రావయ్యా॥రా॥

## వీ ర రా ఘ వ లే రా

ప॥ లేర నాపాలి శ్రీవీరరాఘవ లోకా
ధార మాధవ శౌరి లేరా ॥లే॥

కారుణ్యసాగర కలుషవిదూర నను
కరుణింతువు వేగలేరా ॥లే॥

అత్రివసిష్ఠాది మునులు మీకృపగోరి
పాత్రులై యున్నారు లేరా

పద్మమిత్ర వంశోద్భవ గోత్ర నారద నుత
చారిత్ర పవిత్ర లేరా ||లే||

తెల్ల యేనుగువచ్చి వాకిట నున్నది
నల్లని నాసామి లేరా
కల్లగాదు జగమెల్ల యేలెడు రఘు
వల్లభ యిక నిద్రలేరా ||లే||

అభ్యంగనము నీకు నమరంగ జేసెదు
ననువైన వేళాయె లేరా ||లే||

సభ్యులందరుగూడి సాక్షాత్కరించిరి
సంశయములు మాన్ప వేరా ||లే||

పరమభక్తులు నిన్ను ప్రార్థింపుచున్నారు
పన్నగేంద్ర తల్ప లేరా
వరభద్రాచలమున శరణాగతత్రాణ
బిరుదుబూనిన తండ్రి లేరా ||లే||

నిరతము సంసార భరము బాపెడి భక్త
వరద సీతారామ లేరా
తూము నరసింహదాసుని వెరవకుమని
వెంటదిరుగు వేళాయె లేరా ||లే||

## వైకుంఠవాసా లేరా

(భూపాల రాగం)

1. కేశవ యని నిన్ను వాసిగ భక్తులు
వర్ణించుచున్నారు లేరా
వాసవవందిత వసుదేవనందన
వైకుంఠపురవాస లేరా ||తెల్లవారవచ్చెను లేరా||

2. నారాయణా నిన్ను నమ్మినవారిని
కరుణబ్రోతువుగాని లేరా
శరణన్న విభీషణాదులను బ్రోచిన
బిరుదు నీకున్నదిలేరా ||తె||

3. మాధవా యని నిన్ను యాదవులందరు
మన్నించుచున్నారు లేరా
మందరగిరిధర మణిభూషణధర
సుందర రూపుడ లేరా ||తె||

4. గోవింద యని నిన్ను గోపికలందరు
గొల్లవాడందురు లేరా
చల్లనిచూపులు తెల్లనినామము
నల్లని నాసామి లేరా ||తె||

5. విష్ణురూపముదాల్చి వివరముతెరిగిన
విష్ణు స్వరూపుడ లేరా
దుష్ట సంహారక దురితము లెడబాప
దీనదయాకర లేరా ||తె||

6. మధుసూదన నీవు మగువలతోగూడి
మరచి నిద్రించేవు లేరా
ఉదయార్క బింబము ఉదయించు వేళాయె
వనరుహలోచన లేరా ||తె||

7. శక్రాదివినుత త్రివిక్రమ రిపుహర
చక్రాయుధధర మేలుకో
శుక్రాదిగ్రహములు నీసుందరరూపము
చూడగోరుచున్నారు లేరా ||తె||

8. భూమీసురుడవై భూదానమడిగిన
పుండరీకాక్షుడ లేరా
ముదమొప్ప వామన నామము దాల్చిన
వామనావతారుడ లేరా ॥తె॥

9. శ్రీధర గోవింద రాధామనోహర
యాదవకులతిలక లేరా
రాధావధూమణి రాచిలుక పంపింది
బోధ తెలుపుదుగాని లేరా ॥తె॥

10. హృషీకేశ భూమిలో మంచివార్తలు దెచ్చి
వచ్చికూర్చున్నారు లేరా
ఖరదూషణాదుల ఖండించినటువంటి
కరుణా కటాక్షుడ లేరా ॥తె॥

11. పద్మనాభుడ నిన్ను పద్మభవాదులు
భారకు డనియేరు లేరా
పరమపావనమైన తారకనామము
నమ్మిగొల్చుచున్నారు లేరా ॥తె॥

12. దామోదర నీ నామమె దిక్కని
దాసులున్నారయ్యా లేరా
దాసాను దాసులను దయతోటి బ్రోచేటి
ధర్మము పాలింప లేరా ॥తె॥

13. సంకర్షణ నామము స్వాటు దాల్చినావు
పరవి తెల్లవారె లేరా
భామామణి సత్యభామ రమ్మటంచు
భామను పంపింది లేరా ॥తె॥

14. వాసుదేవ భక్తనరజనపోషక
వసుదేవనందన లేరా
కంససంహారక కలుషము లెడబాప
కరుణాకటాక్షుడ లేరా ॥తె॥

15. ప్రద్యుమ్న నాముడ ఖర్జూరఫలములు
కానుక లొచ్చాయి లేరా
కానుక లందుక కరుణతో బ్రోచేటి
కరిరాజవరదుడ లేరా ॥తె॥

16. ఆదిదేవ వరద అసురసంహారక
అనిరుద్ధ నాముడ లేరా ॥తె॥
అఖిల జంతువులకు ఆహారమియ్యావలె
ఆదినారాయణ లేరా ॥తె॥

17. పురుషోత్తమా నీదు పుణ్యచరిత్రము
భూమిలో వెలిసింది లేరా
శరణాగతత్రాణబిరుదు నీకున్నది
శశిధరసన్నుత లేరా ॥తె॥

18. అనుదినంబును భక్తజనులను బ్రోచెడి
అధోక్షజా నీవు లేరా
ఘనమైన రుక్మిణి కానుక లంపింది
కరుణబ్రోతువుగాని లేరా ॥తె॥

19. నరసింహరూపము నరుడుగ దాల్చిన
నరహరిరూపుడ లేరా
నారదాదిమునులు నమ్మికొలిచెద రిదె.
నందతనూభవ లేరా ॥తె॥

20. అచ్యుత మాధవ అసురాంతక హరి
అమరేంద్రవందిత శేరా
స్వచ్ఛమైన శేషశయను డంబురు నిన్ను
జగదేకనాథుడ లేరా ॥తె॥

21. శ్రీజనార్దన నిన్ను సేవింపవలెనని
శ్రీరుక్మిణి వచ్చింది లేరా
సుందరముఖులతో సొక్కి నిద్రించేవు
సొంపెల్ల దెలిసేను లేరా ॥తె॥

22. పాపపు రక్కసిపాలు ద్రావినట్టి
ఉపేంద్రనాముడ లేరా
పాపము లన్నియు పారద్రోలినట్టి
భవ్యచరిత్రుడ లేరా ॥తె॥

23. శ్రీకృష్ణ నీతోడ చెలులందరుగూడి
జలక్రీడ లాడేరు లేరా
చెలుల వలువలన్ని చెట్లబెట్టినట్టి
శేషాద్రివాసుడ లేరా ॥తె॥

## నల్లని నాసామి

ప॥ తెల్లవారె నమ్మ చెల్ల నే నేమందు
నల్లని నాసామి లేరా ?
మరల పడుకునేవు మసలుచున్నావు
మర్యాదగా దిక పోరా ॥తెల్ల॥

కలకల మని పక్షిగణములు కూసెను
కాంతుడ యిక నిద్ర లేరా

జలజారి కాంతులు వెలవెల బారెను
తలుపు దీసి చూడు లేరా ||తెల్ల||

తరుణు లందరు లేచి దధి చిల్కు వేళాయె
తడవుండ రాదింక లేరా
అరగంటి చూపుతో నట్టిట్టు చూచేవు
నెరజాణవౌదువు లేరా ||తెల్ల||

గోపీమనోహర గోవర్ధనోద్ధార
నాపాలి యదువీర లేరా
కాపురము క్రొత్త గడుసురా మాయత్త
నీపుణ్య మాయెను పోరా ||తెల్ల||

గుసగుస మాటాడ కూడ దంటే నీవు
గుప్పెత్తుచున్నావు లేరా
పసితనంబేకాని పెద్దతనమును లేదు
బాగాయె నిక చాలు పోరా ||తెల్ల||

బాల గోపాల శ్రీలోల సత్కృపాల
వాలధర్మ లేచి రారా
చాలుచా లీరీతి ప్రాలుమాలగ నేలా
వేళగాదు లేచి పోరా ||తెల్ల||

పొమ్మంటి ననుచు నీబుద్ధిలో నెంచకు
ప్రొద్దు లేదని యంటిలేరా
దీపకాంతులెల్ల తెల తెల నయ్యెను
దేవ దేవ మేలుకోరా ||తెల్ల||

ఈరేడు లోకములు నీనోట తల్లికి
నెరుగ జూపిన స్వామి లేరా
కారుణ్యమూర్తి నా నేరము లెంచక
కరుణయుంచి లేచిపోరా ॥తెల్ల॥
నీ జగన్మోహనరూపము కనులార
నే జూడగోరెద లేరా ॥తెల్ల॥

## శ్రీరామచంద్ర మేలుకొలుపు

పల్లవి: మేలుకొను శ్రీరామచంద్రా
మేలుకొను సత్కీర్తిసాంద్రా
మేలుకొను నీసేవకులము
మేలుకొనుమయ్యా ! ॥మే॥

క్షీరవారిధి శేషశయన, శ్రీరమామణి పదములొత్తగ
నిదురబోయెదు నీదుభక్తులు, నెగులు పొగలగను ॥మే॥

సోమకుడు వేదములు దొంగిలి, సాచ్చె నంబుధి నంబుజాసను
నోమి వాని సముద్ధరింపగ, నోలి మేల్కొనుమా ॥మే॥

మందరము పాల్కడలి మునుగ, నమందగతి పైకెత్తి యమృతము
విందుచేయగవలెను సురలకు, ముందు మేల్కొనుమా ॥మే॥

ధరణితలమును చాపచుట్టుగ, దనుజడల్లదె చుట్టుచుండెను
తవిలి వాని వధింపగావలె, దయను మేల్కొనుమా ॥మే॥

దేవుడను నేనుండ హరి గిరి, దేవు డంగురు చూపుడని భ
క్తావళిని బాధించు దానవు, కావరము నణప ॥మే॥

రాక్షసుల ప్రభు వేచి సాధుల, శిక్షలకు పాల్సేయుచుండెను
రక్షణము కృపసేయగా, ప్రత్యక్షమగుటకును ॥మే॥

అష్టకష్టము ప్రజల పెట్టెడి దుష్టులౌ నరపాలకుల పద
భ్రష్టమొనరించి రామరాజ్య ప్రతిష్ఠ నిలుపగను ॥మే॥

లంక రక్కసి దొరలదొర, అక లంకయగు మాలక్ష్మిభూమిజ
శంకలేక హరించె తత్కుల - మింక నింకింప ॥మే॥

మర్మమున గైకొన్న రాజ్యము, ధర్మనియతిని గోర నీయని
దుర్మదుల దుశ్శాసనాదుల తుదిని ముట్టింప ॥మే॥

గగనమున కనపడక తిరుగుచు, జగములను పీడించు ద్రోహుల
విగతప్రాణుల జేసి మాకిల, సుగతి వగుటకును ॥మే॥

## మేలుకో కోటయ్య

ప॥ మేలుకో కోటయ్య మేలుకో జగమెల్ల
యేకచక్రముగాను యేలుకో
వాలాయముగ జనుల పాలన చేయను
ఫాలలోచన నిద్ర మేలుకో ॥మేలుకో॥

తెల్లవారవచ్చె యెల్లమందకొండ వెలసి
కోర్కెలిచ్చిన సామి మేలుకో
నాలుగురాజ్యాల నరులంత వచ్చిరి
నాగభూషణ నిద్ర మేలుకో
కోటిప్రభలు చాల కొండచుట్టున్నవి
కోరి మునులు జూడ మేలుకో
అండబాయక జను లెండలో నున్నారు
మండలాధీశ్వర వేగ మేలుకో ॥మే॥

వెరువక జనులెల్ల హరహర యిమ్ముల
ఆర్భాటములు చేయ మేలుకో
ఆలించి జనులను పాలనచేసెడి
నీలకంఠ నిద్ర మేలుకో ॥మే॥

సతిపతులందరు సంబరం చేయుచు
సరిగంగ లాడిరి మేలుకో
సరివచ్చు కైలాసమనుచు యెల్లమందన్
వరకవులు ప్రార్థింప మేలుకో ॥మే॥

బిందుకళాతీత మెందుజూచిన నీవు
సందు లేకున్నావు మేలుకో
కందుకూరంబను కాచి రక్షింపను
ఇందుశేఖర నిద్ర మేలుకో ॥మే॥

## అంబ మేలుకొలుపు

పల్లవి॥ తెల్లవారవచ్చె ముల్లోకపావని
మొల్ల సుగంధిరో మేలుకో
తల్లివి శ్రీశైల మల్లేశు పట్టంపు
నిల్లాల జగదంబ మేలుకో ॥తె॥

శ్రీసతి బ్రహ్మాదిసేవితాంఘ్రీవాస
లీలావిలాసిని మేలుకో
వాసవహారి కమలాసనవందిత
దాసజనాధారి మేలుకో ॥తె॥

పాశఖడ్గకుంతలాళ చక్రసన్ని
వేశకరాంబుజ మేలుకో
ఓసర్వమంగళ యోసుధీధామ మహి
షాసుర సంహారి మేలుకో ॥తె॥

కుంకుమ మలయజ పంకలిప్త దేహ
ఓంకారరూపిణీ మేలుకో
శాంకరివి దివ్య శంఖము తోడుత
జంగము మ్రొక్కెను మేలుకో ॥తె॥

ఓంకారరూపి గళాంకుశపాణి మృ
గాంకమాళిధారి మేలుకో
కంకణమంజుల కింకిణి తాటంక
కాంతిధగద్ధగ మేలుకో ॥తె॥

## శివకాశి గంగ

ప॥ మేలుకో ఆకాశగంగ మేలుకో శివకాశిగంగ
మేలుకో శంభునిరాణి మేలుకోవమ్మా గంగా ॥మే॥

వెలసితివి నీవు శివకాశీయందున
వేడ్కతోను గన్నతల్లీ గంగా
గోత్రాన్నుంచి వచ్చేవమ్మ ఘనురాలవుగా గంగా ॥మే॥

భాగీరథుడు నిన్ను తెచ్చెను
పరిపరి విధముల స్తోత్రించి
భాగీరథునివంటి భక్తులము గాము
పణతి నీకిపుడు గంగా ॥మే॥

తూర్పు తెల్ల వారె నమ్మ
తూలనాడకమ్మ కన్నతల్లి లేచి
మోక్షమియ్యవమ్మ గంగాభవాని ॥మే॥

మేలు పవళిస్తే విశ్వేశ్వరుని సన్నిధి పణతినీవు
సంతోషముగను కన్నతల్లి
మోక్షమియ్యవే ఘనురాలవు గంగా ॥మే॥

అసివరుణామధ్య నిలిచి అమ్మరో
యీరేయి గక్కున
స్నానానికి వచ్చి నిన్ను తరుణీ లేపితిని గంగా ॥మే॥

కడప కర్నూలు రాజ్యములనుండి ప్రజలందరు
వచ్చి నిలిచిరి ఘట్టముల నిండిరి
తల్లీ ఘనురాలవు గంగా ॥మే॥

గరుగుగుండము దగ్గర నీవు
ఘనముగా శివగంగ వయితివి
ఆది మణికర్ణిక వయితివి అందముతో
పవ్వళించిన అతివ మేలుకొనుమా గంగా ॥మే॥

నిన్ను నమ్మకువారు వచ్చిరి
నిజముగా శివకాశి కిప్పుడు
కన్నతల్లీ మోక్షమియ్యవె
కపట ముంచకనూ, గంగా ॥మే॥

సతిపతులకు మోక్షమిచ్చి
సంతోషముగాను గంగా
వేగలేచి మోక్షమిచ్చి వెలదిరో శివకాశిలోపల
షతితోడ మేలుకొనుమీా పణతి శ్రీగంగా ॥షే॥

సతిపతులు కూడుకుని సరిగంగ స్నానమాడితిరి
వారికి మోక్షమియ్యావె తరుణి యీవేళ గంగా
మేలుకో ఆకాశగంగా మేలుకో శివకాశిగంగా
మేలుకో శంభునిరాణి మేలుకోనవమ్మా గంగా ||మే||

## రంగవిభక్తి హెచ్చరిక

(పున్నాగ — రూపకం)

రంగా భవభంగా సత్సంగా ఉత్తుంగా
గంగానుత చరణ భుజంగా హెచ్చరిక ||రం||
ధీరా సువిచారా ఫణిహారా ఘనశూరా
జారా మురహార వరసుకుమారా హెచ్చరిక ||రం||
లీలా వరచేలా సువిశాలా నరఖేలా
బాలా మధుజిత బుధపరిపాలా, హెచ్చరిక ||రం||
శౌరీ నెల్లూరిపురవిహారీ సువిచారీ
నారీమణి హృదయ సంచారీ హెచ్చరిక ||రం||

## శ్రీరామ హెచ్చరిక

(శంకరాభరణము)

శ్రీ సన్నుత బలభిన్నుత శ్రీశా జగదీశా
భూసురపాలక సురపోషా హెచ్చరిక||
సుందర మృదు మందస్మిత శోభా శ్రితసులభా
కందర్ప సమానాకృతి కలభా హెచ్చరిక||
శ్రీమానిత పరిపూరిత కామా గుణసీమా
రామా యేనుగుల మహల్ధామా హెచ్చరిక||

ఆనందముతో డెందము ననువందగ ప్రేమా
మూనిన శ్రీమానినితో పొందిన హెచ్చరిక
శ్రీరామ బ్రహ్మార్చిత శీలా శుభలీలా
శ్రీరామా వరకాంచనచేలా హెచ్చరిక॥

## దీ ప ము

(తోడి - ఆది)

పల్లవి:- దీపం దర్శయామి యనుచు
దీపము నిచ్చెద సామి ॥దీ॥
దీపము త్రైలోక్య దీపము, విజ్ఞాన
దీపము రఘుకుల దీప ముదంబున ॥దీ॥
అజ్ఞానాంధకార హరణ దివ్యాకార
విజ్ఞానమయసార విదితకృపాపూర ॥దీ॥
పన్నాల రామబ్రహ్మార్చిత కామ
సన్నుతగుణధామ శరణు సీతారామ ॥దీ॥

## పాండురంగని ఆసనం

పల్లవి : పాలించరా పాండురంగా
ఆసనంమీద కై సేయగదె।
భాసమాన చిద్విలాసా మహోన్నతా ॥పాలిం॥
తగటు బంగారున నిర్మించి నవరత్న
స్థగిత మయినట్టియు వినుతా ,,
విధ్యుక్త బిందు కోణములు వెలయ
నిర్మించినా వింతాయెనా శ్రీచే॥ ,,

ఆగమములను గాలించి యోగివరులన్ ॥పాలిం॥
నియోగించు శ్రీనిత్యా ,,
శ్రీసఖ వాణీశ ముఖులు నీ
సేవ నచ్చి దాసులై వచ్చిరి ,,
తమపాదపద్మాలకు తగిలెడునట్టి
సుబ్రహ్మణ్యా మానసమున ,,

## నైవేద్యము

(సౌరాష్ట్రము - అట)

పల్లవి:- చెలగి భుజింపు రాఘవ సీతాదేవితో ॥చె॥

అ.ప. :- తెలినులి వెచ్చనన్నము - తిమ్మనంబులు పాయసంబులు
పలు తెరంగుల పిండివంటలు-తలుకు బంగారు గిన్నెలనుంచిరి ॥చె॥

1. బూరెలు బొబ్బట్లు పోళీలు లాడూలు
గారెలు ఖజ్జము లతిరసాలు సారెకు
కక్కెర లుక్కెర లెక్కువ చక్కెర
చిక్కని మక్కువ నుంచితి ॥చె॥

2. పనసతొనలు నవటి పండులు
తనివితీర ఖర్జూరపండులు
మనసు వచ్చిన యనాసపండులు ॥చె

3. మంచి చెరకు పానకంబులు
మధ్యే మధ్యే పానీయంబులు
నుంచితి పన్నాల రామబ్రహ్మసూరి
నొప్పుగ వరముల మెప్పించు నాసామి ॥చె॥

## కుక్కుటేశ్వరుని ఆరగింపు

ప॥ ఆరగించు కుక్కుటేశ ఉమామహేశా
ఆరగించు కుక్కుటేశ ఉమామహేశా ॥ఆ॥
ఆరగించు కుక్కుటేశ అరటిపండ్లు మామిడిపండ్లు
వేరుపనసపండ్లు గంగానారికేళఫలములు
పాలు పెరుగు తేనె జున్ను పంచదార మీగడలను
చాల చెరకుపానకములు సరసభక్తజనము లొసగ ॥ఆ॥
వరుగు లప్పడములు మంచి వడియములును
కడియములును మిరెపచారు తిమ్మనములు
కర్జకాయ లట్లతోడ
బూరె లరిసె లప్పములను గారెబొబ్బట్లనెయ్యిచారు
పప్పుపచ్చడులును కూరలన్నమమృతవస్తు ॥ఆ॥
అర్ణవోద్భూతగరళ మశనమింక జాలునదియె
స్వర్ణరత్న పాత్రలందు షడ్రసోపేతముగను ॥ఆ॥
ప్రాకటముగ మంచిపండుటాకులను వళాగ్రములను*
జోకైన ముత్యపు సున్నమించు కంత వేడ్క ॥ఆ॥

## భక్తి పాన్పు

(హిందూస్థాని - తోడి)

పల్లవి : పాన్పును వెయ్యారే పడతులార పసిడి చేమంతితో
పడక శృంగారించి ॥పా॥
జివ్వాది పునుగును మువ్వగోపాలునకు
నవ్వుచునుండెడి నవమోహనాంగునకు ॥పా॥

---

*వళాగ్రము = గుండ్రనీ (అనగా నడిమికి కోయని వక్క) ఇది వక్కలలో శ్రేష్ఠమైనదిన్నీ, దొక్కపట్టనిదిన్నీ అని చెబుతారు.

జాజివిరులతోను రోజపువ్వులతోను
వాసనల్ మెరయు వనితలార గూడి ॥పా॥
పంకజనేత్రునకు పరమదయాళునకు
పరిపరివిధముల పడక శృంగారించి
అలివేణి వాసునకు అభయదాయకు డగు
వెలయు సర్వేశునకు మూలాధారునకు ॥పా॥
కోరికలెల్ల నొసగెడు ధీరునకు
వర కేశవపుర వాసునకు నిల ॥పా॥

## ధూప మిదిగో

పల్లవి॥ ధూప మిదిగో చంద్రశేఖరా
మాపూర్వజన్మ పాప మణచ ఓదయాకరా ॥ధూ॥

అ. ప. కోపతాపములను, సర్వవ్యాపకా అఘకూపమంత
బాపి భక్తవరుల బ్రోచు నాపరంజ్యోతికిపుడు ॥ధూ॥

లక్ష్యలక్షణ విచక్షుల - రక్షించి గణా
ధ్యక్ష నీకటాక్ష ముంచరా ॥ధూ॥
సాక్షిగాజగములన్ని - కుక్షిలోన నిల్పిబ్రోచి
దక్ష గర్వమణచి నట్టి - మోక్షమిచ్చుస్వామి కిపుడు ॥ధూ॥

## దశావతార మంగళహారతి

(బిళహరి రాగం ఆదితాళం)

ప॥ మంగళ మనిపాడి మందయానలు గూడి
పొంగుచు రాములకు హారతు లివ్వారే
మంగళ హారతు లివ్వారే !

1 సోమకాసురు ద్రుంచి సామాదివేదములు
సంగ్రహించి విధాతకు ప్రేమా నొసగినట్టి
సామజవరదుడా మత్స్యావతారునకు మంగళం
రామామంగళం ||మం||

2 సురలు అసురులు మందరము కవ్వముచేసి జలధి
తరచుచురాగా గిరిభారము క్రుంగి తిరుగకున్నా
మందరము వీపున నెత్తి మోయు విష్ణువుకు ||మం||రా||మం||

3 ధర చాపవలె జుట్టి శిరముసం దిడుకొన్న
హిరణ్యాక్షు ద్రుంచి ధరను తిరిగిభూజనుల కొసగి
వారి నరసి బ్రోచిన శ్రీవరహావతారునకు ||మం||రా||మం

4 హరిహరి యని యనుదినమున బల్కు శ్రీ
హరిభక్తు ప్రహ్లాదు నరసిప్రోచి హిరణ్యకశిపు
శిరము ఛేదించిన నరసింహునకు ||మం||రా||మం||

౫ బలిని మూడడుగు లడిగి పుడమినణగద్రొక్కి
బలికి మోక్ష మిచ్చిన వామనావతారునకు ||మం||రా||మం||

౬ జమదగ్ని గర్భవాసమున బుట్టి
యిరువదొక్కమారు భువిలో రాజులగొట్టి
మహిని భూసురులకు దానమిచ్చిన
పరశురామావతారా ||మం||రా||మం||

7 ఇనవంశమున బుట్టి శంభుని విల్విరిచి
జనకసుత పెండ్లాడి రావణుతల ద్రుంచి
రమణి నేలిన రామా||మం||రా||మం||

8 సామజపట్టణంబు సాగరంబులో గలుప
నాగలి వైచిన కరుణాపరునకు
యీ బలరామావతారునకు ॥మం॥రా॥మం॥

9 బుద్ధావతారమున బుద్ధులు చెరపి నరుల
హద్దులేక యేలి ద్రేపల్లెలో వెలసిన చిన్నికృష్ణా॥మం॥రా॥మం॥

10 కల్క్యావతారమున పృథ్విలో ఖలుల ద్రుంచి
పురుషోత్తములో బుద్ధితో వెలసిన
జే జగన్నాథావతారా ॥మం॥రా॥మం॥

## 1 దశావతార శబ్దములు.

1. తద్దినుతదీనుత తహాతతహాత తిత్తహాత్త
ఝంతరితరితరి తధణాకిణ తకిటకిట తధణాతరి
తాకుఝెకితకి ఝెకితణక హామికిగల
సోమకాసురుని బట్టి కొట్టి వేదములుదెచ్చితివా
మత్స్యావతారా జై మత్స్యావతారా జై మత్స్యావతారా॥

2 కకుంధరికిట కకుధరికిట దరికిటతక
తళాంగు ధిమితక తధిగిణతోం
సురాసురులు సుధకొరకై మంధరగిరి చే దుగ్ధాబ్ధిని దరువగ
గిరిగ్రుంకిన మరి వెరువకు డంచును గిరియెత్తి మరిసురులను
బ్రోచిన కూర్మావతారా జై కూర్మావతారా
జై కూర్మావతారా॥

3 దధీదిత్తతోం తాకిటకిటఝుం ఝుం ఝుంకిటఝుంఝుకిణనకతక
దధీగిణతోం॥

అతలతలసుతల మహాతల రసాతల తలాతల
పాతాళంబున జొచ్చి హిరణ్యాక్షుని గెలిచివచ్చితౌవరాహా
వతారా జై వరహావతారా జై వరాహావతారా॥

4 జేఝేకిటతక ఝంకిణనక తకనాంతత
ఝాంతకతకుంచిక్కధిక్కుతక దదిగిణతోం॥
పరిపరివిధముల ప్రప్లాదుడుమిము హరిహరి యనుచును మొర
విడ ఘనముగ నురమున స్తంభము విరచుక వెల్వడి
కరకర హిరణ్యకశ్యపు నురమును చరచి రక్తమునరగున
ద్రావిన నరహరి నీవని మరిమరి పొగడెను
కరుణజూడు కరివరద మహారాజ సలాం, నర,
సింహావతారా నర సింహావతారా నర సింహావతారా॥

5. జకజకజకకిణ ఝేకిణ చెలిమిని మూడడుగులచేతనుబలిని గెలి
చిన భూమిలో అదితితనయా ॥శ్రీ॥
వామనావతారా జై వామనావతారా జై వామనాతారా

6. తద్దిమిత వీరపరాక్రమభంజన దురితాత్ముండైన కార్తవీర్యా
ర్జునుకలుషము లెడలించిన ఘనుడవుగద పరశురామావతారా
పరశురామావతారా ॥మహారాజసలాం॥

7. తకడికతక ధిండిక్కిడతక ఢింక్కిత్తదతక ఢిక్కిడితక॥
సతికొరకై దశముఖునితో శతపోరి వానివధించిన
శరణాగతరక్షక శ్రీరామా ॥మహారాజ సలామ్॥

8. తకితఝేం ధిమితకిటఝేం ధిమి, హలము చేతను
హస్తిపురమును తృణముగా పెకలించి హలము
ముల్కిచేతను ప్రలంబాసురుని గెలిచివచ్చితివో, బల
రామావతారా, బలరామావతారా॥

9. ధణతక ఝునతక పాండవులను రక్షించెడి
కుండలిశయన భూస్థలిని — దుండగీ డగుకంసుని చెండాడిన
శ్రీకృష్ణావతారా, శ్రీకృష్ణావతారా॥

10. ధణతత కిటతక గిణతఝుణుత తకిటతకదధిగిణతోం॥
భూమిలోపల బౌద్ధరూపము పొందుగధరియించి
వృద్ధి గలిగినశరముల రాక్షసులను మర్దించి
పొందుగ యీజగము బ్రోచిన బౌద్ధావతారా
బౌద్ధావతారా జై బౌద్ధావతారా॥

11. తఝుంతరితతక తఝుంతకుంతరి తఝునధధంధిమ
తకిటతకిటతక తధిగిణంతోం॥
కలియుగాంతమున కలిగియు వేగమే
ఖలులను ద్రుంచిన కల్క్యావతారా
కల్క్యావతారా జై కల్క్యావతారా॥

## 2 తాళాల, చిడతల, హరిభజనలు

ఈభజనలు జానపదులు అందరూ చేస్తారు. తెలుగునేలనాలుగు చెరగులందూ ఇవి మిక్కిలీప్రచారంలోవున్నాయి. మధ్యను దీపంసెమ్మెగాని, పొన్న చెట్టుగాని వెలిగించుకొని చుట్టూ నిల బడి చుట్టుకీర్తనలూ, అడుగుకీర్తనలూ పాడుతూ నాట్యంచేస్తూ, ముఖ్యమైన అన్ని తాళాలమీదనూ కీర్తనలు పాడుతారు. రాగంతోటీ,అభినయంతోటీ అన్ని రసాలు ఒప్పిస్తారు. తరచుగా కీర్తనలకు శబ్దాలు వేస్తూవుంటారు.

అభినయంచేస్తూ అడుగులువేస్తూ నిల్చోవడం, కూర్చోవడం, వంగడం చూస్తే పద్మదళాలు వికసిస్తూ, ముడుచుకొంటూ

వున్నట్లు తోస్తుంది. వారిదృశ్యం నయనానందకరంగావుంటుంది- వీరు ఎక్కువగా రామాయణకథాకీర్తనలూ, శ్రీకృష్ణలీలా కీర్తనలు పాడుతూవుంటారు.

కొందరు పాత్రానుకూలంగా వేషాలు వేసుకుని వీధినాటక ఫక్కీలో కథనంతయూ ప్రదర్శిస్తూవుంటారు.

ఇటీవల ఉపాఖ్యానాలు కూడా, భజననాటకాలుగా ప్రదర్శింప బడుతూ వున్నాయి.

తాళాలు రెండుచేతులతోను, కర్రచిడతలు రెండుచేతులతోనూ, హారిభజనచిడతలు ఎడమచేతితోనూ వాయిస్తూ ఈభజనలు చేస్తారు.

## భజనపిలుపు పాట

(ముఖారి-ఆది)

రండీ యలయక మీరందరు రాముని భజనకు వేగ
రండీ చిడతలుతాళాల్పట్టుకు రద్దినిచేయండీ
మీరురండీ ఓభక్తులారా ఖండితోక్తులు పలుకరండీ
కార్యముజూడరండీ తెండి నూనె
తోచినకొద్దీ దీపాల్పెట్టండీ
రండిరండి హారేరామ యటంచును
పండితులయినను పామరులయినను
మండిగలోన నఖండము నిల్పుచు
నిండువేడ్కగను పండుగ దొరకును॥ రండి
గోవిందగోవిందా యనుచును గుంపులుగూడండి
మీరు భావించి యిహాపరములు రెండు భక్తినిజూడండీ
నీవే నేనను నేనేనీవంచును గోవిందుని మది
గోరి భజింపుచు సావకాశముగ చక్కనిప్రేమల

సేవింపుడు మన చిద్రము వదలును రండి
అరటిపళ్ళు కొబ్బరి బెల్లము హారతికర్పూరము
తనివితీర గొబ్బున తెండి తాత్పర్యముతోను
మనము మనసులో మన్ననమీరగ మనవిచేసుకొని
మీరలు జేరగ తనివిదీర ధనధాన్యములిచ్చును
దినదినమును గోరిన సిరు లిచ్చును, రండి.
రాములవారిభజనలో రవ్వను దేకండి
కామితముల నడుగండీ మీలో ఖజ్జాపడకండీ
స్వామి వేడుకొన సౌఖ్యము వచ్చును
దీనముతో మన నెయ్యము హెచ్చును
సేమంబున బలు సిరులును వచ్చును
రామబ్రహ్మం రక్షణమిచ్చును ॥రండి॥

## భజన కీర్తన

పరమానందమే రామభజన నిత్యానందమే రామభజనా॥
హృదయానందమే రామభజనా బ్రహ్మానందమే
రామభజన హరిహరుల తత్వముకన్నా ॥పర॥
పంచదార, దాక్షపండ్లుతిన్నా, భక్తిమించిమాధుర్యములేదన్నా
పాలువెన్న భుజించుటకన్నా మధురమన్నా, హరినామమువిన్న ॥ప॥
రాజ్యపాలనా మరియేటికన్నా దివిజపూజ్యుని పూజించుమన్నా
పరమభయములుపోయిఅందర, భక్తిముక్తులొసంగుమీదయ
మీరి ॥ప॥
వరద దాసాంతరాత్మసంచారి కరుణాసాగరుడైనమురారి ॥ప॥

## శ్రీరాముడు, సీతయేమాయనని తమ్ముణ్ణి అడగడం

### బిళహరిరాగం - ఆటతాళం

ప॥ భూపుత్రి యేమాయెరా, లక్ష్మణ ఓయీ
మీవదినా యెటు బోయెరా?
ధిమితకిటధగిరి గిణత
ఆసీత యెటు బోయెరా
తమ్ముడ వినుమి జానకి యెటుబోయెరా ॥భూ

1. భూపుత్రి విడనాడినా కెదురు వస్తివి
మాయరాక్షసు డెవడో మాయజేసె నేమో
వాడివంక తలయెత్తి చూడదు
భగ్నమై వాడిల్లు భగ్గుభగ్గున మండు
నట్టడివిలో సీతను విడనాడన్యాయమా
తమ్ముడ వని చాల నమ్మికొంటిని నిన్ను ॥భూ॥

2. పసిడిలేడిని జూచి పాదములబడె సీత
మృగముకూడా నే వెళ్లి పోతిని
భూపుత్రి వెన్నెలకు తేటయిన వెలది
బంగారుకన్య పుట్టిల్లె వదిలెను నట్టడివిపాలాయె ॥భూ॥

3. పన్నెండు వెన్నెలచాయ పణతి పూబోడి
పురుషుడే దైవమని పూజించుచుండేను
భువి బ్రతుకదురా యాసీత బ్రహ్మారణ్యములో
కారుటడివిలో సీత దుఃఖింపుచుండెనో ॥భూ॥

4. భూపుత్రి యాసీత భూదేవికూతురు
జనకునింటను నేను ప్రేమతో దెచ్చితి

మందయాన తనడెందములో నెంత
కుందుచుండునో నామద్దుతమ్ముడ ॥భూ॥

5. మనల గానక సీత యెంత శోకించెనో
ఏమిసేతుము మనము తమ్ముడా లక్ష్మణా
ఎప్పటికైనను సీతను కండ్లను జూచెదనా నేను
ధరణిలో మర్రిపూడిపురము సర్వేశ్వరుడు
సీత నడవులపాలు జేసెరా తమ్ముడా ॥భూ॥

## రామబాణంచేత పడిపోయినవాలినిర్వేదన

ప॥ ఎంతపని చేసిసితివి రామా !
నిన్ను ఏమనందును సార్వభౌమా !

1 అవతారమూర్తి వని అందరనుమాటలను
వమ్ముచేసితివేమి? రామా! నీకులమ్మునకె దోసమ్ము రామా !

2 ముచ్చటగ నాతోటి ఇచ్చువచ్చినరీతి
నీమానసము తెల్పరాదా; నీకునై నేప్రాణములనిత్తు కాదా ॥ఎంత॥

3 తమ్ము డేదో చెప్పి తగనిన్ను నమ్మించె
కల్లనిజములు తెలియవలదా? రాఘవా!
పొల్లుమాటలు తేల్చవలదా? ॥ఎంత॥

4 నిను మోసగించిన నీచు రావణు బట్టి
నీకడకు నే గొంచు రానా రాఘవా
నీయాజ్ఞ పాలింపలేనా ॥ఎంత॥

5. వైరకథ యేమిటని వచ్చి నన్నడిగినను
హెచ్చు వేడుక చెప్పలేనా? నీకునై
ఇంతసాయము చేయలేనా ॥ఎంత॥

6. పదిమంది నినుగూడి పరమాత్ము డని యన్న
సత్యమని అనుకొంటినీ రాఘవా!
చాలనమ్మిక నుంటినీ ॥ఎంత॥

7. అన్నదమ్ములనకుమ ఎన్నో తగవులు గల్గు
ఏకపాక్షికభావము రాఘవా చాలు నీసౌజన్యము

8. ఐనదానికిచింత నందువాడను గాను
అసమర్థు డని యెంతునే రాఘవా
దొసగున్న క్షమియింపుమా ॥ఎంత॥

## లంకలో సీతారావణ సంవాదం

రావ :- శుక్లగిరిపర్వతము చూచినంతటిలోను
కమలేశపురి నీకు కలుగునటె సీత॥

సీత :- పొంగకురోరి దుర్మార్గరావణ నీవు
నీపొంగు శ్రీరాము బాణముతో కుంగేను.

రావ :- చుట్టూసముద్రాలు మధ్యను నాలంక
లంక కొచ్చినవాడు నరుడెవ్వడే సీత?

సీ : నరుడుగాడురోరి నరసింహాకారుడు
భూమిని నిన్ను బరిమార్చేడు వాడు.

రావ :- నరు డొంటివాడు నల్లనివాడు సీత
నరుడు నాకు ఎంత నాథుడటే సీత
పదిశిరస్సులు గలవాడనే ఓసీత

ఒంటిశిరసువాడు నీనాథుడే సీత
నరుడు ఎంతగలడే నాకు ఓసీత

సీత :- నరుడు గాడురన్నా నారాయణమూర్తి
అవతారపురుషుడు ఆదివిష్ణుమూర్తి
నామీద చెయివేసి నావద్దనిలుచుంటే
పక్కాన సీతల పేలునుగాగటర
పొంగకురోరి నీవేల పొంగేవు
నీపొంగు రారాజుబాణాన కుంగేను.

## సీతాదేవి రావణాసురుణ్ణి దూషించడం

(భూపాలరాగం—ఆటతాళం)

ప॥ రాముభార్యనుగా రావణవినరా రాచకన్యనురా
సీతలద్రుంచే లోకమాతనురా నన్నంటకు రాచకన్యనురా॥

1. భూపతులు మెచ్చగ శివునివిల్లు పూని విరువగను
ఆపదము నన్ను పెళ్ళాడి నట్లుగ సీత మహాతి
శేషగిరిదాసవరదుడైన ॥రా॥

2. వాలినెరుగవురా నిన్నే సప్త వార్ధుల ముంచెను
అటువంటివానిని ఒక్కశరమున ద్రుంచి
వాలితమ్ముని పట్ట మేలించినరాము॥రా॥

3. తాటకిని ద్రుంచె, నీకొరకై యవతారము దాల్చెను
వాలాయముగను విశ్వామిత్రుయాగము గాచి
రాతి నాతిగ జేసిన శ్రీరఘు ॥రా॥

4. మారీచు మాయలేడిని పంపియు చోరా నన్ను దెచ్చితివి
ఉండదు నీలంక దగ్ధమైపోవును
పండువంటి నీలంక పాడై పోవు నమ్ము॥రా॥

4. తొల్లి నే లంకలోను రావణ వినర నీతోడబుట్టితిని
తోచదటర నీకు దుర్మార్గ మేలర?
ఆచక్రధరుని శర ణనర మనవి వినర॥రా॥

## ఆంజనేయు లందించిన శ్రీరాముముద్రికతో సీతాదేవి సంభాషించుట

(శోకవరాళిరాగం-ఆటతాళం)

పల్లః- ఉంగరమా ముద్దు టుంగర మయ్యాయో
రంగైన రాము వ్రే లుంగరమా॥ఉం॥

1. ఎగుర రెక్కలు లేవు నడువ కాళ్లూ లేవు
ఎలాగు వచ్చితివే ఉంగరమా!
నా డగ్నిసాక్షిగ నన్ను పెండ్లాడిన
నాథుడు క్షేమమటే ఉంగరమా॥ఉం॥

2. ఆ రామలక్ష్మణులు వా రన్నదమ్ములు
అందరు క్షేమమటే ఉంగరమా!
కౌసల్య సుమిత్ర కైక మాపిన్నత్త
నాతోడబుట్టువులు క్షేమమటే॥ఉం॥
భరతశత్రుఘ్నులు నాముద్దుమరదులు
బాగుగా వున్నారటే ఉంగరమా?
పతి నన్ను యెడబాసి పరదేశమున నుంటే
సముదార్చ లేవైతివే ఉంగరమా॥

## రామాయణసారాశం

(మంగళహారతి)

పల్ల : మంగళం, మంగళం, సీతా రామా ॥మంగ॥

1. అట్టె సురలు మొర పెట్టగా వినివచ్చి
అట్టెకౌసల్యాగర్భ మందునిలిచిపుట్టి
పట్టి తాటకిని గొట్టిపార వేసి
అట్టె సీతను చేపట్టిన రామా ॥మంగ॥

2. కైకేయివరమున గైకొని శ్రీరామ
వైదేహితోగూడి వనము కేగి
భరతునకు చిత్రకూటమున పాదుకలిచ్చి
వైదేహితో వనవాస మొనర్చిన రామా ॥మంగ॥

3. మారీచు తెగవేసి మగువను యెడబాసి
మారుతాత్మజు జూచి మర్మ మంతయు దెలిసి
కోరి సుగ్రీవుని జేరి వాలిని ద్రుంచి
మీరి సుగ్రీవునకు మేల్ పట్టము గట్టిన రామా ॥ మంగ॥

4 హనుమంతుని బిలిచి తన యుంగరంబివ్వ
అట్టె సముద్రము దాటి ఆసీతను జూచివచ్చి
సీటిమీద వారధి నిలువగట్టించి
తనతమ్మునకు వానరులతో దాటిన రామా ॥మంగ ।

5. అట్టె రాక్షసుల పట్టి తలలుగొట్టి
విభీషణునివల్ల లంకమర్మంబు దెలిసి
రావణాసురుని రణమందు తెగనేసి
లంక విభీషణునికి పట్టముగట్టిన రామా ॥మంగ॥

6. తమ్ముని వానరులను తనసతి జానకిని
వెంట తీసుకొని అయోధ్యపురము జేరి
కన్నతల్లుల కడుపు ఆనందమును కూర్చ
గట్టిగా అయోధ్య పట్టాభిషిక్తుడే రామా ॥మం॥

## కృష్ణుడు యశోద సంవాదం

య॥ కన్నతండ్రి! చిన్నికృష్ణా! కనులజూడుము
కరముసాచితి రమ్ము రమ్మోయీ
మన్నుతినుట మానకున్నను కొట్టెదనునిను
కట్టిరోటికి కదలు వేగంబే

కృ॥ కన్నతల్లిరో, కరుణజూడుము ఎన్నడునునే
మన్నుతినగా లేదు లేదమ్మా

య॥ నీవు తిన నేనిప్పుడే జూచితి, నింతలో నీ
విట్లు బొంకిన నమ్మబో నోయీ

కృ॥ తల్లిరో నీయుల్లమందున భ్రమనుజెందితి
వంతెగానిబొంకలేదమ్మా

య॥ తక్కు తారుచు నక్కుజూచుచు
బొంకులాడుచు బోవజూచిన విడువబోనోయీ

కృ॥ నాదుమాట నమ్మకున్నను మారుజెప్పక
నోరు దెరచెద జూడు మోయమ్మా

య॥ ఎన్నిలోకము లెన్ని జీవులు
ఎంతతిమిరము ఎంత తేజము వింతగా దోచెన్
అమిత మగు నాతిమిరమందున
శక్తియుత తేజంబులోపల
మిళిత మైపోదున్ ॥-

## గోపికలచీరలపదము

వెంకటగిరి యనగ వేడుక వెంకటగిరిలోను
స్వామిసన్నిధినుండి చక్కని సరసపునది యనగా,
రేపల్లెను గనరే చక్కని గోపస్త్రీలెల్లా
ఏవున చెలరేగి మామిడితోపున వలగొని,
ఆడుచును పాడుచును గుంపులుగూడుచు వేడుకలా
చెలులు యీలాగు క్రీడల మదియలరగను,
దేవుని సేవింప వచ్చిన దేవాంగన లెల్ల
శృంగారించుకొని వత్తురు శ్రీహరి జూత మని,
పట్టంచలచీరె మెరిసేటి పంచవన్నెలరవికె
పుట్టుదోడిగినచీర మేనుకు పొంకమైన రవికె,
కరకంచులచీరె పట్టు కంకణాలరవికె
ఆవపూలచీర మెరిసేటి అద్దమ్ములరవికె,
పొన్నపూలచీరె ఎర్రనిపోగడపూలరవికె
మండితెల్లనచీరా నిండామొగ్గలుగలరవికె,
తోపుచీరా గట్టి చక్కనితోపురవికె దోడిగి
నెరిచిక్కులుదీసి కురులు కూడదువ్వుకొని,
జాజులు ముడుచుకొని కొప్పులు జారగ బెట్టుకొని
మట్టెలు పిల్లెల్లు బొబ్బిలికాయలు,
పీరమట్టెలు చిటికినబొడ్డులును వేళ్లకు
చిత్రించినట్లు హస్తకడియములు,
గంటలుమొలనూళ్లా కనకపువడ్డాణ
మ్ములును ముత్యాలరవికెలును,

మదుపులతీగెలు మెరయగనూ చంద్రిక
బాగడులును చెలిమితా యెత్తులు మెరయ
చిలుకతాళి వేసి చక్కని కుతికంటూ మెరయ
ఊరికి దూరముగా అంతా ఒకకొలనికిబోయి,
చీరెలు రవికెలునూ విడిచి కొలనుచేరువ నిలిచి
జలములోనే జొచ్చి పైపై చల్లులాడుకొనుచు,
మొలబంటాయె నని కుతికబంటాయె నని
ముచ్చటలాడుచును,
వనితలు రాగాను జూచి శ్రీకృష్ణుడు తాను
అక్కడి కేలాగో తెలిసికొని ఆకస్మికముగా,
ఆడకూడీ యనుచు మాతో కూడకుడీ యనుచు
శ్రీకృష్ణుడు వచ్చి చేరువ నటునిలచె'
చెల్లబో యికనేమి చెలికత్తె శ్రీకృష్ణుడు వచ్చె
చెల్లవు పంతమ్ములు మన సిగ్గులు పోయె గదవే,
ఇల్లాళ్లమూ మేమూ మాగుర్తెరుగక
నీవుండే ఘల్లుగ వచ్చేవు తిరిగేవు దాగేవు,
జనులుచూచినారా నేరము లయ్యేరా మా
మగవారిటు వస్తేను పోరా యింటికిని,
నీ వాంబోతుకొడెవటరా ఏలేమగవారు
యిక్కడ నెవ్వరు వున్నారూ,
నీరజలోచన నీవే మరిమగవాడవు గావటరా
దా మగవాడన్న నేబాలుడ నెరుగరటే మీరు,
మేమెరిగే కాదా యిప్పుడుమీ కేలాంగేది
గొని చిక్కరే నీళ్లలో వాయువుగోనేరక,

జలములు విడిచిరారే యింక మీావలువలు గట్టుకోరే
అనుచును కృష్ణుండు చీరెలురవికెలు,
ఎత్తుకొని పొన్నమీాదనుండి కృష్ణుడు ఎక్కడ
గనపడకా అప్పుడుగోపికలు జలములు,
విడిచి లేచివచ్చి గట్టుమీాదను నిల్చి
వలువలు ఎక్కడ గనపడకా,
అక్కరోఓయక్క వలువలు ఏమయిపోయెనక్కా
వెతికిన లేవుగదా యిది విష్ణుమాయగదవే,
అక్కరోఓయక్కా వలువలు యేమయిపోయెనక్కా
అక్కడబడకుంటేను,
ఇక్కడ దొంగ లున్నారా దొంగవునే కాంత
కృష్ణుడు దుండగీడుకాడా,
సంగర మయినాడే వాడొక చాటుదాగినాడే
వాగులు వంతలును పొదలమాటులకు,
వెదికిన లేవుగదా యిదియొక విష్ణుమాయగదవే,
వేయిమాటలేల యీా యన్యాయ మేమొకాని తెలియదు
తోయజాక్షులారా మనకిక యేమి
యుపాయమ్ము జెప్పరే॥

## 3 కోపులు - కోలాట భజనలు

కోలాటము పాఠశాలలలోని విద్యార్థులూ, స్త్రీలూ, వేస్తారు. దీనిని జటకోలాటము నృత్యకోలాటము, అని రెండురకాలుగా వేస్తారు. కర్రబిళ్ళకు దారాలు కట్టి వాటికి కర్రచిడతలు కట్టి ఒకచేతిలోదానిని పట్టుకొని, మరోచేతిలో రెండోచిడతను వాయిస్తూను పై దారాలను పాయలుగా వచ్చేటట్టు వీరు మసలుతూ జడవేస్తూ, విప్పుతూ, పాడు

కొంటారు. నృత్యకోలాటంలో చిడతలువాయిస్తూ, అడుగులు వేస్తూ అంగవిన్యాసం చూపిస్తూ రాగ తాళవయ్యారములతో, దీనిని స్త్రీ పురుషులు వేస్తారు.

కోపులు-వీటిని వేసేవారు చాలా శ్రమించి నేర్చుకోవాలి. వేపకర్రలుగాని, పాలకర్రలుగాని, చిడత లుండాలి. భజనపరులు సరి సంఖ్యలో వుండాలి. దీనిలో పాడే ప్రతీకీర్తనకు ప్రత్యేకమైన అడుగులు, కోపులు, అంగవిన్యాసాలు కలిగి, రాగ తాళవయ్యారాలతో నృత్య కళ విలసిల్లుతూ వుంటుంది. ఇది శ్రీకృష్ణునిరాసక్రీడానుకరణం. ఇందులోని కీర్తనలుకూడ ప్రత్యేక విధానంగానే వుంటాయి.

ఇందులో వేషములు వేసుకొనికూడా కొందరు చేస్తూవున్నారు. ఈకోపులభజన చూస్తూవుంటే, ఆనందముగ్ధులు కావలసిందే. ఈకీర్త నలుఎక్కువగా శృంగారరసంలో వున్నాయి. తెలంగాణాకోపులు కొంచెం మార్పుగా వుంటాయి.

## గణనాయకకోపు

(సామ-ఆది)

ప॥ రావయ్యా గణనాయకా మము
కావవే గణనాయకా
విద్యలకు ఆదివయ్యా వేద్య శ్రీగణనాయకా ॥రా॥

1. ఎలుకవాహనమెక్కేవయ్యా ఏకదంతముగలవాడవయ్యా
సాంబశివునిపుత్రుడవయ్యా! స్వామి శ్రీగణనాయకా ॥రా॥

2. తొండముతో నీళ్ళుదీసి తోరంపుబొజ్జ గడిగి
నిండుమోదముతోడ నుండు నిర్మలా గణనాయకా ॥రా॥

౩. గుజ్జురూపపు బొజ్జగదలగ గజ్జెలందెలుఘల్లుమనగా
గజ్జకాయ లుండ్రాళ్లు కుడుములు గైకొనుగణనాయకా ॥రా॥

# గడికోపు

(శంకరాభరణం-త్రిశ)

(చెంచుభామ-శ్రీకృష్ణసంవాదం)

ప ఎక్కాడివాడవో, యిక్కాడికొచ్చేవు
ఎక్కువమాటలేలరా మగవాడా చక్కాగమల్లిపోర ॥ఎ॥
వలచిదానివంకజూచి, ఎగసీగంతేశేవు
ముంగటముల్లునాటెరా మగవాడ వెనకాలఅంబునాటే ,,
కూకోవే చెంచీత కుదురుమద్దిళ్లసందు
కుదురుగాముల్లుదీయవే ఓచెంచీత వెనకాలఅంబుదీయవే ,,
" మాటమాటకు నన్ను చెంచుచెం చనేవు
పట్టి బాణాన వేయింతు, మగవాడ పంచబాణాన వేయింతు"
" కట్టింతు నీయిల్లు, కారుండపడవిలో
యొత్తిందు పసిడికుండలు,ఓచెంచీత వెయ్యింతుచిలుకుజవ్వాజి"
"మాటమాటకు నన్ను, అరెఓరనేవు
మేనబావనుగానటే, ఓలిచెంచీత, మేనబావనుగానటే" ,,
"సన్నబియ్యము దెచ్చి, సంచుల్లో పోసినాను
వంకైన వండగలవా, ఓలిచెంచీత, వంకైన వండగలవా" ,,
"వెదురుబియ్యము తినే, మా చెంచువారికి
సన్నబియ్యము లేలయ్యా, మగవాడ, సన్నబియ్యములేలయ్యా,,
"సన్నచీరెలు తెచ్చి, దణ్ణాన్ని వేసినాను
కట్టైనకట్టగలవా, ఓచెంచిత కట్టైనచూపగలవా" ,,
"పారుటాకులు గట్టు మాచెంచువారికి
సన్నచీర లేలయ్యా, మగవాడ, సన్నచీరలేలయ్యా"

## శరణుధరకోపు

(శంకరాభరణం - ఆదితాళం)

ప॥ శరణు శ్రీధర! గరుడవాహన!
శరణు వేంకటనాయకా ॥శ॥

1 పావనపదపద్మ! గోవింద! మాధవ!
పద్మనాభ! జననాయకా ॥శ॥

2 గజ్జె లందెలు పాదంబులపై
ఘల్లుఘల్లున మ్రోయగా
గుజ్జురూపమున బొజ్జ గదలగా
సహజవెంకటనాయకా ॥శ॥

## భళిరె టంగుటూరుకోపు

(జంఝూటి - ఖండగతి)

ప॥ భళిరె టంగుటూరు, భళిరె టంగుటూరు

1 బలువైనకాపులు భామలున్నదిటంగుటూరు
బలుభాగ్యవంతులున్నది టంగుటూరు॥భ॥

2 విస్తరించిన టంగుటూరు విద్వాంసు లున్నదిటంగుటూరు
బలుభాగ్యవంతులున్నది టంగుటూరు॥

3 ముప్పిరీపగ్గాలు మునకాలకర్రలు
ఐదేళ్లబటువులు హనుమంతు బిళ్లలు
అమరియున్నది టంగుటూరు ॥భ॥

4 పెద్దపెద్దనాగళ్లు పేరైనగుంటకలు
అమరియున్నది టంగుటూరు॥భ॥

## నువ్వుకాయ జడకోపు

(మాండు - ఖండగతి)

ప॥ చెల్లెక్కి పూల్లోసి తాబొండు తా ముడిచి
భామవో ముద్దు దిమ్మారిభామ ॥చె॥
1 దిమ్మారిచూపుల మారామలింగని
రమ్మానవే ముద్దు దిమ్మారిభామ ॥చె॥
3 పున్నమచంద్రుడు నెలయొక్క బాలుడు
చూడగా యికరాడుగా మేలు ॥చె॥
2 అలివేణులార మీ రన్నదమ్ములు గూడి
అందిఅందిస్తాడు పట్టావే ॥చె॥
4 భామ పొందుగా గూర్చుకో మంగళగిరికోట చూడవే॥చె॥
5 చిత్తారిజడక్రింద జడమంచిజడకోపు
మే మేశామే భామ చూడవే॥చె॥

## లయినుకోపు

(ఫరజు-చతురశ్ర)

ప॥ చిటపటచినుకులు దుప్పటితడిసెను
తలుపు తీయవే భామా నీవు
తలుపు తీయవేతరుణీ॥చి॥
వాకిటనుండి పగలు బల్కెదవు
ఎవరిబాలుడవోయి నీ వెవరిబాలుడవోయి॥చి।
అల్లనాడు నీయావుల గాచిన హరికృష్ణుడనే భామ
నే శ్రీకృష్ణుడనే భామ ॥చి॥
వాకిటికాకర మేకలు మేసెను

తలుపు తీయవే భామ, నీవు
తలుపు తీయవే తరుణీ''॥చ॥
" మేసి తేమేసెను, కూసి తే కూసెను
తలుపు తీయను పోవోయి
నీ తగువులేల పోవోయి''॥చి॥

## కృష్ణలీలలు [నాదనామక్రియ-ఆది]

పల్లవి: వింటున్నాను వింటున్నానులే కృష్ణయ్యా నీకథ॥వింటు॥
వింటున్నాను వింటున్నాను వంటరిగా వెళ్ళవద్దంటే
ఇంటియింటికేగి నీవు కొంటెపనులు చేస్తున్నావని నే॥వింటు॥
అంగన యొక్కతె మగని—సంగతి నుండగ జూచి
అంగజు కేళికి బిలచి- యుంగారా లిస్తా నన్నా వని॥వింటు॥
గొల్లభామ మొన్న యింట్లో చల్లచేయుచుండగాను
వల్లభునిగా నన్నేలితే- తెల్లచీర లిస్తా నన్నావని॥వింటు॥
ఇందువదన తాను పడక-మందిరములో నుండగాను
సందిటకుచేరిస్తే కాళ్లందె లిస్తా నన్నావని॥వింటు॥
తద్దినా డొకముద్దరాలు- సుద్దులు పాడుచునుంటే
వద్దజేరి ముద్దుబెడితే దుద్దు లిస్తా నన్నావని॥వింటు॥
పణతు లందగా గూడి బంతులాడుచుండగాను
పణతులారా యివి బంతులా యని చనుబంతులు బట్టుకొన్నా
వని నే ॥వింటు॥
ఇందువదినయును నీవు సందడిగ నాడుకొమ్మంటే
వెంట శేషాచలదాసునింట అందముగా నిలిచినావని నే॥వింటు॥

## శ్రీ కృష్ణుడుదాగిన పొన్నమాను

(మధ్యమావతి - ఆది)

ప॥ పొన్నవాహనమే గంటిమమ్మ గోపాలుడు దాగిన ॥పొన్న॥

అ॥ ప॥ ఎన్నగ యాదవకన్నెలచీరలు తిన్నగ నెత్తుకు
వెన్నుడు దాగిన ॥పొన్న॥

1. అసలు కొమ్మలువున్నవమ్మా, రేమానున పూతా
లమరి కాయలుగాచునమ్మా కనుగొంటిమి
శ్రీ కరమున పిందెలు ననుబొందెను శ్రీ నను
భాగ్యములు ॥పొన్న॥

2. చుట్టూ గోపికల మూకలమ్మా, గోపికలందరు
చెట్టుచుట్టున దిరుగుదురమ్మా, పట్టినకొమ్మకు
పాకుచు చనుచును పొన్నవాహనమే గంటినమ్మ ॥పొన్న॥

3. శృంగార మయిన వృక్షమునమ్మా చూచేటివారికి మంగళ
ప్రదమైయుండునమ్మ శుకపికములచే
కిలకిలరావములు చిలుకలరవములు
కిలకిల కుయ్యాగ ॥పొన్న॥

4. నిండుభక్తితో నిలిచిరమ్మ ఆగోపికలందరు
రెండుహస్తము లెత్తిరమ్మ, దండము వెంకట
దాసపోషక దండంబిదుగో యనుచున్నారమ్మ ॥పొన్న॥

5. పొన్నమీదనుండి కృష్ణుడు చీరలు అందియ్యాగా,
శృంగారించుకొని వత్తురే పల్లెకు తమరూ
పొన్నమీదనుండి కృష్ణుడు క్రిందకు పడదూకి
తరుణుల వెన్నంటి కృష్ణుడు తరుముకు పోగాను ॥పొన్న॥

6. పందిబంటువంటివాడే పఱవజాలము మేమూ
కుందేలువంటివాడే వీడూ కొంపలుగొన్నాడే
పాపడు గాడే వీడు అడవుల కాపురమే వీరు,
కాపువాడే వీడు కొలనులో కాపురాలుగుత్త ॥పొన్న॥

## గోపికల చీరలపదం

(మధ్యమావతి రాగం — అట)

పల్ల:- మాయమాయె చీరలు, ఇది నిజంబయితే
పోయెనే మనసిగ్గులు
దొంగ లెవ్వరు వచ్చిరో, అడుగులజాడ
వంగి బాగా చూడరే ॥మాయ॥

సుడిగాలి వచ్చెను, మనచీర లన్నీ చుట్టిమెత్తుకపోయెను
పడుచుతనమున కాపురమ్ములు విడిచియెగబడి వచ్చి నందుకు
వీధిలోనే మేలుచూపెను చెడువిచారము చేయనేటికి ॥మాయ॥

దీపావళిరోజున రొక్కముబెట్టి తనపతి కొనితెచ్చిన,
తోపుచీర యనుచు ప్రియపడి తేపతేపకు కడితే పోవని
దాపురమ్ముగ దాచి యిప్పుడు సాపుగా పోగొట్టు
కొంటిమా ॥మాయ॥

పెద్దదాన నయినప్పుడు కట్టించినా రాప్రొద్దుచీర యిప్పుడు,
వద్దదన మాయత్తగారిసుద్దులు నాచెవిని బెట్టక,
ముద్దుగొలెక్కడుపట్టుతాపిత మొదటికే
పోగొట్టుకొంటి ॥మాయ॥

బాలశోభనమునకు, తెచ్చినచీర చలవలేవే నేటికి
జలతారుచీరె చెంగు గరిమినిలిపితే పిడికింట నున్నది

నిలిపితే నాసలే లేదన్నది తెలియక

పోగొట్టుకొంటి ||మాయ||

ఈడువచ్చినతరువాత వాడకే రమ్మనిపిలచి చాటుగా

తనపెనిమిటిచ్చిన కోటలబొమ్మంచుచీరె ||మాయ||

ఎరిగి యెరగనప్పుడు తొలుచూలు బిడ్డకాన్పుతో నున్నప్పుడు

చాలగావెలబెట్టికట్నం మేనమామ కొడుకుదెచ్చిన

చీనిపైఠాణియంచు చీర తెలియక

పోగొట్టు కొంటి ||మాయ||

అంగనారో రేపల్లె రంగధాముని పెళ్ళి నాడు

సంగతిగ మాయన్నదెచ్చిన ములగవన్నె రంగుచీరె ||మాయ||

పోతినేయుంద్రడాళ్లకు ముత్యాలమ్మజాతరఅంగళ్లకు,

చేత నగదూలేదు ముందరనేతిబొట్టు

పాటిచేసే చీరదెచ్చిమీపాటికే పోతుననియె

పోగొట్టు కొంటి ||మాయ

ఎవరు దీసిరమ్మా, చీరలజాడ ఎవరుదెలుపరమ్మా

ఎవరు దీసిరమ్మచీరలు ఇందరము మనముండగాను

సుందరిది మామంచిచీర చంద్రపూవన్నంచు రవిక ||ఎవరు||

పణతిరో పట్టిసపు వీరభద్రునిపెండ్లి నాడు

పణతిరో మాయత్తదెచ్చిన పచ్చపట్టు వన్నెచీరె ||ఎవరు||

నాతిరో కల్లేపల్లి నారన్న పెళ్లినాడు,

కొంగుచూరెడు రంగుపట్టు చీనిపైఠాణంచుచీరె ||ఎవరు||

అతివరో అంతర్వేది నారసింహుని పెండ్లినాడు

అతివరో మాయక్కదెచ్చిన ఆవపూసన్నంచుచీరె ||ఎవరు||

కన్నవిన్నట్లు కాంతలుతన్నట్లుపల్కగాను
పొన్నమీదనుండి కృష్ణుడు పిల్లికూతగూసె"
కూసిన గోపికలు వేడుకకూర్చుని యిట్లనిరి
మోసమాయెగదవేయికమన మోసపేలదాగునే
మనకెందుకు సిగ్గుగోవిందునిమనమే యడుగుదము
అనుచుగోపికలు పొన్న చెట్టుకు చనుదెంచిరి
"గోపాల మావలువలుయివ్వర కోరినిన్ను వేడెదము
మదిగోరి నిన్ను వేడెదము"
"అక్కరతో మీరురెండు హస్తములెత్తి మ్రొక్కిన
గానియివ్వను మీచక్కనివలువలను"
కాచుబోయెడ రారా ఆవుల గాచు బోయెడరారా
మాచబోయెడరారా వేగమందబోయెడరారా వేగ"
"అనుచుగోపికలు తమచక్కని పెనిమిట్లనుబిలువా
వనితలపిలుపున నాథులురాగా! గోవిందుడు ఎక్కడగనుపడడు"

## పాలపిట్టకోపు

మదవతితనమమకారాన్ని మార్చిమార్చి వర్ణిస్తూ వెల్లడిచేస్తుంది*

(1) పుట్టమీదాపాలపిట్టా పట్టబోతే తేలుకుట్టె
మంత్రమేసే జాణవైతే! మల్లెపువ్వుల సేవజేతు!

(2) గుట్టమీదా గువ్వగూసె! కట్టమీదా కముజు పలికె
చెన్నరాయని గుట్టమీదా సన్నగాజుల చప్పుడోయి

(3) కోమటెంకయ తోట్టమీదా! సుట్టుముట్టూ చెంగాయిసీరా
మడ్తమడ్త జూడబోతేమా మడ్తాకానబాడె!

* తెలంగాణాప్రాంతానివి

## కూచుని చెరిగే కోపు

(కాంతస్వరూపం కళ్లకుకట్టినట్లు కనబడుతుంది)

॥ప॥ కుచోని చెరిగేచేటికురులపై
తుమ్మెదలాడిందోలాలా
ఘన, తుమ్మెదలాడిందోలాలా ॥కు॥

1 చెమటకుతడిసిచెదిరినగంధము
ఘుమఘుమలాడిందోలాలా
అది ఘుమఘుమలాడిందోలాలా ॥కు॥

2 ముఖమునయుండేకస్తురితిలకం
ముక్కునజారిందోలాలా
కొన, ముక్కునజారిందోలాలా ॥కు॥

3 గొప్పది రోకలి గుప్పున దంచగ
గుబ్బలు కదిలిన వోలాలా
ఘనగుబ్బలుకదిలినవోలాలా

4 చెరిగేటప్పుడుచేతిలోగాజులు
గలగలలాడినవోలాలా
అవి, గలగలలాడివోలాలా ॥కు॥

5 హంసనడుపులునడిచేభామకు
అందెలుకదిలినవోలాలా
కా లందెలుకదిలినవోలాలా ॥కు॥

## మల్లన్నకోపు

యువకుల పౌరుషం, గుండెధైర్యం, మనోనిబ్బరం, ఈపదంలో కనబడుతుంది

పల్లవి:- నాపేరుమల్లన్న నాదిరేకలకుంట
కదిరి భూమండలమున నద రేమున్న దన్నా డే—మల్లన్న

భయమేమున్న దన్నాడే, పాలైనారిచిన్న వాడే మల్లన్న
భోగ మెాళ్ల చిన్న వాడే ॥నా॥

1. ఎద్దిడుగు కనుమలో, యేకు మేడలపైన
చిలుకవలెకూకోని, మలక మీసముదిప్పినాడేమల్లన్న
భైరిమీసం దిప్పినాడే తనపేరు తెలచెప్పినాడేమల్లన్న
లంకమలచేరినాడే॥నా॥

## రథయాత్ర కోపు

పెనొన్నబళం తేరు చూపడానికి, ఈ వెన్నె లాడి, తనయింటిపనులను ముగించు కొని, ఆతురతతో వెళ్లుట ఈపదంలో కనబడుతూంది.

పల్లవి :-వచ్చేనురా. రంగవచ్చేనురా। పెనొన్నబళము తేరు జూడ వచ్చేనురా ॥వ॥

1. గుడ్లకోడిజంపుకొని, గజ్జంగ వండుకొని
గుత్తిలోన తెల్లవార వచ్చేనురా ॥వ॥

2. కారుకోడి జంపుకొని కమ్మంగ వండుకొని
కదిరిలోన తెల్ల వార వచ్చేనురా ॥వ॥

3. అత్తమామ గొలిచేటి గుత్తినరసింహునకు
వత్తిలేని దీపంబెట్టి వచ్చేనురా ॥వ॥

4. నట్టింటనుండేటి నా చిన్న బాలునకు
నల్రావుల పాలు బోసి వచ్చేనురా॥వ॥

5. పాలు బోసిపండబెట్టి నీలోసి నిద్దరూపి
తేరుకదిలే వేళదప్పక వచ్చేనురా ॥వ।

## 4 వేదాంత సమారాధనభజనలు

భక్తులూ, వేదాంతులూ, సమారాధనలూ, గురుపూజలూ, అంటూ ఏర్పాటు చేసుకొని, స్త్రీపురుషాదులు సమావేశమై పూజాపురస్కారణా యధాశక్తిని గావించి భజన హంగామాలతోగాని, ఏమీలేకుండా గాని, భక్తిసంకీర్తనలూ, వేదాంత తత్వాలూ, పాడుకొంటారు. వీరు నియమాలను పాటిస్తూ క్రమబద్ధంగా ఈ సమారాధన భజనలు చేస్తారు. బైరాగులూ, వీరినే సన్యాసులంటారు, వీరిలో గోసాయీలనే వారు ప్రత్యేకంగా వుంటారు.

వీరు, ఒంటరిగాగాని, కొందరుచేరిగాని, వేదాంత కీర్తనలు శ్రావ్యంగా పాడుతూవుంటారు. సితారా వాయిస్తూ, భక్తిభావంతోనే, గంజాయి దమ్ముమైకంతోనే, సమీలిత నేత్రాలతోవుంటారు. వేదాంతకీర్తన లలో కూట వేదాంతకీర్తనలు. గురుముఖంగాగాని అర్థం తెలుసుకోలేము.

వేదాంతమనగా. వేదములకు చివరభాగాలయిన ఉపనిషత్తులలోని భావాన్ని తెలియజేయునది—

### హరినామము - (నాదనామక్రియ - త్రిపుట)

హరినామస్మరణ జేయకుంటె ఆవలగతియేమి ॥హ॥
అన్నదమ్ము లెడబాయక మునుపే
ఆలు నిష్ఠురము లాడక మునుపే
కన్నకొడుకు దండించక మునుపే
కాయము వ్యాధుల జిక్కక మునుపే॥ ॥హరి॥
వృద్ధాప్యము ప్రాప్తించక మునుపే
ఉత్సాహము బలముడుగక మునుపే
నేత్రములకు పొర గప్పక మునుపే ॥హరి॥

దవడలు లోనికి బోవకమునుపే
దంతపటుత్వము తగ్గకమునుపే
చెవులకు మందము గలుగక మునుపే
చెల్లబో నడవజాలక మునుపే॥———————॥ ॥హరి॥
కణ్ణబూనుకొని తిరుగక మునుపే
కంఠధ్వని కడుతగ్గక మునుపే
అణ్ణు ముందరికి వంగక మునుపే
అంగము తలవణికించక మునుపే
అప్పాల వారలు కదియక మునుపే
అన్న మొకరు తినిపింపక మునుపే
దొప్పలోన చెయికడుగక మునుపే॥
దోవతి బలువై తోచక మునుపే ॥హరి

## సా ఫ ల్యం

పల్లవి. కోలుకోలుకోలు కోలే కోలుకోలు కోలన్న
అ॥ ప॥ కోలని కేరుచు గుఱ్ఱమును దూకించ,
కాలిగిట్టల రజము గగన వీధికి నెగయ

1. కరుకై మించిన ౧ పంచకళ్యాణిపై నెక్కి
కరమున ౨ వీరకంకణము గట్టి,
మెరుపు సానకత్తి మేలుచేతబట్టి
గురుతుగ భూచక్ర గొడుగు మెరయ చెలియ ॥కో॥

2. పసిడి ౩ పల్లము చతురపదములందెలుఱవోయు
పొసగ తేజికి ౪ బిరుదు పూనివేసి
శశిసూర్య ౫ అంకములు జాణుడై బిగఱదొక్కి
మిసిమి ౬ తరుటుచేత మెరయ కళ్లెము చెలీ ॥కో॥

3\. ఒనర భూషణములు వరుసతో వెలుగగ
మినుకు పసిడిశాలు మెరయుగను
దిననాథుగతి మాయ ధిక్కరించి తాను
మొనసిముక్కు ద్వారమున జొచ్చితిని చెలియ ॥కో॥

4\. జగన్మోహనాంగి తా జలమధ్య వెలుగుచు
పొగనుమీరి ముఖజ్యోతి చూపులను
మానవ పాటలు పాడి మంగళారతు లిచ్చి
సుగుణి చెలగి పూలుసొంపుతో జల్లును ॥కో॥

5\. పొలుపొంద ౭ చవికెలో పొలతిని గనుగొని
కలికి దివ్యకరము గదిసిపట్టి
కలిసి కలియక పరమ కన్య నధిగమించి
భళిర పూదోటపై బ్రహ్మమంటితి చెలియ ॥కో॥

౧ కోలు:- పెద్ద (అధికారి)
౨ పంచకళ్యాణి.

గుఱ్ఱాల వర్ణాలు మూడువిధాలుగా వుంటాయి.

1\. వర్ణములు :—ఇవి నాలుగు రకాలు.
2\. అనువర్ణములు :-ఇవి పన్నెండు రకాలు.
3\. చిత్రవర్ణములు :—ఇవి ముప్పైరకాలు
మొత్తం 46 వర్ణాలుగా గుఱ్ఱాలను పరీక్షిస్తారు.

గుఱ్ఱాలలో అయిదుజాతులు మహాప్రశస్తమైనవని ప్రజావాణి చెప్తుతుంది.

1\. శ్వేతాశ్వము :—ఇది శరీరమంతయూ తెలుపువర్ణము కల్గివుంటుంది. ఈ గుఱ్ఱాన్ని పూజిస్తారు.

2. పంచకళ్యాణము :-అనగా అయిదు శుభ చిహ్నాలు గల్గిన దంటారు. దీనినే "పంచభద్ర" అనికూడ చెప్పుతారు. దీనికి నాల్గు కాళ్ళయందు తెలుపు వర్ణమునూ, ముఖమునందు మిక్కిలీ తెలుపు వర్ణమునూ వుంటుంది. ఇది శుభప్రదమైన దని భావిస్తారు.

3. పంచభద్రము :-ఇది పంచకళ్యాణముగో మరో రకం. దీని శరిరమంతటను పావురపిట్టవర్ణం గల కేసరములూ, పాదాలూ ముఖము వీటి యందు శ్వేతవర్ణమూ వుంటుంది ఇదియును మంగళ ప్రదమైన దే.

4. అష్టమంగళ :-దీనికి నాల్గు పాదాలూ, తోక, బొమ్మ ముట్టి, తలవెంట్రుకలూ తెలుపువర్ణంతో వుంటాయి. ఇదియును శుభ మైన దే.

5. మల్లికాక్షి :- ఇవి మూడు రకాలుగా వుంటాయి.

1. ముఖమునందు తెల్లని బొట్టు గల్గినది.

2. మిక్కిలీ కృష్ణవర్ణంతో కూడిన కంటిగుడ్డు కల్గినది.

3. కృష్ణవర్ణంగల కంటిగుడ్డు, శ్వేతరేఖతో చుట్టబడి వుంటుంది.

ఈ మూడు జాతులునూ యజమానునకు విశేష సౌఖ్యాలు కల్గిస్తాయి.

౩. వీరకంకణము :-వీరులు బిరుదుగా ధరించే ముంజేతిమురుగు ("కంకణముగట్టి కైవల్య కర్జమంది" వేమనకవి)

౪. పల్లము :-గుర్రపు జీను, దీనిని పల్లాయనము, పల్లయి నము పల్యాళము అని అంటారు.

౫. అంకెము:- గుర్రాన్ని యెక్కుటకు రెండు ప్రక్కల అమర్చినయినుప మెట్లు (రికాబు) దీనిని అంక వన్నియ, అంకవన్నె,

అంకెవన్నెయు, అంకెవన్నె అనే పేర్లతో పిలుస్తారు.

(సీ. గోమేధికంబుల గొమరొందు కల్లెంబు
వజ్రాల మేలంకె వన్నియలును)

(ఉ॥ రా। 7ఆ 397ప)

౯. తరుటు:—గుర్రాలను తోలు సాధనం (మునికోల)

౧౦. చవికె:- రాజార్హమైన పీఠము (కూర్చుండేది)

౧౧. బిరుదు :-సామర్థ్యాన్ని సూచించే చిహ్నం, శౌర్య చిహ్నం.

## పరమాత్మలాలి - (శ్రీరాగం-అట)

లాలి ముద్దులహంస - లాలిపరమాత్మా
లాలి ముక్తికాంత లాలి శ్రీకాంతా

శ్రీగురు పాదముల్ చిత్తమునగోరి
సేవ గావింపుడీ స్థిరబుద్ధిమీరి ॥లా॥

సకలంబు మరచి తా సత్వమునుజేరి
సర్వరాగుల హృదయ సాక్షి కలుపారి ॥లా॥

ముగ్గురు మూర్తులు ముందుగా నిలిచి
బాగుగా నూచెదరు పాడి పూజించి ॥లా॥

మక్కువతో నీతొట్టి మగువలూచేరు
పింగళ యను గొలుసు ప్రేమతో బట్టి ॥లా॥

సూటిగా రత్నాల మేడ లోపలను
సీటుగా పవళించి నిదురపోవగను ॥లా॥

పాటించి యోగులు ప్రస్తుతింపగను
నటనముల్ చేసెదరు నిటల మందునను ||లా||

కమలాక్షి ముఖము సోముని గేలిసేయు
కలికి పలుకులు చిల్క పల్కులను గెలుచు ||లా||

కుండలిపై నుండి కొల్కుచు మెరయు
కూడెదరు పవనమున నూటిగా గదియు ||లా||

ఆరు కొండలమీద నరుదుగా నీవు
మెరయు చుందువు మేటి పదములోపలను ||లా||

పరబైలు దైవమన భక్తితో దలచి
వరములు గోరెదరు వాంఛతోడుతను ||లా||

శృంగాటకమునందు సొంపుతోడుతను
సోహమనుచు బల్కుచును సిద్ధముగను ||లా||

సర్వకాలము లందు సాక్షిగా నిలిచి
శేషాచల యోగి సేవ గావించి ||లా||

## జీవా మేలుకొనవే

తెల్లవారెను పూర్వ మందున
నళినమగు శ్రుత తమము వీడెను
యెల్ల దిశలును బయలు గూపయి
వెల్లి విరియగను |మేలుకో||
మేలు కొనవే రాజహంసా
మేలు కొనవే చైతన్యమా
మేలు కొనవే శుద్ధనిలయా
మేలు కొనగదవే - జీవా ||మే||

మూాకు రెండును గలసి యూరో
మేడ సౌధమునందు యుండే
చేడియతో జతగూడిరి
బ్రహ్మజాడ దెలియుటకు - జీవా ॥మే॥

రంగు మీరగ సహస్రారమున
వెలుగు వేణి త్రయమున
మునిగి నిర్మల ప్రణవమున
సూక్ష్మాంశమును దెలియ - జీవా ।మే॥

జీవపరమాత్మైక్య మగునా
భావ మందున డెలియ వలెనిక
కేవలాత్మ జ్ఞానమున
గురు, సేవ జేయు టకు॥ ॥మే॥

తొల్లి జేసిన కర్మ వశమున
కల్లి దేహము గాంచినందుకు
యొల్ల విధముల నాత్మ గనుగొని
యుల్లమలరగనూ — జీవా ॥మే।

జాతినీతియు లేక సకలా
తీతమై ప్రత్యక్ష భా
భావ మెరయుచునుండు నాపో
జ్యోతి దెలియుటకూ ।మే॥

వింత వింతలు గాంచు విశ్వము
సంత కూట మటంచు దెలిసియు
భ్రాంతి నొందక మదిని ముక్తి
కాంత సతి కొలువా - జీవా ॥మే॥

ఆదితుద మధ్యమును లేకను
పొదుకొను ప్రజ్ఞానమునుగొని
ఖేదమోదము లేని దనుచు వి,
నోద మొందుటకు _ జీవా ॥మే॥

రూపు నామము లేక సర్వ-జీవా
వ్యాప కంబయి నిండియుండియు
ప్రాపుదాపై వెలయు వెలిలో
రూపు దెలియుటకు ॥మే॥

సోహమను భావమున పరమో
త్సాహమున వికసించు బ్రహ్మా
హాహమస్మియటంచుహంసను
యూహ దెలియుటకు — జీవా ॥మే॥

గాసి నొందక సూక్ష్మబుద్ధిని
భాసురంబుగ వెంకటా శివ
దాసు హృత్పద్మ సంగస
దాశివుని కొలువా - జీవా ॥మే॥

## సువ్వితత్వము

సువ్విసువ్వియోగులార - సువ్విసువ్విభ క్తులార
సువ్విసువ్వియనుచుమీరు - సూక్ష్మమందరే ॥సు॥

శృంగాటక తావుజూచి — యోగంబనురోకలెత్తి
రాగము నేవడ్లుబోసి - బాగదంపరే ।సు॥

కుంభకమనుచేటబట్టి - పూరకమునముంచియెత్తి
రేచకమునపొట్టుచెరిగి - రాశిజేయరే ॥సు॥

పాపలంపు బాయకందు - ప్రణవమనేపలుకుగార్చి
పగలు రేయినేకతీతి - పలుకుచుండరే ||సు||
సూటిగనాఘటంబునందు - సోహామనేబియ్యముంచి
సరసముగనుగంగయమున - జలములుంచరే ||సు||
కుండలియనిప్రొయ్యితోను - కర్మములనుసమిధలుంచి
వంటచేయజంటతిత్తు - లంటియూదరే ||సు||
వంటచేసిపచనమైన - వంటకమునారగించి
సూటిసహస్రారమందు - సొచ్చినిలువరే ||సు||
సొచ్చినిలిచిమచ్చికలర - చెంచురాజుగురునికరుణ
శేషాచలయోగిగూడి - చింతసేయరే ||సు||

## జ్యోతివెలుగుచున్నదమ్మా

(ఆనందభైరవి — అట)

జ్యోతివెలుగు చున్నాదమ్మా
దాని, లోతు తెలియరావెకోనమ్మా
పాతాళగగనకళాతీతమైసర్వ
భూతములందు ప్రఖ్యాతిగఃరమాత్మ ||జ్యో||
ఎవరిచేతజిక్కదోయమ్మా దాని
విధమిట్టిదని జెప్పరాదుగదమ్మా శివ
కేళిలోగూడి సిద్ధేందుభావమై
పూనిక్రమమునచాల బుధులందునాయాత్మ ||జ్యో||
మాయలో మాయైనదమ్మా
దానిమహిమ తెలియగూడదమ్మా
మాయకులోగాను మాయకువెలిగాను
రేయిబగలునొక్క రీతిగబరమాత్మ ||జ్యో||

నానారూపములయినదమ్మా
తిరిగి తానుతానై యున్నాదమ్మా
పూని త్రికూటములోన నిత్యానంద
జ్ఞానములోన నిదానముగనాత్మ ॥జో॥

కనకమయమై యున్నాదమ్మా
తిరిగికనవచ్చు కనరాదోయమ్మా
ఫణితోడగూడుక పవలు రేయొకరీతి
తనువులోపల నీలతామరసమునందు ॥జో॥

ఎఱుకలోనెరుకైనదమ్మా సర్వ
మెరిగిసాక్షి తానై యున్నదమ్మా
పరమాణువుగ విశ్వపరిపూర్ణముగనాత్మ
గురుచంద్రుడగు శ్రీతరిగొండ నరహరిరూపమున ॥జో॥

## చిలక పాట

పల్లవి :- చిలుకచిలుకా నిన్ను పిలిచి తేయులుకా ?
నిలిచిమాట్లాడవే నీకింతయలుకా ॥చి॥

ఎఱకవేగ బెట్టుకొని ఎగిరెగిరిపోతావు
తిరిగినాచోట్లకే తిరిగి మళ్ళొస్తావు ॥చి॥

ఈదారినొచ్చేవు ఈయూరునీదటే
కాదు రహదారినే గనుచుపోరాదటే ॥చి॥

అమ్మనేదెలుసుకో అయ్యపేరడుగవే
ఆగొడవ తెలుసుకొని ఆరాట ముడుగవే ॥చి॥

ఆదిపురుషుడుతండ్రి ఆదిశక్తితల్లి
పుణ్యులిద్దరుగలియ పుట్టితివె యోపిల్ల ॥చి॥

జాటినా గిరిమించు తాటివృక్షపుతోట్ల
ఆడిలోనే నెలవు అది తెలిసి తేతోట్ల ||చి||

అండమనోపైన బ్రహ్మాండమనిపించావు
నిశ్చలత్వముగల్గి - నీవుగనిపించావు ||చి||

గ్రుడ్డుపేలినవెనుక మడ్డిజీవితమబ్బె
చిఱుపిట్టరూపంబు తెటవెడలనీకబ్బె ||చి||

పంచభూతములునీ పంచరంగులతనువు
ఆమట్టిగురిగెలో అమరిందినీమనువు ||చి||

తల్లినినుదన్నగా తాటినుండిజాటి
పడగానెనీగుణము పాడుగామారె ||చి||

మాయదిమ్మాతలకు మసకకల్పింపగా
తోటిచిఱుపిట్టలతో ఆటలేయింపుగా ||చి||

ఆడేవుపాటవే పాడేవుముద్దుగా
కిలకిలనవ్వుతూ పలికేవు రద్దిగా ||చి||

ఎదిగెదిగిపెద్దవై ఎగరనేర్చితివి
పొదలలోదూరితివి పొడుగుచెట్లెక్కితివి ||చి||

పండ్లతోటలజొచ్చి పండ్లన్నిగొరికితివి
పూలతోటలదిరిగి-పూదేనెత్రాగితివి ||చి||

పలుహొంరంగులయొడలి-వన్నెచిన్నెలుగాంచి
మురిసిపోతివిలోన ముదముచేగర్వించి ||చి||

ముక్కుముక్కునగల్పి మోహంబుచేబెంటి
నక్కనను జేర్చుకొని యానందమేగొంటి ||చి||

కన్నావుబిడ్డలను కాంచితివి ముచ్చటలు
కొన్నాళ్ళకెఱిగితివిబన్నాములువచ్చుటలు ||చి||

పెంటినిను బాసిచనె అంటుకొనెనగచాట్లు
కిన్నబిడ్డలగుంపు కనుమొఱగెనగచాట్లు
కొండరీల్గిరికటా క్రూరజంతులబారి
కొండరేగట్టుకో కోనకోపారి ॥చి॥
నీపేరుదలపరే-నీచెంతలారారే
ఎవరికెవరేగాక ఏకమాతారె ॥చి॥
భాగ్యభోగమునిత్య వస్తువనుకుంటూ
తనుతానుమరిపించు కొను పెద్దతంటా ॥చి॥
మొకజొన్నకండెలకు మూర్ఛించిచోరకోయి
రెడ్డిపడుచుచేతి దొడ్డయొడిసెలరాయి ॥చి॥
అంటుమామిడిపండ్ల కాసించి జననేల
తోటకాపరియొడ్డు నాటింపుములుగోల ॥చి॥
జామయుసిరికలున్న జాడనేబోకుండు
రెచ్చి విలుకాజేయు రేగడచ్చునగుండు ॥చి॥
నినుబాధపెట్టనే నిద్దంపుచిలకా
నీబాధజూడనే నోర్వనేచిలకా ॥చి॥
పెంటిబాసినవగవు - బిడ్డలేగినదిగులు
మంటలెత్తగనీకు - ఒంటిగానెదబగులు ॥చి॥
చింతపైగూర్చుండి - చింతబడనేలా
శాంతంబుచేకూరు - సరణిగావాలా ॥చి॥
నిష్కామకర్మంబు - నికరంబుదారీ
రాగలిగితేనీవు - రావెపొన్నారి ॥చి॥
గాదంటివానీవు - కడగండ్లపాలౌదు
వొర్లించినినుబట్టి - దొంగఎఱుకులజోడు ॥చి॥

బుట్టలో పెట్టుకొని - పట్టణపు నడబాట
పదిమంది కేజూపు - పాడు వేలము పాట ||చి||

కొన్నవాడొకయినుప - క్రొత్తపంజరములో
నినుదూర్చియిరికింప - నీవొందు బాములో ||చి||

నేజూడలేనె నా - నెయ్యంపుచిలుకా
నరకమేయిదినీకు - నాచిన్నచిలుకా ||చి||

ఇరుగలేదూనీకు - పొరుగులేదేవంక
నీవారుగనపడక - నీరుకన్నులనింక ||చి||

పొట్టపగిలేటట్టు - పొగిలిపోతావా!
ఉప్పట్టిపడినావు - ఉడికిపోతావా! ||చి||

కడ్డీలకెగబాకి - కౌగలించేవా!
దొడ్డివాకిలిరాక - ఉడ్డుగుడిచేవా! ||చి||

మడికూడేగుడిచి - జీడునీర్గొంతార్చి
మలమూత్రములుమేని - పంచనేదిగజార్చి ||చి||

ఎడ్డెబ్రతుకూపైన - ఏవగింపేగల్గి
కలనరంబుననెగుర - కాల్వ్యేరిగకేల్నల్గి ||చి||

ఓరచూపులుజూచి - యొరులెఱుగకయుండ
ఒక్కనాడురవడిని - ముక్కుపుటములురెండు
చొప్పించిద్వారంబు - తప్పించిబయలంది
ఎగరబోతివిగాని - ఎఱకబలమూకుంది ||చి||

దడదడనిగొట్టుకోన - సడిగన్నాయొకపిల్లి
నీగొంతుకొరికేసి - ఏగెనెదోగల్లి
నీతనువురాలింది - నీమనువుతూలింది
మిత్తినినుగబళించి - మింటికేమొగిసింది ||చి||

మరణమేయదినీకు - శరణంబుగాదూ
తరిలేనిదుఃఖములు - విరుగడేగాదూ
మళ్లివస్తానేను - మరివత్తునిచటికే
అనియేడ్చియేడ్చినా వరిగినానెచటికో ||చి||

మళ్లిరావద్దునా - మంచిమాటావినుము
మళ్లిరాకుండేటి - మార్గమేగనుగొనుము
రహదారిమార్గాన - రావెనాచెంతా
రహదారిపయనంపు - రహస్యమెఱిగింతూ ||చి||

మూడింటిపై భ్రమలు - ముండ్లపొదలనితొలగి
కలిమిలేములుసరిగ - దులదూచికొని మెలగ
అచటచటనాదారి - సంటియుందురునక్కి
ఆరుగురుదొంగల - ల్లదెచూడుమాచక్కి ||చి||

నూలువలలశ్వంపు — జూలువెండ్రుకయురులు
బంకరాచినగెడలు - బద్దలల్లినతెరలు
అమరించినినుబట్టి — నావరించుచున్నారు
మెలకువతోనడువలే - మేలయినచిన్నారి ||చి||

నెలరాదారినినడువ - నీకుసుకరంబు
రచ్చలన్నిటిమిన్న - రాజమార్గంబు
శమదమాదులుతరు -చ్ఛాయలై శ్రమదీర్చు
దానజపములఝరులు - దాహంబుతెగటార్చు ||చి||

నియనునిష్ఠాదులే - నిదురింపసావిళ్లు
రివ్వురివ్వుననడువు - రేయింబవళ్లు
ఆకాశయానమా - అలవడ్డదేనీకు
రెక్కలిమ్ముగగట్టి - రెక్కొంచుపై బ్రాకు ||చి||

అంచెలంచెలుదాటి — అలసటలుదీర్చుకొని
ఆనందవనమునకు — ఆత్మనేచేర్చుకొని
నీరూపునావెరిగి — నీలోనమునదమొందు
విరుగుతరుగూలేని — వింతసౌఖ్యముజెందు ||చి||
ఓంతత్సతోమ్మంచు — ఓలలాడేచిలుక ||చి||

## 5 తప్పిడికుండలభజన

తప్పిడికుండలభజనలో, ఏలపాటలూ, శృంగారపదాలూ, నీతి గీతాలూ పాడుచుండుట పరిపాటిగా వస్తూవుంది—

నాయకుడు, "హారే; హారే;" అంటూ బొరలుచాచి 3 సార్లు దీర్ఘంగాపాడి తరువాత ద్రుతంలో "వహ్వారి; వహ్వారి; వహ్వారి; తధిం తథ" అనిచెప్పి చాపుగా "భాళీ; భాళీ; భాళీ;" అనిదరువువాయించి పాడుటకు ప్రారంభిస్తారు.

### ఏల పాట

చోళ్లునల్లన్న చోడిపిండి తెల్లన్న
కాగబోసిత్రాగి తేను కడుపుచల్లన్న!
కోడినల్లన్న కోడిగ్రుడ్డు తెల్లన్న
అందులోని చందమామ! అధికపసిమన్న

### * శృంగారపదం

పల్లవి:- [1] గుమ్మ గుమ్మన్నలార గుమ్మన్నలారో
నారాచ గుమ్మడీ ||గు||
కోరకొప్పుబెట్టి కోరింటపూలుగుచ్చి
బారలేసుకనడిచేటి పణతీనిచూడరో
నారాచ గుమ్మడీ ||గు||

---

* విశేషాంశాలుగ ఈపదంలో ప్రాచీనవస్త్రవిశేషం వర్ణించబడింది.

1. గుమ్మన్న = అలంకరించుకొన్నస్త్రీ.

[2] అద్దాలరవికమీద [3] అద్దకాలకోకో
పయ్యాటచెంగుమీద [4] పావురాలనేతో
నారాచ గుమ్మడీ ॥౫॥
కుచ్చీలకొంగుమీద [5] గువ్వల్లకూర్పో

---

2. అద్దాలరవిక = పట్టునూలు జలతారుల నగిషీపనికి "బుటేదారి" అంటారు. అతిప్రాచీనమయిన చిత్రకళగా దీనిని భావించాలి. యీమనులూ, వీటినితయారు చేసే పరికరాలూ వేదాలలో వర్ణించబడ్డాయుట. బుటేదారిపనిలో, నూలుబట్టమీద రంగుపట్టుదారంతో వెనకనుంచి సూదితోకుడతారు. పట్టుజరీకుచ్చులు అమర్చుతారు. కొన్నింటికి గాజుపూసలు, ముత్యాలు కలిసికుడతారు మరికొన్నింటికి అద్దాల బిళ్లలుఅమర్చి కుడతారు.

3. అద్దకాలకోక:- చిత్రవిచిత్రాలబొమ్మలు. నగిషీలు, నమూనాలుగల కర్ర అచ్చులతో బట్టమీదరంగులతో అద్దుతారు. రకరకాలరంగుబట్టలమీద, దానికిసరి పడే రంగుఅద్దకపు చిత్రాలు ముద్రిస్తారు. ఒక్కొక్కభాగంలో ఒక్కొక్కరంగు పూసిన దిమ్మలతోముద్రించి రకరకాల వర్ణచిత్రాలు వచ్చేలాగుచేస్తారు. ఇందులో 'కలంకారీ' అద్దకాలుచాలాశ్రేష్ఠమైనాయి. బందరుకలంకారీ అద్దకాలు జగత్ప్రసిద్ధిపొందాయి -

4. పావురాలనేత:- రంగురంగుల దారంపోగులతో నూలుబట్టలమీద పట్టుబట్టలమీద కాయలు, పువ్వులు, తీగెలు, చెట్లు, దేవతలు. మనుష్యులు, పక్షులు, జంతువులు మొదలైనవర్గాలకుచెందిన బొమ్మలు రకరకాల నగిషీలువచ్చేటట్టు నేస్తారు. మామూలు పడుగు, పేక, దారాలలో చమత్కారంగా చాతుర్యంగా నేసేడోరియాలూ, చారలూ, గళ్లూ, వెండి, రాగి, బంగారుజలతారులతో అంచులూ, చిత్రంగా నేస్తారు.

5. గువ్వలుకూర్పు:- రంగురంగుల దారాలతో బట్టలమీద కావలసిన ఆకారాలను చిత్రంగా కుడతారు. ఇది బుటేదారీ పనివంటిదే -

హిందూదేశ వస్త్ర పరిశ్రమ వేదకాలంనుంచీ అభివృద్ధిచెందుతూ ప్రపంచ ప్రఖ్యాతిగాంచినది జిలుగువలువలు, రవసెల్లాలు, చీనిచీనాంబరాలు ఢాకామజిలీనులు, కలంకారీఅద్దకాలు మిక్కిలీప్రశంసింపబడ్డాయి -

ఈవస్త్రపరిశ్రమగూర్చి చారిత్రకులు చెప్పేగాథలు

౧ గౌతమబుద్ధుడు ఒకనాడు "గంగద్దామొ" అను స్త్రీ విగతవస్త్రగాతియగు

కరకంచుచీరమీద కస్తూరిమల్లో;
నారాచ గుమ్మడీ ॥౫॥

---

తున్న దనిభావించి, ఆమెను మందలించగా, ఆ స్త్రీ తనయొంటి నిండుగా ఉలిపిరి జిలుగు వలుతను కట్టుకొనుట ఆయనకు చూపిందట -

౨ ఔరంగజేబు చక్రవర్తి ఒకసారి తనకూతుర్ని చూచి, శరీరం కనిపించేటట్టు చీర కడుతున్నావేమి?" అని మందలించగా ఆమె "అయ్యా! ఈమల్ మల్ చీర నాశరీరం చుట్టూ యేడుసార్లు చుట్టుకున్నానండీ" "అని జవాబు చెప్పిందట.

౩ ఈమె కట్టుకొన్న చీరెను, చాకలి చలువచేసి, పచ్చికబయలుమీద ఆరవేయగా ఆవు, పచ్చికతోబాటు చీరెనుకూడ మేసివేసిందట.

౪ నత్తగుల్లలో యిమిడే పదహారుమూళ్ల చీరెలూ, సెనగకాయలో యిమిడే ఎనిమిది మూరలపంచెలూ, దేవతావస్త్రాలని వాడేవారు -

వస్త్రాలలో, స్త్రీ పురుషాది ఆబాలగోపాలం వాడేవి. అనేక పేర్లతో వున్నాయి - చూడండి-

సీ॥ సంపంగి కావులు, జందురు కావులు
పలిపట్టుపుట్టిముల్, వేఁటచాళ్లు
జిలుగుబొమ్మంచుల, చీరలునాచులు
నుదయరాగంబులు, నుడుతవన్నె
లొప్పుముయ్యంచుల. పుష్పాళ్లుహొన్నంచు
వలువలుఁగరకంచు, వస్త్రతతులు
ముత్యాలపందిళ్లు నుత్తరగోగ్రహ
ణములునిగమగోచ రములుఁబద్మ

తే॥గీ॥ పుందిలకలు నిండువన్నెలు, బొడలు బచ్చ
లునుహారిణవల్లుహంసవ. ల్లులునురంగ
వల్లుబొదలునుసామంత, వదులునన'గఁ
దనరెడు పసందుపటముల, గొనియె వెలకు

(హంసవంశతి 5. ఆ 355 ప)

ద్విపద॥ కెంజాపళియుజయ, రంజియుసంచు
పుంజంబుమణిపట్టు భూతిలకంబు
శ్రీవన్నెయయునుహా జీనియుజీని
భావజతిలకంబు, పచ్చనిపట్టు

రాయశేఖరమును రాజవల్లభము
వాయుమేఘము గజ వాళంబుగండ
పడము గాపునసరి పట్టునుహంస
పడియవీణావళి పల్లడదట్టి
వారణాసియు జికువాయిగొందొగరు
గౌరీగనయమును క్షీరోదకంబు
పట్టును రత్నంబు పుట్టునుశంకు
పట్టునుమరకత, పట్టుపొంబట్టు
నెఱపట్టుజాలిపట్టు నేత్రంబుపట్టు
మరితపరాజంబు మాండోదరవియు
చంద్రాతపంబును సాంధ్యరాగంబు
నింద్రరాగంబు మహేంద్రభూషణము
సన్నవడంచును శరధియుమేఘ
వన్నియరుద్రాక్ష వన్నెకాంభోజి
పులిగోరుపట్టును భూపతిరుద్ర
తిలకంబుసరిపట్టు మలయజసిరియు
శాలనిమేఘము గజావళిహయావళియు
వలిపంబు సరిదమ్మి తెలుఁపుదివ్యాంబ
రంబులు నుదయరాగంబు దేవాంబ
రంబుపొత్తియుగుజరాష్ట్రంబుపట్టు
మానితవస్త్రవితానముల్ గలవు.

(పా॥ సోమన్న – బసవపురాణము 3 ఆ)

## సప్త తాళాలభజన

అధ్యాత్మరామాయణ కీర్తనలవలె, యీభజనలోని కీర్తనలను ప్రతీదానినీ గురుముఖంగా నేర్చుకోవాలి. చాకచక్యంగా తాళాలు మారుస్తూ పాడాలి —

శంకరాభరణరాగం — ఏడుదెబ్బలు

ప॥ నీలవర్ణ రా రా! నిన్నె నమ్మితిని రా
జాలమేల రా రా! ॥జాల॥

తాళజాల వీరశూరధీర రా రా ॥నీ॥

అ॥ ప॥ నీ లా వర్ణా రా రా
ని న్నె నమ్మితి నిరా ॥నీ॥

చ॥ బాల కృష్ణ రా రా! భళిర వహరిజేలరా
మేలు లొసగ వేరా ॥మేలు॥
ముద్దులొలుకు చిలుక పలుకు కల్కిరార ॥నీ॥

చ॥ హరి హరాదిదేవ। అరమరలేలరా రా
కరినిగాచినావా ॥కరి॥
కుర నేలినావు గావదేవబ్రోవరా ॥నీ॥

చ॥ చింగునాచేటకవి చెంగునాయనిబ్రోచు
సంగతితోబంగరు టుంగరములు
అంగనకొసంగిన మంగళాంగరంగశాయి ॥నీ॥

# ౭. వ్యవసాయ వాఙ్మయం

జాతి మనుగడకు వ్యవసాయమెంత ప్రాణాధారమో, దాని సాహిత్యంగూడ, విజ్ఞానానికిఅంతప్రాణప్రద మయింది. జాతియొక్క నిజచైతన్యమూ విజ్ఞానం మనం అర్థంచేసుకోవాలంటే ఆజాతి కృషీవలుల చేవ గలిగిన కృషివిధానంలోనూ, వారి వాఙ్మయంలోనూ ఉన్న లోతుపాతులను గ్రహించాలి–

మన తెలుగునాడులో ప్రతీప్రాంతంలోను వ్యావసాయక కార్యకలాపాలను మనం ప్రత్యక్షంగా చూస్తే. వారివారి ఆనందోత్సాహాల పరిమితిని అర్థం చేసుకొనగలము. ప్రాణచైతన్యమైన ఆ ఆనందానికి ఏరకమైన ముసుగూలేకుండా స్వాతంత్ర్యదేవత ఉరకలువేస్తూ నాట్యం ఆడుతూవుంటుంది. అట్టిఉత్కృష్టమైన కృషి వాఙ్మయసమ్మేళనమే ఈశీర్షిక–

రామాయణ భారత భాగవతాది పురాణాలూ, ఉపనిషత్తుల సారమూ అలలలోని రాగంవలె అలంబనమై యీవాఙ్మయంలో నిండివున్నాయి. భక్తి, భుక్తి, ముక్తి, శక్తి. రక్తుల లీలా సహజ సౌందర్యస్వరూపాలు వ్యావసాయిక శ్రామికులలోనూ, వారి పదాలలోనూ, విరాజిల్లుతూ వుంటాయి. వినువారికీ, కనువారికీ ఆనందప్రదానం చేస్తూవుంటాయి.

భూమాత తన నవరసభావాలను వారిసన్నిధినే వ్యక్తీకరిస్తూ వుంటుంది. క్షేత్రలక్ష్మి వారి సన్నిధానంలోనే సాక్షాత్కరించుతూ వుంటుంది. యౌవనలక్ష్మి వారియెదుట చిరునవ్వులు నవ్వుతూ వుంటుంది. ధాన్యలక్ష్మివారికి తన పసిడి చేతులతో నివాళులిస్తూ వుంటుంది–

## (1) వానకోసం ప్రార్థన:-

మొర్రో మొర్రో వాన దేవుడా
మొర్రో మొర్రో వాన దేవుడా
మమ్మింక దయ జూడుమయ్యా
మా వాడ కే రావయ్యా ॥ మొ॥
ఏనుగులాంటి మొగోళ్లు
ఎత్తులడి పోయారు ,,
కూకొండ లేదంటు ,,
కుండెట్టి కొట్టాడు ,,
మండెడు గంజిలేదని ,,
మండెట్టి కొట్టాడు ,,
ఈనుతున్న చేలన్ని ,,
ఎండిపోవు చున్నాయి ,,
పండుచున్న చేలన్ని ,,
పండుబారి పోయాయి ,,
దుక్కి టెద్దు లన్నియు ,,
తూలిపోవు చున్నాయి ,,

### -:వర్షాని కురిపించమని కోరుట:-

♦ పేట్రాయి వాన దేవుడా! మమ్మేలినోడ
పేట్రాయి సామి దేవుడా!

---

♦ విషాశేంశములు:— పేట్రాయి- వేటరాయడా!

తిరుపతి వేంకటేశ్వరుడు వేటగాని వేషంలో వుండగా, అ రూపంతోనే వుండమని, ముని కుమారు డొకడు స్వామిని కోరగా, అట్లే వుండిపోయాడు. "వేట రాయ" అన్నది వాడుక. పేట్రాయి, ట్రాయి అయింది.

వర్షాలు కురిపించి వరిచేలు పండించి
వసుధ జనులనెల్లపోషించి, రక్షించు ॥పే॥

## కప్పను వూరేగిస్తూ వానదేవుని ప్రార్థించడం

ప॥ వానదేవుడా! వానదేవుడా!
వానల్లు కురిపించు! వానదేవుడా ॥వా॥
కప్పతల్లీ నీల్లాడె
కడవలనిండా నీల్లొచ్చె
మొుర్రో వానదేవుడా ॥వా॥
ఈగ తల్లీ నీల్లాడె
వీధుల నిండా నీల్లొచ్చె
మొుర్రో వాన దేవుడా ॥వా॥
దోమ తల్లీ నీల్లాడె
దొరువుల నిండా నీల్లొచ్చె
మొుర్రో వాన దేవుడా ॥వా॥
చేప తల్లీ నీల్లాడె
చెరువుల నిండా నీల్లొచ్చె
మొుర్రో వాన దేవుడా ॥వా॥
తూరుపున మొయిలుట్టె వానదేవుడా!
తుంపరలు రావాలి వానదేవుడా!

---

తిరుపతి తిరునారాయణులలో కదిరి మహాక్షేత్ర మున్నది. ఫాల్గుణ శుక్ల పక్షంలో. యిక్కడి బ్రహ్మోత్సవం జరుగుతుంది. యిక్కడ దేవుడు "కదరి వర సింహుడు" ఈయన పట్టమహిషి లక్ష్మీదేవి. రెండో భార్య చిన్నాదేవి. ఈ స్వామిని గౌడులు కాటమహేశ్వరుడు, కాటమరాయడు అని చెప్పుతారు. వారు "బ్రెట్టాయి స్వామిదేవుడా!" అంటూ సేవిస్తారు.

చిన్న చిన్న తుంపరలు వాన దేవుడా!
చేలరేగి కురవాలి వాన దేవుడా!
జడి వాన రావాలి వాన దేవుడా!
సాగాలి కాలువలు వాన దేవుడా!
చెరువు లన్ని నిండాలి వాన దేవుడా!
చేలన్ని పండాలి వాన దేవుడా!
అందవయ్యా దణ్ణాలు వాన దేవుడా!
అందరిని బ్రతికించు వాన దేవుడా!

## —: కప్ప తల్లి పెళ్లి వేడుక :—

కప్పతల్లి పెళ్లి వేడుక చూడరే
కావిళ్ల నీళ్లంపినాడూ
వరుణ దేవుడు పంపినాడూ ||ఓ చెలీ||
వాడలన్నీ నింపినాడూ||

## కప్పమ్మ పెళ్లి

కప్పమ్మ పెళ్లికోయంచు మేళములు
గొప్పగా తెప్పించినాడు
వరణ దేవుడు పంపినాడు ||ఓ చెలీ||

---

♦ విశేషాంశములు:- వర్షాలు సకాలంలో వర్షించనప్పుడు, హరిజన స్త్రీలు, ఒక బోదురు కప్పను పట్టుకుని, పసుపురాసి, కుంకుమబొట్లు పెట్టి, పసుపు గుడ్డతో రోకలి మీద పెట్టి కట్టి, యిద్దరు దానిని మోస్తూవుంటే, కొందరు పేరంట్రాళ్ళు పళ్లెంలో పసుపూ, కుంకుమా, పువ్వులూ, పత్రీ పెట్టి, కోలన్న పుల్లలతో వాయిస్తూ, వరతపదంగాయీ పాటను శ్రావ్యంగా పాడతారు—

కప్పలలో 1. ఊరుకుడు కప్ప, 2. వదరుకప్ప, 3 గోండ్రుకప్ప, 4. ఆడు కప్ప, 5. చిరికప్ప అనే రకాలున్నాయి. గోండ్రుకప్పనే పెద్ద కప్ప లేక బోదురు కప్ప అని చెప్పతారు.

చెప్పశక్యముగాదు వేరే - బోదురూ
కప్పలా మేళములు రావే
కప్పమ్మ గడపతొక్కినదీ - శుభమన్న
సూచనలు మూరు చెప్పినదీ
కప్పలెగిరె - వానలమ్మా - పొలములో
కనకమే పండుతాయమ్మా॥

## పువ్వుల మబ్బా! దిగవే దిగవే

కారు మేఘమా! రావే, రావే,
పువ్వులమబ్బా! దిగవే, దిగవే, ॥కా॥
పింజమేఘమా! ధూళిమేఘమా!
చెమటనుఊడ్చి దిమ్మరింపవే ॥కా॥
కబోదిమబ్బా! చిట్టితమ్ములను
పన్నెండుగురిని పట్టుకురావే ॥కా॥

---

విశేషాంశములు :—

అష్టమేఘాలు:— మేఘమాలికా శాస్త్రంలో, మేఘాలను ఎనిమిది రకాలుగా నిర్ణయించి వివరాలు వ్రాయబడి వున్నాయి.

1. పుష్కలావరక మేఘాలు :— యెక్కువగను, మిక్కిలి వింతగను వర్షిస్తాయి. ఇవే కుంభవృష్టిని కురిపించేవి. కుంభవృష్టి అనగా కుండలతో దిమ్మరించు విధముగా వాన వుంటుందంటారు.

2. మధుమేఘాలు :—తేనె రంగు కల్గి వుంటాయి. పదునైదామడల పొడవు వరకు వ్యాపించి, నాలుగు తూముల వర్షాలు కురుస్తాయని చెప్పతారు.

3.. వాయు (షండిల) మేఘాలు:—గోరోచనపు రంగు గల్గివుంటాయి. ఇత్తడి రంగుగా కనబడతాయి. ఇవి కనిపస్తే వర్షం కురియదంటారు. దీనినే జానపదులు "పులిచారల మబ్బు" అంటారు. ఇవి పన్నెండాడల పొడవు వ్యాపించుననియూ, గాలి యెక్కువగా ప్రకోపించి, ప్రధానంగా వుండే స్వల్పవర్షం కురుస్తుందని చెప్పుతున్నారు.

4. రాజమేఘాలు :— నల్లని, తెల్లని మబ్బునందు రాగి వలెను, దాసాని పువ్వువలెను, రంగుల్లు కలిగి మెరుపులు కనబడితే, ఆ మబ్బులో రాజమేఘా లున్న

కొంచెమునీళ్లను విడిచిపెట్టవే
అన్నంకడుపుకి తింటాము ||కా||
తిన్ననిమబ్బా! దిట్టారావే,
సోమరిమబ్బా! చిట్టీరావే ||కా||
ముక్కుపుడక నేనమ్మి నీకొక
గొడుగునుకొంటా వేసుకురావే ||కా||
మెత్తనివానా! మెల్లిగదిగవే
ఇంటినాగలి మూలకుచేరే ||కా||
సూరన్న వేడిమి సొమ్మసిలచేసె
నవ్వు మొగముతో రావే,రావే ||కా||

---

వని తెలుసుకోవాలి. మరియు యీ మేఘాలు ముఖ్యంగా వింధ్యోత్తర దేశాలందు గంగా తీర సీమలందు వర్షిస్తాయని వాకొంటున్నారు.

5. బ్రాహ్మణ జాతి మేఘాలు ;- కమలముల వన్నె కల్గి వుంటాయి. ఇవి గాలిపాటును బట్టి వర్షిస్తాయని చెప్పుతారు.

6. క్షత్రియ జాతి మేఘాలు :- యెర్రని రంగుగల్గి, గంభీరాకారంతో వుంటా యంటారు.

7. శూద్రజాతి :- నల్లని రంగుగల్గి ప్రశాంతంగా వుంటాయని చెప్పుతారు

8. నీలమేఘాలు :- ఇంద్ర నీలమును పోలిన రంగుగల్గి, వుంటాయనియూ, నిప్పురంగు మెరుపు లీ మేఘముల నుండి కల్గుతాయనియూ, ఇవి వింధ్యకు దక్షిణదేశముల, గోదావరినది సముద్రగామి యగు ప్రదేశాల వర్షిస్తాయని చెప్పుతున్నారు.

—: వర్షమానము :—

| | |
|---|---|
| దుక్కికి సరిపడిన వర్షం | 1 మానిక |
| 16 మానికెలు | 1 తూము |
| 4 తూములు | 1 ద్రోణము |

అని కాలవిజ్ఞాన శాస్త్రంలో చెప్పబడింది,

గ్రామీణులు చెప్పుకునే మానం

| | |
|---|---|
| పయిమీద బట్ట తడిసే వానకు | బట్టతడుపువాన |
| సాగటితో దున్నె పదును పడితే | దుక్కి వర్షం |
| మడిగట్లు నిండిన నీరుగల వర్షం పడితే | మడికట్లవాన |

ఈ విధంగా జానపదులు లెక్కిస్తారు. ఇంగ్లీషువారు వర్షాన్ని అంగుళాలతో కొలిచి లెక్కిస్తారు.

## వర్షంకోసం చేసే ప్రయత్నాలు

వర్షాలుకురవకపోతే గ్రామీణులు శ్రీమహాభారతంలోనినాల్గవదయిన విరాటపర్వాన్ని చదివించుటపరిపాటి. కొందరు, శివలింగానికిజలాభిషేకంచేస్తారు, వెయ్యికడవలనీరు శివలింగంమీద అభిషేకిస్తారు. దీనినే "సహస్రకుంభాభిషేకం" అంటారు. కడవలకుబదులు బిందెలను ఉపయోగిస్తే ఘటాభిషేకమందురు.

కొన్నిచోట్ల వరుణపూజలుచేస్తారు. అనగా పాలతో అన్నం వండి - దీనినే క్షీరాన్నము, పాసెము, పరమాన్నము అనుపేర్లతోపిలుస్తారు- గ్రామీణులంతా క్షీరాన్నాన్నివండి ఊరిబయట ఎత్తైన ప్రదేశంలో వరుణదేవుని ఆహ్వానంచేసి భక్తి ప్రపత్తులతో యీపరమాన్నాని, దేవుని ఒకబల్లమీదవారపోస్తారు. దానిని దేవప్రసాదంగా ప్రతీవారూ తీసుకొని. కళ్లకద్దుకొని భుజస్తారు. దీనిని "వరుణపూజ" "వానదేవునిపూజ" అనిచెప్పుతారు.

ఆ సందర్భంలో యీదిగువజానపదగేయాన్ని వంతపాటగా పాడుకుంటారు

---

విశేషాంశాలు:-

వానరాకడ, పోకడ వివరాలు:- రెట్టమత శాస్త్రంలో యీ విషయమై చక్కగా వర్ణించబడినది. రెట్టమత శాస్త్రాన్నే కాలవిజ్ఞాన శాస్త్రం, మేఘమాలికా శాస్త్రం అనికూడా వాడుతుంటారు. వ్యవసాయదారులు అనుశ్రుతంగా వానరాకడ పోకడలు చెప్పుకుంటూ వుంటారు.

1. గర్భఋతు వేళలందు మబ్బు మధురవర్ణం కల్గివుంటే, అప్పుడు గ్రహవక్రములు లేకుండేనేని, నాల్గుతూముల వర్షం కురుస్తుందనియూ, గ్రహావక్రస్థితివుంటే ఖండవృష్టిగా మారుతుందనియు చెప్పుతారు.

2. నాలుగు దిక్కులందూ, ఆకాశాన మబ్బుకలిగి, యేనుగురంగు గలిగి నల్లగా వుంటే చక్కగా వర్షిస్తుందంటారు.

3. నాలుగు దెసలందాకాశమున వ్యాపించిన మేఘాలు, మంద్గగమనం

## వానదేవుడు

| | |
|---|---|
| మాపల్లెపాలించే - | వానదేవుడా |
| మా కెల్లవర్షమిచ్చే | ,, |
| మా కెల్లనారిచ్చే | ,, |
| మాదప్పికలుతీర్చే - | ,, |
| మాపల్లెపాలించే | ,, |
| మమ్మెల్ల నేలుకోని - | ,, |
| ఉత్తరానఉబ్బుబ్బు - | ,, |
| దక్షిణానజల్లుజల్లు - | ,, |
| ఏదిక్కునున్నావో | ,, |
| మాదిక్కు రావో | ,, |
| మా కెల్లవరమిచ్చే | ,, |

---

గలవిగా, మృగాల వలెనూ, ఏనుగుల లాగుననూ కనబడినచో మంచివాన కురుస్తుందంటారు.

4. తళతళ మని మెరిసే మెరుపులూ ఉరుములూ గలిగి తెల్లని మబ్బు గగనతలాన్ని క్రమ్ముకొని వుంటే దేశం నలుమూలలా వానలు పడతాయని చెప్తారు.

5. మబ్బులలో వున్న మేఘాలు, వింజామరాలు, సరస్సులు, తటాకాలు, మంచెలు, ఏనుగు కుంభస్థలాలు, హంసలు, తెల్లని పర్వతాలు, గోపురాలు, తోటలు, విమానాలు, గొడుగులు, ఖడ్గాలు, ఎద్దు, శంఖాలు వంటి ఆకారాలు కనిపిస్తే కుంభ వర్షం కురుస్తుందంటారు.

6. కాకులు, నక్కలు, కోతులు, ఎలుగుబంట్లు, కుందేళ్ళు, పడిపోయిన గృహాలు, కాలిన గ్రామాలు, విరిగిన మోడుమ్రాకులు — వీటి స్వరూపాలతో ఆకాశమునందు మేఘాలు కనబడితే, అల్పవృష్టి అని చెబుతారు.

7. ఎరుపు, పసుపు రంగులు కలిసి (కొత్తగోరోజనం) రంగు మేఘాలునూ, ఇత్తడిరంగు మేఘాలునూ, ఇంగిలీకపురంగు మేఘాలున్నూ, బూడిదరంగు మేఘాలున్నూ అనావృష్టి సూచకా లంటారు.

నిన్నె గానమ్మియున్నాం — వానదేవుడా
మమ్మెల్లరక్షించే — ,,
మాకెల్లపంటలిచ్చే — ,,
మామొరపాటించయ్యా — ,,
కాపాడవచ్చినావా — ,,

## •తొలకరి

తొలకరిఒకమబ్బు తొంగిచూచింది
మబ్బులోఒకమెరుపు మెరిసిపోయింది
పెరటిలోఒకజల్లు కురిసిపోయింది
* వీధిలోఒకగాలి విసిరిపోయింది
ఏకొమ్మమీదపో ఎండతాకినపిట్ట
ఏటితోవలుపట్టి ఎగిరిపోయింది
ఏరువాకనాటి కేడాదిదాటింది
ఎదురుచూచిగుండె చెదరిపోయింది

---

8. సూర్యోదయ సూర్యాస్తసమయాలలో, ఆకాశంలో మబ్బులు ఎర్రగా కనబడితే వర్షసూచ కాలంటారు.

9. కొండమీదికి మబ్బులు దిగినట్లు వాలి వుండుటయునూ, మబ్బులలో మెరుపులు కనబడడమునూ, వాయవ్య, యీశాన్య దిక్కులందు మబ్బులు కూడుటయునూ, పెద్ద వర్షాలు కురిసే సూచకాలని చెప్పుతారు.

10. సూర్యుడుండగా, తూర్పునగాని, పడమరగాని, మబ్బులు వేసి మెరయుట, మేఘాలు బంగారు ఛాయ గలిగి వుండుట, గొప్పగా వర్షించే సూచకములంటారు.

11. గొప్పమర్రిచెట్టులాగ కనపడే మేఘాలమీద బంగారు ఛాయతో వున్న యింకొక మేఘం కనిపిస్తే, ఎక్కువ జడివానలకు సూచకాలంటారు.

•తొలకరి చైత్ర వైశాఖమాసాలలో కురిసే వానలనే తొలకరించిందంటారు

పిట్టపిట్టాముద్దు పెట్టుకొన్నాయి
గోవులన్నియిల్లు చేరుకొన్నాయి
ఏటిగాలికిచిలుక లెగిరిపోయాయి
ఎందుకోనాయాశ లిగిరిపోయాయి
ఏటిఒడ్డుననేను పాటపాడేవేళ
నవ్వుతూమాబావ పువ్వులేరేవేళ
కొంటికోయిలపైన కూతకూసేవేళ
లేతమనసువిచ్చి పూతపూసేవేళ
బావొచ్చినాతోటి బాసలెన్నిటోనాడి
ముద్దిచ్చినాతోటి మురిసిపోవాలి
ఏరువాకమ్మ మాకెదురుకావాలి
తలవంచి మముజూచి దీవించిపోవాలి

## నా గ లి పూ జ

ప॥ మంగళమమ్మా! మాపూజలుగైకొమ్మా
మంగళమమ్మా! నాగలి నీకు ॥మం॥

1. కష్టమనకభూమిదున్ని కరువుమాపి, కడుపునింపి
సకలజీవరాసినీ, చాలునపోషింతువమ్మా ॥మం॥
2. కర్షకులను కరుణతోడ; కాపాడుచుయెల్లప్పుడు
కామితార్థములనిచ్చెడి, కల్పవల్లివమ్మానీకు ॥మం॥

## నా గ లి ప ద ం

పడమటకొట్టు వేసె, పదునువానగురిసె
పో పొయ్యిరఘురాముడు పదునుజూసొచ్చె
గోపమ్మనులేపండి, గొట్టుపూజియ్య

ఇంట్రటాన్ని లేపండి, సద్దుల్లుగట్ట
శ్రీరాముడుగొఱ్ఱుతోలె, సీతవిత్తనాలేసె
శ్రీరాముడుయెవ్వరు ? సీతయెవ్వారు ?
శ్రీరాముడుమాతండ్రి, సీతమాతల్లి,
రఘురాముడుగొఱ్ఱుతోలె, సీతవిత్తనాలేసె,
రఘురాముడుమాయన్న, రంభమావదిన
మూడుకన్నులరాయి ముత్యాలరాయి
ముత్తయిదులిసిరేరె నిన్నుగౌరమ్మ
పదికన్నులరాయి పగడాలరాయి
[1] పుట్టెడురాగులు యీరాతిపాలు
[2] పందుముజొన్నలు యీరాతిపాలు

## * ఏరువాక ఆరాధన

ఏరువాకమ్మకు ఏమికావాలి ?
ఎర్రఎర్రనిపూల మాలకావాలి
ఎరుపుతెలుపులమబ్బు కొండకావాలి
ఏరువాకమ్మకు ఏమికావాలి ?

---

విశేషాంశాలు:-

1. పుట్టెడు :- మలక పుట్టికి 200 కుంచాలు, పల్లెపుట్టికి 80 కుంచాలు విశాఖమండలములో 20 కుంచాలు.

2. పందుము 1 పుట్టిలో సగం

విశేషాంశాలు ;- 1. ఏరువాక పున్నమ. 2. ఏరు సాగుట.

ఏరువాక అను పదము. దేశ్యము, ఏరు = సర్వావయవాలు గల వాగలికి యెడ్లను పూనినది వాక = దున్నుటకు ఆరంభం.

ఏరువాక పున్నమ :- ఇది ఆంధ్రదేశంలో ప్రచారంలో వున్నది. దీనిని జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాడు చేస్తారు.

పొలముగట్టుననిలిచి వేడుకోవాలి
టెంకాయవడపప్పు తెచ్చిపెట్టాలి
ఏరువాకమ్మకు ఏమికావాలి ?
ముత్తైదువలందరూ పాటపాడాలి
పుణ్యస్త్రీలందరూ పూజచేయాలి
ఏరువాకమ్మకు ఏమికావాలి ?
పాటపాడుతుతల్లి, పాదాలుమ్రొక్కాలి
ఎడతెగని సిరులివ్వ వేడుకోవాలి
పాడిపంటలుకోరి పరవసించాలి ॥ఏ॥

---

కొన్ని చోట్ల పునర్వసు కార్తెలో పునాసవిత్తనాలు చల్లుటకు ఆరంభిస్తారు.

ఈ పండుగ వ్యవసాయ దారులకు ముఖ్యమయినది. ఈ పండుగనాడు ఎడ్లను కడిగి, వాటి కొమ్ములకు పసుపుపూసి; బొసికానికి పసుపురాసి దానిమీద కుంకుమ బొట్టుపెట్టి, గజ్జెలు, గంటలు అద్దాల చిరుముట్లు, కుచ్చులుకట్టి అలంకరిసారు. ఎడ్లను కట్టే గుంజలకు ధూపదీపనైవేద్యాలిస్తారు. ప్రొద్దునసే పులగం (పొంగలి) వండి ఎడ్లకు పెడతారు.

సాయంకాలమందు, మంగళవాద్యాలతో, ఊరిలోని వారందరూ, తమ తమ ఎడ్లను ఊరి బయటకు తోలుకు వస్తారు. ఊరివాకిట పుంటినారతో తోరణాలు కట్టి దానిని గ్రామస్థులు చేతికర్రలతో కొట్టి పీచుపీచుగా చేసి, ఎవరికిదొరికిన పీచు వారు తీసుకొని పోయి తమతమ యిళ్ళలలో పెట్టుకుంటారు. ఈ పీచు పసువులకు మేలు కల్గిస్తుందని వారి విశ్వాసం ఎడ్లను పరుగులెత్తిస్తారు.

ఉత్తరదేశమున "ఉద్వృషభయజ్ఞము" అని దీనిని చేస్తారు.

2. ఏరేసాగుట=నాగలితో నడచుట, అనగా తొలి దుక్కిని ప్రారంభించుట.

క్రొత్త అమావాస్య తెల్లవారు గట్ల అనగా, ఫాల్గుణ బహుళ అమావాస్య నాటి తెల్లవారు జామున తెల్లవారితే సంవత్సరాది వచ్చేముందు ఏరుసాగుతారు. దీనిని 'దొంగఏరు సాగుట' అంటారు. సంవత్సరాది వెళ్ళిన తరువాత మంచి ముహూర్తం పెట్టించుకొని ఏరుసాగుతారు. ఈ రెండు విధాలా వాడుకలో వున్నాయి.

## ఏరువాక

ఏరువాకవచ్చింది - ఏరువాకమ్మా
ఏళ్లునదులుపొంగి - వెంటనేవచ్చాయి
నల్లమేఘాలలో - నాట్యమాడింది
ఇసుకనదిలోదూరి - బుసలుకొట్టింది
పాడుతూకోయిల - పరుగులెత్తింది
ఆడుతూనెమిలి - అలసిపోయింది
నవ్వుతూమాబాబు - బువ్వతిన్నాడు
ఏరువాకవచ్చింది - ఏరువాకమ్మ

## మెరకలకు నీళ్లుతోడుట

పంటకాల్వలకంటె మళ్లు మెరకగా వుంటే, గూడతో నీళ్లు తోడడం పరిపాటి. నూతిలోని నీరు తోడుటకు ఏతాము, మోటలు వుపయోగపడతాయి.

---

తొలిమక్కి దున్నుటకు బయలుదేరే ముందు, నూనె వేసిన పులగము ఎడ్లకు పెడతారు. నాగలికి యెడ్లనుకట్టి, పసుపుపూసి, కుంకుమబొట్లు పెట్టి, పూలు పత్రి దండలు వేసి ధూపదీపము లిస్తారు. "మంగళమమ్మా! మాపూజలు గైకొమ్మా! మంగళమమ్మా! మా నాగలి నీకు ॥మం॥ అంటూ స్త్రీలు హారతి నిస్తారు.

ఏరు సాగిననాడు తమ యింటిలోని నిప్పు యితరులకు యివ్వరు. ఏ విధమయిన చేబదుళ్లు గాని యివ్వరు.

తూర్పు ముఖంగా గాని, ఉత్తర ముఖంగాగాని ప్రారంభించి కొండ్రపోసి ఆయా ముఖాలుగానే అపుజేసి, యెడ్లకు విప్పుతారు.

కృషి ప్రారంభానికి మంచివి

అనూరాధ, హస్త, చిత్త, స్వాతి, రోహిణి, ధనిష్ఠ, మఖ, అశ్వని, ఉత్తర ఫల్గుని, ఉత్తరభాద్ర, ఉత్తరాషాఢ, రేవతి, మూల ఈ 13 నక్షత్రాలూ, మంగళ, బుధ. గురు, శుక్ర వారాలూ వ్యవసాయారంభానికి మంచివి.

## గూ డ ప దం

॥ప॥ పాతాళగంగమాయమ్మా. తల్లీ;
చెంగుచెంగున పైకిపొంగిరావమ్మా ॥పా॥

1 వచ్చొచ్చెదారిలో, తచ్చాడుచుంటావు
కన్నతల్లినిబోలి, కదలిరావమ్మా ॥పా॥

2 పల్లుపువ్వాలతో, పసుపుగంధాలతో
పూజించి నినుదెత్తుమమ్మా ॥పా॥

3 పంటకాలువనుంచి పయనించిపయనించి
పంటభూములకలయ ప్రవహించవమ్మా ॥పా॥

## 2 ఏ తా ము పా ట

ఏతాము తోడరా తమ్ముడా ! నీ
చేతయిన సాయమదె తమ్ముడా !

1 పాతాళగంగమ్మపై కుబికి పొంగింది
యేతాము తోడ మొరకనేలన్ని తడపాలి ॥ఏ॥

2 గూళ్లునొప్పనకుండ, గూనలులాగాలిబేగి
నేలన్ని తడిసిమరి మూనలుబాగెదగాలి ॥ఏ॥

3 కట్టతెగి పోకుండ కట్టండిగట్లన్ని
బద్దిపై సిన్నోడు భద్రముగానడవాలి ॥ఏ॥

4 పట్టుతప్పి తెపల్లు, పలపలరాలాయి
చట్టలువిరిగేను, సరితూగినడలాలి ॥ఏ॥

5 ఏతమెక్కినవాడు, ఏరుకట్టినవాడు
ఏటేటపంటలతో, వెలగాలిపదినాళ్లు ॥ఏ॥

1 నీరు తోడడానికి వెదురుపేళ్లతో చేయబడిన కోలగావుంటుబుట్ట, వానకు తలమీద వేసుకొనే జమ్ముతోఅల్లిన దానినికూడా గూడఅంటారు

2 ఏతము యొక్క రూపాంతరం. ఏతాము=నీళ్ళను యెత్తే యంత్రము.

## పార పదాలు

నీటికాలువలు కట్టే టప్పుడు, పార వేస్తూ పాడెవి పారపదాలు

"అన్నిటికి నీవేగతి దమ్మిడీ!
నీవెంతపని చేశావె దమ్మిడీ
నిన్ను పెట్టి లోనెపెట్టినానె ,,
నన్ను మోసగించి పోయినావె ,,
అందరికి ఆసపెట్టే ,,
ఏకాదశినాడు, రాకాసినాడు
నీకోసంవచ్చి నానే ,,

"ఏవూరు భామా?
గుంటూరు నాది?
ఏమినీ పేరూ?
పేరె గున్నమ్మ?"

" వచ్చెవచ్చె వానజల్లు?
జాలమది యేలా?
గుచ్చుకొనె రేగుముల్లు
జాలమది యేలా
వచ్చేటి భామనుచూడు
జాలమది యేలా?"
చెక్కగొట్టే చిన్నవాడా
జాలమది యేలా?
చెక్కవిరిగి చెంపనాటె
జాలమది యేలా!
చెప్పరాని దుఃఖమొచ్చె
జాలమది యేలా?
చెయ్యినిమిరి చూడవోయి
జాలమది యేలా?"

## పొలం పనులతో స్త్రీలు పాడే పదాలు

సస్యాలలో కలుపుతీత, గొప్పు త్రవ్వడం, వరి ఆకు ఊడవడం, పండిన చేలను కోయడం, కోసినపనలను కట్టడం - వ్యవసాయశ్రామిక స్త్రీలు, వరుసలుదీర్చి మునుములు పట్టి, ఈపనులను చేస్తూవుంటారు. తమ శ్రమ కనబడకుండా పదాల మాధుర్యంలో మునిగి, పాడుకుంటూ, ఆపని జరిగే లయతో తాళం, రాగములతో ఊగుతూ ఉత్సాహంగా పనిపాటలు జరుపుతూ వుంటారు. ఆ శ్రామిక జీవితంలోనే మహానందాన్ని అనుభవిస్తూ వుంటుంది వారి హృదయం.

ముందు ఒకస్త్రీ పాడుతూవుంటే మిగతా స్త్రీలు వంతపదం గాని, బృందగానం గాని, పాడుట పరిపాటి. ఆకపదం, తుమ్మెద, వెన్నెల, తుమ్మెదీలో, చందమామ, జిల్లేడిమ్రాను, గుజినెల్లి పూలు, గుణసారి గున్నమ్మ, రమణి మొదలయిన పదాలు ప్రస్తుతం వాడుకలో వున్నాయి.

ఒక పదాన్ని, ఆ యాపనులలో, వరసమార్చి పాడడం కూడా వున్నది.

### కలుపు తీతలో పాడే
### తుమ్మెద పదం

శివ శివ యనమేలు తుమ్మెదా!
శివ యంటేను వినమేలు ,,
శరణన్న మేలే ఓ ,,
శ్రీ కంఠు డను పుష్పు ,,
మూడులోకము లామెనే ,,
సాకార మైయుండు ,,

పరమేకాంతమును జూడు తుమ్మెదా
ముట్టే ముట్టని పువ్వు ,,
అది ముట్టింది జగమెల్ల ,,
అంటే అంటని పువ్వు ,,
అది అంటేంది జగమెల్ల ,,
ముట్టి కూడదే ఓ ,,
ముట్టి పాయలే వేవో ,,
యవ్వన మందూనే ,,
చాల పువ్వుల వాసన ,,
కొప్పో నీ వెరుగావె ,,
నీనెవ్వ రనే మూల ,,
ఆరు రేకుల పువ్వు ,,
అది మించిన వాసన ,,
తేరు సేయక నీవు ,,
శివుని చేరి భజించాలె ,,
మేలు యెరిగి నీవు ,,
కేళి జరించాలె ,,
ఏడుగురు రాజులు ,,
నీకు యీడుజోడు బంట్లు ,,
చూడ పాడు జంపె ,,
రూఢి కెక్కుమట్టె ,,
ఆస సాపజాతి ,,
వట్టె ఆస దీడు మంచి ,,
మోస బోకు మట్టె ,,
భక్త వాసి కెక్కు ,,

| | |
|---|---|
| అష్ట దళము మీాద | తుమ్మెదా! |
| అంటి చరిం చాలె | ,, |
| కష్టము లెరుగావె | ,, |
| నీవు స్రష్టవై యుందూవె | ,, |
| తొమ్మిది వాకిళ్లు | ,, |
| నీవు నమ్మి చరింతూవె | ,, |
| ముమ్మూర్తులలలోన | ,, |
| నీవు నెమ్మదిగ వుండావె | ,, |
| అనాస తోటపువ్వు | ,, |
| నువ్వు ఆనక వుండావె | ,, |
| అందూన జిక్కిన | ,, |
| తోట మాలిచే బడుదూవె | ,, |
| నింగి నేలయూను | ,, |
| గంగా గౌరు లంద్రు | ,, |
| ఉప్పొంగుచు నొకచోట | ,, |
| వేయి విధాల నటించు | ,, |
| వేయి రేకుల పువ్వు | ,, |
| అది వెదికి కొనాలేవె | ,, |
| సద్గురు నడువుగావె | ,, |
| వూపు మధ్య చూపు నీకు | ,, |
| గురునకు హారునకు | ,, |

---

పన్నెండవ శతాబ్దం నాటి పాల్కురికి సోమనాధుడు తన కాలం నాటికే ప్రచారంలో వున్న పదాలను, తన గ్రంథంలో పేర్కొన్నాడు. అందులో యీ తుమ్మెద పదం బహుళ ప్రచారంలో వున్నది, దీనిలో చక్కని వేదాంత ప్రబోధం ద్యోతక మవుతూవున్నది.

అంతరువు లేదు నిజము ,,
గురు పాద పద్మములు ,,
నిన్ను దరిశించ మంటిసే ,,
శివ శివ అనమేలు ,,
శివ అంశేను వినమేలు ,,

## కలుపు పాట

### వెన్నెల్లో పదం

చిక్కుడూఆకుల్ల వెన్నియ్యాలో
శివసద్దులుగట్టి వెన్నియ్యాలో
చిత్తూరు నేబోదు చుట్టాలుజూడ
అక్కడెవరున్నారె ఆంభోజిరాజు
మాఅమ్మతమ్ములు మాకు మేనమామలు
మముగన్నతండ్రికి బావమరదులమ్మ
బావమరదులుగూడి బాతోయిడించిరి
బాయిలోఉన్నాది బంగారుబిందె
బిందెలోఉన్నాది చేమంతికట్ట
కట్టల నెవున్నదిచిన్నపు మంచము
చిన్నపుమంచానికి సన్నపునులక
దానిమీదపండేటి జానాలెవరమ్మ
పనిచేసేలక్షుమ్మ పవళించినాది
విసనకఱ్ఱలతోటి విసిరిలేపన్నా
విసిరినాలేవదు విరజాజిమొగ్గ
కొబ్బరకుడకలతో కొట్టిలేపన్నా

కొట్టినా లేవదు కోమటోరిపట్టి
దొప్పిళ్ళగంధాలు గుప్పి లేపన్నా
గుప్పినా లేవదు ఈగురిజలబంతి
దొడ్లోపసులెళ్లె దొరఎండొచ్చె
ఇక నన్ను లేపవే దొడ్డవారిబిడ్డ
మందపసులెళ్లె మారుఎండలెక్కె
ఇక నన్ను లేపవే మాఅమ్మకోడలా

## కలుపుతీస్తూపాడే వెన్నెలపదం

ఆ [1]గరగపట్టింది వెన్నెలా (వెన్నెల్లో
నీళ్లకు వచ్చింది ,,
పాపిడి సెట్టెక్కె ,,
[2]పలుకర్రకు యిరిసి ,,
పగడాల రాయెక్కె ,,
పలువరుస తోమింది ,,
ముత్యాల రాయెక్కె ,,
ముని పళ్ళయిన తోమె ,,
నలుపైన రాయెక్కె ,,
నాలుక గీసింది ,,
మాడికెడు నీళ్లల్లో ,,
మొకమైన కడిగింది ,,
చారెడు నీళ్లలో ,,
జబ్బలు కడిగింది ,,

1. గరగ = కడవ (బిందె), 2. పలుకర్ర = పళ్ళుతోముపుల్ల, 3. సుమ్మ = మట్టుగుడ్డ.

| | |
|---|---|
| చుట్టజలతారుసాపు | వెన్నెలా (వెన్నెలాలో) |
| [3]సుమ్మ సుట్టింది | ,, |
| ఆ గరగ ముంచింది | ,, |
| ఒడ్డునా చేర్చింది | ,, |
| అటుయిటు సూసింది | ,, |
| ఎవ్వరూ లేరాయె | ,, |
| కట్టమీద కామన్న | ,, |
| గరగెత్తి పోరయ్యా | ,, |
| నీకుగర గెత్తితే | ,, |
| నా కేమి లంచాలు | ,, |
| నాపాడి యావునిస్త | ,, |
| నీ పాడావు నాకొద్దు | ,, |
| నీగరగ నేనెత్త | ,, |
| నాకు గర గెత్తితే | ,, |
| నాగున్న యెద్దునిస్త | ,, |
| నీగున్న యెద్దునాకొద్దు | ,, |
| నీగరగ నేనెత్త | ,, |
| నాకుగర గెత్తితే | ,, |
| నానాగరం యిస్తాను | ,, |
| నీనాగరం నాకొద్దు | ,, |
| నీగరగ నేనెత్త | ,, |
| అంత్తైతె నీమనసు | ,, |
| నేనే వస్తాను | ,, |

## కలుపుతీతలో "రాయినా చందనాల" పదం

రాయినాచందనాలో
ఓయి బామల్లాల బావన్నలాల ||రా||
రామలచ్చ్మల్లాటి రాజులూలేరు
సీతమ్మలాటి యిల్లాలులేదు ||రా||
తొలకరిలో వరసాలుకావాలి
ఎకరానికి గరిసెపండాలి ||రా||
నీరుపెట్టి దుక్కుదున్నాలి
దుక్కిదున్ని మొక్కనాటాలి ||రా||
పల్లెలు బాగుండాలి
పట్నాలు బాగుండాలి ||రా||
పేరుకంకులమీద పిట్టలువాలాయి
ఇల్లాగరమ్మురో పిల్లోడ ||రా||
కొట్టకుండ నువ్వుతిట్టకుండా.
అదలకించి బెదిరిస్తె అవతలకుపోవురా ||రా||

చిక్కుడూ ఆకుల్లు వెన్నియల్లో
శివసుద్దులుగట్టి ,,
చెయ్యేరునేబోదు చుట్టాలజూడ ,,
అక్కడెవరున్నారె అంభోజరాజు ,,
మాయమ్మ తమ్ములు మాకుమేనమామలు ,,
మముగన్నతండ్రికి బావమరుదులమ్మ ,,

1. గరిసె=మూడుపుట్లుగింజలు మనిక. పుట్టికి రెండువందల కుంచాలు, పల్లె పుట్టికి ఎనభై కుంచాలు, విశాఖమండలంలో పుట్టి అనగా ఒక భస్తా, బస్తా అంటే యిరవై కుంచాలు.

బావమరుదులు గూడి బాయితోడించిరీ వెన్నియలో
బాయిలోవున్నాది బంగారు బిందె ,,
బిందెలోవున్నాది చామంతికట్ట ,,
కట్టలోవున్నాది చెన్నపురిమంచం ,,
చెన్నపురిమంచానికె సన్ననిసులక ,,
దానిమీద పండేటి జాణయెవరమ్మా ,,
పనిచేసి లచ్చుమ్మ పవ్వళించింది ,,
విసన కర్రలతోటి విసిరిలేపన్నా ,,
విసిరినాలేవదూ విరజాజిమొగ్గా ,,
కొబ్బరి ఆకుతో కొట్టిలేపన్నా ,,
కొట్టినా లేవదు గొప్పోరిపట్టి ,,
దొప్పళ్ల గందాలు గుప్పిలేపన్నా ,,
గుప్పినాలేవదు గురిజాలబంతి ,,
దొడ్లో పసువులెళ్లె [2]దోరెండలొచ్చె ,,
ఇకనన్న లేవదే దొడ్డోరిబిడ్డ ,,
మందు పసువులెళ్లి మారెండలెక్కె ,,
ఇకనన్న లేవవే మాయింటికోడలా ,,

### పైరులలో గొప్పాత్రవ్వుతూపాడే నారాసగుమ్మడీ పదం

గుమ్మా! గుమ్మన్నలార!
గుమ్మన్నలారో! నారాసగుమ్మడీ!

---

1. బాయి=బావి (నుయ్యి)

2. నీరెండ, దోరెండ, మారెండ, ముందుటెండ అంటూ ప్రతిజాములో కాచే యెండను చెప్పుతారు.

తూరుపునున్నాది [1] తారుపుగుల్లో ! నారాసగుమ్మడీ
తారుపుగుల్లాకు, తవ్వంతకొప్పో ||నా||
తవ్వంతకొప్పాకి, గుప్పుడేసిపూలో ||నా||
గుప్పుడేసి పూలకు, తాకట్టుసరుకో ||నా||
తాకట్టుసరుకీకి, తాగుబోతు మొగుడో ||నా||
తాగుబోతు మొగుడీకి । [2] తాళింపుకూడో ||నా||
తాళింపుకూడూకు । తాటికాయపులుసో ||నా||
తాటికాయపులుసు । తాళింపుకూడుదిని ||నా||
బాగుగాదిద్దుకొని । పయనమయిందో ||నా||
[3] పయ్యేట చెంగుమీద । పావులార నేతో ||నా||
గుచ్చీలకొంగుమీద । గువ్వల్లకూరొప్పో ||నా||

## గొప్పు త్రవ్వుతూపాడే తుమ్మెద పదం

ఓయిమామల్లార తుమ్మెదా
మామ నన్నూళ్లార ,,
తోటలల్లోకీ ,,
చేలల్లో కీ ,,
పాలాల్లో కీ ,,
వరిచేలల్లో కీ ,,

1. ఒకరి నొకరిని కలిపేస్త్రీ, 2. పులిహోర, 3. ప్రాచీన భారతవస్త్ర పరిశ్రమలో, చిత్రవిచిత్రమైన లతలూ, పక్షులూ, జంతువులూ వచ్చేటట్లును, రకరకాల రంగులతో పలు విధాలైన ఆకారాలు వచ్చేటట్లును నేయడం, కుట్టడం ప్రముఖస్థాన మలంకరించింది. కుట్టే వస్త్రపరిశ్రమనే "బుటేదారి" పని అంటారు. యీ పనికి ఉపయోగించే సూదులను వేదములలో వర్ణింపబడుట వలన, వేద కాలంనుంచీ మనదేశంలో బుటేదారి పని వున్నదనుకోవాలి,

ఇరగబడొచ్చింది — తుమ్మెదా
దేవసిరి నంది — ,,
తేరగావచ్చింది — ,,
గొంతెమ్మపెంచేనా — ,,
గొలుసులనంది — ,,
ఈనినవరిచేలు — ,,
ఈదువిడి దొక్కింది — ,,
అల్లముచెడదిని — ,,
పేడకడివేసింది — ,,
అంతట్లో ఆసేను — ,,
కాపన్న వచ్చాడు — ,,
ఎక్కడిదియానంది — ,,
ఏడాదియానంది — ,,
పండిన వరిసేలు - — ,,
పాయలడ దొక్కింది — ,,
కట్టండి నందని — ,,
గాజుల్ల కంబాన్ని — ,,
ఎయ్యండి నందికి — ,,
ఏడుకట్లా చొప్ప — ,,
పొయ్యండి నందికి — ,,
గోలేలతో కుడితి — ,,
అంటానె కాపన్న — ,,
గొంతెమ్మ మేడకూ — ,,
మేడల్లో గొంతెమ్మ — ,,
ఏలాగునా వుంది — ,,

ఉయ్యాల్లో గొంతెమ్మ తుమ్మెదా
ఊగుతూ వున్నాది ,,
ఊగూగు గొంతెమ్మ ,,
సేరూల నింపింది ,,
ఎక్కడిది యీనంది ,,
ఏడదీ యీనంది ,,
గొంతెమ్మ పెంచినా ,,
గొలుసుల్లా నంది ,,
మానంది కొట్టోదు ,,
మమ్ములా తిట్టొద్దు ,,
మానంది బందెలా ,,
మే మిచ్చుతామయ్యా ,,
సోలతో సోలేదు ,,
మాడ వేసుకొని ,,
ఇదిగోర కాపన్నా ,,
మానంది బంది ,,
ఇక్కడకు తీరదు ,,
మీనంది బంది ,,
తవ్వాతో తవ్వేడు ,,
మాడ వేసుకొని ,,
మానెతో మానేడు ,,
మాడ వేసు కొని ,,
అడ్డతో అడ్డేడు ,,
మాడ వేసుకొని ,,
కుంచముతో కుంచెడు ,,

మాడ వేసుకొని తుమ్మెదా
పన్నెండు చెంగులు ,,
పట్టు పంచెలును ,,
పట్టు మనికాపన్న ,,
పైమీాద కప్పింది ,,
చాలునని కాపన్న ,,
సంతోష పడ్డాడు ,,
మేడలో గొంతెమ్మ ,,
ఏలాగు నందో ,,
పొరుగోరి చేలోకి ,,
పోబోకు నందెన్న ,,
పొరుగు బందులుమాకు ,,
తేబోకు నందెన్న ,,
కట్టండి నందిని ,,
గాజుల్లకంబాల ,,
వెయ్యండి నందికి ,,
వెయ్యకట్లాచొప్ప ,,

గొప్ప త్రవ్వతూపాడే "రమణి ముద్దులగుమ్మ" పదం

రాయే రాయే భామనందనా
రమణిముద్దులగుమ్మా నందనా ॥రా॥
[1] సామోరుసత్తెభామా కూడెను
నరివాదములు యేసుకొన్నారు
వేడికూటియేళాకి యారాలు తెస్తాను

(1) సామోరు= స్వామివారు (శ్రీకృష్ణమూర్తి)

సద్దికూ టేళాకు సవతిని తెస్తాను
చాలపొద్దులేదు సరివాదమేశారు ॥రా॥
రాకయ్యారాకయ్యా సామోరూ
మాఅన్నలొస్తారు సామోరూ
మమ్మల్ని తిడతారు సామోరు
మమ్మల్ని కొడతారు సామోరు ॥రా॥
పోవయ్యాపోవయ్యా సామోరు
పొద్దుచాలాలేదు సామోరు
ఏడుగురుఅన్నలూ సామోరు
వచ్చేవేళాయింది సామోరు ॥రా॥

## గొప్పులో పాడే "ఒయ్‌రాజ" పదం

ఒయ్ రాజా ఒయ్‌రాజ జయ్‌రాజ రాజో
ఓరా కూర్చున్నట్టి ,,
ముక్కూ కాడున్నట్టి ,,
తప్పా కాలున్నట్టి ,,
దిబ్బ ముక్కున్నట్టి ,,
[1]తొంట చెయ్యున్నట్టి ,,
నెత్తినైన జుట్టు లేదు ,,
కంటికైన చూపులేదు ,,
కాలూపు తాడమ్మ ,,
[2]కన్నే కొడతాడమ్మ ,,
సైగలు చేస్తాడమ్మ ,,
కన్నెత్తి చూస్తేను కన్నంలోదూరాడు ,,

---

1 చేతులు సరిగాలేక, కుంటుపడి వంకరగావుంటే తొంటచేతులంటారు
2 ప్రేమించమని కంటితో సంజ్ఞ చేయుడం.

నోమి నోమన్నారె తుమ్మెదీలో
నోమన్న లారా ,,
కలువ రేకులె కళ్లు ,,
కలికి సీతమ్మవి ,,
ఆ అందాలు చందాలు ,,
అవనిలోనే లేవు ,,
బంతులాడ బోయె ,,
సీమంతి సీతమ్మ ,,
చిలుకలే చూశాయి ,,
సీత చెలి కత్తెలె ,,
సిగ్గులే పొందారు ,,
అంతలో ఆబంతి ,,
అరచేతిలో పడి ,,
జనకుడు తెచ్చినా ,,
శివువింటి కిందికి ,,
దొరులుతూ పోయింది ,,
సీత చెలులను చూసి ,,
నవ్వుతూ పలికింది ,,
అక్క సెల్లెండ్రార ,,
నాఅందమైన బంతి ,,
పెట్టె కిందకు పోయె ,,
తీసి యివ్వ రమ్మ ,,
చెలులు అందరు గూడి ,,
చేతులు కలిపారు ,,
సత్తువలు చూపారు ,,

బలము లే చూపారు తుమ్మెదిలో
పట్టులే పట్టారు ,,
శివ దేవుడి యిల్లు ,,
కదలాకపోయెను ,,
నవ్వుచూ సీతమ్మ ,,
అంసలా గొచ్చింది ,,
తామరలె చేతులు ,,
అరి కాళ్లు బంగారు ,,
అతి సులువుగాను ,,
అవలీల యెత్తింది ,,
జనకుడె చూశాడు ,,
దేవతలు చూశారు ,,
పుష్ప వృష్టి కురిసె ,,
దేవ దుందుభు లెల్ల ,,
దేవ ఘోషలు చేసె ,,
జనకు డంతటి తోను ,,
జానకొద్ద కొచ్చి ,,
సంబరము తోతాను ,,
తన పంతమె పలికాడు ,,
కన్న తల్లీ నిన్న ,,
పొగడ తరమూ కాదు ,,
దేవతలె జంకారు ,,
రాక్షసులు రాలేరు ,,
నరుల వశమూ కాదు ,,
నీ బలము చూడంగ ,,

నా మనసు పొంగింది తుమ్మెదీలో
నీ బలము మించిన బలను ,,
నే నవని చూడాలేను ,,
ఈ విల్లు విరిచేటి ,,
వీరునకె నిన్నిత్తు ,,
సీత సిగ్గు తోటి ,,
చెలులతో చేరింది ,,

## ఆకుతీతలో పాడే పదం

[1]"కాట్రేడు నీరెగట్టి
గోకేసిన రైకదొడిగి
మాలచోళ్ళింగ నుంటాదే —

విశేషాంశాలు:- కాట్రేడు=వేట కాంట్రడను, ఆరాధ్య దేవతయూ, ఆడవారికి సంతానాన్ని కలిగించేదేవతయూ, అవుతుంది. ఈమెకు ప్రతినిధిగా కాటమరాజు పేరు ప్రజలలో వ్యాపించింది. కాట్రేడుదేవత, కాటమరాజు మృతవీరుడు.

2. కాటేరుకోక=కొంతమంది స్త్రీలకు సాధారణంగా సంభవించే ప్రదర అనే వ్యాధి కాటేరి అనుక్షుద్ర దేవతవలన కల్గుతుందని ప్రజల నమ్మకం

ప్రదరవ్యాధి (1) కాటేరు (2) రక్తకాటేరు అని రెండు రకాలువున్నది. మొదటిది దేవతవలననూ, రెండవది, రక్తకాటేరు వలననూకల్గునని ప్రజల విశ్వాసం, ఈరోగం మంత్రప్రయోగం వల్లకూడాకల్గుతుందని కొందరు నమ్ముతారు.

## పల్లెపడతుల విశ్వాసాలు

ఈవ్యాధిని వారణకు వడుకునూలుకోక అంచులకు నీలితొగరుగళ్లు ఉండేటట్లు నేయించి, అమావాస్యనాటి ప్రొద్దున్ననే, ఈవ్యాధిగల స్త్రీ, ఇంటిబయటి వసారాలో పొంగలిబెట్టి, అపొంగలితోపాటు ఒకకోడిని బలియిచ్చి, వాటిని చాకలికి యిచ్చి పంపివేసి, ఆకోక చు కట్టుకుంటుంది. ఆలా చేయడంవల్ల ఆవ్యాధిపోతుందని పల్లీయులవిశ్వాసం—

ఈలాగే సంతానంకల్గుటకు, "నాగులకోకధరిస్తారు. పాములుండేపుట్టను పూజిస్తారు– నాగులకోక అంటే తెల్లనూలు మీద – ఎర్రనూలుగళ్లు నేసినది. పుట్టిన

సూస్తుంటె నామనసు సోలిపోతుందే"
కందుకూరు చిన్నదాన
[2]కాటేరు కోకదాన
కట్టు చెంగులమీద
[3]సజ్జాకు పసరేడదే "

---

బిడ్డలు బ్రతుకని స్త్రీలు "చెంచు పేరంటాలు కోక" అనగా ఎర్రతొగరు గళ్లు ఆరంగుళం వెడల్పుగానూ, నిట్ట నిలువు పట్టెలతోనూ, నేసింది. దీనిని బిడ్డలు బ్రతుకని తల్లులు కట్టుకుంటారు, పడకమీద పరుచుకుంటారు. అందువల్ల వారి సంతానం చిరాయువుగా వర్ధిల్లుతుందని నమ్ముతారు.

## క్షుద్ర దేవతలు

౧ శిశువులను చంపుటకై వచ్చే ఎల్లమ్మ (ఎన్నెమ్మ)

౨ కాటేరు. యీమెయే ఎల్లమ్మ

3 ఏకవీర = ఈమె నరుకబడిన తల మాలవాడలో పడిందట. మాహూరము అనే గ్రామానపడుటవల్ల "మాహూరమ్మ" "మారెమ్మ" అనే పేరువచ్చిందట — ఈమెయే పరశురాముని తల్లి రేణుకాదేవి.

చాణక్యసీమలో "ఎన్నెమ్మ" నెల్లూరుప్రాంతాన "మారెమ్మ" రాయల సీమలోనూ; తెలంగాణమందూ "ఎల్లమ్మ" అని జానపదులు పేర్కొంటున్నారు.

రేణుకాదేవికథనూ. రాయలసీమ పల్లెప్రాంతాలలో "బవినీళ్లు" అనగా అరుంధతీయులు "జవనిక" "జముకుజమిడిలి" అనేదాన్ని వాయించుచూ, రెండు రోజులు చెప్పతారు. ఈకథ "అలంపురీమహాత్మ్యము" అనే స్థానిక గాథలో వున్నది. ఈమె బిడ్డలనిచ్చుదేవత అని అక్కడివారి నమ్మకము.

కాట్రేడు=వనదేవత, వేటగాళ్లు తిరిగి సుఖంగా యింటికి చేరుకోవడానికని యీవనదేవతను ప్రార్థిస్తారు.

జానపదులు. ఏదైనా చెట్టును యెక్కేటప్పుడూ, దిగేటప్పుడూ ఆచెట్టును నమస్కరిస్తారు. ఆనమస్కారం యీవనదేవతయైన "కాట్రేడు" కే చెందుతుంది. స్త్రీలకు ప్రదరవ్యాధిని కల్గించే "కాటేరు" అను క్షుద్రదేవత, ఈ కాట్రేడు అనువనదేవత మాత్రం కాదు.

3 సజ్జాకు=సబ్జాఆకు, అనగా, రుద్రజడఆకు, ఇది మంచి సువాసన కొడుతూ వుంటుంది. శరీరతాపాన్ని తగ్గించి, చలువచేసే ఓషధిగా ప్రశంసింపబడుతూ వున్నది.

# ఊడ్పు పాటలు

## తుమ్మెద పదం

పాండవులు పాండవులు తుమ్మెదా
పంచ పాండవులు ,,
ఓయి భామలల్లాల ,,
భామల్లాల ,,
పండిన వరిచేలు ,,
పాయల్లు తొక్కింది ,,
పట్టండి నందిని ,,
గాజు కంబానికి ,,
కట్టండి నందినీ ,,
యీనిన వరిచేలు ,,
యీచు పెడ జిమ్మింది ,,
పొగతోట లన్నీ ,,
పొడిపొడిగ తొక్కింది ,,
చెఱుకు తోటలన్నీ ,,
చెడతొక్కి వేసింది ,,
యెక్కడెక్కడ వెదకినా ,,
ఏడాది నందియె ,,
కాపోరి చేనులో ,,
కట్టిపెడ తారూ ,,
మాలవారి చేలోకి ,,
వెళ్లు నందన్న ,,
మాలవారు మంచివారు ,,
నిన్ను గొలుస్తారు ,,

## సింహాద్రి అప్పన్న — సానివాడకు పోకడ

### ఊడ్పులో చందమామ పదం

ఒక్కా సింహాచలము అంగళ్లలోను చందమామ
లచ్చిమికి కట్టించు లక్క టివ్వారో ,,
లక్క టివ్వారిలో పట్టిమంచాలో ,,
సింహాద్రిచీరలు ఆపఉపుప్పైనో ,,
మాడుగులు మడతలు ఆపఉపుప్పైనో ,,
ఒల్లేబత్తకుండ మల్లెలుపోసో ,,
నాలుగు కోళ్ల కాడా దివనాటకాలో ,,
పచ్చనీపోకలూ పండుటాకులో ,,
లచ్చిమీ అప్పాడు పరుపెక్కినారో ,,
సున్నాన్ని ఒకజాము జూదమాడేరో ,,
ఆకుల్ని ఒకజాము అందాడినారో ,,
లచ్చిమీ అప్పాడు పండుకున్నారో ,,

* * *

వృక్షాలు పక్షులూ వియ్యమందేళ్లో ,,
పసిబిడ్డ తల్లులూ పాలివ్వనేళ్లో ,,
లచ్చిమినిదురించి అప్పడెల్లంగో ,,
మంచాలకాడిది కుంచాలముంతో ,,
కుంచాలముంతలో ఉదకమిచ్చుకోనో ,,
వెళ్లేడు అప్పాడు వేశ్యవాడలకో ,,
సాగేడు అప్పాడు సానివాడలకో ,,
మూలాని ఉన్నావు ముత్యాలరాశో ,,
రాశినువ్వొఉగుదువా రాజెల్లడామో ,,

ఎఱుగము లచ్చిమీ మేమెరుగ మమ్మా — చందమామ
ఎరుగుంటే అప్పడ్ని ఏలాపోనిస్తో ,,
చూసుంటే అప్పడ్ని చుట్టూరుకోమా ,,
పంచాని ఉన్నావు పగడాల రాశో ,,
రాశీ నువ్వెరుగవా? రాజు వెళ్ళడమూ ,,
ఎఱుగము లచ్చిమీ మే మెఱుగమమ్మా ,,
ఎఱుగుంటె అప్పడ్ని ఏలాపోనిస్తూ ,,
చూచుంటే అప్పడ్ని చుట్టూరుకోమా ,,
పదిమంది దాటేటి దేవిడి గడపో ,,
గౌరి నువ్వెఱుగవా అప్పడెల్లడమో ,,
యెఱుగము లచ్చిమీ మేమెఱుగమమ్మా ,,
యెఱుగుంటె అప్పడ్ని యెలాపోనిస్తూ ,,
చూచుంటే అప్పడ్ని చుట్టూఱుకోమా ,,
దొడ్డిలోవున్నావు ఓ మల్లిమానా ,,
మానూ: నువ్వెరుగవా అప్పడెల్లడమో ,,
ఎఱుగుదుము లచ్చిమీ మేమెరుగుదు మమ్మా ,,
మామల్లి పువులన్ని సిగజుట్టుకోనో ,,
మాసాన గంధాలు పైజల్లుకోనో ,,
మంచాలకాడాది కుంచాల ముంతో ,,
కుంచాల ముంతతో ఉదకముచ్చుకోనో ,,
వెళ్ళేడు అప్పడు వేశ్య వాడలకో ,,
సాగేడు అప్పడు సానివాడలకో ,,
పట్టు చీరలు విప్పి పాజీకలు గట్టి ,,
పట్టు రవికా దీసి పాతరవికా దొడిగో ,,
నొష్ట కుంకుమ దీసి బరిణాని పోసో ,,

కొళ్ల కాటుక పాసి కరటాన్ని పోసో చందమామ
కుక్కి మంచమ మీద కూలబడ్డాదో ,,
తలుపు దగ్గిఱ వేసి తాబండుకుందో ,,
తలుపు దియ్యి లచ్చిమి తలుపు దియ్యవే ,,
నీతలుపు సానోరి సుబ్బి తియ్యాదా ,,
సుబ్బి వాడల నేను వెళ్లలేదు లచ్చో ,,
ఏలూరునుంచి ఎడ్లమ్మ వచ్చో ,,
ఎడ్లనూ బేరాలు చెయ్యేల్లినానో ,,
తలుపు దియ్యి లచ్చిమి తలుపు దియ్యవే ,,
నీతలుపు సానోరి సుబ్బితియ్యాదా ,,
సుబ్బి వాడల నేను వెళ్లలేదు లచ్చో ,,
పెద్దాపురంనుంచి పెట్లమ్మ వచ్చో ,,
పెట్లనూ బేరాలు చెయ్యేల్లినానో ,,
తలుపు దియ్యి లచ్చిమీ తలుపు దియ్యవే ,,

## బాపన పిల్ల

### ఊడ్పులో పాడే "రమణీ" పదం

రమణీ తందానా
బాపనోరిబొట్టె బంగారు శేణీ (శ్రేణీ)
ఏడుగురూతోడాని బాలపుట్టింది ॥రమణీ॥
తగినవారెవ్వరూ మనువులకు లేరూ ,,
పొద్దుపొద్దునలేచి పొద్దున్న లేచి ,,
ఇల్లువాకిల్లు దుడిచి కల్లాపులేసి ,,
సురవన్న పంచాలు సుమ్మచుట్టింది ,,

బంగారు బాండములు శిరసానుకోని ॥రమణీ॥
గల్లుగల్లున బాలయిల్లు బయలెల్లి ,,
యిరుగుతా తరుగుతా యిందు వెంబడిని ,,
పాపిడి చెట్టుల పలుకర్రతీసి ,,
ముత్యాల రాయెక్కి మునిపళ్లుతోమి ,,
ఓలికలురాయెక్కి నాలికలు గీసి ,,
తోమింది తనగరగ దోండపూచాయ ,,
ముడుకుటి నీటిలో ముక్కుమొకము కడిగి ,,
చేరాడు నీటిలో చెయికాలు కడిగి ,,
యీదుదోసిట గంగయెత్తి పోసింది ,,
సూరుడా నీవంటి సుతునియ్యాగలవా ,,
చంద్రుడా నీవంటి రూపియ్య గలవా ,,
కడిగింది తన గరగ కాకర పూచాయ ,,
యిడుకు మీదా గరగ శిరసానుకోని ,,
యెత్తించింది దనిగరియ యెలగపూచాయ ,,
యేరుదాటకముందె యేగుళ్లు బుట్టె ,,
గట్టుదాటకముందె గరబముదాల్చె ,,
పుట్టదాటకముందె పురుషుడై పుట్టె ,,
దానితల్లి దండ్రికి తలదింపుడొచ్చె ,,
పొలాన అన్నలకు బలువంపుపుట్టె ,,
రచ్చమీదన్నకు హెచ్చుసిగ్గయ్యె ,,
ఇందరకు సిగ్గైతే యీడేలమనకు ,,
గొల్లుగొల్లున బాల కుమ్మరిదెల్లి ,,
కుమ్మరీయీరన్నను పిలుస్తున్నాది ,,
కన్నవారిచ్చింది కాసులాపేరూ ,,

కాసులూయిస్తాను బాలియ్యగలవ ॥రమణి.।
బాలుడుకి తగినట్లు బాలి (కుండ) దెచ్చింది ,,
బాలిలో బాలుణ్ణి యిముడ జేసింది ,,
ఆ సప్తసముద్రాన పారేసి వచ్చి ,,
గల్లుగల్లున బాల యింటికొచ్చింది ,,
పొరుగింటి పిన్నమ్మ గరియదించావా ,,
ఏమోలి కూతురా పిప్పళ్లకంపు ,,
అన్నాయమాడకా అగ్గాడచెయ్యాకు ,,
యిరుగుతుంటే దానికి కంపుకొడతాది ,,
దాసూసు నాకేమి అంతనున్నాది ,,
ఆలాగు కొన్నాళ్లు జరిగిపోనాయి ,,
జాలారి తమ్మన్న జల్లేట గాడు ,,
చల్దిండి తిన్నాడు బయలుదేరాడు ,,
ఆయుసురు వలలనే చేతబట్టాడు ,,
ఆసప్తసంద్రాని కెలత నన్నాడు ,,
తొలివలేసి నాడు తొలిగి పోయింది ,,
మల్లా వలేసినాడు మల్లిపోయింది ,,
మల్లా వలెత్తే చచ్చింటి ,,
బాలుణ్ని చూచాడు మూర్ఛితు డాయె ,,
కనీపెంచని బాల మనకు దొరికింది ,,
ప్రేమతో బాలుణ్ని పెంచమన్నాడు ,,
ఉగ్గు పాలూపోసి పెంచుతున్నారు ,,
ఆలాగు కొన్నాళ్లు దరిలిపోనాయి ,,
అంతోడు యింతోడు పెరుగుతున్నాడు ,,
ఆయీడు వెంబడీని ఆడుతున్నాడు ,,

అమ్మోయి మాయమ్మ అమ్మ లచ్చిమ్మ ||రమణీ||
బొంగరాలాటకి నేనెల్లుతాను ,,
నాయీడు జోడోళ్ళు ఆడమన్నారు ,,
బొంగరాలు కొనమని అల్లరిబెట్ట ,,
వెయి యిచ్చి కొన్నాది వెండి బొంగరాలు ,,
పదియిచ్చి కొన్నాది పాల బొంగరాలు ,,
ఆవున్న యీడిన్ని పట్టు కొన్నాడు ,,
ఆయీది వెంబడిని సాగిపోనాడు ,,
ఆయీది వెంబడిని వెల్లి పోనాడు ,,
యీదిలో యిసిలమ్మ నీల కెలతంది ,,
ఆ బొంగరాలు యిసిలమ్మకు కొట్టె ,,
అబ్బా అమ్మాలేని ముండపాపాడా ,,
నీటిలో దొరికావు గడుసు గుంటడవు ,,
ఆ మాట పిల్లోడు ఆలించినాడు ,,
నాతల్లి దండ్రెవరు చెప్పు పెద్దమ్మ ,,
బాపనోలూ బొట్టి మీఅమ్మగాదా? ,,
ఆ సూరీడు చంద్రుడు మీతండ్రులుగారా? ,,
ఆ చుక్కలాచాల్లు మీ మేనత్తగాదా? ,,
చెప్పేసి పెద్దమ్మ ఎల్లిపోయింది ,,
ఇంటికి వెళ్లాడు అప్పుడు బాలుడు ,,
మారుతేములనా నలకమంచము మీదా ,,
పండుకుండి పోయిండు ఆబాలు డపుడు ,,
యీదీ ఎల్లాలమ్మ వెదుకుతున్నాదీ ,,
ఎక్కడ బాలుడూ ఏగులేదామె ,,
ఇంటిలో అప్పుడే మెదుకుతున్నాది ,,

పడుకున్ని బాలుణ్ని కన్నుల్ని జూచి ||రమణీ||
అన్నమూ తినకున్న అలకేల నీకు ,,
ఎవ్వారేమన్నారు చెప్పుమన్నాది ,,
ఎండి గిన్నెలోన ఎన్నార బోసి ,,
గూడు గిన్నెలోన కూడారబోసి ,,
పైడిగిన్నెలలోన పాలారబోసి ,,
పాలుదాగుదు రార పద్దనాబ బాల ,,
జాలారి పాలునిను తాగనేనేను ,,
యీనీసు కంపింట నేనిలువలేను ,,
జాలారి కూడూ నేతినాలేనూ ,,
ఎవరి బాలుడమ్మ ఎగ్గులెంచాను ,,
పడుకున్నా బాలుడూ గప్పునాలేచి ,,
మీయింట ఒకసణము నేనుండలేను ,,
చేతనీ బొంగరాలు పట్టుకొన్నాడు ,,
బాపనీ యీదులకు ఎల్లిపోతాడు ,,
ఆళ మామలందరూ రచ్చకూపోసి ,,
అరుగుమీదా శమ్మఅద్దాలు జూసి ,,
ఏసెనే బొంగరాలు తీసుకోడేనా ,,
రచ్చమీద బొంగరము ఎగిరిపోయింది ,,
పరుగెట్టిబాలుడూ రచ్చెక్కిపోయె ,,
ఏవూరు చిన్నోడ ఏ దేశంమీది ,,
మీతల్లెవరు తండ్రెవరు చెప్పుమంతారు ,,
బాపనోళ్ళి బొట్టె మాయమ్మగాదా ,,
సూరుడు చంద్రుడు మాతండ్రులుగారా ,,
చుక్కలాచాల్లు మామేనత్తగాదా ,,

ఏడుగురు మీరు మామామలుగారా ||రమణి||
అస్త్రముల బాలుడ్ని అందుకున్నారు ,,
బాలుడ్ని తీసికొని యింటికెల్తారు ,,
యింతపని చెయ్యడం తగునటే బాల ,,
పచ్చని బాకుతో సరికేస్తాము ,,
అన్నలకి తిన్నగా నిలబడ్డాది ,,
పెద్దన్న సుబ్బారావుకత్తి దీశాడు ,,
బుజ్జమీద శాకత్తి ఎత్తుతున్నాడు ,,
ఆసూర్య చంద్రులకు మాళిమైనాది ( తెలిసింది) ,,
ఎత్తినా కత్తులూ చేతబట్టారు ,,
మేముండగా నీకుతగదు యీబుద్ధి ,,
నరకడం తగగయ్యబావఅంటారు ,,
పెళ్లిచేసుక మేము తీసుకుపోతాము ,,
బాలుణ్ని బాలనీ తీసుకపోతారు ,,
పూలసవ్వారెక్కి వెళ్లిపోతారు ,,

సస్యానుకూల వర్షాలులేని వరుపులోని వానకోసం

### పల్లెటూరిభామిని ప్రారన

వానదేవుడనీకు వరుసచెల్లెన్ని
వర్షాలు కురిపించు వరిమళ్లలోన॥
ఉత్తరము మెరిసింది ఉరిమికురిసింది
ఊరివారిచేను ఊటలూరింది
దక్షిణాని మెరిసింది తరిమి కురిసింది
తమ్మయ్య మనచేను లక్ష్మిపండింది॥

## గ్రామీణస్త్రీల కాంక్షలు

[1] వరుణదేవుడ నీకు వరుసచెల్లెల్ని
చక్కగా కురిపించు సస్యాలమీద
కురవాలి మాపూర కుంభ వర్షమ్ము
పండాలి మాచేలు భాగ్యారాసుల్లు
పండించి తేవాలి పంట కాపుల్లు
నూర్పించి తేవాలి నూరుగరిసెల్లు
ఎక్కలేనిగట్లు దిగలేనిమెట్లు
[2] చూలింత పోయాలిచుక్కల్ల పొడుగు
[3] బాలెంతపోయాలి పర్వతాలపొడుగు
మానెతో పులగాలు మాయెడ్లు తినాలి॥

## పొలంపనులు చేసే శ్రామికస్త్రీ కోరికలు

| పన్నెండు | పరగణాలు | వానదేవుడా |
|---|---|---|
| పంటల్లు | పండాలి | ,, |
| పన్నెండు | ధాన్యాలు | ,, |
| పంటచేలు | పండాలి | ,, |
| మాకడుపు | నిండాలి | ,, |
| పేదసాద | బతకాలి | ,, |
| కూలినాలి | దొరకాలి | ,, |

1. నీటికి అధిపతి, పడమటిదిక్కును పాలించువాడు, ఇతడు ద్వాదశాదిత్యులలో ఒకడు, ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు ఆర్యముడు, భగుడు, వివస్వంతుడు. విష్ణువు, అంశుమంతుడు. మిత్రుడు వరుణుడు వీరే ద్వాదశాదిత్యులు-

2 చూలు + ఆలు = చూలాలు, గర్భిణీ స్త్రీ, చూలింత = బిడ్డగలస్త్రీ

3 బాలెంత = బాలెంతరాలు = ప్రసూత

పారపోయినవాబావ వానదేవుడా
పరుగెత్తుక రావాలి ,,
ఊరికెళ్లినబావ ,,
ఉరికురికి రావాలి ,,
తల్లిలేనిపిల్లలు ,,
తల్లడిల్లుతున్నారు ,,
తండ్రిలేనిబిడ్డలు ,,
తల్లాడపడతారు ,,
పసిబిడ్డ బాలకులు ,,
పస్తులు పడతారు ,,
చేటంత మబ్బుపట్టి ,,
చెరువంత నిండాలి ,,
తూరుపున మొయిలేసి ,,
తుల్లి తుల్లి కురవాలి ,,
పడమటను మబ్బుపట్టి ,,
పుట్టిపట్టికురవాలి ,,
ఉత్తరాన మొయిలట్టి ,,
ఉరిమిఉరిమి కురవాలి ,,
దక్షిణాన మబ్బుపట్టి ,,
జల్లుజల్లుకురవాలి ,,
ఈగతల్లి సీళ్ళాడి ,,

---

x పరగణా=జమీలో భాగం. S నవధాన్యాలు 1 గోధుమలు 2 యవలు 3 పెసలు 4 సెనగలు 5 కందులు 6 బొబ్బర్లు 7 నువ్వులు 8 మినుములు 9 ఉలవలు (వడ్లు, జొన్నలు, వోళ్లు) మొత్తం 12 ధాన్యాలు

y తల్లాడపడతారు (తల్లడముపడు) =చలిస్తారు.

వీధివీధి నిండాలి వానదేవుడా
దోమతల్లి నీళ్లాడి ,,
దొడ్డెల్ల నిండాలి ,,
పాముతల్లి నీళ్లాడి ,,
పంటచేలో తిరగాలి ,,
కప్పతల్లి నీళ్లాడి ,,
కడవ.పంచల కుయ్యాలి ,,
కురవాలి కురవాలి ,,
కుంభవృష్టికురవాలి ,,
డబ్బుకు తవ్వెడుబియ్యం ,,
మనిషి కిద్దరు పెళ్లాలు ,,
వానొస్తే వణుకైన ,,
కురవాలి కురవాలి ,,
మూడురోజులయెండ ,,
ముప్పై రోజులు[T]ముసురు ,,

## సస్యభంగ నివారణోపాయాలు

చేలలోని సస్యాలను, ఎలుకలు కొరికివేస్తూ వుంటాయి. తోటలకూ పాదులకూ మొక్కలకూ పచ్చ పురుగులు పడుతూవుంటాయి. ఆకుకూరలకు గొంగలి పురుగులుపడతాయి. పండిన ఆరంభాలను అడవిపందులూ, దుప్పులూ తిని పాడు చేస్తుంటాయి, పైరు పచ్చలకు దిష్టి దోషంకూడా తగులుతూవుంటుంది. రైతులు ఆయా సస్యభంగాలను వారించడానికై తగిన ఉపాయాలు చేస్తూ వుంటారు.

---

T ముసురు = నిరంతరవర్షము

## సస్యాలకు గర్భశత్రువులైన ఎలుకలనుగురించి

కోతగాడు కోతగాడు నీపేరు
ముట్టకు అంటకు నాపైరు
గ్రుడ్డి దానవైపో ఎలకమ్మా!
చెవిటి దానవైపో ఎలకమ్మా!
దూరకు దూరకు నాయిల్లు
దూరాలంటే ఒక యిల్లు
ఊరంతా యిళ్లూ పాతల్లూను॥

x రైతులు తమపొలంచుట్టూనడుస్తూ, ఎలకలనుద్దేశించి యీజానపదగేయాన్ని పాడతారు. ఎలుకలు ఈచేనును వదలిపోతాయని వారి నమ్మకం

## పచ్చ పురుగులకు

తోటలకూ, పాదులకూ, మొక్కలకూ పచ్చపురుగులు పట్టినప్పుడు రైతులు "శ్రీవత్సగోత్రపుబ్రాహ్మణుని" దగ్గరకువెళ్లి తాటియాకుమీద గాని, కాగితంమీద గాని,

"శ్రీవత్సగోత్రమువారి, సింహామువచ్చినది
పచ్చపురుగుల్లారా! విచ్చిపొండు"

అనే మంత్రాన్ని వ్రాయించి వ్రాసినపత్రాలకు పసుపురాసి, సాంబ్రాణి ధూపంవేసి; పచ్చపురుగు లున్నచోట కడతారు. పచ్చపురుగులు ఆచోటును విడిచి పోతాయని వారి విశ్వాసము.

## సస్యరక్షణ మంత్రం

సస్యాలుకోమలంగా పెరుగుతూవుంటే వ్యవసాయదారులకు నేత్రానందంగా వుంటుంది.

సస్యాలలో కలుపుమొక్కలూ చెత్తచెదారం వుంటే చీడపుట్టి సస్యాలు వికారంగావుంటాయి. అప్పుడు కృషీవలులు ఆవికారాన్ని పోగొట్టాలని

శ్లో॥ యక్షరాక్షసపక్షీణాం । కీటకైః క్రిమి కీటకైః
సర్వపీడావినాశాయ, ఆజ్ఞాశుద్ధివిభీషణాః॥

ఈశ్లోకాన్ని పచ్చితాటియాకుమీద వ్రాసి, చక్రంగాచుట్టి, ఆచక్రానికి పసుపురాసి, ధూపంవేసి, చేనుమధ్యను కడతారు-అందువలన సస్యాలకుసర్వపీడలూ నశించిపోయి, ఏపుగావుంటాయని నమ్ముతారు.

## బెదరుకొయ్య తంత్రం

పంటచేలను అడవిజంతువులు తినిపాడుచేస్తూవుంటే, వ్యవసాయదారులు వాటి నివారణకు బెదురుకొయ్యను వేస్తారు.

"సీ॥ ఖరఫణిచంద్రుల కణుజులురారావు
బ్రహ్మేంద్రమూలల పందిరాదు
అదితి వాసననిల రా వెనుబోతులు
పుష్యమిచిత్తల పులులురావు
శ్రవణవిశాఖల చేరవుమృగములు
మఖయందుచోరులు మరియురారు
పూర్వత్రయంబున బోవునుదుప్పులు
భరణినిపక్షులు పారిపోవు
తే॥ స్థిరములగు లగ్నవృశ్చికా సరముల దు
కొరిమిముసిడైన తుమ్మైన కొయ్యయైన
నొక్కవ్రేటున ఖండించి యొనరచేను
నడుమపాతి నజంతుసంతసులురావు

తాత్పర్యం:- హస్త, ఆశ్లేష; మృగశిర, ఈనక్షత్రాలందు కణుజులును, రోహిణి, మూలయీనక్షత్రాలందు పందులును, పునర్వసు, జ్యేష్ఠలందు యెనుబోతులును, పుష్య చిత్తలందు పులులును, శ్రవణవిశాఖలందు మృగాలును, మఖయందు దొంగలును, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వభాద్రనక్షత్రాలందు దుప్పులును, భరణియందు పక్షులును బెదురుకొయ్యవేస్తే పంటచేనులోనికిరావు. బెదురుకొయ్యకు కొరిమి, ముసిడి, తుమ్మ ఈమూడుజాతులలో ఏకొయ్య ఏనక్షత్రానికి ఫలమయినదో చూచి. ఆనక్షత్రము నందు ఒక్కవ్రేటున చెట్టుకొమ్మను ఖండించి, దానినికొయ్యగా తయారుచేసి, పసుపురాసి, కుంకుమబొట్లుపెట్టి, ధూపంవేసి. చేనుమధ్యను దానిని పాతిన పైజంతుజాలములు రాజాలవు.

## సస్యసౌభాగ్య యంత్రం

పైరుపచ్చలు బాగుగా పెరుగుటకునూ, మంచిపంటకల్గుటకునూ రైతులు ఈయంత్రాన్నికూడా వేస్తారు-

| 56 | 66 | 3 | 7 | సర్వ |
|---|---|---|---|---|
| 6 | 3 | 63 | 62 | పీడా |
| 65 | 60 | 8 | 1 | వినా |
| 4 | 5 | 61 | 64 | శాయ |
| ఓం భగవతి నమో, నమః | | | | |

పైయంత్రాన్ని తాటియాకుమీదగాని, రాగిరేకుమీదగాని వ్రాసి, పసుపు కుంకుమలతో శుద్ధిచేసి, సాంబ్రాణిధూపంవేసి పంటచేనుమధ్యకడితే ఆరంభాలు చక్కగా పెరుగుతాయనిన్నీ, మంచిపంట పండుతుందనిన్నీ కర్షకులవిశ్వాసము- ఈ యంత్రాన్నే పశువులశాల ముఖద్వారానికి వేస్తే పశువులు క్షేమంగా వుంటాయంటారు.

## దిష్టికి

సస్యాలు చూపరులకు నయనానందకరంగావుంటే త్రోవనుపోయేవారలు రిచ్చపడిచూస్తారు. అలాచూడడంవల్ల దిష్టి తగులుతుంది. ఈదోషనివారణకు, మట్టి కుండకు సున్నంరాసి, మసిబొట్లుపెట్టి, అందరికీ కనబడేటట్లుగా పెడతారు. కొందరు వట్టిగడ్డితోగాని, ప్రాతగుడ్డలతోగాని, వికారాలుగల స్త్రీపురుష బొమ్మలనుచేసి, చేనుమధ్యఎత్తుగావుంచుతారు- అందుచేత చూపరుల దృష్టిదోషం పోతుందని చెప్పుతున్నారు-

## కీటకనివారణోపాయం

ఆకుకూరలమొక్కలకూ, కాయగూరలపాదులకూ, గొంగళిమొదలైన చీడ పురుగులుపడుతూవుంటాయి. అప్పుడు ఖామందులు కుమ్మరిబూడిదను తెప్పించి, వాటి మీద చల్లిస్తారు. క్రిములుపోతాయి మొక్కలూ, పాదులూ, ఏపుగాపెరుగుతాయి-

బూడిదను కుమ్మరావములనుండి తెచ్చేటప్పుడు, ఆమూటనుక్రింద దింపరాదు—మూట తోసేమనిషి మాట్లాడరాదు. ఈనియమం పాటిస్తే చక్కని అనుకూరలూ, కాయగూరలూ. వృద్ధిఅగుతాయని జానపదుల నమ్మిక —

## పంటచేల రక్షణ కార్యకలాపాలు

అడవిజంతువులు పంటచేలలోపడి, పంటనుతిని పైరును పాడుచేస్తాయి. అడవి పందులూ, దుప్పులూ, కనుజులూ, ఇవిమందలు మందలుగా చేనులోపడి ధ్వంసం చేస్తూవుండడం పరిపాటి. అడవిపందులులను "జీవాలు" అంటారు. వీటిని చేను లోనికిరానీయకుండా చేనుచుట్టూ, ఏరుపిడకల దాలి పెట్టి అగ్గితోరాజవేస్తారు. జంతువులు వచ్చే సమయానికి, దాలిరాజుతూ పొగలు విరజిమ్ముతూ వుంటాయి. ఆపొగవాసనకు జడిసియీజంతుజాలాలు దూరంగాపోతాయి—

ఫలవృక్షాలు పండినప్పుడు, ఆపళ్లుతినడానికి, ఋషిపిట్టలు (పక్షులు) చిలుకలు, వస్తూవుంటాయి. వాటిని చేరనీయకుండా బెదురులువేస్తారు. అనగా రంగురంగుల గుడ్డలజండాలుగనూ, తాడునకుశబ్దంవచ్చేలాగు తాటిఆకులనూ, గిరగిరాతిరుగుతూ చప్పుడిచ్చేగాలి గిలకలునూ, చెట్లమీదనున్నూ, చేలమధ్యనున్నూ కడతారు—

ఫలవృక్షాలకొమ్మలమధ్య రాళ్లుపోసిన. ఓటిడబ్బాలుకట్టి. డబ్బాక్రిందత్రాడు పొడుగ్గాకట్టి, దానిసహాయంతో డబ్బాను వూపుతూ చప్పుడు చేస్తూవుంటారు. ఆచప్పుడుకు పక్షులుజడిసి బెదిరిపోతాయి —

ఈవివిధమంత్ర, తంత్ర, యంత్ర, తతంగాలతో రైతులు సస్యాదులను రక్షింకొంటూవుంటారు.

## చేనుకాస్తూ పాడేపాట

పిల్లోణ్ణక్కడ
కూకడేసి
పుల్లలకెళ్లిందో
వానిపెళ్లాన్నాడు కొడితే
దానికెందుకో
సందకాడ దానిమొగుడు
సందుకాచేడే

పిల్లెంకడి చల్దికూడు
పిల్లితిన్నాదీ
వెంకన్న కాపూ
మామాలపల్లి రాకయా
నిన్న మద్దినాలా
జొన్న చేనుకాడ, రా,
నువ్వొవతల, నేనవతల
కాలవవతలా
పిల్లోణ్ణక్కడ — కూకడేసి
పుల్లల కెళ్లిందో.
ముద్దు మొగమూదాన
ముక్కు పోగూదాన
కలికి వేపము దాన
కామంచి పడుచా! మంచెదిగవే!
అరక చేనూలోన
ఆవు లున్నవి భామ
ఆలమందా నన్న
అదలించి రావె, మంచె దిగవే!
రామాల మూటలో
రూకలున్నవి భామ
మంచె కిందికి రావె
పంచుకుందాము, మంచె దిగవే!

మంచె=జొన్న చేనులో పిట్టలను బెదర కొట్టడానికని వేసేది - అరప అంటారు.

## ప్రస్తావన

పంట ముఖానికి వచ్చిన చేలకు, బలి చల్లుతారు. పండినచేలు కోసేముందు పొలిచేస్తారు.

## బలి చల్లుట - పొలిచేయుట

"ముందున్నది మొసళ్ళ పండుగ" అనే సామెత పాతకాలపుది "ముందున్నది ముసర్ల పండుగ" తరవాతది. మిక్కిలీ పురాతన కాలంలో పంట చేలకు పశుబలి నిచ్చే వారు. దానిదే మొసలి పండుగనే వారు.

తరవాత ముసర్ల పండుగ వాడుకలోనికి వచ్చింది. ముసర అనగా అన్నం మెతుకులు - ఈ సామెతకు జానపదులు చెప్పేగాథ - పూర్వం ఒక గొర్రెపిల్ల ఉత్సాహంతో చెంగుచెంగున గంతులు వేస్తూవుంటే, ఒక యెద్దు దానిని చూచి, ముందుందిలే ముసర్ల పండుగ" అని అన్నదట.

అనగా సంక్రాంతి పండుగకు పంటచేలలో బలిచల్లుతారు. గొర్రెలను బలి వేసి, ఆ రక్తంతో అన్నం కలిపి, ఆ బలికూడు పంటచేను నలుమూలలా జల్లడం పరిపాటి. ఈ ఆచారం ప్రస్తుతం లుప్తమైపోయింది, రక్తానికి బదులు కుంకుమను అన్నంలో కలిపి, ఎర్రన్నంచేసి పొలి జల్లడం, గొర్రెతల నరకడానికి బదులు గుమ్మడికాయ పగుల గొట్టడం జరుపుతున్నారు. దీని వలన ఆరంభాలు బాగుంటా యని జానపదుల విశ్వాసం - ఇదిబలి - పొలిచేయుట అంటే పండిన చేను కోసే ముందు కోడిని కోసి, దాని రక్తాని చేనులో చల్లి, మూడు గుప్పిళ్ళు చేను కోస్తారు.

ఇది పొలి :- పొలి అనే శబ్దానికి చంపుట, లాభం కల్గుట, ఎక్కువగుట, అనే అర్థాలు వస్తాయి. గింజలు కొలుస్తూ పొలిగలుగు అంటూ ప్రారంభిస్తారు, కుప్పలు నూరుస్తూ, గింజ లెక్కువవ్వాలని పొలి పదాలు పాడుతారు.

## కోత పాట

కోత కొయ్యండమ్మ లాలా సేలు॥
కోరుకున్నా మమ్మలాలా
ఆరుమూడు కాలమైన

అసలుకి మరి కొసరు లేదు
సోడిసేలు మెన్ను లేసి
సోలెడి గింజలై తే
పాలికాపు బత్తేలకు
పని కొచ్చును కొయ్యండి
దసరా భోగాలంటే
అసరా తీరుస్తాయి
పసరాలకి కసవుంటే
భాగ్యాలే పండాయి
సాలొచ్చిన మారాజు
సెయి ములగా యిస్తాడు
కాసు సేత పడితేను
గగన మందేము సేను

## కోత పదాలు

కొయ్యండల్లా ! కొయ్యండి
కోసి 1 బణుపూ లెయ్యండి
వానల వరదల వంగినను
వెన్నుల నీనిన వన్నెలసేను
తిన్నగ దీసి మొదలూ కోస్సీ
పనలన్నీ నీ 2 పొం జెట్టాల
గింజలు బందలొ పడిపోకుండా
పొందుగ వెన్నులు కొయ్యండల్లా

1. కోసిన పనలను పేర్చినది బణిపి అంటారు.
2. కోసిన సస్యాన్ని ఒబ్బిడిగా పెట్టితే ఒంజి (పొంజి) అంటారు.

కాలం సూత్తే 3 సీతాకాలం
కొడవలి పాటూ జాగ్రత్తరా
కాలుసెయ్యీ ఆడితేనే
కుండలో కూళ్ళు కనిపిస్తాయి.

గుణాసారి గున్నమ్మా !
ఒణ్ణిండ పసుపేస్కో ఒయ్యారమేమే ||గు||
పొద్దున్ననువ్వులెగిసి పొలానికెళ్లే ,,
ఎండెక్కిసూరీడు కొండెక్కిసూస్తే ,,
గంపాకిందకోడి కోయనికూసే ,,
గట్టెక్కిసూత్తాడు గవరయ్యకాపు ,,
మద్దేన్నయేళపుడు మరిదప్పికేత్తే ,,
సద్దిగంజికాంత తాగిమరివుండు ,,
ఆకుమళ్లలోను ఆకొండిపోయె ,,
తోడత్తానీరంత బావుల్లనుంచీ ,,
గొప్పుతవ్వేకాడ కొప్పందుకోలే ,,
పండినాసేలోకి పయనామైయెల్లీ ,,
కుప్పానూర్పుళ్లకాడ కూకున్నరేమి ,,
కొయ్యండికోతలు కొడవళ్లబట్టి ,,
ఎయ్యండిబళ్లాకి ఎగుడుదిగుడూలేక ,,
కొలవండిగింజల్లు కుంచాలతోటి ,,
గంపలతోపొయ్యండి గాదుల్లలోనూ ,,

3. సీతాకాలం పుండు త్వరగా మానదు.

## కోతలో స్త్రీపురుష సంవాదం పాట

పు:- ఉల్లిమల్లా చీరగట్టి, కచ్చలూపై కొంగాగట్టీ
ఉన్నవాళ్లపిల్లనంటావే, ఓలోలీరంగీ ||ఉన్న||

స్త్రీ:- ఉన్నవాళ్లాపిల్లానంటే కన్నుగీటి రమ్మన్నావూ
కంటిబాసలు నాకు ఒద్దురా, ఓరోరీమామా ||కంటి||

పు:- ఉన్నవాళ్లపిల్లానాసీ ఉచ్చిపోకే ఓలేపిల్లా
కోతలాకీ కోరీవస్తేనూ ఓలోలీరంగీ
కోతలోళ్లకికోపా మొస్తుందే? ||ఉన్న||

స్త్రీ:- కోరమీసాల్ దువ్వూకుంటూ, ఎర్రాగుడ్డా చుట్టుకుంటూ
కోతలాకీరావద్దంటావా; ఓరోరిమామా
కోరికైనా తీర్చనంటావా; ||కంటి||

## జొన్నచేను కొయ్యవస్తావా? లలనపదం

నాగలైతే కట్టినాడు
నదివొడ్డున దున్నినాడు
యేసెనమ్మ యెట్టిజొన్న
ఏటిబొడ్డునా లలన!
ఎయ్యాన్లైతే వేసినాడు
చుక్కల్లో పెరిగినాది
వానలేక జొన్నచేను
వాడిపోయెనే లలన!
పడమటొంక మబ్బువేసె
ప్రాణమొంటి వానగురిసె
వాడిపోయిన జొన్నచేను.

పడిదిరిగెనో లలన!
చిట్టెడుచిట్టెడు ముత్యాలిస్తె
చిన్నపువ్వుల దండనిస్తె
మనుమరాల జొన్నచేను
కొయ్యవచ్చెనా లలన!
చిట్టెడుచిట్టెడు ముత్యాలొల్ల
చిన్నపువ్వుల దండనొల్ల
తాతసీది జొన్నచేను
వాడిపోనియ్యో లలన!
సోలెడుసోలెడు రత్నాలిస్తె
సోమిపువ్వుల దండనిస్తె
మనుమరాల నాదిజొన్న
కొయ్యవచ్చేవా లలన!
సోలెడుసోలెడు రత్నాలొల్ల
సోమిపువ్వుల దండనొల్ల
తాతసీది జొన్నచేను
వాడిపోనియ్యో లలన!
తవ్వెడుతవ్వెడు పచ్చలిస్తె
తాలిపూల దండలిస్తె
మనుమరాల నాదిచేను
కొయ్యవచ్చేవా? లలన!
తవ్వెడుతవ్వెడు పచ్చలొల్ల
తాలిపువ్వుల దండనొల్ల
తాతసీది జొన్నచేను
వాడిపోనియ్యో లలన!

మానెడుమానెడు మాణిక్యాలిస్త
మల్లెపువ్వుల దండలిస్త
మనుమరాలా జొన్న చేను
కొయ్యవచ్చేవా? లలన!
మానెడుమానెడు మాణిక్యాలొల్ల
మల్లెపువ్వుల దండనొల్ల
తాతనీది జొన్న చేను
వాడిపోనియ్యో లలన!
అడ్డెడుఅడ్డెడు వజ్రాలిస్త
అల్లిపువ్వుల దండలిస్త
మనుమరాలా జొన్న చేను
కొయ్యవచ్చేవా? లలన!
అడ్డెడుఅడ్డెడు వజ్రాలొల్ల
అల్లిపువ్వుల దండనొల్ల
తాతనీది జొన్న చేను
వాడిపోనియ్యో లలన!
కుంచెడుకుంచెడు పగడాలిస్త
కుసుమపువ్వుల దండలిస్త
మనుమరాలా జొన్న చేను
కొయ్యవచ్చేవా? లలన!
కుంచెడుకుంచెడు పగడాలొల్ల
కుసుమపువ్వుల దండనొల్ల
తాతనీదిజొన్న చేను
వాడిపోనియ్యో, లలన!
జొన్న సేను వాడిపోతే

జొన్నపిండి దొరక్కపోతే
మనుమరాలా, పడుచుమనసు
మాడిపోవునో, లలన!
పచ్చిజొన్న రొట్టెలిస్తే
పచ్చిసజ్జ రొట్టెలిస్తే
కప్పుకొనే కంబళిస్తే
కొయ్యవచ్చేనో లలన!
పచ్చిజొన్న రొట్టెలిస్త
పచ్చిసజ్జ రొట్టెలిస్త
కప్పుకునే కంబళిస్త
కాపుకాచే మగణ్ణిస్త
మనుమరాలా జొన్నచేను
కొయ్యవస్తావా? లలన!

## కోతపదాలు మగవారుపాడేవి

ప॥ జంబైరన్నయో! జంబైరన్న, నీజోరుకాల!
జంబైరన్నయో ॥జం॥

1. దబ్బచెట్టుకి నిచ్చెనేసి
దబ్బపళ్లు కొయ్యబోతె
దబ్బముళ్లు రొమ్మునాటె
ముళ్లునాటి రక్తకొల్లు
సన్నరవిక సగముతడిసె
ముతకరవిక మునిగితడిసె ॥జం॥

2. ఈతచెట్టుకు నిచ్చెనేసి
ఈతపళ్లు కొయ్యబోతె
ఈతముల్లు రొమ్మునాటె
సన్నరవిక సగముతడిసె
ముతకరవిక మునిగితడిసె ||జం||

3. నిమ్మచెట్టుకు నిచ్చెనేసి
నిమ్మపళ్లు కొయ్యబోతె
నిమ్మముల్లు రొమ్మునాటె
సన్నరవిక సగముతడిసె
ముతకరవిక మునిగితడిసె ||జం||

4. రాజుకొడుకు రాతిఓడు
పిల్లవంక సూసినాడు
ఓరాసూపు సూసినాడు
పిల్లచూడ సకిలించినాడు
పిల్లదాపుకు వచ్చినాడు ||జం||

5. రాజువంక సూసెపిల్లా
గడగడమంటూ ఒణికినాది
దండంరాజా అన్నాది
మాటవినకా రాజు
పిల్లనుచేరీ ముద్దెట్టినాడు ||జం||

* * *

కాటుకెట్టిందిరా ఏలోడోముకులాడి
కమలాలెట్టిందిరా ,,
గాజూలేసిందిరా ,,

సూపూ సూసిందిరా — ఏలోడో ముకులాడి
చరపూ చరిచిందిరా — ,,
పూలూ పెట్టిందిరా — ,,
తాలీ నడిసిందిరా — ,,
అందరినీ చూసిపిల్ల — ,,
అదిరిపోయిందిరా — ,,

## *స్త్రీలు కట్టేతలో పాడేపదం

y ఎరుపురంగూ ఎదురుచుక్కారా! — నా సామిరంగా!
ఎన్నిదినములెదురు చూతురా
వలపునిలుపాజాల లేనురా! — నా సామిరంగా!
కలలోనైనను కావవేమిరా!
కాలుకురచ ఆడదానినిరా! — నా సామిరంగా!
వీలుసాలు చూడవేమిరా!
మూరతక్కువ చీరలంపరా! — నా సామిరంగా!
ఆకులతో పోకలంపరా!
ఆలసించీ ఆపబోకురా! — నా సామిరంగా!
అలపగానికి చెడుపుబుద్ధిరా!
పోయేటిరువులు వచ్చేటప్పుడు — నా సామిరంగా!
పాలపిడతలో విషములుండేనురా!
గువ్వచేత గురుతులంపారా! — నా సామిరంగా
కాకిచేత కబురులంపారా!

* వరి, జొన్న, పంటచేనుకోసి వేసిన పనలను కుప్పలుగను, గూళ్ళుగను చేయడానికి మోపులుకడతారు. దానినేకట్టేత అంటారు–

పెండ్లివేళలో వధూవరులకు బంధుమిత్రాదులు చదివించే కానుకలనుకూడా కట్టేతఅంటారు–y ఈగేయంలాంటి దింకొకటుంది.

ఓచిన్న దానా?

బంగారుచిన్న దాన, బాజాబందూలదాన,
బాజాబందూలమీాద బంతిపూలుసోకే ॥ఓ॥
నీలీనీలాటిదాన, నిలువుసన్నాటిదాన,
నీలీనీలామువిూద నగలుంబెసోకే ॥ఓ॥
నల్లానల్లానిదాన, నడుముసన్నానిదాన,
నడుముసన్ననమీాద నడికట్టుసోకే ॥ఓ॥
సన్నాసన్నానిదాన, సన్నానికురులదాన,
సన్నానికురులమీాద జాజిగుత్తిసోకే ॥ఓ॥

* * *

ఓచిన్న దానా,

గూడూరుచిన్న దాన, గుళుకుమట్టెలదాన,
గుళుకుమట్టెలమీాద గొబ్బిపూలుసోకే ॥ఓ॥
గుంటూరుచిన్న దాన, గుబ్లాపేరులదాన,
గుబ్లాపేరులమీాద కళ్లూపోలేదే ॥ఓ॥
కాకినాడచిన్న దాన, కాసులపేరులదాన,
కాసులపేరుమీాద కంటుంబెసోకే ॥ఓ॥
అర్ధరూపాయబెట్టి, అద్దాలరయికతెస్తే,
అద్దాలరయికమీాద బుద్దేలలేదే ॥ఓ॥

## గణపతిపూజ

పొలియో, పొలియో
వెయివేలుగలవాడ! వేలజంపన్న!
చిప్పతోగంధంబు చిరుశెనగపప్పు
ఒప్పయినగణపతికి ఒనరంగపూజ

మాచేనుమాఊదల రెండుజమ్ములుగలవు
జమ్మిపత్రీదెచ్చి మాగణపతికిపూజ
మాచేనుమారుదల రెండుమారేళ్లు
మారేడుపత్రి మాగణపతికిపూజ
ఒప్పయినగణపతికి చప్పిహండ్రాళ్లు
భక్తితోపూజించి ముక్తిపొందేము
ఆసరసవిద్యలకు ఆదిగురువైనట్టి
మాగణపతినిపూజించి గణుతీగాంచేము
మాచేనుమారుదల రెండువెలగలేగలవు
వెలగపత్రీదెచ్చి మాగణపతికిపూజ
తేనెతోమాగిన తియ్యమామిడిపండ్లు
ఒప్పయినగణపతికి ఒనరంగపూజ
మల్లెపువ్వులుదెచ్చి మాగణపతినెపుడు
మతియందుద్యానించి మరిపూజసేతు

## రావేలుగలవాడ

వలియ, వలియో, వలియ రావేలుగలవాడా? రారపొలిగాడ
పొలిపొలో పొలి ||వలియ||

౧. రావేలునీవయ్యా! రాశిమాదయ్యా!
నూరేలు నీవయ్యా! నూగుమాదయ్యా!
వేవేలునీవయ్యా! వెన్నుమాదయ్యా!
కోటేలునీవయ్యా! కొండ్రమాదయ్యా ||వ||

౨. ఎద్దులునూర్వంగా మిద్దెరాసూలు
కోడెలూనూర్వంగా కొండరాసూలు

ఆవులూనూర్వంగా అడ్డరాసూలు
మున్నలుమూర్వంగ దిన్నెరాసూలు ॥వ॥

3. తూరుపూఒకవానా తుమ్మెదలమోత
పడమటాఒకవానా బాజాలమోత
ఉత్తరానొకవానా ఉరుమూలమోత
దక్షిణానొకవానా తాళాలమోత ॥వ॥

4. మంగళగిరిలాగూ పొంగెరారాశి
సింహాచలములాగూ సిగదేలెరాశి
కోటయ్యకొండల్లా కొసదేలెరాశి
బొప్పూడికొండల్లా పొడుగయ్యేరాశి ॥వ॥

5. దాగెరాపొలిగాడు తలకాడిక్రింద
తొంగెరాపొలిగాడు తొలకట్టక్రింద
వచ్చెరాపొలిగాడు వరగాణిదాటి
పోయెరాపొలిగాడు పొలిమేరదాటి

* పొలిగాడు

ఒలియా ! ఒలియా ! ఒలియా
రావేలుగలవాడ రారపొలిగాడా ! ॥ఒ॥
తూర్పునాఒకవాన, తుమ్మెదలమోత

---

* ధాన్యములలోని రకాలు

సమాలిక:- జంగారుతీగెలు గంగాజలమ్మలు
కస్తూరినిగరాలు కటకసరులు
ఇప్పపూరాజనా లేనుంగుకొమ్ములు
మల్లెశ్రీగంధులు మదనగంధు

పడమటఒకవాన పట్టికురవంగ ||౭||

ఈవాడఆవాన ఏకజడివాన

ఏవిలీచేసుకూ ఎడవానలాయె ||౮||

వెండితూములకింద వెల్లడముపండు

---

లేలికరాజనా లీశ్వరప్రియములు
రావిపూరాజనాల్ రత్నసరులు
కుసుమపూరాజనా ల్గుత్తిబల్గుత్తులు
కస్తూరిపట్టెలు గంధపరులు
మందిగంద్రలునాగ మల్లెలుతీగమ
ల్లెలుకృష్ణనీలాలు వెలువడాలు
మన్మథబాణాలు మరువంపుమొలకలు
సన్నమణింగెలు జున్నుఁబ్రాలు
పొన్నశ్రీరాజనా లుప్పునఁగురాజనములు
ముద్దుప్రాలారళ్లు ముత్తుసరులు
సన్ననూదులుపచ్చ గన్నేర్లుకోదండ
రాముళ్కెసర్లు రాయసర్లు
చంద్రవంకలుజీని సరులు కాంభోజాలు
వంగాకుబుడమలు పొంగుఁబ్రాలు
జిలకఱ్ఱరాజనా ల్చింతపువ్వులుగోరు
రాజనాల్బ్భద్రప్రోల్ రాజనాలు
రామబాణాలు రెక్కాములుపెన్నము
ద్దలుజిల్మబుడమలు దాళువాలు
గొబ్బికాయలు బలుగుత్తులుపాలమీఁ
గడలుశ్రీరంగాలు కామదార్లు
ఔక్కపాలలు కాకి ఔక్కలుపుష్పమం
జరులుసీతాభోగ సరులుగౌరి
కుంకమల్రణపెండ్లి కొడుకులుపిచ్చుక
గోళ్లు ప్రయాగలు గొజ్జఁబ్రాలు
గరుడసరులొప్పెతు గంటరాజనములు

పైడితూములకింద పాలంకిపండు ॥౨॥
రాగితూములకింద రానాలుబండు
కర్రతూములకింద కాంభోజలుపండు ॥౨॥

మోఁదుగతోడిములు ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డి పాలవంకెలు సుఖ
భోగులు పచ్చకర్పూరసరులు
నివ్వరులైబ్బస తీన్నరుకావులు గాజా
కప్పెరలు కుఱువడాల్ కుంకసరులు
సాలంక లలుగు రాజనములు సంభావు
లవసరదార్లు మోహానపుసరులు
మణిసరుల్మసరులు మంకెనల్పగడంపు
తీఁగెలు మడిప్రాలు దేవసరులు
లత్తుకబొత్తులు లక్ష్మిమనోహరా
ల్భారతీసేసలు బాహుపురులు
వజ్రపుఁదళుకులు వాసవరాజనా
లజ్వాజివంకెలు గవ్వసరులు
సంపంగిపూవడ్లు జాజిరాజనములు
గంబూరరాజనాల్ కన్నెసరులు
తమ్మిపూరాజనాల్ అమ్మడుకొణిగెలు
జీనువముక్కులు చిలుకముక్కు
లేదుకజ్జలవంకె లిసుకరాజనములు
పులిగోళ్లవంకెలు బొగడసరులు
గీ. జిలితొగలరాజనమ్ములు వలసరులును
తెల్లనల్లచెన్నంగులు దీవసరులు
నాదియగుపేర్లుగలుగువడ్లౌనియింట
నుండుశతకోటిపుట్టులా కొక్కక్కదినను

(హంసవింశతి 5 ఆ 128 ప)

సీ॥ శ్రీరామవంకియుఁ జిటిబలుగుత్తియు
శ్రీకేసరియుఁ శక్తి శ్రీధరంబు
నీశ్వరప్రీతియు శేనుఁగుకొమ్మును
బోడసంపంగియు నోడవరియుఁ

రా వేలుపోలు రాసిపది వేలు
రా వేలుమీాదయ్యా రాసిమీాదయ్యా ॥౭॥

గన్నూరినికరంబు గర్పూరభోగియు
కావలి కాంభోజి కనకగిరియు
దేవాన్న మెలిమియు దేవడన్ని యకొట్టి
నీరుచంచలియు శృంగారభోగి
తే॥ వంకిప్రాసంగిసంపంగి వారణాశి
కామధేనువునారేళి గంద్రగోళి
వెదురుపులయంబు బుడమయు వెలువడంబు
రాచమెచ్చునుములువంకి రాజనములు

(వైశ్యపురాణము 5 అ)

"రెడ్లలో తెగలూ; వడ్లలో తెగలూ లెక్కపెట్టలేము" అనే సామెతగలదు. రకానికి ఒకగింజచొప్పున తీస్తే కుంచెడుగింజలవుతాయని పెద్దలంటున్నారు—

—ప్రస్తుతం వాడుకలోవున్న జాతులు—

1 అక్కుళ్లు (పాలక్కుళ్లు, తూర్పుఅక్కుళ్లు, బొంతక్కుళ్లు, కర్రక్కుళ్లు) 2 అవ్వారి 3 ఉట్రగడసన్నాలు 4 ఎరడామ 5 కిచిడి=పిచ్చుకసాంబా, 6 కుసుమ 7కృష్ణకాటుకలు 8 కోణావణి (సన్నకోణావణి, 9 గరిగసన్నాలు 10 గుణపుర సన్నాలు 11 చిలుకముక్కు 12 జిలమ 13 జీలకట్ట 14 దాళువాలు 15 నీటికాపరి 16 నీవారనివ్వరి, తృణ, నిదార్య, అరణ్యశాలి అనిపేర్లున్నాయి, 17 నృపహ్వార 18 పతంగ (పడగ) 19 పరశువేదు (కాశ్మీర) 20 పవనాలు (పునేరా, పన్హారా, బీజపుష్ప, గంధపుష్ప, దేవ, అనేపేర్లతో — వేర్వేరుతావులందు వాడుతూవున్నారు. 21 పవమాన 22 పార్వతీయ 23 పారావత 24 పాలగుమ్మసరి 25 (పిచోడి= దీనిలో అయిదుజాతులు వేర్వేరు ప్రాంతాలలో ఒకేపేరుతో పిలువబడుతూవున్నాయి. 26 పుష్పాండక 27 పుష్పాంతక 28 బంగారుతీగెలు 29 బంగాళా 30 బర్మాసమృద్ధి 31 బసంగి (ఎర్లీబసంగి) 32 బుడమ (సారబుడమ, కోడిబుడమ) 33 బొబ్బిలికంటె 34 బోదన 35 మహారాజభోగాలు 36 మాన్యభోగాలు బలరామభోగాలు శ్రీరామభోగాలు) 37 యుగంధర 38 రసరిగి (కృష్ణరసంగి 39 రాజనాలు 40 రాజభోగాలు, 41 లక్ష్మణపురులు 42 వంకసన్నాలు (అకుసన్నాలు) 43 సీతకాటుకలు 44 సుకుమార — ధాన్యరకాలువున్నాలు — ఇవిమూడువర్గాలుగా విభజిస్తారు.

పోలోపొలి పొలిపొలి
తిరుపతెంక న్నిచ్చినపొలి
వినుకొండెంకన్నచ్చినపొలి
పోవేలుగా చాలపొలి

## వె యి వే లు గ ల వా డా!

పొలియన్న పోలియో - వెయివేలుగల పొలియో
వెయివేలకు నూర్చగల పొలియో
నడి యాకసం మెరసి నల్ల మొయిలుట్టింది
తూర్పున బుట్టింది తుమ్మెదల మోత
పడమటను బుట్టింది పావురాలమోత
ఆవాన యీంవాన కలసి కురిసింది
చేరి రావులగడ్డ తేలుచిపారింది
గొడుగంత మొయిలుట్టి గుంటలే నిండేయి
చేటంత మొయిలుట్టి చెఱువులే నిండాయి
నిండింది మనచెఱువు నిండాదిగాను
అడివోర పెదచెఱువు వెంటనే నిండింది
వేసింది ఆ చెఱువు పదుకన్నాలు
రాగి తూములనీట రాజనాలు పండె

౧. మెరకమీద చల్లేవి

౨. తేలికవరులు — 3 నెలలలోపు పండేవి

3. పెద్దవరులు 4 నెలలలోపులో పండేవి

మొత్తంమీద కొన్ని 75 రోజులకు, కొన్ని 90రోజులకు కొన్ని 120 రోజులకు. కోతకువస్తాయి —

కంచుతూములల నీట కార్తికలు పండె
వెండితూముల నీట వెఱడాలు పండె
చినకాడి పెదకాడి కాపులిద్దరు గూడి
వారెంచి పూనేరు ఎల్లెడ్లజతలు
అల్లుడు మామలు ఎల్లెడ్లజోడు
ఒన్నె కర్రమేడి ఓదికర్రకాడి
నల్లతుమ్మనాగలి చంద్ర ఏటికోల
తూర్పునకు సాలొడిసి పడమటకు దున్నె
దక్షిణపు కూలీలు దమ్ము చేసేరు
పడమటి కూలీలు పట్టితోలేరు
ఉత్తరపు కూలీలు ఊడ్చివెళ్ళేరు
ఎల్లెడ్లు నూర్చంగ ఏకరాసులు
పడ్డలు నూర్చంగ పర్వతాల పొడుగు
పోతులు నూర్చంగ పోగులు మండీలు
దూడలు నూర్చంగ ధూళిరాసులు
పొలిగలసీతవైతే మా పోతుమీదకురమ్మ
మాచేను ప్రక్కను రావియొకటుండె
రావెక్కి మాసీత రాగాలుదీసె
మాచేను మాటుదల మఱ్ఱి యొకటుండె
మఱ్ఱెక్కి మాసీత మఱిరాగదీసె
మాచేను వెనకాల జువ్వొకటి యుండె
జువ్వెక్కి మాసీత జూద మాడింది
పొలియున్న శబ్దము మాపొలములో గలదు.

## ఏ య్యే లు కె య్యే లు

పొలి పొలో పొలో అనుపల్లవి ప్రతిపాదం చివరను పాడాలి

ఎయ్యేలు కెయ్యేలూ నూటనూ రేళ్ళూ
సరస్వతీ! నిను దలవాక సాగవూ పనులూ
గణపతీ! నిను దలవాక గడవవూ పనులూ
ఊళ్లో వినాయకా ఉండ్రాళ్ళభోగీ
పొలములో వినాయకా, పోగునాళ్ళభోగీ
గట్టుమీాద వినాయక! గంధాల భోగీ
నాయకా నాయకా! స్వామి విఘ్నేశా
దొప్ప చెవులవాడూ, దోనె కడుపుగలవాడూ
ముందరా జూచితే ముంగి రూపంబూ
వెనకనూ జూచితే ఏనుగూ రూపూ
నొసట కిరీటమూ గలవాడు స్వామీా
వీపుల వింజామరగలవాడు స్వామీా
బొడ్డునా సురపొన్న పువ్వుగల స్వామీా
పళ్ళ పరసా వేదీగలవాడు స్వామీా
అరికాలు పద్మమూ గలవాడు స్వామీా
ఇన్నిగల గణపతికి పూజేమి పూజా
కర్రావు నేతులూ కరకు బెల్లాలూ
ఖండించిన చెఱకులూ గానుగా చిమ్మిలీ
చివ్వతో గంధములు చిరుశెనగ పప్పూ
దొప్పతో గంధములు దోరావు నెయ్యీ
అల్లాలు బెల్లాలూ అమృతపాణీలూ
టెంకాయ కొబ్బెరలూ తేనరటిపళ్ళూ
అవియు మాగణపతికి ఆరగింపులుగా

మాచేను మారుదలరావులే గలవూ
రావిమీద మాసీతమ్మ రాగాలు దీసె
మాచేను మారుదల జువ్వులే గలవూ
జువ్విమీద మాసీతమ్మా జూదమాడింది
పొలిగల సీతవైతే మాపోతులమీదికి రమ్మా
భక్తిగల సీతవైతే మాబరిమీదికి రమ్మా
వూరువెలుపల రెండు ములగచెళ్లే గలవూ
దాని ఆకులే వెళ్లేయీ అంతరిచ్చముదాకా
దాని కొమ్మలేవెళ్లేయీ కోటిపల్లిదాకా
గున్నచింతల క్రింద చిరుకొలుముపెట్టి
వూయూరి కమ్మరులా వూయూర బిలిచీ
తనవూరి కమ్మర్ని తనపేర బిలిచీ
నిమ్మ పండ్లోకొక్కన్ని నిప్పెక్కచేసి
కొలిచే కుంచెడు ధనమూ కొలుము లేయించి
వూదేటి తిత్తులూ వురమడమ్మబోలి
వేసేటి సమ్మెటలూ రణభేరి మ్రోతా

### సీత కు పొ లి పా డు మ మ్మా

(పొలి, పొలో, పొలో ప్రతి చరణానికి అనాలి)

పొలిగలిగి సీతమ్మా పొలిబాడుదామా
పగితే క్రొత్తామానేళ్లు పోసన్నా
మనపాల నాగళ్ళు కట్టించుకన్నా
కొడుకుల్ని బిలిపించి కోడేళ్ళు వేసీ
మనమల్ని బిలిపించి మారేళ్ళు వేసీ
ముప్పయి ఐదేళ్ళు వూయించినారూ

నల్ల రేవడిలోకి తోలిపెట్రన్నా
తోలినా యేళ్ళోరే తోటవెంబడినీ
తూర్పుకి పడమరకి తోలిసాలు బోసి
కొండలకి ఏనాంకి మరి సాలుబోసి
నల్లన్న రేవడి తెల్లన్నదున్ని
కాడికాడని భూమి కదల దున్నేడూ
వరిపిండి వర్షాన దున్నించినాడూ
బట్టిగట్టూకాడా యేళ్ళిప్పినాడూ
ఆవుల్ని దొడ్డికే తోలిపెట్రన్నా
తీగమేటుల్తోటి కట్టి పెట్రన్నా
యింటి కొచ్చినాడు వెజ్జుడేలమన్నా
ముత్యాలు ములకాలు ముంజూటినేసీ
పగడాలు చెప్పుజోడూ పంచదిగనాడీ
పట్టిమంచముమీద పవ్వళించాడూ
వర్షాలు లేవని వాడివున్నాడూ
వుత్తరాన్ని మెరిసిందీ వురుము గర్జిల్లి
దక్షిణాన్ని మెరిసింది ధరణి గర్జిల్లి
గంపెడంత మేఘాము గాదరిల్లిందీ
చేటంత మేఘాము చెదిరి కురిసిందీ
కురిసేనూ వర్షంబు కుంభ జలనిధులూ
ముత్యాల చెరువుకి మూడు ముదు ముల్రా
వజ్రాల చెరువుకి వాలుగొమ్ముల్రా
పగడాల చెరువుకి పారుబట్టెల్రా
పారుబట్టెలుగట్టి పంట వెలమన్నా
నిండింది ఆచెరువు నీలరూపమునా

యింటికెళ్ళినాడు వెజ్జుడేలమన్నా
గోడపై నిచ్చెనను మేడపై నేసి
అటకమీదాకట్ట నేలబడదోసీ
కుక్కలా కొడవళ్ళ కట్టబద్దించీ
తొంగున్న లచ్చుమ్మనీ తొడచరిచి లేపీ
విత్తనాల పేరులూ వివరించినాడూ
పెద్దవరి ధాన్యాలు కాపోళ్ళుతిన్నా
వెలమలూ తిన్నవీ వెల్లరకణాలూ
తెలగాలు తిన్నవీ తెల్లబాలోరి
మాళోళ్ళు తిన్నవీ గవిరివజ్జాణాలూ
మురికి వజ్జాణాలు మాదిగోళ్ళు తిన్నా
సెగిడోళ్ళు తిన్నవిరా శామంచనాలూ
వాయిలపాటి సన్నాలు చాకళ్ళుతిన్నా
మంగళ్లు తిన్నవిరా మల్లిసన్నాలు
దూదిబోగములండీ దూదేకులోడీవి
కాకిమూతి సన్నాలు కమసాల్లు తిన్నా
యర్రబాలూ ధాన్యం యాతోళ్లుతిన్నా
కాయిరిధాన్యాలు కాజోళ్లుతిన్నా
బలరామ భోగాలూ బ్రాహ్మర్లుతిన్నా
రక్తసరి ధాన్యాలూ రాచోళ్లు తిన్నా
సుఖాసులు తిన్నవిరా సన్నసూద్రుల్రా
బంగారుతీగెలూ బైరాగులుతిన్నా
బొంద్దవాధాన్యాలూబట్లోళ్ళుతిన్నా
దాళవాధాన్యాలూజాలర్లు తిన్నా
సత్తికపుధాన్యాలూసాలోలుతిన్నా

గుత్తుబాసికాలూ కుమ్మర్లుతిన్నా
బుడబుడకలాళ్ళు తిన్నవిరా బుకమ ధాన్యాలూ
మడిలోను పండినవీ మడిరాసికాలూ
చెరువులోను పండినవీ చేమంచనాలూ
గుంటలోను పండినవీ గుత్తుబాసికాలూ
అచ్చికలు బుచ్చికలు మొల్లంకణాలూ
మాంచేని కాటికలూ మల్లిసన్నాలూ
అమ్మవారు తిన్నవిరా అమృతపాణీలూ
విత్తనాల పేర్లన్నా వివరించినాడూ
నల్ల రేవడి నట్టానడిమి కెళ్ళేడూ
కాలితోటీపదునూ తన్ని సూసేడూ
చేటతో విత్తనాలూ పట్టికెళ్ళేడూ
నల్ల రేవడిమీందా జల్లొచ్చినాడూ
ఆప్రొద్దు పోనిచ్చి అమరసనాడూ
మూడురోజులున్నాడూ ముడిమొక్క దోలీ
పందికొమ్ముల్లాగా పల్లటిల్లింది
దుప్పికొమ్ముల్లాగా దూరింది మొక్క
గాలిదగిలి చేనూగాదు కొన్నాది
హస్తకార్తికి చేనూ అటుకుకక్రోరి
చిత్తకార్తికి చేనూ చిరుపొట్టదగిలి
చవితమాసకి చేనూ కడలుపండిందీ
దండమాసకి చేనూ దండల్ని పండిందీ
నల్ల రేవడిచుట్టూ తిరిగిచూచేడూ
యింటి కొచ్చినాడూ వెజ్జుడెలమన్నా
తనవూరు కమ్మర్ని తనవేరబిలిచి

గున్న చింతలకాడా చిరుకొలుముబెట్టి
నేరేడు పండంటి నీలాలు పోసి
వుల్లితొర్లావంటి వూకపై బోసి
నిమ్మ పండ్లొకొన్ని నిప్పొక్క ఊసి
జోడు తిత్తులుబట్టి బోరుకలి పేదూ
వూదేటితిత్తులూ వురమడంబోలి
కొలిచి తూముడు ధాన్యంకొలిమి చేశాడూ
బంగారు కొడవళ్ళూ బాగుచేయించీ
పాలోసి కొడవళ్లు పదునుబట్టించీ
యెనిమిసి క్రాసిడులూ వేయించినాడూ
వుక్కసేనాముతో కక్కు లేయించి
కోసి నాడెలమన్నా కొన్ని గరిశెలుకీ
కళ్ళాన్ని పడుగులూ వేయించురన్నా
లంకిగట్టోరన్న పూలగబ్బినాన్న

రాగిపల్లా పోతుల లంకి గట్టనాన్న
పెద్దకరిపోతుల లంకి ,,
గుండుగమ్మా పోతుల లంకి ,,
నెత్తిచుక్కా పోతుల లంకి ,,
కలమపోకా పోతుల లంకి ,,
రామలక్ష్మణ యెడ్లూ లంకి ,,
పెద్దయెల్లా యెడ్లూ లంకి ,,
పెద్దకరీ యెడ్లూ లంకి ,,
రాచయెల్లా యెడ్లూ లంకి ,,
నిలువుకొమ్ముల యెడ్లూ లంకి ,,
జాతియెడ్లూలంకి గట్టితేనాన్న

పాలసారాయెడ్లూ లంకి గట్రన్నా
ఎఱ్ఱసారాయెడ్లూ లంకి ,,
కాటిక కళ్లెడ్లూ లంకి ,,
చప్పికొమ్ముల యెడ్లూ. లంకి ,,
బుఱ్ఱయెడ్లాలంకి గట్టి తేరన్నా
దాకోడుతిరిగిందా దండకడియాలూ
వలపలినితిరిగింది వలగజ్జెపేరూ
పొలిదిరిగినోడికి పొంగుబూరెల్లా
నూర్చినాడెలమన్నా నూరుగరిశెలకీ
జగనాలుచేబెట్టి గాలికిపోయిరన్నా
రామలక్ష్మణయెడ్లు నొల్లపుయిరన్నా
గొల్లకొండాపొడుగు మండిదోయరన్నా
దశమిదశమీనాడూ ద్వాదశీనాడూ
శుక్రవారంనాడూ చుక్కపొద్దేళా
మంచిదోకొక్కమూర్తి మెంచిపడిగట్టీ
బాపనోరికాడిదీ బంగారుతూమూ
గోపెమ్మగారింట గొలుసులాతూమూ
రాశిమీదాతూము రంజిల్లుతాదీ
తొమ్మిదొందలగరిశా లెక్కయ్యిరన్నా
గాదెలికియీబల్లూ పూయించురన్నా
గాదెల్లోధాన్యాలూ పోయించురన్నా
గాదెలకుతలుపూలూ చేయించురన్నా
తలుపులికితాళాలూ వేయించురన్నా
కళ్లానికొచ్చినాడెజ్జుడెలమన్నా
పాలికాపుజీతాలూ తీసెయ్యిరన్నా

బాపలికిభ త్త్యాలూ తీసెయ్యరన్నా
గొల్లోళ్ళభ త్త్యాలూ తీసెయ్యరన్నా
వెనక పాటోళ్ళకి పీనికట్టియరా
చాకలిమడేలుకీ పందుమియరన్నా
బారిక్కిమంగలికీ పందుమియరన్నా
అమ్మాగతికిమానె డిచ్చెయ్యరన్నా
యింటికొచ్చినాడూ వెజ్జుడేలమన్నా
వూరుదండాశోణ్ణి పిలించురన్నా
వూళ్ళోనిఅమ్మోరికి చాటించురన్నా
పురటాలుపోలమ్మఘుట మెత్తించురన్నా.

## వొలియపదాలు - కోటేలుగలవాడా

వొలియ వొలియా
వొలియవొలియా, వొలియా
కోటేలుగలవాడ రారపొలిగాడా
కోటేలుమీదయ్య కొండ్రమూదయ్యా
వెయ్యేలుగలవాడ రారపొలిగాడా
వెయ్యేలుమీదయ్య వెన్నుమూదయ్యా
నూరేలుగలవాడ రారపొలిగాడ
నూరేలుమీదయ నూగుమూదయ్య
పదివేలుగలవాడ రారపొలిగాడా
పదివేలుమీదయ్య పంటమూదయ్య
రావేలుగలవాడ రారపొలిగాడ
రావేలుమీదయ్య రాశిమూదయ్య
ఎద్దులూతొక్కంగ ఎదిగెనేరాశి

కోడెలూతొక్కంగ కొల్లాయెరాశి
పెయ్యలూతొక్కంగ పెరిగనేరాశి
పొలిగాడుకొల్వంగ పోగాయెరాశి
వచ్చేనేపొలిగాడు పొన్నలూదాటి
దాగెనేపొలిగాడు దండాకొట్లల్లో

## ఉయ్యాలపదం

(ప్రతిపాదం చివరను వుయ్యాలో అనాలి)

వొలియ వొలియా వొలయ
ఊరికివుత్తరాన వుయ్యాలో
ఊడల్లామఱ్ఱి ,,
ఊడల్లమఱ్ఱిక్రింద ,,
ఉత్తముడీచవికె ,,
ఉత్తముడీ చవికెలో ,,
ముత్యాలాకొలిమి ,,
గిద్దెడుముత్యాలు ,,
గిలకల్లాకొలిమి ,,
అరసోలముత్యాలు ,,
అమరిందికొలిమి ,,
సోలెడుముత్యాలు ,,
సొంపైనకొలిమి ,,
తవ్వెడుముత్యాలు ,,
తనిసిందిఆకొలిమి ,,
మానెడుముత్యాలు ,,

మనిసింది ఆకొలిమి ఉయ్యాలో
అడ్డెడుముత్యాలు ,,
అమిరింది ఆకొలిమి ,,
తూమెడూముత్యాలు ,,
తూగింది ఆకొలిమి ,,
ఏదుమూముత్యాలు - ,,
మెలిసింది ఆకొలిమి ,,
పందుమూముత్యాలు ,,
పాకైన ఆకొలిమి ,,
పుట్టెడుముత్యాలు ,,
పుట్టింది ఆకొలిమి ,,
వూదేటితిత్తులూ ,,
ఉరుముల్ని మోలు ,,
పట్టేటి కారులు ,,
పాముల్ని మోలు ,,
బాదేటిసమ్మెట్లు ,,
పిడుగుల్ని పోలు ,,
మొలుచుకొచ్చేరవ్వలు ,,
మెరుపుల్ని పోలు ,,
చుట్టూరు కాపులు ,,
చుక్కల్ని పోలు ,,
మధ్యకమ్మరిబత్తుడు ,,
చందురుణ్ణిబోలు ,,

శ్రీరాములేయించె | వుయ్యాలో
---|---
ఆగొ_ర్తికొకజతా | ,,
రఘురాములేయించె | ,,
నాగేండ్లు ఒకజతా | ,,
శ్రీరాముగొఱుపట్టి | ,,
సీతమ్మ యెద పెట్టి | ,,
రఘురాముగొఱ్ఱుపట్టి | ,,
రంభ యెదాపెట్ట | ,,
సీత పెట్టిన పైరు | ,,
చిగురువలెవచ్చింది | ,,
రంభ పెట్టినపైరు | ,,
రాణింపుగావచ్చె | ,,
పైరులెస్సగపండె | ,,
పాతళ్లూనిండె | ,,
పాతళ్లునిండగా | ,,
కూతుళ్ల పెళ్లిళ్లు | ,,
వాలియ వాలియా వాలియా | ,,

తొలియేళ్లు భాగోతులాడించురన్నా
చుట్టాలుబంధువులికీ చెప్పించురన్నా
నవరుచుల పిండొంటలొండించురన్నా
వీధిలోశిరిమానూ తిప్పించురన్నా
అశిరితల్లిగుడికి వెళ్లొస్తుమన్నా
అనుపుకూళ్లూపెట్టి అనిపెట్టురన్నా

## వేలసంపన్నా

ఒలియ, ఒలియా, వేలుగలవాడా! రా! పొలిరా!
వెయివేలుగలవాడా! వేలసంపన్నా! పొలో!! పొలో!!

అనునది ప్రతిపాదంతుదను పాడాలి

పడ్డాదిమాకుప్ప పర్వాతామల్లేను
కూలిందిమాకుప్ప కుంభకర్ణుడిమల్లె
విఘ్నేశుడ్ని తలవందె మాకీడీరవ్రుపసులు
గాలిగాడిసీతలంపగ ఘనమామెమారాసి
ముందుచూస్తైయిగ్గెన్న ముంగిరూపంబు
యెనకచూస్తేయిగ్గెన్న యేనుగురూపంబు
మిట్టనోసలవాడు మిడిగుడ్లవాడు
దొప్ప చెవులావాడు దొడ్డకడుపువాడు
ఇన్నిగలస్వామికీ ఏమిపూజల్లు?
మాచేనుమాఉదల మారేళ్లుగలవు
మారేళ్లపత్రి మాగణపతికిపూజ
మాచేనుమాఉదల జమ్మిల్లుగలవు
జమ్మిల్లపత్రి మాగణపతికిపూజ
కట్టావునేతుల్లు గంగరేగుపండ్లు
దోరావునేతుల్లు దొంతినరటిపళ్లు
కోడెల్లునూరవంగ కొండలాపొడుగు
దున్నల్లునూరవంగ దుమ్ములాడేరాసి
శ్రీరాముకొట్టట్ట సీతమెదబట్ట
సీతబట్టినమెదలు చిట్టీసుత్యాలుపండు
రఘురాముకొట్టట్ట రంభమెదబట్ట

ఖండితూములకింగ యెఱ్ఱజొన్నలు పండు
కంచుతూములకింద కాంభోజిపండు
రాగితూములకింద రాజనాలుపండు
తూరుపున మొదలెట్టు తుమ్మెదల మోత
పడమటా మొదలెట్టు పట్టెకురవంగా
పొలిగలసీతవైతే మాపోతుమీదారమ్మ
మతిగలసీతవైతే మామండిమీదికిరమ్మ
వెయినేలుమాకిస్తే సీతకీ వెండికడియాలు
పదివేలుమాకిస్తే సీతకీ పైడికడియాలు
పూరుముంగటచేను పుంట్రాళ్లభోగి
పాటిమీదాచేను ఫలారానికిస్తు
గమిడిముంగటచేను మీగద్దెకిస్తు
గణరాయిపతిచ్చిన పొలిచాలాపొలి
గాలిగాడ్నితలవంగ మాఘనమాయెరాశి
వెయివేలుగలవాడా! వేలసంపన్నా!
ఒలియా, ఒలియా, వేలుగలవాడా రా! పొలిరా

## ఒ లి యా! ఒ లి యా!

"ఒలియా, ఒలియా, ఒలియా
రా వేలుగలవాడా! రా వేలు గలవాడా"
అనుపల్లవి రెండేసి చరణాలకు పాడవలెను.

* కొట్టు = గుంటక, ఇది నాగలివలె దున్నగా వచ్చేసాలులో గింజలు వేస్తారు.
2 ఎదబట్ట = దున్నినచాలులో గింజలు వేయడం-

ఊరికి ఉత్తరాన వూడాలమఱ్ఱి
ఊడాల మఱ్ఱిక్రింద వుత్తాముడి చవికె ఒల్లియా
ఉత్తాముడి చవికెలో రత్నాల పందిరి
రత్నాల పందిట్లో ముత్యాలా కొలిమి ,,
గిద్దెడు ముత్నాలు గిలకలా కొలిమి
అరసోల ముత్యాలు అనురెరా కొలిమి ,,
సోలెడు ముత్యాల చోద్యంపు కొలిమి
తవ్వెడు ముత్యాల తరిచినా కొలిమి ,,
మానెడు ముత్యాల మలచిన కొలిమి
అడ్డెడు ముత్యాల అలరినా కొలిమి ,,
తూమెడు ముత్యాల తూగనే కొలిమి
చద్దిఅన్నము తిని సాగించుకొలిమి ,,
ఉడుకు అన్నాముతిని ఊదనే కొలిమి
పాలఅన్నము తిని పట్టెనా కొలిమి ,,
ఊదేటి తిత్తులూ ఉరుములాబోలు
వేసేటి సమ్మెట్లు పిడుగులాబోలు ,,
లేచేటి రవ్వలూ మెరుపులా బోలు
చుట్టున్న కాపులూ చుక్కలా బోలు ,,
నడుమ కమ్మరిబిడ్డ చంద్రుణ్ణి బోలు
నెయిబోసి గొడ్డళ్ళు నేర్పు లెక్కించి ,,
పాలుబోసి గొడ్డళ్ళు పదును లెక్కించి
నీర్వోసి గొడ్డళ్ళు నునుపు లెక్కించి ,,
పోయిరే అన్నాలూ అడివి మార్గాన ,,
పోయేటి అన్నలకు యేమిమి చద్ది

అసలు చిక్కుడుకాయ అలచందపప్పు ఒలియా
పచ్చజొన్నన్నంబు ఎత్తావు పెరుగు
పోయిరే అన్నాల్లు అడవిమార్గాల ,,
మూడామడలబోయి ములకలాగొట్టి
నాలుగామడలు బోయి నాగళ్ళుకొట్టి ,,
ఏడామడలుబోయి ఏడికలుగొట్టి
పదియామడలు బోయి పాపటముగొట్టి ,,
కొట్టినా సామాన్లు బళ్ళకెత్తేరు
పోయిన మార్గాన వూరుజేరేరు ,,
పోయెనో ఆబండి బ్రాహ్మణావీధికి
బాపనా రక్కప్ప పట్టెనివ్వాళి ,,
ముత్యాల కొలిమి కాడనిల్పిరిబండి
తెచ్చినా సామాన్లు దించిరా వీధి ,,
చేసిరి నాగళ్ళు చేలుదున్నంగ
దండాల పగ్గాలు దబ్బునాలాగి ,,
దూలాలపై గొర్లు దుమ్ము దుల్పేరు
వేసెనే కోటేళ్ళు విత్తువేయంగ
పోయెనే కోటేళ్ళు చేను ముందరికి
తూర్పునా ఒకవాన తుమ్మెదల మ్రోత
పడమట ఒకవాన పట్టెకురవంగ
ఈవాన ఆవాన యేకజడివాన
ఏదిరిచేనుకూ మెరవాగ లావాయె
శ్రీరాముడు గొఱ్ఱుబట్టి, సీతయెదబట్టి
రఘురాముడు గొఱ్ఱుబట్టి, రంభ యెదబట్టి

సీత బెట్టిన యెద సిరిముత్యములు లండు
రంభ బెట్టిన యేద రాజనాలే పండు
వెండితూములకింద వెల్లడము పండు
పైడి తూములక్రింద పాలరికిపండు
రాగి తూములక్రింద రాజనాలేపండు
వెండిపిడి కొడవళ్ళు వెయివేలు జేసు
పైడి పిడికొడవళ్లు పదివేలు జేసు
రాగి పిడి కొడవళ్ళు లక్షలును జేసు
కోసేటి గుబ్బలి వేసేటి ఓదె
మాచేను ముందట మారేళ్ళు గలవు
మారేళ్ళు పూపత్రి గణపతికి పూజ
మాచేను ముందట మామిళ్లు గలవు
మామిళ్ళ పూపత్రి గణపతికి పూజ.

## పొ లి గా డా

ఒలే, ఒలియా, ఒలియా, ఒలియా
రావేలుగలవాడ రారపొలిగాడ
రావేలు నీదయ్య రాశిమాదయ్య
నూర్వేలుగలవాడ రారపొలిగాడ
నూర్వేలు మీదయ్యజనూగుమాదయ్య
వెయ్యేలు గలవాడ రారపొలిగాడ
వెయ్యేలు నీదయ్య వెన్నుమాదయ్య
కోటివేల్ గలవాడ రారపొలిగాడ
పోమెనే పొలిగాడు వరగాణిబాట
వామెక్కి పొలిగాడు వాలలాడంగా

కుప్పెక్కి పొలిగాడు కూకలేయంగా
మట్టెక్కి పొలిగాడు మాటలాడంగా
జువ్వెక్కి పొలిగాడు జూదమాడంగా
పోలెక్కి పొలిగాడు బొబ్బరిల్లంగా
రాసెక్కి పొలిగాడు రంపటిల్లంగా
పొలిగాడు గొట్టంగ ఘనమాయె రాశి
పెయ్యలూ త్రొక్కంగ పెరిగెనే రాశి
ఎద్దులూ త్రొక్కంగ నెదిగె నేరాశి
కోడెలూ త్రొక్కంగ కొనసాగె రాసి
కొండవీటి కొండల్లె గొప్పాయెరాశి
మంగళాగిరి మల్లె మణిగె మారాశి
తిరుపతి కొండల్లే తేరెనే రాశి
రామలక్ష్మణు లట్లు రాసులూ గలవూ ॥పొలి॥

## గింజల రాశి ఎత్తుతూ పాడేది

అయిపోయె గౌరమ్మ అయిపోయెనమ్మ
ఆపైన గిరిమీద ఆడిరావమ్మ
మాగింజ లయి పోయె మేము పోతాము
మళ్ళొచ్చి నీపాట లెల్లపాడేము.

## కళ్ళం పాటలు

సిరి సిరి మువ్వా ! ఓహో ! సిరి సిరి మువ్వా ! ॥సి॥
చింతాకు కళ్ళదాన చింతారేకుల్లదాన
చెంతా కూకుంటేను చింతలన్నీ పోతాయె ॥సి॥

కోరంగి కురంగీ, నీలాల నీలవేణి
చిన్నారి కన్నెదానా, వన్నె చిన్నెలదానా ॥కో॥

జానెడుగొయ్యి దీసి, దోసెడునీరుబట్టి
గంగా బొండా [illegible]! గంగులూ
నా రంగడి కుచ్చుందునా ?

## గింజల బస్తాలు ఎగుమతి దిగుమతులలో పాడేవి

హైలేసో యవ్వారి యవ్వా
ఓ చూరుకాడా ॥హైలేసో॥
ఓ పిల్లదాన ,,
ఓ పెళ్ళిచేసుకుంటే ,,
ఆ పెద్దకాసుల దండ ,,
ఆ పెట్టేదె గాని ,,
ఆ చుక్కాలరయికా ,,
ఆ కుట్టించి పెడతాను ,,
నీ సన్న సన్నాని ,,
నీ నడుముకూ ,,
నే నొక్క ఒడ్డాణం ,,
నే చేయించి పెడతా ,,

హైలాసో యల్లా హైలాసో
చింతచెట్టు చిగురుచూడు
చిన్నదాని సొగసుచూడు
రావిచెట్టు చిగురుచూడు
రాజుగారి మీసంచూడు.

## ♦ పంటల ప్రాభవం

అబ్బాయి నీచేను ఏమి పండింది
[1] రాజనం పండింది లక్ష్మీ కోరింది
అమ్మాయి నీచేను ఏమి పండింది
సౌభాగ్యం పండింది సరసమాడింది
పాప కర్ములచేను ఏమి పండింది
[2] పల్లేరు పండింది [3] పదట గలిసింది

జానపదులు :- తిండిగింజలు క్రొత్తపంటరాగానే అత్తెసరు= గంజివార్చకుండా అన్నంతో యిగిరిపోవునట్లు వండేది, 2. పులగము= పప్పువేసి వండే అన్నము, వీటిలో ఏదో ఒకటివండి, గ్రామ దేవతలకు నైవేద్యం పెడతారు. ధూపదీప నైవేద్యాలు నివేదనచేసి, మంగళ హారతి నిస్తూ, యీహారతిపాట పాడుదురు.

## మంగళహారతి

పల్లవి:-అంబ జగదంబ నైవేద్యమారగించు
శంభుని రాణీ శరణంటి నమ్మా ॥అం॥

1. చ. ముజ్జగములమాత, సజ్జననేత
అబ్జగర్భాది, అమర సన్నుత ॥శం॥అం॥

---

♦ జానపదులు పుణ్యాచరణతోనూ, పాపభీతితోనూ వుంటారు. పుణ్యాత్ముల పొలాలూ మంచిపంటలు పండుతాయనియూ పాపాత్ములచేలు పాడవుతా యనియూ వారి భావన యీగేయంలో సూచించబడింది.

1. మంచిధాన్యము
2. కాయతో సహాముళ్ళుండే తుప్ప
3. బూడిద

2. చ. భక్తకల్పవల్లి! బాలా! దయజల్లి
శక్తి నొసగుమా, శర్వాణివినుమా ॥శం॥అం॥

3. చ. వెంకటశివ గురుని కింకరివరదా
వెంకట్రంగనాయకివినీవే గాదా ॥శం॥అం॥

---

# శ్రమ జీవుల సాహిత్యం

ఇందు పురుషుల పాటలు వేరు. స్త్రీలపాటలు వేరు.

పురుషులు:— బరువులుమోయుట, తరువులుమోయుట, రోడ్డు రోలరు లాగుట, బెల్లువేయుట, ఇటుకలు పెంకులు తీయుట, పడవ లాగుట మొదలగు పనులు చేస్తారు.

స్త్రీలు:— పీచు కొట్టడం, కంకర కొట్టడం. నేటికాలపు వర్జీనియా పొగాకు పనులు చేయడం, మొదలగునవి చేస్తూ వుంటారు.

కష్టపడడం శ్రమగా భావించ బడితే జగత్తులో ఏపనీ జరుగదు. శ్రమజీవుల కష్టాన్ని హరించే మంత్రం ఏదో ఒకటి వుండాలి. అదే జానపద గీతం లేక సంగీతం. హాయిగా పాటలు పాడుకుంటూ స్త్రీలూ పురుషులూ కలిసి, లేక వేర్వేరుగా పనులు చేస్తూ, వేసవి కాలపు మండు టెండలలోనూ, హోరునకురిసే వర్షాలలోనూ, శరీరం కొంకరిపోయే చలిలోనూ, నవ్వు మొగాలతో, ఆనందోత్సాహాలతో, కొండలను కూడా పిండి కొట్టేయడం మనం చూస్తూనేవుంటాము_ ఇది నిజంగా చిత్రమే; మహా కష్టమైన కార్యాల్ని మన శ్రామిక జనాళి నవ్వుతూ, త్రుళ్లుతూ, చేస్తూన్నారంటే దానికీలకం జానపద సాహిత్యమూ. ఆసాహిత్యంలోని బీజాక్షరాలూను, ఈపాటలు వారు వారు చేసేపనుల ననుసరించి లయను యేర్పరచుకొంటూ వుంటాయి. ఆలయతో జరిగే ఆపనులు ఆనందహేలగా, మధురిమలీలగా వుంటాయి.

సాధారణంగా ఆగేయాలలో ప్రేమగీతాలు హెచ్చు. వాటి అర్థం బాహ్యానికి మోటుగా పాటకపు భాషలో నుండి నప్పటికీ; వాటిలోని భావాలు ఏదో అనిర్వచనీయమగు ఆత్మానందాన్నిస్తూ, ఏదో అదృశ్య దేవతమనకు వారిముఖతా వినిపిస్తూ వున్న ప్రేమగీతాలవలె తోస్తూ వుంటుంది.

పురుషులు పాడేవి

దరువులు వేస్తూ పాడేవి

## చెంగు - కొంగు

ఓ చిన్నదానా విడువనే చెంగు
ఓ చిన్నదానా వదలనే కొంగు ॥ఓ॥
బందారు చిన్నదాన బాజాబందుల దాన
బాజాబందుల మీాద మోజేలలేదే ॥ఓ॥
గుంటూరు చిన్నదాన గుల్లపేరుల దాన ॥ఓ॥
గుల్లా పేరులమీాద కల్లూపోలేదే ॥ఓ॥
కాకినాడ చిన్నదాన కాసుల కంటెలదాన
కాసుల కంటెల మీాద కాంక్షేలలేదే ॥ఓ॥
అర్థరూపాయి బెట్టి, అద్దాలరయిక కొంటే
అద్దాల రయికమీాద బుద్ధేలలేదే ॥ఓ॥
నల్లానల్లనిదాన నడుమూ సన్ననిదాన
తళుకూ సేపలమల్లె కులుకూ సూపులదాన
నిన్నూ సూసే మనసు నిలువకున్నదోలె ॥ఓ॥

## నన్నుచూచి నవ్వింది

పూవూ లెట్టిందిరోయ్ పూవులెట్టిందిరోయ్
పూవులకోకమీాద పునుగుపూసిందిరోయ్
బొట్టుపెట్టిందిరోయ్ బొట్టుపెట్టిందిరోయ్
బొట్టులాంటి అడ్డ బాసా పెట్టిందిరోయ్
నన్నూచూసింది రోయ్ నన్నూ చూసిందిరోయ్
నన్నూ చూసినంత నవ్వే లేసిందిరోయ్

## సోకులు

గూడూరు చిన్నదాన, గూడూరు గుట్టాలదాన
గూడూరు గుట్టలమీాద గుళ్ల పేరుసోకె ఓ చిన్నదాన
సీలీసీలాటిదాన నిలువు సన్నాటి దాన
సీలీ సీలాము మీాద నగలుంచె సోకె ,,
సన్న సన్నిదాన సన్నాని కురులదాన
సన్నాని కురులమీాద జాజి గుత్తిసోకె ,,

## చక్కాని గుంటా

చక్కాని గుంటా ! సరసను కూచుంటా
ఏ తంట లేకపోతే నామెంట రామె ||చ||
సిత్రం చూపెడతా నేతీమిఠాయి కొనిపెడతా
ఏ తంట లేకపోతే నామెంటరామె ,,

## నిరబండి

నిరనిర నిరబండి, నిరనిర నిరబండి
బారకొమ్ములగేదె, బాడవలోకొచ్చింది
నాగేదె మాదొంగ, నాగూరెదొంగ ||ని||
తాలూకుతలగుడ్డ, గోంగూరగోచిగుడ్డ
యీాబిలోయిటికాము, యీాయంకుడిల్లే ,,
ఎర్రయెర్రనిదాన, ఎత్తూపిల్లలదాన
నాయన్నమాదొంగ, నాగూరెదొంగ ,,
నిన్నురమ్మన్నాది, నన్నురమ్మన్నాది
యిద్దరినీ రమ్మనీ, నిద్దరోతుందో ,,

గంగీగళ్ల పట్టెడెక్కడిదే!
గుండెలుతీసినగుల్లా, నీగుత్తినిండాగాజులే?
ఓ, ఓ, ఓ, దానికొొప్పులోనే, గుప్పెడుసూదులున్నాయి!
బాగాచూడరబ్బాయి, భాగ్యవంతుల కుర్రోడా!
ఆ, ఆ ఆ దానికళ్లల్లోనే। కలువరేకులున్నాయిరా!
నిన్నురమ్మన్నాది। నన్నురమ్మన్నాది
యిద్దరిని రమ్మనీ। నిద్దరోతుందో
నిరానిరా నిరబండి

## ఇద్దరికీ జోడుచూడు

ప॥ ధూళి ధూళి ధూళి తందాన
నాయన్నలాలి ధూళికీబాగాలువెయ్యన్న ॥ధూ॥

1. దుమ్ముజూడూ దూలిజూడూ
దున్నపోతు బారుజూడూ
పోట్లచెరువు కట్టమీాదా
పోట్టిలంజల బారుజూడు ,,

2. చింతజూడు చిగురుజూడూ
చిన్నదాని వలపుజూడూ
అద్దములో నీడజూడూ
యిద్దరికీజోడుజూడూ ,,

## బేరిమోత

### కలప బరువు మోస్తూపాడేవి

ఓ అరిజెల్ల; బేరిమోత
ఓ నల్లనేలల? దున్నదలచేరా

మ్రొక్కబోతే ; ఓదయ్యమైరా
పట్టినాదిరా ; ఓ మానయుంబరా
గాలిమోతరా ; ఓ గాలిమోతరా
ధూళిమోతరా ; ఓ ధూళిమోతరా
ఓరేమి రన్నయా ; ఉసారులేదురా
ఓరాగిడబ్బురా ; ఈడుముంతరా
ఓబొట్టుపెట్టిరా ; బొమ్మచూడరా
ఓమిద్దెమీదరా ; మిరపచెట్టురా
ఓకాయచూడరా ; నీలులేవురా
పాలులేవురా ; ఓకూకున్నాదిరా
కుర్రకుంకరా ; ఓబిర్రబిగిసెరా
ఓ మేదరోడురా ; దానెంపతెల్లెరా
ఓకుంచమంతరా ; ఓగుడిసెలోనురా
ఓమానికంతరా ; ఓరోలుతోసెరా
ఓ అరిజెల్ల ; బేరిమోత
ఓ నల్లనేలల ; దున్నదలచేరా

## యేపచెట్టు సిగురు

యేలేయాలా యేలేయాలా
రావిచెట్టూ రంగు సూడూ
రాజుగారి మీసంసూడూ
యేపచెట్టు సిగురు సూడూ
మొరకల్దాని వయసు సూడు

## బరువుగా యెత్తరా!

యేలో౽యాలా యేలో౽యాలా
యెంతబరువున్నదిరా ॥యే॥
యెత్తరా అన్న ,,
యేమి సరకురఅన్న ,,
బరువు సరకురఅన్న ,,
మంచి సరకురఅన్న
బాగుగా నున్నది ,,
బరువుగా యెత్తరా! ,,

## నూగునూగు మీసగాళ్లు

జాలిబొంబైలే - జాలిరా ఓ బేరిజెల్ల
,, అన్నలార! తమ్ములార!
,, అందమైన శూరులార!
,, సూరుమోత బేరిమోత
,, నూగునూగు మీసగాళ్లు
,, నూటికొక్క కాపుబిడ్డ
,, జోరుతో జొన్నాడదాటి
,, బారుతో బందారుదాటి
,, జాలిరా ఓ బేరిజెల్ల

## నా మ న సు

ఐసా; ఐసా; ఐసా;
వేలూరెల్లిందొక చిలుక దాని
ఎఱ్ఱకోకమీద నామనసు ॥ఐసా॥

ఒంగోలెళ్లిందోక చిలుక దాని
వాలుకొప్పు మీద నామనసు ||ఐసా||
ముమునూరెళ్లిందోక చిలుక దాని
ముక్కు సత్తుమీద నామనసు ,,
కాకినాడెళ్లిందోక చిలుక దాని
కాటుక్కంటిమీద నామనసు ,,
రంగూనెళ్లిందోక చిలుక దాని
రవిక సొంపుమీద నామనసు ,,

## రోసంలేదు - మీసంలేదు

జంబయిలే జోరులంగరు
అవుర అవుర మనోళ్లబ్బాయి ||జం||
నీకు బారులేదు జోరులేదు ,,
నీకు రోసంలేదు మీసంలేదు ,,
నాచల్లనీళ్లు మల్లిమొగ్గ ,,
నా ఉడుకునీళ్లు ఉల్లిపువ్వు ,,
కడవమీద కడవబెట్టి ,,
కాకినాడ రేవు కెళ్లితే ,,
కాకినాడ కలక తేరు ,,
కడవదింపి కౌగలించె ,,
బిందిమీద బిందిబెట్టి ,,
భీముడు పట్నం రేవుకెళ్లితే ,,
భీముడు పట్నం కలకతేరు ,,
బింది దింపి ప్రియములాడె ,,
ముంతమీద ముంతబెట్టి ,,

కళింగ పట్నం రేవుకెళ్ళితే ||ఝం||

కళింగ పట్నం కలకటేరు ,,

ముంతదింపి ముద్దులాడె ,,

ఎవరో? ఎవరో? మనోళ్ళబ్బి ,,

## కావిళ్లతో బరువుమోస్తు బృందగానం చేస్తూ పాడేవి

జంబైలో షోకుల లంగరి ||జం||

చిన్నదాన్ని ముచ్చట చూడు ,,

కళ్లనిండ కాటుక చూడు ,,

వాలుజడల చిన్న దాన ,,

ఎల్లిపోయే చిన్నదాన ,,

లాగినోడే లాలు కాడు ,,

లాగనోడే లంజకాడు ,,

## వుండదేరా ముండమనసు

జాలిమాము లేలే జాలిమా మోబోడ్జెల్ల ||జా||

చింతచెట్టు చిగురు చూడు

చిన్నదాని సొగసు చూడు ,,

రా ఝుచెట్టు రంగు చూడు ,,

రాజుగారి మీసం చూడు ,,

కాకినాడ రేవులోన ,,

జోడుకొయ్యల వోడవచ్చె ,,

ఓడమీద చిన్న వాడ

వేళ్లనిండా వుంగరాలు ,,

వుంగరాల సెయ్యి చూచి

వుండ దేర ముండమనసు ,,

## నేను రానా ?

జంబై లేలో జోతులంగరు
అన్నలారా తమ్ముళ్లారా ! ||జం||
జోడు గుళ్లా యీదిలోనా
జోరు సేసీ పలుకరన్నా ,,
మిద్దెమీదా మిరపా చెట్టు
నీళ్లు లేకా సోలిపోయే ,,
అంతరాలా పడవమీద
అంది పూలు కొయ్యబోతే ,,
రాలిపూలూ రంగ మెల్లి
భళ్లు భళ్లున తెల్ల వారె ,,
రంగ మంతా భంగపుచ్చె
మంచినీళ్ల బాయి కాడ ,,
పుట్ట మీద పాల పిట్టా
కొట్ట బోతే తేలు కుట్టె ,,
బావగారు మంత రించి
భళ్లు భళ్లున తెల్లవారె ,,
పెద్దచెరువూ గట్టుమీద
ఎద్దు మేపే చిన్న వాడ ,,
ఎడ్ల కేసే పాలి కేకా
నాకు ఏస్తే నేను రానా ? ,,

## ఓ చిన్న దానా?

గుంటూరు చిన్నదానా! గుబురు కేశాలదానా!
గుబురు కేశలమీద గొబ్బిపూలుసోకే ||ఓ||
పుచ్వాడ చిన్న దానా! పువ్వ్వాల జడదానా!
పువ్వ్వాల జడమీద మనసెంతనీకే ,,
రంగాము పోయినేను రంగైన రయిక తెస్తే
రంగైన రయికమీద మనసేలలేదే? ,,

## దిమ్మిశా వేస్తూ పాడేపదం

### ఎట్టాపోనిత్తురా

కందిరీగ నడుముదాన్ని; ఎట్టాపోనిత్తురా!
వాలుచూపు కళ్లదాన్ని; ఎట్టాపోనిత్తురా!
పికిలిపిట్ట గొంతుదాన్ని; ఎట్టాపోనిత్తురా!
చింతపువ్వ రంగుదాన్ని; ఎట్టాపోనిత్తురా!
అట్టా టిట్టాటి దాన్ని; ఎట్టాపోనిత్తురా!

## ఇటుకల అందిస్తూ పాడే గేయం

### ఇంటపుట్టిన యెద్దుల్లాగ

ఎయ్‌రా సినోన్నెయిరా
ఎయ్‌రా జోరుగెయిరా
దిక్కులు చూడకపక్కలొంచి

మక్కువతో పనిచెయ్‌రా
ఎయ్‌రా సిన్నోడెయిరా
ఇంటపుట్టిన యెద్దుల్లాగ
మొద్దుకింద వుండకుర
ఎయ్‌రా నీజోరుగాల ॥ఎ॥

## బెల్లుతీస్తూ పాడేది

బెడ్డతియ్యొనడ్డిపిల్ల, గట్టువెయ్యి చక్కగాను
గునపమేస్తాకాచుకోయె, గుడ్డిదాన నడ్డిపిల్ల ॥బె॥
బెడ్డకుముంతెడు నీళ్లు తాగీ, ముచ్చటగాబెల్లుతియ్యి
పారతోటిపనికిరాదు, బెల్లుతియ్యిచేతితోను ,,
చెయ్యితియ్యొచెంచుపిల్ల, గునపమేస్తాజాగ్రత్త
బెల్లుతీస్తే పొలములన్నీ, గుల్లలయ్యి పంటపండు ,,
పంటపండి గాదెనిండు, పొదుపుగాను పొట్టనిండు
పాడుచెయ్యకుపచ్చగడ్డి పోగుచెయ్యిపొదుపుగాను
పోగుబెట్టిమోపుగట్టి; అమ్ముకోయెనడ్డిపిల్ల ,,

## మగ్గంనేస్తూపాడే వేదాంతం పాట

ప॥ అగ్గువాయెరాముక్తి । అగ్గువాయెరాయిట్లు
మగ్గాముబట్టకునేత । మరిగినేసేవారికెల్ల ॥అ॥

1. చ:- వేదాంతసార మిది । వెలసిపడుదుదడపాలె
సాదాంతమనియేటికుంచెతో । సరిచెయ్యవలె ,,

2. చ:- నాదుబిందుకళలమంచి । నాటకాననచ్చువలె
పాదుకున్నాప్రణవరవము । ప్రబల నేసేవారికెల్ల ,,

3. చ:-గంటనాదం యిమడించి । గజ్జలుపల్లాకుగట్టి
ఒంటిస్తంభంమేడలోపల । ఒనరనేసేవారికెల్ల ॥అ॥
4. చ:-నగవులతిమ్మప్పగురుని । నమ్మిమడతవేయవలె
తగచెలిమిఒక్కాటిజేసి । దట్టించేవారికెల్ల ,,

## పడవ పదాలు

లంగరును నీటిలోనుంచి బయటికి లాగినప్పుడు పాడేది

### ఆగాయిస్తే

తూరుపునమెయిలుబట్టె, తుమ్మలమ్మచెరువునిండె
బంకజెల్లలుబయలపడే, జెల్లనిస్తా గిల్లనియ్యి
చేపనిస్తాచేరనియ్యి, చెరువులోనిచేపలన్ని
చెదరిపోయె పిల్లచూచి జెల్లవిస్తాగిల్లనియ్యి
పావలిస్తాపారిపోకు, బేడయిస్తాబెదరిపోకు
అణాయిస్తాఅదరిపోకు, అదిమిముద్దుపెడతానీకు

పడవనులాగేపాటప్పుడు పాడేది

### వగలాడిమాటలు

చిన్నదాన ఓచిన్నదాన, వగలాడిమాటలే ఓచిన్నదాన
గుంటూరుచిన్నదాన గుళ్లపేరులదాన
గుళ్లపేరులమీద గుణమేలలేదే ॥ఓచి॥
బందారు చిన్నదాన బాజీబందులదాన
బాజీబొందులమీద బ్రాంతేలలేదే ,,
కాకినాడచిన్నదాన కాసులపేరులదాన
కాసులుపేరులమీద కాంచేలలేదే ,,

## అందమైన శూరులారా !

జోరులో జొన్నాడ దాటి
బారులో బందారుదాటి
ఓ లాగరా లాగర నాయన
ఓ నిమ్మచెట్టుకి నిచ్చెనేసి
నిమ్మపళ్లు కొయ్యాపోతే
నిమ్మముల్లు రొమ్మునాటె
ఓ అన్నలారా! తమ్ములారా !
ఓ అందమైన శూరులారా !

## నోటిలోన పచ్చిమిరపపాలు

ఓ అన్నలారా! తమ్ములారా !
ఓ అందమైన శూరులార !
పట్టండీ పట్టండిజాన
ఓ పట్టనోడి నోటిలోన
పచ్చిమిరప పాలుపొయ్యి
ఓ దిబ్బమీద దీపమెట్టి
దేముడానీ మొక్కబోతే
దయ్యమాయి తరమబోయె
ఓపలకండ్ర పలకండ్రజాన
ఓమడత మేన చిఱుత కట్టి
కంచు మ్రోగు కనుము మ్రోగు

కట్టకాదు మూరుడన్న
జానకొొకటి బారకొొకటి
ఆపట్టండి పట్టండిజాన

## లాగరోరి లంగరుత్రాడు

హైలాసో హావ్వారి హావ్వ
లాగరోరి లంగరు త్రాడు ||హై||
పీకరోరి పిల్లజుత్తు ,,
లాగరోరి లంగరుత్రాడు ,,
మూడునెల్లా ముండలపోరు ,,
ఆరునెల్లా అనుభవించు ,,
ఎక్కరానీ పడవమీద ,,
ఎంచరాని దుఃఖమొచ్చె ,,
యేళ్లనిండా వుంగరాలు ,,
వుంగరాల సెయ్యిచూచి ,,
వుండదేర ముండమనసు ,,
హైలేసో హావ్వారి యవ్వ ,,
హైలేసో హైలాసా ,,
జానాకొొక్కా ,,
బారాకొొక్కా ,,
పట్టండి గట్టి ,,
బండాడి పేరు ,,
భద్రాద్రదిగో ,,
హనుమంతు డన్న ,,
పట్టండి జాన ,,

గట్టీ పట్టీ హైసాలో ॥హై॥
పట్టిన వోడూ ,,
గట్టీ వోడూ ,,
పట్టనివోడూ ,,
చెడ్డవోడూ ,,

### తెడ్లు వేస్తూ పాడేది

### ఏనాభీ

అంతరాలపడవ మీద — హైసా
అంది పువ్వులు కొయ్య బోతే - ఏనాభీ!
అందిపువ్వులు కొయ్య బోతే — హైసా!
కొమ్మదూగే కొప్పునిండె - ఏనాభీ
లేనిపోని రవ్వలొచ్చా — హైసా!

### పెళ్లి చేసుకుంటే

హైలేసో యల్లా హైలేసో
ఓచూరుకాడా ,,
ఓచిన్నదాన ,,
ఓపెళ్లి చేసుకుంటే ,,
ఆ పెద్దకాసుల పేరు ,,
ఆ పెట్టి దేగాని ,,
ఆ చుక్కాల రయికా ,,
ఆ కుట్టించి పెడతాను ,,
ఆ చుట్టు చెంగావిచీరె ,,
ఆ తెచ్చి యిస్తాను ,,
నీ సన్న సన్నాని ,,

| | |
|---|---|
| నీ నడుముకూ | హైలేసా |
| ఆ మువ్వ ఒడ్డాణం | ,, |
| నే చేయించి పెడతాను | ,, |
| నీ హద్దుపద్దుల్లో | ,, |
| నే అణగి వుంటాను | ,, |
| హై లేసో యల్లా హైలోసో | ,, |

## కన్నుగీటె

| | |
|---|---|
| ఏలియాలా | ఏలియాలా |
| ఏలియాలా | ఏలియాలా |
| ఐలాసా | జోరుసెయ్యి |
| ఐలేసా | బారుసెయ్యి |

| | |
|---|---|
| అయిల పట్టు | హైలేసా |
| బల్ల కట్టు | ,, |
| అద్దిర బాబు | ,, |
| అక్కడ పట్టు | ,, |
| సాప చుట్టి | ,, |
| సంక బెట్టు | ,, |
| సందమామ | ,, |
| అందముగా | ,, |
| సన్నజాజి | ,, |
| సీర కట్టి | ,, |
| పొన్న పూలు | ,, |
| అహా కొప్పు పెట్టి | ,, |
| సిన్న దొచ్చి | ,, |
| కన్ను గీటు | ,, |

## గడలు వేస్తూ పాడేవి

### సిరి తాళం వేసుకొంటా

ఐలాసో ఎయిరా ఐలాసో
లంగరెత్తి ఏటిలో, త
రంగాలను చీల్చుకొంటూ
చెంగు చెంగున మనపడవ
టింగురంగా యంచుపోవ ॥ఐ॥

అలసట మరిపింపంగ
పదా లాడంగ గొంతెత్తి
పడతుల్లోని సాములెల్ల
పదము లాలకించి మురియ ॥ఐ॥

గంగమ్మకు గోదావరికి
కావేరికి కృష్ణమ్మకు
చేతులెత్తి మ్రొక్కులెట్టి ॥ఐ॥

వేయర సుక్కాని సూటి
వెడ వెడ గడల తోయర
మధ్య కట్ట నూదుకొందు
రివ్వున త్రాడు లాగర ॥ఐ॥

సుడిగుండా లన్ని దాటి
చుట్టుగాలివానదాటి
ఒడిదుడుకు ల్లేక రేవు
కడకు నడవ పడవ తొయ్యి ॥ఐ॥

## తెడ్లు వేస్తూ పాడేది
## కన్న తల్లులు

హైలేసా —

గంగమ్మ గౌరమ్మ — హైలేసా
దండాలు తల్లు... — ,,
కొలుపులు తల్లులకు — ,,
కొండల్లో తల్లులకు — ,,
దిగి రండి తల్లులూ — ,,
దండాలు యివిగోను — ,,
దండాలు గంగమ్మ — ,,
దండాలు గౌరమ్మ — ,,
కళ్ళు కనిపెట్టండి — ,,
మాకన్న తల్లులూ — ,,

## పడవను మరామత్తుకు మెరకకులాగేటప్పుడు పాడేది

దంబయి రేచోడి దెలంగరు, దంబయి రేచోడి దెలంగరు
లాగులాగు పడవలాగు, లాగినోడే రాజుగారు,
లాగనోడే నల్లరాయి; రోసమేల లేదురోరి;
మీసమేల లేదురోరి; మీసముంటే మిరపకాయ
లేకపోతే దొండకాయ, కాయలుంటే కూరబాబు
లేకపోతే ఊరగాయ ||దం||

## చేపలుపట్టేడప్పుడు పాడేది

గంతులేసే గండుమీన, పరుగులెత్తే పండుగొప్ప,
వాలలాడే వాల్గుచేప, ఒరిగియెగిరే ఒంజిపిల్ల,
రోసమేల రొయ్యపిల్ల, కపటమేలా కట్టచేప,

మిట్టిపడెడిమట్టగిడస, చూపులేలాచుక్కపరిగి
కోపమేలాకొఱ్ఱమీన, బోగమేలబొచ్చపరిగి
చేతగానిచేదుపరిగి, వారిగివారిగేవడ్లముక్కు
బిగువులేలబిళ్లమోసు, మోసంచేసేమోసుపిల్ల
నసుగులాడేయిసుకదొందు, బెదిరిమొగిరేబేడిసపిల్ల
రండి, రండి, నావలల్లోపడండి,

## చెపలను దులుపునప్పుడు పాడేపాట

ధులపరా! వల, దులపరా! వల,
దులుపు దులుపు గవరయ్యా దులపరా వల ॥దు॥

కట్టెచేపలన్నీ కారిపోతున్నాయి
బేడిసిపరిగెలు బెదిరిపోతున్నాయి
చేదుపరిగెలన్నీ చెదిరిపోతున్నాయి
మట్టగిడసలన్ని కొట్టుకొంటున్నాయి ,,

పండుగొప్పలన్ని పారాడుతున్నాయి.
గండుమీనులన్ని గంతులేస్తున్నాయి
వాంజపిల్లలన్ని వారిగిపోతున్నాయి
ముక్కుజెల్లలన్ని మూలుగుతున్నాయి ,,

చెంగునమొగిరేటి చేపల్ని పట్టుకొని
బుంగలోవేసుకొని బంగమేమిచేయకుండ
అంగడికి పట్టుకెళ్లి అమ్మరోరిగవరయ్యా ,,

## స్త్రీలపదాలు

### స్త్రీలు పీచుగాని, కంకరగాని కొడుతూ పాడేవి

శుక్రవారం సంతలోన బావయ్యో! బావయ్య!
చుట్లుమీద తొక్కినావు ,,
నువ్వు తొక్కినందు కేడలేదు ,,
నీకాలు బాద కేడ్సాను ,,
ఆదివారం సంతలోన ,,
అంది అంది గుద్దినావు ,,
నువ్వు గుద్దినందుకు కేడలేదు ,,
నీగుతి నొప్పి కేడ్సేను ,,
బుధవారం సంతలోన ,,
బుగ్గలట్టుకు కరిసేవు ,,
నువ్వు కరిసినందు కేడలేదు ,,
నీపంటిబాద కేడ్సేను ,,

### మొగమాటి పడకాను

చినోడ, చినోడ, మేనత్త కొడుకా !
కన్నెత్తి చూడరా ! చినోడ ॥చి॥
కాగలీ యీయరా ! ,,
పున్నమా చంద్రుడూ ! ,,
నీ మొగము బోలురా ! ,,
ఎన్నాళ్ళు నుంచోను ,,
నీ మీద ఆశగా ,,
ఆడబిడ్డా నాకు ,,

అడ్డము వుందిరా ! ॥చి॥
మాయింటి కాడికీ ,,
రాత్రుల్లు రావోరె ,,
మొగుడు వుండడు రేపు ,,
మొగమాట పడకాను ,,
మురిపంగా రావయ్యా ,,

## ఒయ్యారిమొగడా !

ఓరి మొగడా
ఒయ్యారి మొగడా
నాయేలిపడ్డ
పాటుచూడు ఓరి మొగడా
నీవు దయగల
మొగుడువైతే
నేను చిత్రమైన
చీరగట్టి ,,
నేను రత్న మయిన
రయిక తొడిగి
కాలు కెల్లుకు
కమత లాగున్నాను ,,
బొట్టెట్టుకు
బొమ్మ లాగున్నాను ,,
నే గజ్జిలా
కొడవలుచ్చుకొని
నేగుంటూరు చేలోకి

నేవరి కోతకెళ్లాను ఓరి మొగడా.
న న్నెంద్రకాయ
కరిచింది
నీవు ప్రేమగల
మొగుడ వై తే ,,
నీవు డాఎరు
మందెయ్యించు ,,
నీవు ప్రేమగల
మొగుడ వై తే ,,
సరసమైన
మొగు డవై తే ,,
నాకు సంది మంత్ర
మేయించు ,,
ఓరి మొగడా
ఒయ్యారి మొగడా
నాయేలి పడ్డ
పాటు చూడు
ఓరి మొగడా ,,

## జేడకి దానికొప్పుబేరమయింది

నీలాంటికోయమామ, మాలాంటి దేశ మొస్తె
ఉట్టిమీద బెట్టి వూరేగించేస్తాము .

రాయి రాయి కాగితము॥

ఆడాడి పుణ్యాన్ని అబ్బాయిపుడి తేను
కోయరాజు పేరుపెట్టుకొండి ॥రా॥

పడీలు సీడీలు యెక్కువై కొందరు
ఎనక సక్కరాలు యెంటబడ్డాయి ॥ రా॥
దమ్మిడీ కూలోళ్లు దగుల్బాజీగుత్తోళ్లు
గొప్పకు రమ్మంటేను, కొప్పులుదిప్పేరు
ఇంటిలో తలదువ్వి, యీదిలో కొస్తేను
బేడకి దానికొప్పు బేరమయింద ,,

## రెక్కలేని పక్షి

ఆకుచిన్నా అడవిలోనా
నాకుచిన్నా దండదారికే
దండపేరు కట్లదండేగా, ఓకోంటెగాడా!
దండసొగసూ చూడగావలెరా
చిన్నచిన్నా పువులుకోసి
చిన్నదానీ కొప్పుముడిచి
చల్లనేలల నన్నుదలచేరా ॥ఓ॥
కొప్పుసొగసు చూడగావలెరా
భద్రగిరీ కోనలోనూ
చిత్రమయిన దండ దారికే
చిత్రమయిన బొమ్మమీదానూ ,,
చిలిపిమనసు చిందులాడేరా
కానరాని అడవిలోనా
విత్తులేకా చెట్టుపుట్టె
కొమ్మలేని చెట్టుమీదనూ
రెక్కలేని పక్షిపుట్టేరా ,,

## కులికిపోవోయి

సిపాయిబావా! సిరికన్నెసీ
మరలీపోనావా, ||సి||

ఆనాడునీవెట్టావ్ అందమైనదుద్దులూ
లోలకులూ, అవి సెక్కిళ్లపై జారి
సల్లగూగుతుంటేను జల్లూజల్లునఒళ్లు
సెమ్మగిల్లిందోయీ! కల్లగాదోయీ ,,

ఆనాడునీవేసినమొలక, ఈనాడు పెద్దదాయె
పువ్వుపూసికాయ కాసిందోయి
కాసినకాయను, కన్నారచూచి
కలికిసంతోషాన, కులికిపోవోయి ,,

## రంగన్నబావా

కొండవలీమొలనుంచి, కోతచాలించి
రావోయిబేబేగె, రంగన్నబావా ||కొ||

తలమీదకొచ్చాడు, తండ్రిసూరీడు
యిలలోనజనులెల్ల యిసిగిపోనారు ,,

మొకమెల్లకప్పింది ముత్తెలసెమటా
ఒళ్లెల్లవాసినాడి కందిపోనాది ,,

బంగారునీమోము బయసిపోనాది
ఎదరొమ్ముకందింది, యెర్రినాబావ ,,

సెలయేటిలోమునిగి సెమటకడిగేసి
సరసనూకూకోని సల్లారగించూ ,,

## గుంటడుపుట్టాడు

నిరానిరానిర బండి, నిలుపర బండోడా ॥ని॥

అల్లుడొత్తాడాని, అత్తతొంగిచూస్తుంటె
మీసంగీటుకోని, మీదపడ్డాడో ॥ని॥

దమ్మిడీయిచ్చి నేను, తాటిపండుకొనుక్కుంటె
పేశముతనదాని, పిరియాదుకెళ్ళాడో ॥ని॥

గురువులు నేనూనూ, గరువులమీద కెల్తుంటె
గురువులు కాలూతగిలి, గుంటపుట్టాడో ॥ని॥

## దొర పోగాక!

పల్లవి :- ఎంత జేస్తివె దొరపోగాక
నీవెంత జేస్తివె దొరపుగాక

అ. ప॥ అమ్మ నిన్ను నమ్మినవారు
ఆస్తి పాస్తులు పెంచేరు ॥ఎం॥

1 ఒక్కొక్క బ్యారెను । వరుసతో గట్టించి
వరిపూడ్చుట మానినారు । జొన్న చల్లుటమానినారు !
పశువులకు మేత లేక । పస్తులతో అల్లాడిన ।
పొలములన్ని నీకొరకు । పురమాయించేరు దొరలు ॥ఎం॥

2 సీమ దేశాన బుట్టి । మా దేశమొచ్చినావు ।
ఉత్తరభూములందు । ఉదయమయినావు ।
దక్షిణభూములకొచ్చి । ధన్యుల నుము చేసినావు ।
నీమహిమవర్ణింప । యిలనెవరితరమమ్మ ॥ఎం॥

3 కొన్నాళ్లుపరుచూరిలో । కొన్నాళ్లుగుంటూరిలో
చివరకువచ్చేవు । చీరాల పేరాల
బిదసాదలనెల్ల । ప్రేమతో పోషించి
రైతులనురాజులుగ । రాణింపజేసేవు ॥ఎం॥

## వేరుసెనగమ్మ!

గంపెడు పిల్లలతో । వేరుసెనగమ్మ
నీవుభూమిలో నపుట్టేవే । వేరు సెనగమ్మ ॥౧౦॥
చిన్నోళ్లు పెద్దోళ్లు ,,
నిన్ను వేలెట్టి కదిపేరే ,,
పెద్దపెద్ద రైతులకు ,,
నువ్వుపెంకు చేతికిచ్చావే ,,
పుట్టింది బొంబాయి ,,
నీకెగుమతి కాకినాడ ,,
కాకినాడ బుడంపేట ,,
బంగారు పేటఅయ్యిందే ,,
తూరు పోళ్లందరికీ ,,
నువ్వు తీగెనాను లిచ్చావె ,,
రెడ్డి పోళ్లునిన్ను ,,
బుజాన యేసిమోసేరే ,,
జాతోడు నిన్నుచాల ,,
ఎత్తుకొని ముద్దులాడు ,,
ఎక్కడ చూచిననీమహిమే ,,
యింతగా పాకి పోయిందే ,,

(శ్రామికులు పనులుచేస్తూ ఉజ్జీలుగా పాడేవి

## కొయ్యోడు - చిట్టెమ్మపాట

చుక్కలకోకా కట్టుకొని
చుట్టూగోడు రై కాతొడిగి
బుర్రనున్నగ దువ్వూకోని

బొట్టూ కాటుక బెట్టుకోని
నోటికి చుట్టా పెట్టూకోని
గోటుగాను నడుచు కొంటూ
ఎక్కడి కెల్తావు చిట్టెమ్మగారు ?

ఆ — పెద్దాపురం మెరకలమీదికి
పుల్లల కెడ్తను కొయ్యోడో !
రయ్యో కొయ్యోడా !
ఓరయ్యో కొయ్యోడా !

కఱ్ఱచేత పట్టుకోని
కిఱ్ఱుచెప్పులు తొడుక్కొని
కాయపంచలు కట్టుకోని
వక్కలాకులు వేసుకొని
ఎక్కడి కెల్తావు కొయ్యోడంటే ?

ఆ — పోలేరమ్మా దిబ్బలమీదికి
పొగాకు కెల్తిని చిట్టమ్మా
ఓలమ్మా చిట్టమ్మా

చీటికిమాటికి చిట్టెమ్మంటా
చిట్టెమ్మున్నా యీదిలోనూ
చినబాబుంటడు పెదబాబుంటడు
కాపులుంటరు కరణాలుంటరు

చిట్టమ్మని పిలువకురో
ఓరయ్యో కొయ్యోడ

నువ్వు చిడతదెబ్బలు తింటవురోరయ్యో కొయ్యోడ
కొయ్యోడు కొయ్యోడంటా నీవు

కుయ్యాబోకే చిట్టమ్మా లమ్మా చిట్టమ్మా
నువ్వు కొరడాదెబ్బలు తింటావే లమ్మా చిట్టమ్మా
కురసా కురసా ముక్కాలిపీట
నే కుందన్నాయుడి కూతుర్నో
రయ్యో కొయ్యోడ॥
అబ్బో అబ్బో ఆలాగైతే
కురసా కురసా ముక్కాలిపీట
కుందన్నాయుడి కూతురివా ? లమ్మా చిట్టెమ్మా
నువ్వు కుందన్నాయుడి కూతురివైతే
నేను మద్దెప్పయ్య మనమణ్ణే లమ్మా చిట్టెమ్మా
చిలుకలూరి కల్లుతాగి
పలకలు గూర్చిన బండియెక్కి
బందరుపట్నం పోదామా
లమ్మా చిట్టమ్మా మనం బందరు పారిపోదామా
లమ్మా చిట్టమ్మా
పెద్దాపురం నడియీధిలో
పెద్దలుంటరు పిన్నలుంటరు
నువ్వు చిట్టమ్మాని పిలవకురో
రయ్యో కొయ్యోడ
నువ్వు చిట్టమ్మాని పిలిస్తేని
చిడతా దెబ్బలు తింటవురో
రయ్యో కొయ్యోడా
అబ్బో, అబ్బో ఆలాగైతే
కొయ్యోడంటా కుయ్యాబోకే

చిట్టమ్మో లమ్మో చిట్టమ్మో
కొయ్యాడంటా పిలిస్తేని
నువ్వు కొరడా దెబ్బలు తింటావే
లమ్మో చిట్టమ్మో
మల్లి మల్లి నాటాడితే
మడమ తాపులు తింటావే
లమ్మో చిట్టమ్మో

కలిగినకంట్లో కాటుక బెడితే
కన్ను మెరమెర లాడేరోరయ్యో కొయ్యోడా
దాని మరిగిన మొగుడు పొరుగున వుంటే
మనసు మెరమెర లాడేరోరయ్యో కొయ్యోడు ,,

చిట్టెమ్మెక్కిన తొక్కుడుబండి
కొయ్యోడెక్కిన రబ్బరు బండి
చీపురుపల్లి స్టేషన్ కాడ
చీలాజారిపోయెనురోరయ్యో కొయ్యోడ ,,

ఓరింట్లో తిండికి లేకపోతే పోయె
బయటా బడాయి కొట్టకురోరయ్యో కొయ్యోడ ! ,,
కొయ్యోడ, కొయ్యోడ, బండంటా
వాడి బండికి బస్తాలు లేవంటా
వాడి కొడుకే మట్టిబెడ్డంటా

* జానపదులు. వారివారి ప్రాంతాలలో, ఒక గేయాన్నే రకరకాలుగా పాడుతూవుంటారు. కొన్ని చరణాలు విరుగుతాయి. కొన్ని తరుగుతాయి. కొన్ని పెరుగుతాయి, లయకూడా మారుతుంది.

వాడి పెళ్ళాం  సూరకత్తంటా
ఆ గుంటకు నీకు తగునంట్రోరయ్యో కొయ్యోడ ,,
అందము చందములేని మొగుడు
వాడు సందేహుంటే యెందుకురోరయ్యో కొయ్యోడ
ఎదిగిన పిల్లను యింట్లో బెట్టి
బయటా మంచము వెయ్యకు రోరయ్యో కొయ్యోడ ,,
చెల్లని రూపాయి చేతిలో బెట్టి
చిల్లర మాటాలాడకురోరయ్యో కొయ్యోడ ,,
అలికినయింట్లో గిలకలమంచం
నీవు మంచమెక్కి మాట్లాడరోరయ్యో కొయ్యోడ ,,
చిట్టెమ్మొచ్చిన మూర్తంనుండి
దొడ్డెడు గేదెలు చచ్చెనురోరయ్యో కొయ్యోడ ,,
దొడ్డెడు గేదెలు చస్తే చచ్చెను
అది యింటికి తగినయిల్లాలు రోరయ్యో కొయ్యోడ
ఇవతలముప్పై ఆవతలముప్పై
అరవై రూపాయలప్పయితే అయ్యింది
వాడి సందిడినిండిన పెళ్లామోరయ్యో కొయ్యోడ
డజనున్నర కోడిగ్రుడ్లు
పుల్లడోసి నాకుబెట్టి
నువ్వు వట్టి గులకలు తిన్నావేలమ్మో చిట్టమ్మో
చీటికి మాటికి చిట్టమ్మంటే
నువ్వు చీపురు దెబ్బలు తింటవురోరయ్యో కొయ్యోడ !

మాటిమాటికి కొామ్యోడంటే
నువ్వు మడమ తాపులు తింటావే లమ్మీ చిట్టెమ్మీ.

## పిన్ని - పిల్ల - సంవాదం

పనిచేసే స్త్రీసమూహం ఉజ్జీలు వేసుకొని యీసంవాదం పాడు కొంటారు

పిన్ని :-నాయుడోల్లింటికాడ । నల్లతుమ్మచెట్టుకాడ
నాయుడే మన్నాడెపిల్లా !
అబ్బ ; ఎంత వింతగున్నావె పిల్లా !

పిల్ల :- నాయుడో ల్లింటికాడ, నల్లతుమ్మచెట్టుకాడ
నానుకోల్లిచ్చేడే నాయుడూ
అబ్బ ! గుండె ఝల్లుమన్నదే పిన్ని !

పిన్ని :-కరణంగారింటికాడ । కారుమునగచెట్టుకాడ
కాముడేమన్నాడె: పిల్లా ? ॥అ॥

పిల్ల :- కరణంగారింటికాడ, కారుమునగచెట్టుకాడ
కాసులుపేరిస్తా నన్నాడమ్మా ॥అ॥

పిన్ని :- మునసుబుగారింటికాడ । ముందరదర వాజుకాడ
ఆతడేమన్నాడే పిల్లా ? ॥ అ॥

పిల్ల:- మునసబుగారింటి కాడ । ముందరదరవాజుకాడ
ముక్కుపుడక లిస్తానన్నాడమ్మా ॥ ॥అ॥

పిన్ని:- కోమటోరింటికాడ । కొట్టుబాజారుకాడ
కముతుడే మన్నాడెపిల్ల ? ॥అ॥

పిల్ల :- కోమటోరింటికాడ । కొట్టు బాజారుకాడ
కోరికోరి రమ్మన్నడమ్మా ॥అ॥

పిన్ని :- మాలపల్లి తూముకాడ । మల్లిపూలపందిరికింద
బాలుడేమన్నాడె పిల్లా ? ॥అ॥

పిల్ల :- మాలపల్లితూముకాడ । మల్లిపూలపందిరికింద
మల్లిమల్లి రమ్మన్నాడమ్మా ! ॥అ॥

పిన్ని :-కిందవి కడియాలు । మీదవి పావడాలు
నెత్తిమీదనాగరము । ఏ దేవుడిచ్చాడెపిల్లా ? ॥అ॥

పిల్ల :- కడియాలు కామరాజు । పావడాలు పాపయ్య
నాగరము నాగరాజు । నాకు కోరికోరిచ్చేరమ్మా ॥అ॥

పిన్ని :- ముంతంతకొప్పుమీద । మూడుచేమంతిపూలు
ఏరాజుపెట్టేడమ్మా । అబ్బ ఎంత చక్కగున్నావె పిల్లా ?

పిల్ల :-చేమంతిపువ్వులు । చెంగులోన బెట్టి
కోరికోరి పిలిచేడె నాయుడు
అబ్బగుండె దడదడలాడిందె పిన్నీ !

పిన్ని :- కాళ్లకు కడియాలు । యేళ్లకుమట్టెలు
నాయుడెప్పు డిచ్చాడెపిల్లా? ॥అబ్బ !ఎంత॥

పిల్ల :- కాసులపే రేసుకొని । కాలవగట్టు నెల్తాతుంటే
కానిపట్టుపట్టాడే, నాయుడు, అబ్బ! గుండెజల్లుమన్న దేపిన్నీ ॥అ॥
ఎలమంచిలి రోడ్డుమీద, తాలూకాకచ్చేరికాడ

తాళ్ల పాలెం రేవులోనూ । పిట్లా కోనేరు కాడ
ఎగిరెగిరి తన్నేడమ్మా । అబ్బ ! గుండెబడేలన్నదే పిన్ని
మాయమ్మ తమ్ములు । మాకు మేనమామలు
గుబ్బా గోడుగులవారు, కిర్రు చెప్పులవారు
చేతికర్రాలవారు । వారకన్నులవారు
వయ్యారినడకలవారు । ఏత్రోవ నున్నారమ్మా !

పిన్ని :-రవికేసుకో పమిటేసుకో
పంచాదిలో మంచమేసుకో
వాకిట్లో దీపమెట్టుకో
రాకపోతే కేకేసుకో

వ్యవసాయం చేసిన వారిదురవస్థను తెల్పేగేయం

ఏటివొడ్డునబట్టి సేద్యంచేస్తే
ఈడ్చికొడితే యిరవై పుట్లు
ఆర్చికొడితే అరవై పుట్లు
అన్నికొంచబోయి అప్పయ్యదొర
ఇసుకోయిసుకో ఇద్దుమేవుంచే
మనోన్నైమెలో మానెడువుంచే
ఉప్పులేనిగంజి తాగితిమయ్యా
చొప్పకట్టెలోన సోలితిమయ్యా
కుక్కిమంచములోన కూలితిమయ్యా
నల్లి కుడితే కిందదొల్లితిమయ్యా

## రైతుల దురవస్థను తెల్పేగేయం

ఏటికేతంబట్టి ఎయిపుట్లుపండించి
ఎన్నడూ మెతుకెరుగరన్నా ! నేను
గంజిలో మెతుకెరుగరన్నా !
కాళ్లేయికడుక్కొని కట్టమీదకూసుంటె
కాకితన్నీ పోయెరన్నా ! కాకి
పిల్ల తన్నీ పోయెరన్నా !
పోరుకూజాల్లేక పొయికాడకూసుంటె
పోరితన్నీ పోయెరన్నా ! పోరి
తల్లి తన్నీ పోయెరన్నా !
చుక్కపొద్దునలేచి బొక్కెనెత్తాబోగ
బొక్కబోర్లా బడితిరన్నా !
నాదేటి బ్రతుకాయెరన్నా
నేనునాడే చావకపోతిరన్నా.

## శ్రమజీవులపాట్లు

ఎన్నాళ్లుపాటుబడిన
ఈ గునపమే మిగులు
ఎందుకోయీజన్మ – ఓరన్నా
గొప్పగొప్పవారు
చెప్పినట్టిచేస్తే
కట్టించుకువారు

సౌఖ్యాలు పొందూతుంటె
ఈసురోమని యిట్లోవున్నా - ఓరన్నా ॥ఎ॥
ముందూమన కేదంచు
మోసాపోతూవుంటె
ఎండ వేడికి మాడుతున్నా
తిండిలేక నె యెండుతున్నా - ఓరన్నా ॥ఎ॥
*కటికి గంజిలోకి
కాస్తమెతుకులేక
గంజిముంతకు బరువులేదు
గంగ చలువకు తిరుగులేదు ॥ఎ॥

*మరోమాదిరి చరణం

ఈడిముంతకు యేడిలేదు
కల్లుముంతకు కాక లేదు
కలికాపాశాలమ్మ
కల్ల చలవకుతిరుగులేదు ॥ఎ॥

శ్రామికులు పనులు ప్రారంభించే టప్పుడు "స్వామీ! సరస్వతీ!" అంటూ భక్తి పూర్వకంగా ధ్యానించుకొంటారు. పనిమానేసే టప్పుడు మంగళహారతి పాడడం వారికి పరిపాటి.

## మంగళహారతి

పుట్టమీదాకొమ్మ । పూతవిచ్చినకొమ్మ ।
నరికి వేసినకొమ్మ । నందికొమ్మా ।
అందులోదాకకొమ్మ । హారతు లివ్వంగ

అందిన శ్రీరామ చందురులకూ
జయమంగళం నిత్య శుభమంగళం ।
శుభోజ్జయమంగళం । జయజయామంగళం
చిన్న చెంబుతోటి । సీకాయఉదకాలు
అల్లా బెల్లాలు । అరటిపళ్లూ
తేనెతో నాగిన । తియ్యమామిడిపళ్లు
అందిన శ్రీరామ చంద్రులకునూ
జయమంగళం, నిత్యశుభమంగళం
శుభోజ్జయమంగళం । జయ జయమంగళం ॥

---



# ౬. ప్రణయ వాఙ్మయం

# ౯౼ ప్రణయ వాఙ్మయం

## (ప్రేమ గీతాలు)

స్త్రీ పురుషుల ప్రణయ రసమయ భావమే ప్రేమగీతాలు – ప్రణయసారస్వతము విస్తృతసాహిత్యమును ఆలంబనము చేసుకొన్నది. మన సాహిత్యానికి వన్నెతెచ్చింది. ఇది సహజంగా మధుర భావము గావున యిదిలేని సాహిత్యము మాధుర్యరహితమే అవుతుంది.

ఈ ప్రేమగీతాలలోగల నాలుగుశాఖలు (1) పురుషుడు స్త్రీని గూర్చి పాడుకొనేపదాలు (2) స్త్రీ పురుషునిగూర్చి పాడేపాటలు (3) స్త్రీ పురుషసంవాద గేయాలు (4) వారివారి వియోగసందర్భాలలో అనుభవించే అవస్థలనుగూర్చి పరితపించే గీతాలు – ఇవి మనసంఘ చైతన్యము వివిధ కాలాలలోను వేరు వేరు ప్రాంతాలలో, రకరకాల తరగతుల ప్రజలలో, ఏలా విజృంభించిందో ఒక్కొక్కప్పుడది సాంఘిక హద్దుల్నిదాటి యేలాపెల్లుబికిందో తెలుపుతుంది –

నిజంగా యీప్రేమికుల ప్రగతే అనంతమగు కాలప్రవాహములో సంఘనౌక పురోగమనాన్ని తెలియపరుస్తుంది. సంఘం తన వైవిధ్యంలో యేకత్వాన్ని యీ ప్రణయముఖంగా యేలాగు సాధిస్తుందో వివరిస్తుంది.

కృత్రిమమగు మానవపరిమితులను సహజమగు దేవప్రకృతి యేవిధంగా కాలరాచి తనపురోగమనాన్ని సాధించునో యీసాహిత్యం తేటతెల్లని భావాలతో, తియ్యని మాటలతో వినువారి హృదయాలలో సుందరమైన ప్రణయచిత్రాల్ని గీస్తుంది.

## పురుషుడు స్త్రీని గూర్చి పాడుకొనేవి

### ముద్దులగుమ్మా

ఓ రంగుంగుల రమణరంగీ
సొగసులెన్నో జరిగిపోయె
సగం ప్రేమ సాగిపోయె
ఇరుగుపొరుగు వారితోను
ఇసుమంత చెప్ప కుండ
చిలకా గోరింకలముగా
చెంగుచెంగున లేచి మనము
లింగాలపురికి పోదామే
ఓరమణి ముద్దులగుమ్మా ఓ॥రం॥

### గైరమ్మ అందము

గైరమ్మో లే గైరమ్మా !
ని న్నేతల్లి గన్న దేగైరమ్మా ॥గై॥
నీ ముక్కెంత చక్కనే గైరమ్మా
నీ ముక్కులో నత్తెంత అందమే గైరమ్మా ॥గై॥
నీ నడుమెంత చక్కనే గైరమ్మా
నీ నడుము వడ్డాణమెంత అందమే గైరమ్మా ॥గై॥
నీ కాలెంత చక్కనే గైరమ్మా
నీ కాలి అందెలెంత అందమే గైరమ్మా ॥గై॥
నీ వొళ్లెంత చక్కనే గైరమ్మా
నీ వొళ్లుమీద నగలెంత అందమేగైరమ్మా ॥గై॥
నీ కళ్లెంత చక్కనేగైరమ్మా
నీ కళ్ల కాటుకెంత అందమేగైరమ్మా ॥గై॥

## ఓ బొల్లారపిల్లా

పెట్టిపోస్తా వుంట
పైనిండ బట్టలు పెడ్తా
నా పేరుమీద బతుకే

ఓ బొల్లారపిల్లా!

అచ్చాపు తెల్లచీర
అంచున జిల్లేడుకొమ్మ
నీ కొంగున రామచిలుకలే ||ఓ||

బాయిలయిల్లు కట్టి
బొజ్జోడు యెంటబడితే
కుంటోడు కులము జెరిపెనే ||ఓ||

నీ కాలుకు నామట్టె
నీ సేతులున్న కట్టె
నిన్ను కొట్టకుంటె ఒట్టేనే ||ఓ||

సంకల ససితిట్టా
సేతుల సీపురుకట్టా
నా యెంట జమూ యెందుకే ||ఓ||

బండిమీద బలితోళ్లు
బాగోతు లాడంగ
బాగా తన్నులు తింటివే ||ఓ||

దొరగారి జీతగాడు
దొర్రెడ్ల మేపేటోడు
దొడ్డెక్కి సీటునొట్టెనే ||ఓ||

పదేండ్ల జీతగాడు
పై యెడ్ల మేపేటోడు
బండిమీద సీటుగొట్టెనే ॥ఓ॥
దిగింది ఉచ్చువెల్లి
పోయింది సుద్దవెల్లి
పనిచేసి సాంపెల్లి ॥ఓ॥

## * మల్లెపూలవంటి మనసే.

వేళజూడ వెన్నెలాయె
వెండి కట్ల కిన్నెరాయె

(1) మల్లెపూల పందిరాయె
వయ్యారి రావె_ పాయమెవ్వారిపాలు సేతునూ

*సరిగా యిదేరీతిలో స్త్రీలు పాడేది ఒకటుంది.

విశేషాంశాలు:—

మల్లె:_ దీనిపువ్వులు సువాసనకు సుప్రసిద్ధమైనవి. స్త్రీలు తలలందు అలంకరించు కొంటారు. హిందువులీపుష్పాలతో దేవుని పూజిస్తారు. గౌరవార్థం పూజ్యుల మెడలో పూలదండలు వేస్తారు.

మల్లెపూలు వెంద్రుకలకూ, నేత్రాలకూ, బలమిస్తాయి. స్త్రీలకు చను కదురు లయితే పాలు చేపు రాకుండ ఆపుటకు దోసెడు పువ్వులను చితకగొట్టి స్తనాలపైన కడితే పాలచేపులు ఆగుతాయి – వీర్యమునకు ఉష్ణతను పుట్టిస్తాయి. కామోద్రేకాన్ని కలిగిస్తాయి. శ్లేష్మాన్ని హరించి నేత్రాలకు బలమును కాంతిని గల్గించి, శిరోజాలను అభివృద్ధి నొందిస్తాయి. వీటితో సువాసన నూనెలను తయారుచేస్తారు

మల్లెయందు 1 త్రిపుర మల్లిక 2 మోహినీమల్లిక 3 వటపత్రీమల్లిక 4 మోహన మల్లిక 5 వృత్తమల్లిక (బొండు లేక బొడ్డుమల్లె) అనే జాతులున్నాయి.

మల్లె సమూలరసం గాని కషాయంగాని, వాత, పిత్తములనూ రక్త దోషాలను హరిస్తాయి. _ చిగుళ్లువెచ్చజేసి కడితే, కండ్ల యెయిపులు, నీరు కారడం, మొదలయిన నేత్ర వ్యాధులు పోతాయి.

కొండ గోగులు పూసెనేమొ
కొండ నిమ్మలు పండెనేమొ
దొండ పండూ పెదిమేలే
వయ్యారి రావె - మనసు యెవ్వారిపాలు సేతునూ

మల్లెపూలుపూసినట్లు
మల్లిమల్లి మాటలాడు
మల్లిపూల వంటిమనసే
వయ్యారి రావె - పూలు యెవ్వారిపాలు సేతునూ

కందిపూసె కందిగాసె
కంది కోనలు సందిమేసె
అందమైన మేలినడకతో
వయ్యారి రావే - గంధమైన సంపబోతిని

---

ఆకుల కాచిన తైలం గాని, ఆకుపసుపు కలిపి కాచిన తైలం గాని రుద్దిననూ నేత్రవ్యాధులు పోతాయి.

నేపాళమల్లె:- అడవిమల్లె అని కొందరూ, విరజాజి అని కొందరూ అంటారు. సంస్కృతంలో "వాసంతి, సువసంత, వసంతజ, సుకుమార, శిఖరిణీ నేపాళీ, వనమల్లికా. ప్రహసంతి అనే పేర్లున్నాయి. దీనిపూలు చిన్నవిగానూ గుత్తులుగుత్తులుగానూ, మిక్కిలీ వుంటాయి. పువ్వులు కామవికారాన్ని పుట్టిస్తాయి దీనిఆకు రసము స్త్రీలబుతుశూలలను తగ్గిస్తుంది. పువ్వులు చలువ చేస్తాయి. నాగమల్లెకు సంస్కృతంలో - అష్టపుత్రిక" అని పేరు. దీనివేళ్లను లేక ఆకులను నిమ్మకాయ రసంతో నూరి పట్టిస్తే, చిడుము గజ్జి తామగ మొదలయిన చర్మవ్యాధులు హరిస్తాయి. వేరు చిదుగగొట్టి ఆవునేతిలో వేసి, కాచిన నెయ్యి పూస్తే, సర్పి, చలిజ్వ. రోగాలు నివారణమవుతాయి. వేరుపొడిని పాలలో వేసి పంచదార కలిపి సేవిస్తే వీర్యవృద్ధి అవుతుంది. వేరు గంధం విషాలను హరిస్తుంది. కేవలం వేళ్లను మాత్రమే నూరి పుచ్చుకుంటే పాములు మొదలయిన వాటి విషాలు హరిస్తాయి. వేరుగంధం విషమును హరిస్తుంది. పుష్పంలో లింగాకారం. పైనపాము పడగ వలె వుంటుంది అడవిమల్లె తీగజాతి (అధమజాతిగా చెప్పుతారు) 2 తుప్పజాతి అనికూడా వున్నాయి.

## మనసులో మర్మము

ఏమేగంగీ భామాగంగీ
బొట్టు చెదిరిందీ ?
ఉగాదియెండలు మొగానకొడితే
చెమటకు చెదిరిందీ ||ఏ||

నీళ్లకుపోతావు ఏతోవనొస్తావు
తోవతోలగవేమే, ||ఏ||

నీమనసులోమర్మము, కడుపులోకపటము
మాటలాడవేమే ||ఏ||

చూడనూచూస్తుంది నవ్వనూనవ్వుతుంది
సిగ్గూపడుతుంది ||ఏ||

నేనాడినమాటలు దానిమగనితో
చాడీలుచెపుతుంది ||ఏ||

కుంకుమరేకుది గుజనపురవికది
గురుతులందినాది ||ఏ||

"ఆగురుతులంది నాసామిగంగినీ
యెదుటకేలారాదు ||ఆ||

కాలుకురుచదీ కంచురవికదీ
కనుమలో యెదురాయె ||కా||

దానికన్నూసైగలు తిప్పుతుంటేనా
మనసు చెదరపోయె ||దా

## బోగంసాని పాట

పావలా[1] పరకిచ్చి పాలమితాయికొన్నాది
తూరూపుగదిలోను తూకమేయించింది
పడమటిగదిలోన పంచుకొందామన్నాది
దక్షిణపుగదిలోన దాచుకొందామన్నాది
మేనేజరునన్నాది మేడగట్టించింది
మేడలో ఇద్దర్ని మేళమోగించింది
ఆడగుఱ్ఱమెక్కింది అడవులెల్ల తిరిగింది
వచ్చిన సరసులకు వయినుబోయించింది
చూచినచూపులకు సున్నమేయించింది

## పీటపైనపూలు

నన్నుసూసినవ్వబోకోలె॥
కొండలనడుమ పోయేదానా
గూటూరైకా సిన్నదానా
గూటూమీద పోటూలెత్తేమే
కాళ్ళింగి కిణకిణ ఛణకఛణకని
పీటపైనపూలుపొయ్యాకే,

## నీకునాకు జోడంటా

చక్కనిగుంట రామెనామెంట
సరసకూచుంట, సరసమాడుకుంట ॥చ॥

1 పరక ఒక అర్థణా (పావలలో ఎనిమిదవవంతు)

పెళ్లిచేసుకుంట గుల్లగుఱ్ఱటపెట్టుకుంట,
గుఱ్ఱాన్ని యెక్కిస్తా, కూడానేనూవొస్తా
నగరునవూరంత సైదిరిగివత్తాము ॥చ॥
నేనుకులాసగుంటా నిన్నంటాపెళ్లాడతానంటా
నీకునాకుజోడంటా, నాకేమిపెట్టకుతంటా ॥చ॥

## పల్లకున్నది

నన్నుసూసినవ్వింది దేశోళ్లచిన్నదీ
మెట్టాయెట్టింది అహామేలుకళ్లదీ ,
పెద్దసట్టిచేతబుచ్చుకోని సాగెడుతుందీ
మిట్టపిల్లలాగ మిడిసి మిడిసిపడుతుందీ
కోకకట్టుకుంది సెవ్వాకులెట్టుకుంది
నాకేసిచూడకుండ, నవ్వుకుంటాయెల్తుంది
ఎల్లిక, ఎల్లోరి, ఎల్లు ఎల్లుమన్నదీ
నల్లగచెయితాకు తేను, పల్లకున్నది.

## లగ్గోపిల్లా

| | |
|---|---|
| నల్లనల్ల మబ్బునుండి | లగ్గోపిల్లా |
| అదె తెల్లతెల్ల చంద్రుడొచ్చె | ,, |
| అల్లిబిల్లి తీగచూడు | ,, |
| అల్ల నేరేడు కిందజూడు | ,, |
| చల్లనైన చెలమజూడు | ,, |
| నేరేడు నీడలోన | ,, |
| నీ చారేడేసి కళ్లుచూపు | ,, |
| మారేడు నీడలోన | ,, |

నీ బారెడంత జడనుచూపు లగ్గోపిల్ల
నిండూ పున్నమనాడు ,,
పండూ వెన్నెలగాచె ,,
చిన్నారి చిన్నదాన ,,
నాకన్నుల పండుగుసెయ్యే ,,
పొన్నపూలు యేరితెచ్చి ,,
నీచిన్న చేతి నియ్యరావె ,,
అందమైన నీదు మోము ,,
ఆచందురుణ్ణి మించింది ,,
తెల్లజొన్నలరొట్టె ,,
యెన్నబూసి యెంట తేవె ,,
పల్లెదగ్గర తోటకాడ ,,
మంచి తెల్ల మల్లిపూలు తేవె ,,
నాచేను పండిపోయె ,,
ఇంకనీచేను పండదాయె ,,
చేనుచేను గలసినట్టు ,,
మేనుమేను కలపరాద ,,

## *నారాయణమ్మా

రంగమెల్లి పోదామే నారాయణమ్మా
రంగురంగుల మేడలోన ,,
పొంగుతావుందారి ,,
చెంగున లేచి రావే ,,
కులుకు గుబ్బలుసూసి ,,
వలచి పిల్చితినిన్ను ,,

మరిమరి వేడితిని — నారాయణమ్మ
సరి లేరు నాతోటి ,,
సంతోషమౌతుంది ,,
సరసకొచ్చెయ్యింక ,,
మోటారు బండెక్కి ,,
వాటముగ తిరుగుదాము ,,
నాటకాల కెల్దాము ,,
బూటకా లికావు ,,
నీయిష్టమొచ్చినట్టు ,,
నేనెప్పు డుంటాను ,,
నీకెంతో సుఖమిస్తా ,,
నీకెన్నో వస్తువులిస్తా ,,
నాయందు దయవుంచు ,,
శుక్రవారంనాడు
బయదెల్లు ఓడలోన ,,
పోదారి సద్దుకోవె ,,
నీవెపుడు చూడనట్టి ,,
చిత్రాలెన్నో సూపెడతా ,,
అందమైన సీరలెన్నో ,,
అందునీకు కొనిపెడతా ,,
నీయిష్ట మేముందో ,,
నీమనసులో యేముందో ,,
వెంటనే కబురంపూ ,,

* నారాయణమ్మ నాయుడు బావపాట ఇంకొకటి సంవాదంగా వున్నది

## స్త్రీలు పురుషుని గూర్చి పాడేవి

### బంగరు సామి

అద్దాల మహాలు లోని
ఓ రబ్బా! బంగరుసామీ!
ఇట్లు రానిపోని మాటలకీ
వాదాడబోకురో ॥రబ్బా॥
ఊటికాయల కాలమొచ్చేనురో
ఉబ్బింది దానిమొగము
వుబ్బితే వుబ్బిందిగాని
సబ్బు యేసి రుద్దుకో ॥రబ్బా॥
కలే కాయలకాలమొచ్చె
కత్తి పిల్లలకు పాయమొచ్చె
సుట్ట గాల్చుకున్నట్టు దాని
సుట్టింటి కెడతావు దాని
సుట్టూర తిరుగుతావో ॥రబ్బా॥
ఎగువ సేలోగడ్డి కోసి
దిగువ సేలో మోపుగట్టి
ఇట మోపెత్తి పొమ్మంటే
కొంగులాగి పోయేవేమిరో ॥రబ్బా॥
గూడవేసే గుంటకాడ
కపిలెదోలే బాయికాడ
ఇటవజ్జరాల వానగురిసె
విడువరింక కపిలెవోరబ్బీ
రాజా బంగారుసామీ

---

కపిల = మోట.

## ఇద్దరికీ యిమ్మెజాలదు

ముద్దులరంగా
కలుపుదీయ మరచిపోతీరా ॥ము॥

చిలుకనిచ్చి చేనుగాంతే
చిత్రకోళ్లా పట్టెమంచం
ఇద్దరికీ యిమ్ముజాలదూ ॥ము॥
తిరిగిరెండు పక్కలాయెరా !
చింతమానుచిలకలారా ! చింతలేటి జాణలారా !
చందమామవంటిదానిరా ॥ము॥

## * పచ్చబోయించు

పచ్చబోయించు బావా !
ఆకుమల్లె పోకమల్లె
బొడ్డున పొన్నంగిమల్లె
బావా ! పచ్చబోయించుబావా !

---

### విశేషాలు

పచ్చొకుబొట్టు : దీనినే పచ్చ పోయించుకోవడ మంటారు పచ్చ పొడిపించుకొనడం నవనాగరికపు పద్ధతులకు ఆక్షేపణగా వుంటుంది, కాని, జ్ఞాపకానికి లొంగని ప్రాచీనకాలముల నుండి అనేక దేశాలలో వ్యాపకమంది వున్నది. నేటికినీ వ్యాపకమందే వున్నది.

మొదట హిందూదేశమున సౌందర్యాధిక్యతను కాంక్షించి నుమట చిన్నదిగనొక పచ్చపొడిపించు కొనుట ఆచారముండేది. బైబిలు ప్రాతగ్రంథంలో యూదులకు పచ్చబొట్టు నిషేధింప బడింది.

ఐరోపాదేశమందు సైనికులు చేతులందు వివిధాకారలతో పచ్చపొడిపించుకుంటున్నారు. ఆంగ్ల సైనికులు తప్పించుకొని పారిపోయిన వారికినీ దుష్టవర్తనగల

జెట్టిపోతునడుము
నాగుబాము తళుకు
చేవూరి చెరువొకటి
కందుకూరి వాగొకటి
బావా! పచ్చబోయించుబావా!

* పచ్చబొట్టుపాటలు మూడున్నాయి

## రామన్న పాదాలు

పచ్చబొట్టు పొడిపించుబావా !
పావలాఅద్దిచ్చి పొడిపించుబావా !
కొండమీద గుడియంట
గుడిలోన దేవుడంట
సాలోరి యింటెనక
సాదుబొట్టు పెట్టుకొని
కోమటోరింటెనక
కోకైనగట్టుకొని
కోకేబాగుండాలె బావా ||ప||

---

వారికినీ "డి" అక్షరంగాని "బి. సి." అక్షరాలుగాని పచ్చపొడిపించి అందరికీ కనేబడేటట్లు చేయడం శిక్షగా 1880 సం|| ప్రాంతములలో వుండేదట.
మనదేశంలో కొన్నిజాతుల వారు తమశాఖకు అర్థమగు గుర్తులను పొడిపించు కొంటారు. కొందరు తమ యిష్టదైవముల పేర్లను, కొందరు తమ ప్రియుల పేర్లను పొడిపించు కొంటారు. అడవులలో నివసించే అనాగరికులు తమపగవారిని భయ పెట్టుటకు జెట్టివికారాలుగాను, భయంకరముగాను ముఖాలమీద పచ్చాకుబొట్లు పొడిపించు కుంటారు

పచ్చరంగు (కొన్నిఆకుల పసరులు) తమ శరీరమున చిన్నసూదితో చిన్న రంధ్రాలు పొడిచి అందు రంగును జొప్పించి, మాన్పడం చేత "పచ్చపొడిపించ

మొక్క బాగుండాలె
రంగూ బాగుండాలె
అడవిమల్లె పొడమల్లె
ఆకాశ పొడమల్లె
రామన్న పాదాలు
లచ్చుమన్న పాదాలు ||ప||

## కరిగిపోయిన కమ్మలు

| | |
|---|---|
| బావిగట్టున చేనుచెయ్యరా! | చెన్నంగిరామా |
| నీళ్లకొచ్చి నిన్నుచూచేను | ,, |
| నీళ్లకొచ్చి నిన్నుచూచేను | ,, |
| బావిగట్టున చేనుచేస్తేను | జాలారిపాపా! |
| బీటుగుత్తమీదికొచ్చేను | ,, |
| బీటుగుత్తమీదికొచ్చేను | ,, |
| బీటుగుత్తమీదికొస్తేను | చెన్నంగిరామా |
| చెవులుకమ్మల అమ్మికట్టేను | ,, |
| చెవులుకమ్మలు అమ్మికట్టేను | ,, |

---

కొనుట" అనే పేరువచ్చింది. ఐరోపా వారి పచ్చపొడుచుటయందు, ఆకుపచ్చరే గాక, వేర్వేరు రంగులుంటాయి.

పచ్చాకుచెట్టు:- దీని ఆకులుయెండినను ఆకుపచ్చరంగు పీటికి నిల్చివుంటుంది. అందుచేత "పచ్చాకు" అనేపేరు వచ్చింది. దీనిఆకులు పరిమళమునకుగాను, తలనూనెలలో వేస్తారు. పచ్చాకు కషాయం జీర్ణశక్తిని అధికపరుస్తుంది. చూర్ణంగాని, కషాయంగాని, కఫదోషాన్నీ వాతదోషాన్నీ హరిస్తాయి.

పచ్చాకు వెగటు, చేదు, సువాసనగా వుంటుంది. వేడిచేస్తుంది, చిత్తోద్రేకం కల్గిస్తుంది. ఆకులపొడిని భూతపిశాచపీడలకు ధూపంవేస్తారు.
పచ్చాకుబొట్టు వల్ల సమస్తవాతనొప్పులు పోతాయి.

చెవులకమ్మలు అమ్మికడి తేను, జాలారిపాపా
మీావారు నిన్నుతిట్టూరా ,,
మీావారు నిన్నుతిట్టూరా ,,
మావాళ్లు నన్నుతిడితేను, చెన్నంగిరామా
బావిలోపడె నంటూ చెప్పేనూ ,,
బావిలోపడె నంటూ చెప్పేను ,,
బావిలోపడె నంటుచెప్పితే జాలారిపాపా
బావి[1]వూడుపట్టి చూస్తేనో ,,
బావివూడుపట్టి చూస్తేనో ,,
బావివూడు పట్టిచూస్తేనూ చెన్నంగిరామా
కప్పమింగిన దంటుచెప్పేను ,,
కప్పమింగినదంటు చెప్పేను చెన్నంగిరామా!
కప్పమింగినదంటు చెపితేనూ- జాలారిపాపా
కప్పకడుపు కోసి చూస్తేనో
కప్పకడుపు కోసి చూస్తేనో ,,
కప్పకడుపుకోసి చూస్తేనూ చెన్నంగిరామా
కరిగి పోయినదంటుచెప్పేను ,,
కరిగి పోయినదంటుచెప్పేను ,,

## * రాచముద్దుల మరిదీ

ఓ డెల్తుందో డెల్తుంది మరదీ దేశమెల్లిపోతున్నావా!
నారాచముద్దుల మరదీ రంగమెల్లిపోతున్నావా! ||ఓ||

---

1 వూడు = నూతిఅడుగు భాగానవుండేమన్ను.

* ఇలాంటివి మూడు గేయాలున్నాయి.

నా రాచ ముద్దులమరదీ నాలేతమామిడి చిగురా !
నాసంపంగి మొగ్గా ! నాజాజి పువ్వులగుత్తీ ||ఓ||
యెల్లేవోడి వెల్తావు రంగంలో దిగుతావు
ఒకటో నెంబరు గల్లీ చల్ రెండో నెంబరుగల్లీ ||ఓ||
చలో మూడో నెంబరుగల్లీ మూడో నెంబరుగల్లీ
కెల్తే తే నువుమల్లీ రావు మరదీ ||ఓ||
దేశము బాగుందా ఊరై నా బాగుందా !
అనుచు అడిగిపిలిపించి అతిగానిన్నులోంగ దీసి
ఉడుకునీళ్లు త్రాగ బెట్టి వేపరొట్టచేతికిచ్చి
అవతల కెళ్లేటప్పుడు అర్ధమంతఅర్ధానం ||ఓ||
అందసందము పోవునోయి నీఅర్ధరూపాయ్ డబ్బులకు
ఆశపడకురాజా ! చంక కర్రలపాలవుతావా
వచ్చేవరకు ప్రక్కలోను మచ్చుగానుతన్నెల్లురా
వచ్చినదాకా చెప్పుకుంటాను
నా రాజా రంగ మెల్లిపోతున్నావా
నారాచముద్దుల మరదీ దేశ మెల్లిపోతున్నావా ||ఓ||

## పెళ్లాడినమారాజో

నారాజో — నారాచనిమ్మలపండో !
ఓడెల్లిపోతున్నదీ నారాజో ||ఓ||
చెన్నపట్నం రేవులోన
చెట్టాపట్టా లేసుకొని
చెవిలో గుసగుసలేమో
చెప్పిపోయిన మారాజో ||ఓ||
కాకినాడ యీదుల్లోన

కాటుక కళ్లూ చూచి
కన్నీళ్లు చేత్తోతుడిచి
కౌగలించిన మారాజో ॥ఓ॥

భీమవరం పట్నంలోనా
పెద్దలందరు చూడంగ
పెద్దాపందిరిలో నన్ను
పెళ్లాడిన మారాజో ॥ఓ॥

కంచాన చద్దెట్టుకొని
తెల్లవెన్నెలల్లోన
కసిగాట్లు గొట్టుకుంటూ
కలవరించిన మారాజో

అందమైన నీమొగాన
చందురుణ్ణి సూత్తుంటే
గుండెచల్లబడతాదాని
గునిశాడిన మారాజో ॥ఓ॥

## ఏమయ్యో ! మాట్లాడవు ?

(ప్రతీ చరణం చివరను 1. సంసారయా 2 వన్నెకాడా 3 కిన్నెరో అనేవి ఏదో ఒకటిపాడాలి)

చుట్టూకొల్లారంటివో ,,
సున్నంపు మిద్దంటివో ,,
దిద్దేవారు లేరంటివో ,,
దిద్దేవారొచ్చేరయ్యో ,,

యేమయ్యా! మాట్లాడవు? ,,
ఒకమూాల వడ్లంటివో ,,
దంచేవారు లేరంటివో ,,
దంచేవారొచ్చేరయ్యో ,,
యేమయ్యా మాట్లాడవు? ,,
ఒకమూాల చోళ్లంటివో ,,
విసిరేవారు లేరంటివో ,,
విసిరే వారొచ్చేరయ్యో ,,
యేమయ్యా! మాట్లాడవు? ,,
పెట్టెలో నగలంటివో ,,
పెట్టేవారు లేరంటివో ,,
పెట్టేవారొచ్చేరయ్యో ,,
యేమయ్యా మాట్లాడవు? ,,
దణ్ణాన్ని చీరలంటివో ,,
కట్టేవారు లేరంటివో ,,
కట్టేవారొచ్చేరయ్యో ,,
యేమయ్యా! మాట్లాడవు? ,,
నమ్మించి ననుదెత్తివో ,,
నానెత్తిన చెయ్యిడితివో ,,
బోడిగోడల్లో బెడితివో ,,
నాగోడు నీకు తగులునో ,,
నాడబ్బు నాకివ్వరా ,,
నావూరునేబోతాను ,,

## జెల్లతింటే జారిపోతావు

బావ బావ సరసయ్యబావ
బాతుగుడ్డూ లొండేనుబావ
బల్లమీద పెట్టేనుబావ
ఊదకూడు వండేను
ఉట్టిమీద పెట్టేను
ఎండుగడ్డి కెల్లకుబావ
ఎండలంటా తిరగకుబావ
పచ్చగడ్డి కెల్లకుబావ
పంచలంటా తిరగకుబావ
పాలకొండా పారేటిజెల్ల
ఆజెల్లతింటేను జారిపోతావు బావ

## బంగారు మామా

చంద్రగిరి చీరలంపరా
ఓరందగాడి బంగారుమామా! ||చం||
కాకినాడ కర్ణాటపుకోక
రాజమండ్రి రవ్వలజోడు
పెద్దాపురం దుద్దులజత
ఉప్పాడ జరీ రవిక
కచ్చాలకుచ్చు గట్టి
కూకుంటే నీవొళ్లో
కూకుంటే నీసందిట్లో
కునుకు[1] దీత్తే నాగొంతులో
కూనిరాగాల్ పలుకుతాయి
ఓరందగాడి బంగారుమామా!

1 కునుకు = మాగన్ను నిద్ర

## సిన్నిమువ్వ సినోన్నడు

బేపనోళ్ల కుఱ్ఱోడు — సిన్నిమువ్వ
పట్టెళ్ల నామాలు — ,,
మెల మోరి సినోన్నడు — ,,
యెండిబంగారాలు — ,,
కమ్మోరి అబ్బాయి — ,,
కాసూలూ కంటేలు — ,,
కాపోరి పిల్లోడు — ,,
గజ్జెల వడ్డాణాలు — ,,

## నవ్వబోకురో

నన్ను జూచినవ్వబోకురో ! ఓ ప్రాణనాథా
 నన్ను జూచినవ్వబోకురో ! — ,,
నల్లనల్లని దాననని నన్నుజూచి నవ్వబోకు
 నల్లరేగడదున్ని చల్లితే తెల్లజొన్నలు పండలేదా ॥న॥
 నా మొగుడు సంతకెల్లె
 నాకుతోడు ఎవరులేరు
 కోడికూసే యేళదాకా
 తోడు రా రా వన్నెకాడా
  టమ నాటంకుజెల్ల !
 చింతచెట్టు చిగురుచూడు
 చిన్నదాని యీడుచూడు
 అద్దంలో నీడచూడు
 ఇద్దరికిజోడు చూడు ॥టు॥

నరసాపురమునుంచి
నలిగినేనొస్తుంటే
తాళ్లపాలెముకాడ
తగిలిందీ జ్వరము ॥టు॥

చంకలోన నీళ్లకడవ
నీడజూచి నిందగట్టి
యిద్దరికీ యిష్టమైతే
ఎవరేమంటే భయము ॥టు॥

## ముద్దులబావా!

"ముద్దులబావా! ఓముద్దులబావా!
నారాజానారాజ నారాజనిమ్మలపండు
నా అబ్బురాలకుప్ప, నాఅచ్చావుపాలు
నాఅప్పాడుకాచినే్న యి, నాఅప్పడాలవ్రె
నాఅంటుమామిడిగున్నా నాజ టబాయకుంటావా
ముద్దులబావా!"

"రమణిముద్దులగుమ్మా! ఓరమణిముద్దులగుమ్మా
నారాణినారాణి నారాణిముద్దులగుమ్మా
నాగజనిమ్మపండూ - నాఆవకాయబద్దా
నాఅప్పడాలపీటా నీయబ్బమీాదిఆన
నిన్నిడిసినిముసముంటానా? ముద్దులగుమ్మా
రమణిముద్దులగుమ్మా"

"మనసంటేయెంతవరకో, మాటంటే యెంతనిరుకో
వైనమేమి తెలియకుండ, వాసివన్నె చూడకుండ
ఉన్నవూరనుంటేను విన్నవారునవ్వుతారు

మనమేవూరుపోదామో, ముద్దుల బావా
చిలకా గోరింకల్లాగా
కలిసిమెలిసి ఉందాము
ముద్దులబావా"

మళ్లీరారా!

ఆవునెద్దు బండికట్టి
పరువు పరువున పోయేవాడ
బండినిలిపి బాసలాడరా
పెదమల్లిచిన్నా!
బండినిలిపి బాసలాడరా!
ఆకసము అరటివనము
ధరణిమీద నిమ్మవనము
నట్టనడుమ బండిబాటోయి
పెదమల్లిచిన్నా!
బండినిలిపి బాసలాడరా!
ఉద్దగిరి బండిమీద
ఉద్దులెండ బోసేపాప
ఉద్దులాకు మెద్దులొచ్చేనే
వయ్యారి పిల్లా
సుద్దులాడపొద్దుపోయె న

1 ఉద్దులు = మినుములు

బాటవార బండ్లమీాద
చెక్కగొట్టి మీాయక్కమగడు
చెక్కవచ్చి చెంపదగిలేను
　　వయ్యారి పిల్లా
　　యెక్కడలేని దుఃఖ మొచ్చేను
బాటవార బండిమీాద
వడ్లుదంచే వన్నెలాడి
[2]నానబియ్యం నాకుపెట్టవా
　　వయ్యారిపిల్లా
　　నానబియ్యం నాకుపెట్టవా
కళ్లుఋప్పి సూసిసూసి
తెల్లమొగము యేసేవోడ
వల్లగాని యేళఅడిగేవా
　　పెదమల్లిచిన్నా
　　మల్లిరారా మలచిపెట్టేను

## మేనత్త కొడకా

అతడు :— ఓబులేశుని కొండల నడుమా
　　వాంచెగడ్డి కోస్సేదానా
　　వాంచెగడ్డీ వాల్లైగుడ్డేమొ
　　కాంళింగీకిణీ కిణీ ఘణకనీ
ఆమె :— గిద్దలగిరి కొండలనడుమా
　　యెద్దులకాచే ముద్దుల మరదీ

2. నానబియ్యం (నానబాలు బియ్యం) కన్యక రజస్వల అయినపుడు బియ్యం నానబోసి బెల్లం కలిపి పంచిపెడతారు.

నన్ను సూసినవ్వ బోకోయీ
హరిఓబులేశా !
నన్ను సూసి నవ్వబోకోయీ

అతడు :- కట్టమీదనుంచెళ్లే దానా
కాలుకురచ చిన్నదానా
కాసులిస్తా యెంటవస్తావా ? ||కా||

ఆమె :- ముందటరక దున్నే హాడా
ముద్దుల మేనత్త కొడుకా
సీలదిప్పి నిలబెట్టరబ్బీ ! ||హ||
హరి ఓబులేశా !
సీల దిప్పి నిలబెట్టరబ్బీ ||

---

అహోబలేశునే ఓబులేశు డంటారు జానపదులు,

1 విశేషాంశాలు :- కర్నూలు మండలంలో, నల్లమలపర్వతముందున్న వైష్ణవక్షేత్రం అహోబలము అనేపేరుతో వున్నది. ఈపర్వతం పైనిఒకటి, దిగువను ఒకటి శిఖరం మీదను ఒకటి పర్వత సెత్తాల మీదనుఆరు మొత్తం తొమ్మిది నరసింహస్వామి దేవాలయా లున్నాయి. వీటిని "నవనరసింహ దేవాయాలు" అంటారు. ఇవి ఓరుగంటి ద్వితీయ ప్రతాపరుద్రుడు కట్టించాడట. కొండవీటిరెడ్లు కల్యాణమండపాన్ని 64 స్థంభాలతో కట్టించారట. గోడలమీద రామాయణం బొమ్మలుగా చెక్కబడినది. స్థంభం ఒక్కొక్కటి 8 అడుగుల పరిషములుగా వున్నాయి-

ఈపనితనాన్ని "ఫర్గ్యూసన్" అనువిదేశపండితుడు ప్రశంసించాడు. క్రీ॥ శ॥ 15,2 లో గోల్కొండ నవాబయిన "ఇబ్రహీంకుతుబ్ షా"యునూ. అనంతపురం నాయకులైన "హండే" వారునూ కలసి ఈదేవాలయాలను దోచుకుని అయిదు సంవత్సరాలు పాలించారు - కొన్నాళ్లకు "రెండవరంగరాజు" (పెనుగొండపాలిక) "హండే" వారి నోడించి 1578లో తిరిగి వశపరచుకున్నాడు.

ఈదేవాలయమునకు రెడ్డిరాజులూ, విజయనగరం రాజులూ అనేక దానాలు ఇచ్చినట్లుగా శాసనాలు ఉన్నాయి.

## *తడిక రాయబారం

వరికూడు వార్చేను, వంకాయవండేను
తినమనీ చెప్పవే తడికా! తడికా!
        వగలాడి మాటలకు వళ్లంతమండింది
        వద్దనీచెప్పవే తడికా! తడికా!
పట్టుచీర తెచ్చేను పెట్టిలోపెట్టేను
కట్టుకోమని చెప్పవే తడికా! తడికా!
        చీరకంచులులేవు వారతోగరులేదు
        వద్దనీచెప్పవే తడికా! తడికా!

## రమ్మని చెప్పవే తడికమ్మా!

కొఱ్ఱబియ్యం తెచ్చాను
గోంగూర తెచ్చాను
వండమని చెప్పవే                    తడికమ్మా
        కొఱ్ఱబియ్యం తెస్తేని
        గోంగూర తెస్తేని
        వండవాని చెప్పవే!                    తడికమ్మా
తాటిపండు తెచ్చాను
బుర్రగుంజు తెచ్చాను
తినమని చెప్పవే                    తడికమ్మా
        తాటిపండు తెస్తేని
        బుర్రగుంజు తెస్తేని
        తిన నని చెప్పవే?                    తడికమ్మా

* ఈ రాయబారం మూడు విధాలుగా వ్యాప్తిలో వున్నది.

నులక మంచం తెచ్చాను
కంబళీ తెచ్చాను
వెయ్యమని చెప్పవే ? తడికమ్మా

నులకమంచం తెస్తేని
కంబళీ తెస్తేని
రమ్మని చెప్పవే ? తడికమ్మా

## రంగేలినిలయం రంగం

నేరంగమెల్లి పోతానే చిన్నదానా
నేరంగమెల్లి పోతానే ,,
నువ్వు రంగమెల్లిపోతావా? చిన్నవాడా
నువ్వు రంగమెల్లిపోతావా ? ,,
రంగమెల్లిపోతానే చిన్నదానా
నేరంగంలో వుంటానే ,,
నువ్వు రంగంలో వుంటేను చిన్నవాడా
మరి నామాట యేటంట ,,
నేరంగంలో వుంటేనూ చిన్నదానా
నామనసంత నీమీద ,,
నువ్వులేని ఒకరోజు చిన్నవాడా
నేను గడపలేనయ్యా ,,
నేరంగమెల్లి రంగైన చిన్నదానా
రవ్వలు కొనిపంపుతానె ,,
నీరవ్వలు నాకొద్దు చిన్నవాడా
నీతోటేవుంటాను ,,

రంగమంత రంకులే — చిన్నదానా
రంగేలీ నిలయమే — ,,
    రంకూల రంగంలో — చిన్నవాడా
    నువ్వేలా గుంటావు — ,,

## రంగం సబురు

నేరంగ మెల్లిపోతానే — నారాయణమ్మ
నేను [1]సబురెల్లి పోతానే — ,,
    నీవు సబురెల్లిపోతేను — నాయుడు బావ
    నీయబ్బ నాకు తోడెవరు — ,,
నే రంగ మెల్లిపోతేను — నారాయణమ్మ
నీకు సీరరవిక లంపుతానె — ,,
    సీరలు సారెలుగట్టి — నాయుడు బావ
    నే నేరితోను కులుకుతాను — ,,
పదిరాళ్లు తెస్తాను — నారాయణమ్మ
మనమిద్దరమూ కులుకుదాము — ,,
    నన్నిడిసి పోకోయి — నాయుడు బావ
    మనకిద్దరికి జోడోయి — ,,

## మంచె దిగను

[2]మంచె దిగవే పాంచాలచిలకా ! మంచెదిగవే
మంచె దిగవే ఓ పంచవన్నెల చిలకా !
వంచినతల యెత్తి వాలుసూపులు సూసి ||మం||

---

1 సబురు = ఓడప్రయాణం

2 మంచె = జొన్నచేలో పిట్టలను వాలనీయకుండా కొట్టేవారికి ఎత్తుగా వేసే "అరప"

సేబాసు కుర్రాడ సెవులపోగులవాడ
మాబావ కన్నవిన్న మరియాద దక్కునా
మంచెదిగనూ నేను కంచెదాటిరాను ॥సే॥

అల్లాము బెల్లాము తెల్లకొంగున కడుదు
తెల్లకొంగున కట్టి తెల్లగారే సరికిపోదు ॥మం॥

అల్లాము బెల్లాము వల్లాదు నామనసు
అన్నదమ్ములు సూత్తె ఆచోరు నిలవారు
మంచెదిగనూ నేను మంచి మురుగులవాడ ॥సే॥

పూలరై కాదానా వాలుసూపులదానా
కాలులో ముల్లుదిగెను కాసింత ముులుదీయవే ॥మం॥

కాలిలో ముల్లుదిగితే కర్రిమంగలికలడు
తాళికట్టినోడు తా మెత్తు కట్టాను
మంచె దిగనూ నేను పొంచున్న చిన్నోడ ॥సే॥

## రాజడిగి తేమందును

స్త్రీ. —చేతిగాజులు పోయెను చినవాడ
రాజడిగి తేమందునూ ?

పు: — సెనగపూ రోకలనుమీ। చినదాన
చెయిజారిపోయెననుమీ.

స్త్రీ: - కాలిమట్టెలు పోయెను। చినవాడ
రాజడిగి తేమందునూ!

పు: - మనగడప పెద్దదనుమీ। చినదాన
గడప తగిలిపోయెననుమీ.

స్త్రీ :— ఒళ్లెల్ల రక్కులయ్యెను। చినవాడ
రాజడిగి తే మందునూ ?

పు : — మన యిల్లుచీకటనుమీ। చినదాన
మన పిల్లిరక్కు లనుమీ !

స్త్రీ :— నొష్టబొట్టు పోయెను। చినవాడ
రాజడిగి తే మందునూ ?

పు : — చిరుచెమట లెక్కెననుమీ। చినదాన
చెమటకు కరిగెననుమీ।

స్త్రీ :— ముక్కునత్తు పోయెను। చినవాడ
రాజడిగి తేమందునూ ?

పు : — ముత్యాల చెరువులోన। చినదాన
మునిగితే పోయె ననుమీ।

## సిరిగల నీ మోముసూత్తే

పు . — రూపాయికావాలా। రూపాయిచిల్లర కావాలా ॥పిల్లా॥
స్త్రీ :- రూపురేక సల్లగుంటె రూపాయెందుకు
రూపాయిసిల్లరెందుకు నానల్లజీలకరిమొగ్గ
పు :- పావలాకావాలా పావలాడబ్బులు కావాలా ! ॥పిల్లా॥
స్త్రీ :- పాదాలుసల్లగుంటె పావలెందుకు
పావల డబ్బులెందుకు నానల్లజీలకరి మొగ్గ.
పు :- చీరలు కావాలా, సిల్కు, సారీలుకావాలా ! ॥పిల్లా॥
స్త్రీ :- సిరిగల నీమోముసూత్తె సీరలెందుకోయిబావ
సారీలెందుకోయిబావ నల్లజీలకరి మొగ్గ
పురు : — వస్తావటోలె పిల్ల వస్తావంటే, నిన్ను
వరంగల్లు తీసుకపోతా వస్తావంటే

### పోకిళ్లుపోతా వుంటే

స్త్రీ :— వరంగల్లు తీసుకపోతే వస్తానుగానీమన
దారిఖర్చు దప్పిఖర్చు తెస్తావటోయి

పురు :— దారిఖర్చు దప్పిఖర్చు తెస్తానుగానీ అడుగు
దాటకుండ యింట సిల్చి వుంటావంటే.

స్త్రీ :— అడుగు దాటకుండ యింట వుంటానుగానీ
మాట పోటీ రాకుండ సూసుకుంటవా

పురు :— పోటీరాకుండ సూసుకుంటానుగానీ
పోకిళ్లుపోతావుంటే కూకలెడ్తాను.

### సంతంటే సంతోసం

పు:- ఏవూరు యే దేశం పిల్లానీది
స్త్రీ:- కొవ్వూరు కొత్తపట్నమయ్యామాది
పు:- పనియైన సెయ్యగలవా పిల్లానువ్వు
స్త్రీ:- పనిఅంటే బద్దకమయ్యా నాకు
పు:- కూడొండిపెట్టగలవా పిల్లానువ్వు
స్త్రీ:- వంటంటే వళ్లుమంటయ్యానాకు
పు:- ధాన్యమైన దంపగలవాపిల్లానువ్వు
స్త్రీ:- గొట్రగొట్టి దగ్గొస్తదయ్యానాకు
పు:- బియ్యమైన యేరగలవాపిల్లానువ్వు
స్త్రీ:- బియ్యమేరితే కళ్లుమంటయ్యానాకు
పు:- దూదియిడ దియ్యగలవాపిల్లానువ్వు
స్త్రీ:- దూదంటే వుబ్బసమయ్యానాకు
పు:- చేలోకలుపు తీయుగలవాపిల్లానువ్వు

---

* ఇదేరీతిలో జరిగే సంవాదాలు చాలా వున్నాయి.

స్త్రీ:- కలుపుతీత్తే కాళ్లులాగుతావయ్యానాకు
పు:- పిడకలైన చరపగలవాపిల్లానువ్వు
స్త్రీ:- పిడకలుచరిస్తే కమనొప్పు హయ్యానాకు
పు:- సంతకెళ్లి రాగలవాపిల్లానువ్వు
స్త్రీ:- సంతంటే సంతోసరు హయ్యానాకు

## నోటివట్టపు కూతలు

పు:- నీముద్దుపలుకులు యింటూవుంటే
ముచ్చటవుతున్నదే పిల్లానాకు

స్త్రీ:- నాముద్దుపలుకులు నీకెందుకు
నావూసునాజోలెందు కయ్యానీకు

పు:- నువ్వుతొడిగిన పట్టురైకకంటె
మంచిదిస్తే కావాలాపిల్లానీకు

స్త్రీ:- నాపట్టురైక వూసెందుకు
నన్నల్లా తేరి సూడ్డమెందుకయ్యానీకు

పు:- ఆమెళ్లోదండ కంటెమంచిదండ
యిత్తానుకావాలంటే పిల్లానీకు

స్త్రీ:- దండజోలెందుకు, కైదండవూసెందుకు
నోరుమూసుకుండ లేవంటయ్యానువ్వు

పు:- రైకమీదరామచిలుక రంగురంగులూ
చూపుచున్న వేంటే పిల్లానీకు

స్త్రీ:- [1]నోటివట్టపుకూతలు కూసావు
మోటుమూనిసివేటి అయ్యానువ్వు

---

1 నోటివట్టపుకూతలు = లోటుకల్గిన మాటలు,

## నన్నింటి దా న్ని సెయ్యి

బాలయ్యి:— నీలేడి కన్నులోలె చంద్రీ
నీ లేత నవ్వులోలె ,,
ఆ తీగసొగసు లోలె ,,
ఆ పళ్లగుత్తులోలె ,,
ఆ నడక అందాలోలె ,,
నీనడుము సన్న మోలె ,,
నీ రంగు పింగులా సూత్తే ,,
రంభ లాగున్నావు ,,
రంగమెడదామోలే

చంద్రి:— నేనై కైకాలసిన్నదాన్ని బాలయ్యి
నన్ను [1]కంకులు పెట్టకు ,,
నా కమ్మ బాబులు లేరు ,,
నన్ను ఆరళ్లు బెట్టకు ,,
నామేనత్తసాకుతూంది ,,
ఈ యిరుగు పొరుగు సూత్తే ,,
ఏ మనూకుంటారో
నావెంట రాకూరోరి ,,

బాలయ్యి:— కమ్మోరి బావికాడ చంద్రీ
నువ్వు కడవ నెత్తి నెట్టి ,,
సందు గొందులు దాటి ,,
నువ్వు సిందులు దొక్కగ ,,

1. కంకులు = ఇబ్బందులు

| | |
|---|---|
| నీ కొప్పూ తిప్పులు సూచి | చంద్రి |
| నాకోరిక లూరేయి | ,, |
| నీకాళ్ల కడియాలోలె | ,, |
| గణగణా మోగాయి | ,, |
| గిలుకు మట్టెలతోటి | ,, |
| నువ్వు గిరునా తిరిగేవు | ,, |
| సుక్కలో నిలబెడితే | ,, |
| సుక్క లాగున్నావు | ,, |
| చుక్కల్లారె కిస్తానోలె | ,, |
| నీమీద మనసుపడింది | ,, |
| నువ్వు మాయదారి నోలె | ,, |
| మత్తుమందు జల్లావె | ,, |
| నావుత్తమాటలు గావె | ,, |
| నా కెర్రెత్తిపోతుందే | ,, |
| నీ గుండెంత బండదే | ,, |
| నీ మన సెన్న సేసుకో | ,, |
| నాసేతిలో సెయ్యేసి | ,, |
| నాసందిట్లో కొత్తేను | ,, |
| నాసంక లెగరేత్తాను | ,, |
| చంద్రి : బతిమి లాడతున్నావు | బాలయ్య |
| నామతి తిరిగిపోయింది | ,, |
| నన్నింటి దాన్ని సెయ్యి | ,, |
| నిన్నింటిపెట్టు కుంటాను | ,, |

## సన్న జాజుల సిన్నీ

బావ :- సిన్నీ ఓసిన్నీ ఓసన్న జాజులసిన్నీ
పొన్నపూలసిన్నీ నేనందమైన వోడ్నీ
నన్నేలుకోవెసిన్నీ నిన్నొదిలి వుండలేను ।

మరదలు :- బావా ఓబావా బంగారు ముద్దులబావా
ఎన్నటికి నిన్నే నేనేలుకొంటా నోయీ
నే వున్నదాన్నిగాను, నావుసురుపోసుకోకు ।

బావ :- సిన్నీ నాసిన్నీ నేసిన్నివోణ్ణిగానె
సిన్నజమీ లున్నవోడ్ని నిన్నుపువ్వులల్లోపూజిస్తా
మీఅన్నలతోసెప్పి నన్నేలుకోవె సిన్నీ

మరదలు :- నీకన్న ఎవరునాకు మాయన్నలతో సెప్పి
అందాలబావ నన్ను ఏఅడ్డు సెప్పకుండ
నన్నింటిదాన్ని సెయ్యి నన్నొడ్డునెయ్యిబావ

## గంగితో

గంగినాపయి మనసొప్పకుంటేను
నడిబావిలో పడి సస్తానని చెప్పు గంగితో
మా పొస్తానని చెప్పు గంగితో ॥గం॥

చెవులకు కమ్మాలు కాళ్ళకు అందెలు
తెస్తానని చెప్పు గంగితో
మాపొస్తానని చెప్పు గంగితో ॥గం॥

బాణాల చీరలు బొమ్మంచు రవికెలు
తెస్తానని చెప్పు గంగితో
మా పొస్తానని చెప్పు గంగితో ॥గం॥

వెంకటగిరి బంగారుసొమ్ములు
తెల్సిందిలేరా ఏమిరా తేవద్దులేరా ॥వెం॥
కట్టుకోను కోకతేరా
తెల్సిందిలేరా ఏమిరా తేవద్దులేరా ,,
చిట్టేటి సొమ్ములు తేరా
చిల్లకూర బెల్లంతేరా
తెల్సిందిలేరా ఏమిరా తేవద్దులేరా ,,

## సిగ్గులేకుండ

ఊడ్పులకాలాన ఒద్దన్న మొగుడు
కోతలకాలాన కోరిరమ్మన్న॥
ఏమిరా ఓబావ! ఏమిరానువ్వు
ఆలి కన్నం పెట్టి పూరా కుపకారమా!
పెగ్గెకి పెళ్లాడగాని
కూడెట్టడం నా కులానలేదు
అల్లాగ సెబితేను బోడిగోడల్లో
పిల్లల్ని కంటూవ సిగ్గులేకుండ
పిల్లలంటే భాగ్యం
మొగుడంటే దుఃఖం
మొనగాడ వయ్యావ
మోమాటంలేక
పొద్దున్నె పోతాను
మాంపిటికి పత్తాను
నీరాకపోకలకేమి
అడ్డువచ్చాను

## మమకారం

స్త్రీ:- లాలూదర్వాజ బల్లకాడామరిదీ
రంగులకుండా త్రైళ్ళినాడేమరదీ ||లా||
పు:- సింతాజెయ్యాకు నాసిన్నివదినే
చీరెల్ జోడాల్ నీకు తెస్తాన్లమ్మో ||లా||
రద్దీసెయ్యాకు నారాజేవదినే
సైకల్ జోడాల్ నీకు తెస్తాన్లమ్మో ||లా||
బదీసెయ్యాకు నాబంగారువదినే
బంగరుకడియాల్ నీకు తెస్తాన్లమ్మో ||లా||

## *వెంకయ్యా చంద్రమ్మ

చం:- నీయందమూసూసి, నీచందమూసూసి
నేపొంగిపోయానురో యెంకయ్యా! నేపొంగిపోయానురో ||వెం||
వెం:- మిడిమిడియెండలో నడిసివస్తుంటావు
జోడుకుట్టీ తెచ్చినానే చంద్రమ్మా! ఆకుచెప్పాలుకుట్టినానే ||చం||
చం:- తెలిసందమామలో తేనెతెరలున్నాయి
తెచ్చిపెడుదువుగానిరారో! యెంకయ్యా ||తె||
వెం:- పండుయెన్నెల్లోన పక్కేసిపడుకుంటె
మల్లెపాన్పుగమారిపోనాదే చంద్రమ్మా!
పూలసెజ్జగ మారిపోనాందే చంద్రమ్మా!
చం:- నువ్వుసెప్పినదెల్లా నిజమూనినమ్మేను
నవ్వులాటకుకాదురో రెంకయ్యా ||న||
వెం:- శిరసుతొడమీదెట్టి! సిరినవ్వునవ్వితే
సింతలన్నీమాయమైనాయే చంద్రమ్మా!
వంతలన్నీమాయమైనాయే చంద్రమ్మా!

చం:- ఒక్కకౌగిలిల్లోన యేకమైపో తేను
పైనచుక్కలునవ్వినాయో రెంకన్న
కిందచుక్కలు రాలినాయో రెంకన్న,

వెం:- రాబోయేనవమికి రాములోర్ని సూడ
బద్రాద్రికిపోదమే చంద్రమ్మ ||బ||

చం:- గోదారితీరాన కోటిలింగాలుండె
కోట్లింగసామికి కొబ్బర్లుకొట్టాలి
మూటముల్లుకట్టరో రెంకయ్య ||మూ||

వెం:- ఏడుకొండలరేడు యెంకటేసరసామి
కడకుబోయి మొక్కులిడుకొనివద్దాము
మీతల్లితో సెప్పిరావే చంద్రమ్మ ||మీ||

చం:- ఇద్దరమూకలసి యేకముగవుంటేను
ఏడులోకాలు మనకాడనేవుంటాయి
ఎక్కడికీయెల్లొద్దురో రెంకన్న ||ఎ||

వెం:- యెండికొండల్లాగ। పండుయెన్నెల్లో
మిలమిలా మెరసేటి చెరువుకెరటాల్లో
కాళ్లుకడిగీకొందమా, చంద్రమ్మ ||కా||

చం:- చెరువుగట్టుమీద। సింతచెట్టున్నాది
సిగురాకుతింటాను। చిలుకలుకూకున్నాయి
చిలుకలపాటలు యిందామో రెంకయ్య
సిగ్గిడిచి మాటాడుకొందా మెంకయ్య ||సి||

వెం:- మనప్రేమలతపెరిగి మనలనొకటిగసుట్టె
మనకడ్డమౌ తాయో మతకట్టుదిట్టాలు

మనమందుచింతలేలా చంద్రమ్మ
మనకిట్టిచింతలేలా చంద్రమ్మ। ॥మ॥

చం:- మనకిపెళ్లయితేను। కనకదుర్గకుపళ్లు
యిచ్చితీరాలి రో రెంకయ్యా। ॥ఇ॥

వెం:- నిన్ను పెళ్లాడితే నిలవనియ్యరు నన్ను
కులముతక్కువాని కొట్టవస్తుంటారు
ఏడకెళ్లినగాని యీసుతో సూస్తారు
ఎందుకొచ్చినబ్రతుకే చంద్రమ్మ
యింక నేబతకలేనే చంద్రమ్మ ॥ఇ॥

చం:- పెళ్లికాలేదాని పెద్దలుమాబాబుని
వెలియేత్తామన్నారో రెంకయ్యా
ఎగిరెగిరిపడ్డారురా
యింతఅప్పరతిట్ల నేను తెచ్చానని
ఎగిఎగిరిపడ్డారురో రెంకయ్యా
యేమిసెప్పాగలనురా। ॥ఏ॥

వెం:- ఇద్దరమూకలసి యేకంగ వుంటేను
ఏడులోకాలు మనకాడనేవుంటాయి
ఎక్కడికియెళ్లవద్దే చంద్రమ్మ
ఇక్కడే వుండిపోదామే

చం:- నిన్ను యిడువలేను। నిన్ను కూడాలేను
తిప్పలుపడలేనురో రెంకయ్యా
తిట్లు కాయలేనురో రెంకయ్యా ॥తి॥

చం:- గోదారికిపోయి గోయిందునకు (మొక్కి
కడతేరి పోతాను రో రెంకయ్యా
కడసారి చూపిదేరో రెంకయ్యా ॥క॥

వెం:- నువ్వు చచ్చిపోతే నేను బతికుంటాన
నేను కూడవస్తానే చంద్రమ్మ
నీతోడ నే నుంటానే
సొరగలోకంలోను సల్లనీ సోటులో
సరసము లాడుదామే చంద్రమ్మ
చందమామను సూతమే

## 4 స్త్రీ పురుష వియోగాలు

### చందమామ - రంగధామ

వలచినాడమ్మయ్యా వలచినాడక్కయ్యా చందమామ ॥వ॥
వలచినతరువాత పిలచిన పలుకడు రంగధామ ॥వ॥
ముఖమెత్తిచూడడు. ముచ్చటలాడడు చందమామ ॥వ॥
కోరినమగవాడు కొంగునుంటేచాలు రంగధామ ॥వ॥
ప్రక్కనుంటానంటే పారిపోతాడు చందమామ ॥వ॥
పరుగు పరుగునవెళ్తే, ఫరవాలేదంటాడు రంగధామ ॥వ॥
అందగాడే గాని, పందెంబులేదాయె చందమామ ॥వ॥
తొందరపడబోకు తాళు తాళంటాడు రంగధామ ॥వ॥
తెల్లవారిందని, వెళ్లిపోతుంటాడు చందమామ ॥వ॥
కల్లగాదీమాట, నల్లనయ్యతో జెప్పు రంగధామ ॥వ॥
ఈలాటి కాపురము, యెన్నాళ్లుచేతును చందమామ ॥వ॥

---

* వెంకయ్య చంద్రమ్మ పాట - దేశంనలుమూలలా వ్యాప్తిలో వున్నది. ఇది సుమారు అరువది చరణాలుగా పాడబడుతూవున్నది. వీటిలో కొన్ని చరణాలు బండుబూతులుగాను, కొన్ని అవాచ్యంగాను వున్నాయి. అలాంటివాటిని తొలగించి నాశక్తి ననుసరించి మంచివిగా వున్నవాటినే యిందుపొందుపరిచాను.

అడవికాచిన వెన్నె లెవరికి మేలాయె రంగధామ ॥వ॥
కూడుగుడ్డవుంటే, కోరికతీరున చందమామ ॥వ॥
పండువంటిమగడు? ప్రక్కనుంటేచాలు రంగధామ ॥వ॥

## కోడెవయసు

1. మిద్దెమీద మిద్దెగట్టి మిద్దెకురంగూలు వేయా
   మిద్దేమీద యెవరులేరయ్యో మిద్దెచిన్నబోయినా దయ్యో
   కల్యాణరాయా మిద్దెచిన్నబోయినాదయ్యో ॥క॥
2. దంచిదంచి నిన్నే చూతు దంచలేక నిన్నే చూతూ
   దండివయసు నిలుపలేనయ్యో ॥క॥
   కల్యాణరాయా! ధరనివయసు నిలుపలేనయ్యో ॥క॥
3. చెరిగిచెరిగీ నిన్నే చూతూ చెరగలేక నిన్నే చూతూ
   చేడెవయసు నిలుపలేనయ్యో!
   కల్యాణరాయా! చేడెవయసు నిలపలేనయ్యో ॥క॥
4. పట్టిపట్టీ నిన్నే చూతూ పట్టలేక నిన్నే చూతూ
   పత్తికొనలు యెక్కి చూతయ్యో!
   కల్యాణరాయా! పత్తికొనలుయెక్కి చూతయ్యో ॥క॥
   కోరి కోరినిన్నే చూతూ కూడలేకనిన్నే చూతూ
   కొమిరెకొయ్యా లెక్కిచూతూ
   కోడెవయసూ నిలుపలేనయ్యా
   కల్యాణరాయా! కోడెవయసూనిలుపవేనయ్యో ॥క॥

## వన్నెవన్నెలవార్తలంపు

ఓ రందకాడ బంగారుమామ
చంద్రగిరి చీరలంపరా! ॥ఓ॥

చంద్రగిరి చీరలంపు కాకినాడ గాజులంపు
రాజమండ్రి రైకలంపరా ||ఓ||
నీకునాకు దూరమాయె నీలికొండలడ్డమాయె
కొండలెక్కి గొర్రె మేసింపోయి ||ఓ||
నిమ్మ చెట్టుకు నిచ్చెనేసి నిమ్మపళ్లు కొయ్యబోతే
నిమ్మముల్లు రొమ్ము నాటె నోయి ||ఓ||
నాకు నీకు దూరమాయె నల్లకొండ లడ్డమాయె
సన్న గున్న సాలునంటిరా ||ఓ||
నందియాల సందుల్లోన ధర్మలూరు దారుల్లోన
కాలుజారితే కదలనివ్వకురా ||ఓ||
దచ్చినాన గాలితోనే వచ్చెనల్లమబ్బుతోను
వన్నె వన్నెల వార్త లంపుమురా ||ఓ||

## చెదిరిన చిత్తము

అప్పనాతనామన మారోరి బైరనా
మారోరి బైరన రాగోరె బైరనా ||అ||
ఇంటిముందు యీతరుప్ప । యింటి వెనుకగచ్చతుప్ప
ఒంటిగాను రాబోకు ఐమూలజిక్కిపోదువు రా ||అ||
సవతి తల్లి పెట్టుపోత, పగలు రేయికత్తికోత
గుమ్మమైనా దాటనీరు, గుసగుసలు ఆడనీరు ||అ||
రాతి రెండుజాములకు, రాయిచెట్టుకిందనుండు
ఇంటో వోరుసూడకుండ, ఎట్టో నిన్ను కలిసెదరా ||అ||
వచ్చిపోయేదారిలోను, పిచ్చికుక్క లున్నారా
మచ్చుజల్లిపోయెదరు, మాయలోపడబోకుమురా ||అ||
నీకునాజోడుగాన, నిమ్మపూలతెప్పమీద

తేలిపోవమనసుప్పైు, తెల్లవారుటెప్పుడురా ॥అ॥
ఎప్పుడిల్లు యిడిచెదనో, ఎపుడు నిన్నుసూచెదనో
చిత్తమంతా - చెదిరిపోయె, కత్తికోతలాగనుండి ॥అ॥

## ఆసుపత్రిపాలైతే

### సిరిసిరిమువ్వా

| | |
|---|---|
| జోడుకొయ్యల వోడమీద | సిరిసిరిమువ్వా |
| జో డగ్గిపెట్టిలంపినానే | ,, |
| అవి అందినాయో అంద లేదో | ,, |
| నాకు,తిరిగి జాబు లంపలేదే | ,, |
| మూడుకొయ్యల వోడమీద | ,, |
| నీకు ముక్కుపుడక లంపినానే | ,, |
| అవి అందినాయో అందలేదో | ,, |
| నాకు, తిరిగి జాబు లంపలేదే | ,, |
| నాలుగుకొయ్యల వోడమీద | ,, |
| నీకు, నానుకోళ్లంపినానే | ,, |
| అవిఅందినాయో అందలేదో | ,, |
| నాకు తిరిగిజాబు రాలేదే | ,, |
| అర్ధరూపాయి డబ్బులకు | ,, |
| ను వ్వాసపడ కన్నావు | ,, |
| ఆసుపత్రి పాలైతే | ,, |
| నిన్ను ఆదుకొనరన్నావు | ,, |
| కసరికసరి కొడితేను | ,, |
| నే సరసమను కొన్నానే | ,, |

* సిరిసిరి మువ్వ పదాలు చాలావున్నాయి

| | |
|---|---|
| కంటికికాటుక బెడితే | సిరిసిరిమువ్వ |
| నువ్వు, కన్నె వనుకొన్నానే | ,, |
| పైటపావడ గడితే | ,, |
| నువ్వు, పడుచు ననుకొన్నానే | ,, |
| పసుపు రాసుకుంటేను | ,, |
| నువ్వు, బాల వనుకొన్నానే | ,, |
| తళుకు జూపిస్తేను | ,, |
| నీ, వలపు లనుకున్నానే | ,, |

## తిరుగు జాబులు

సిరిసిరి మువ్వా!

| | |
|---|---|
| జోడుగొట్టా లోడమీదా | ॥సి॥ |
| జోడుంగరా లంపానే | ,, |
| జోడుగొట్టా లోడమీదా | ,, |
| జోడుసవణ లంపానే | ,, |
| అందినాయొ అందలేదో | ,, |
| తీగజాబు లంపవే | ,, |
| కవరుజాబు లంపనే | ,, |
| జోడుకొయ్యి లోడమీదా | ,, |
| జోడుబొమ్మ లంపానే | ,, |
| జోడుకొయ్యి లోడమీద | ,, |
| జోడుపెట్టె లంపానే | ,, |
| జోడుకొయ్యి లోడమీద | ,, |

జోడుసవరా లంపానే ॥సి॥
అందినాయొ అందలేదో ,,
నాకు తిరిగి జాబులంపావే ,,

## చెంతకు రమ్మంక

వన్నిడిసి రంగ మెల్లినావు సిరిసిరిమువ్వ
నీమీాదమన సుండిపోయె ,,
సొమ్ములెన్నో తెత్తానసి ,,
నువ్వు, కోతలెన్నో కోసావు ,,
నీమీాద బెమచేత ,,
నాక, పనిమీాద దిష్టిలేదు ,,
తిండిమీాద మనసులేదు ,,
పిచ్చెత్తి పోతుంది ,,
తుదకేమి ఔతానో ,,
తెలియలేక వున్నాను ,,
కూడులేక కూలిలేక ,,
మాడిపో తున్నాను ,,
ఓడకేవు కూడలేక ,,
ఈడబడి వున్నాను ,,
ఏమిాతోచ కుండ ,,
ఈడ తిరుగుతున్నాను ,,
ముందునీవు సెప్పినట్టి ,,
పొందయిన మాటలన్నీ ,,
మందబుద్ది యిన్నైతి ,,
అందుకిట్టు లయ్యాను ,,

నన్నాదరింపరావే సిరిసిరిమువ్వ
నీవొచ్చి నన్నుజూత్తేని ,,
నీముద్దు నాకిత్తేని ,,
దయనిండా సూపితేని ,,
ఎంత్తైనా పనిసేత్తా ,,
ఎంత్తైనా తెత్తాను ,,
ఏదైనా కొనిపెడతా ,,
నీ వేనాటి కొత్తావో ,,
ఆ మాట రాయించునాకు ,,
నాయందు మనసుంచు నువ్వు ,,
నన్నెంతో దయసూడునీవు ,,
నేను కూలి సేత్తానని ,,
ఒప్పందం పుచ్చుకొని ,,
నీకు డబ్బంపినాను ,,
ఈమాటు రాకుంటే ,,
నన్నింక నువ్వుసూడలేవు ,,
నామాట నమ్మాలిమీ ,,
వెంటనే రావయ్య ,,
ఈబాద పడలేక ,,
ఇంతేర బతిమాలు తున్నా ,,
బయదెల్లి రమ్మింక ,,
నీరాక సూత్తాను ,,
నే రేవులో నిలుచుంటా ,,
చీకాకు పడకుండ ,,
పరాకు పడకుండ ,,

బేగబేగ రావయ్యా ||సి||
పలుమారు దీవించి ,,
రాయిస్తి వుత్తరము ,,
ఇంతే సంగతులు ,,
సెంతకు గమ్మింక ,,

## ఒంటి నేనుండలేనో ?

ఒంటి నేనుండలేనో చందమామా
ఒక్కదాన్ని కోనలో ||ఒం||
ఏనూరు యేతాలు ఇన్నూరుకాలవలు
ఎంతచక్కనిదయ్యా యీ పూలవనము ,,
మంచినీళ్లాబావి మనపెరట నుంచుకొని
ఉప్పునీళ్లకుబోవ ఉపకారమేమో ,,
మల్లిపూలాతోట మనపెరటపెట్టుకొని
చీకిపూలకు బోవ సింగారమేమో ,,
దవనమేసినరాజు కావలుండకపోయె
ఎనలేని దవనమ్ము యేటిపాలాయె|| ,,

## * నిన్ను నేనుమరువ జాలను

ఓ వాలుకన్నుల మువ్వయెంకటసామి
నిన్ను నే నిడువజాలనురా ||ఓ||
ఇంటిముంగల యినుపరోలు
సేతిలో సేమంతిరోకలి
దంచిదంచి నీవంక సూచితే
దరణిమీదాకాలు నిలువదు యెంకటసామి
నిన్ను నే మరువజాలనురా ,,

* ఇదే రీతిలో "వాలుగన్నుల పోలీసువెంకటస్వామి" అనే పాట సినిమాలోకెక్కింది. దేనికేది అనుసరణో

ఉంటే వూళ్లోవుండూ
పోతే పొరుగూరెల్లు
సుట్టుపట్ల ఏమూలనువ్వున్నా
సూడక నామనసుండదు యెంకటసామి
నిన్ను నే మరువజాలనురా ||ఓ||
ఎఱ్ఱసెరువు వాలుగుముక్కలు
గోలకొండ గుల్లసింతపండు
ఆవాలు దనియాలు యేసివండితే
ఆవాసనకి సుట్టుతిరిగే యెంకటసామి
నిన్ను నే మరువజాలనురా ,,
ఓ అందకాడ నాకోడెకాడ
సందకాడ గోడదూకి
తొంగిసూత్తే గడబిడాయె
వంగి వంగి నడిచిన యెంకటసామి
నిన్ను నే మరువజాలనురా ,,

## *దూడంటే దుఃఖంవచ్చె

దూడమ్మదూడదూడా! దూడంటేదుఃఖంవచ్చె
వాడంతా వాడిపోయె! కూడైనతినిపోవే దూడమ్మా! ||దూ||
బూరెలువండినాను! బుట్టలోపెట్టినాను
బూరైనతినిపోవె! దూడమ్మదూడదూడా! ,,
గారెలువండినాను । గంపలోపెట్టినాను
గారైనతినిపోవె । దూడమ్మదూడదూడా ! ,,

* దూడమ్మ పాటింకొకటి వున్నది

గుగ్గిలువార్చినాను । గుమ్మంలో పెట్టినాను
గుగ్గిలుతినిపోవె । దూడమ్మదూడదూడా ! ॥దూ॥
మంచినీళ్ల బాయి కాడ । మంచిమంచిగంతులేసి
మంద మోరమలగుకోవె । దూడమ్మదూడదూడా! ,,
వరిచేలలోకిపో ఖు । వచ్చేపోయేవారిమీాద
వన్నె చూపులై నచూడు । దూడమ్మదూడదూడా ! ,,
ఎన్నెన్నో దూడలున్నా । ఎన్నెన్నో వాడలున్నా
నావాడ దూడనీవే । దూడమ్మదూడదూడా ,,

## గతస్మృతులను వివరించడం

ప॥ ఎటుల మరతునె రంగని యేమని పిలుతునే ॥ఎ॥

1 పట్టు వస్త్రంబూలు ధరియించే వానితో
అంగాన చదరంగ మాడితీ నోయమ్మ
అంగాన చదరంగ మాడినచోటాను
ఆణి ముత్యపు సరులు వోడితి నోయమ్మ ॥ఎ॥

2 కెంపూటి వుంగరము ధరియించే వానితో
సొంపూగ చదరంగ మాడితీ నోయమ్మ
సొంపూగ చదరంగ మాడిన చోటాను
సొంపైన కమ్మాలు వోడితినోయమ్మ ॥ఎ॥

3 కస్తూరి తిలకాము దిద్దినవానితో
యింపూగ చదరంగ మాడితీనోయమ్మ
యింపూగ చదరంగ మాడిన చోటాను
యింపైన కుంచేళ్లు వోడితినోయమ్మ ॥ఎ॥

4 మోహంపు రంగాని ముద్దుగనేజూచి
మోరీలతో జూదమాడీతినోయమ్మ
మోరీలతో జూదమాడిన చోటాను
ముద్దైన కంకణా లోడితినోయమ్మ ॥ఎ॥

5 శ్రీరంగ నాథూని ముద్దూనేబిలిచి
మల్లెపూలా జూదమాడితినోయమ్మ
మల్లెపూలా జూదమాడిన చోటాను
పచ్చాలపతకాము వోడీతినోయమ్మ ॥ఎ॥

6 ఇంపైన మోమున దామూము దిద్దిన
వానితో చదరంగ మాడితి నోయమ్మ
వానితో చదరంగ మాడిన చోటాను
విలువైన పోచీలు వోడితినోయమ్మ ॥ఎ॥

7 కస్తూరి రంగాని చూచీన చోటాను
కాసులాతో జూదమాడిన చోటాను
కర్పూర దండాలు వోడితినోయమ్మ ॥ఎ॥

8 సిరిసూడు శ్రీరంగధాము డటంచును
దరిజేరి నేజూదమాడీతినోయమ్మ
దరిజేరి నేజూదమాడిన చోటాను
సర్వాభరణంబూలు వోడితినోయమ్మ

9 వరదుడైన రంగనాథూని నేగూడి
వరహాలతో జూదమాడితి నోయమ్మ
వరహాల జూదమాడిన చోటాను
వన్నెరైన వకలతు సొమ్ము పోయేనమ్మ ॥ఎ॥

10 శ్రీరంగ పురమందు నేకశయ్యాపైని
ఆదమరచి నిద్రపోయితి నోయమ్మ
ఆదమరచి నిద్రపోయిన చోటాను
ఆరు లక్షల సొమ్ము వోడితినోయమ్మ ॥ఎ॥

11 రూపైన వానితో రూఢిగా నేగూడి
రూపాయిల జూదమాడితి నోయమ్మ
రూపాయిల జూద మాడిన చోటాను
రూకల వెయ్యేలు వోడితి నోయమ్మ ॥ఎ॥
పతిని జూడగోరి పట్టపగలె పోయి
12 పండుటాకుల జూదమాడిన చోటాను
పరువైన వైరాము దెచ్చితినోయమ్మ ॥ఎ॥

13 అమ్మారో కొమ్మారో ఆబ్రహ్మదేవుని
ఆడపుట్టు నన్ను పుట్టించ వొద్దాని
యెన్నో విధంబుల వేడుకున్నాగాని
వ్రాసినా డాబ్రహ్మ దేవుడు ఓయమ్మ ॥ఎ॥

14 పన్నీరు గందాము దెచ్చితి నోయమ్మ
తెచ్చి రంగని మేన బూసితి నోయమ్మ
పూసి దగ్గిరజేరి పాదంబు లొత్తగ
రంగాడు కోపాము విడువడె వోయమ్మ ॥ఎ॥

15 నాథుడైన రంగనాథూని నేజేరి
నయమూగ మ్రొక్కుచూ నిలచీతి నోయమ్మ
భామారో రమ్మాని ప్రేమతో బిలిచియు
సిరులు మోక్షంబూలు జెందించె నోయమ్మ ॥ఎ॥

16 భక్తిగా నెవరైన వినిన చదివిసగాని
సిరులు యిచ్చును రంగధాముడు వోయమ్మ
సిరులున్న వారికి మోక్షంబు లిచ్చును
పదముగా పాడారె శ్రీరంగ వాసునీ ॥ఎ॥

ద్విపద:-పస మించుముత్యాల। పాపటబొట్టు
పాజుల కమ్మలు । పల్లేరుపూలు
రాజిల్లు రత్నాల । రాగిడీ పెట్టి
కెంపులముక్కర । గిలకసరంబు
సొంపుతో వజ్రాల । జోడువారములు
బంగారు పట్టెడ । బన్న సరములు
రంగుపచ్చలయుంగ । రంబులు మెఱయ
నబ్బురంబైయుంద । వాచిల్కతాళి
గుబ్బచన్నులమీర । గునిసియాడంగ
సందిటితాయెతుల్ । జతలుదూగాడ
గందుబొల్లనిపైడి । కంకణంబులును
ఘంటల మొలనూలు । కాళ్లగజ్జెలును
దంటమెట్టెలు వింత । దళుకొత్తుచుండ
(సారంగధర చరిత్ర.) బా। శం॥ ।ఆ

## స్త్రీలు ధరించే భూషణాలు

సీ॥ కుప్పెరాగిడి బిళ్ల । కుంకుమరేఖపా
పట బొట్టుకమ్మలు । బావిలీలు
లలిసూర్య చంద్రవం । కలుసూసకము కెంపు
రవల పల్లెరుఁబూవు । రావిరేక

బొగడలు నానుఁ గ్రో । వులు తీఁగె మెడనూలు
కంఠికంటు సరపెణ । గుండ్లపేరు
కరిగె ముక్కఱ బులాకి । కరిమణి సత్తిగండాలు
కంకణంబులుతళ్లు । కడియములును
తే॥ సందిదండలు నొడ్డాణ । మందమైన
ముద్రికలు హంసకంబులు. । మోయుగజ్జె
లలరు బొబ్బిలికాయలు । గిలుకుమట్టె
లాదియగు సొమ్ము దాల్చి య । య్యబల మెరయ

(హంసవింశతి 2 ఆ 190)

సీ॥ రతనంబు కీల్జడ । రహిఁ గొప్పుగొలుసులు
శశిపువ్వు రాగిడీ । చంద్రవంక
పాపిటబిందీలు । పచ్చబొట్టు హారంగు
కమ్మలు బవిరెలు । గుమ్మటీలు
బొగడలు ముత్తియం । పు మెఱుంగు ముక్కఱ
పగడాల పేరులు । జిగిమెఱుంగు
బాజుబొందులు జిల్కు । పలకీల్కడెంబు పో
చీలు బటువు లుంగ । రాలు చిన్ని
తే॥ గంటలొడ్డాణ మందియల్ । గజ్జెలంద
మైనమట్టెలు పిల్లెండ్లు । నాది గాఁగఁ
దొడవులెల్లను మైనిండఁ । దొడిగి దర్ప
ణమునఁ దన నీడఁ జూచియా । నందమంది

(శకుంతలా పరిణయము. ష॥ వేం॥ 3 ఆ)

# నేదునూరి గంగాధరంగారి రచనలు

## అచ్చు అయినవి

వేమన పద్యములు (5,000 పద్యములు)
పండుగలు - పరమార్థాలు
సెలయేరు (ద్వితీయ కూర్పు)
గీతార్థసారము (స్త్రీల పాట)
ఆటలు - పాటలు (జాతీయక్రీడలు)
నెహూ౹ పూర్ణ చరిత్ర (బుర్రకథ)
పసిడి పలుకులు (సామెతలు, జాతీయాలు వ౹)
మిన్నేరు (జానపదగేయరత్నావళి)

## అచ్చునకు సిద్ధపరచినవి

**సంకలనము**

మున్నీరు
(జానపదగేయరత్నాకరం)
సెలయేరు (ద్వితీయ కూర్పు)
జానపద కళాఖండస్వరూపాలు
జానపద కథలూ-గాథలూ
కలాప కల్పవల్లి
మువ్వగోపాల ముద్రాంకిత పదాలు
శృంగార పదాలు
పదాలు - పదకర్తలు
సంప్రదాయక విజ్ఞానం
ప్రాచీన పద్య రత్నాకరము
అపురూప పద్య రత్నావళి
వేమన పద్య పరమార్థాలు
శృంగార పద్యాలు
జీవద్భాషా నిఘంటువు
(వాడుకమాటల డిక్షనరీ)

**స్వరచనాలు**

బాలానందరామాయణం
(బాలసాహిత్యం)
పూతగౌతమి
(గోదావరి తీరక్షేత్రాలు)
విజ్ఞాన విపంచి
(ప్రాచీనవిషయాల పరమార్థాలు)
గంగాధర - రచనలు
(వివిధ విషయాలమీద వివిధ రచనలు)